శివాయ గురవే నమః



# శైవరహస్యబోధిని.

ఇది

శ్రీ దేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జితాసాక్
శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని
సాహాయ్యమున వెలువడుచు,
శైవధర్మములను, వాని ప్రామాణ్యమును దెలుపు
మాస పత్రిక.



| సంపుటము 5. | విభవనామ సంవత్సర చైత్ర, వైశాఖములు. | సంచికలు 1, 2. |
|---|---|---|



సంపాదకుడు:- ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।
విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ।
అశేషశంకామయసంకశోధినీ।
జయత్వియం శైవరహస్యబోధినీ।

తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడెను.

చందా సం॥ రు 2-0-0.

1928.

## శాశ్వత ప్రధాన పోషకులు.

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగమయ్యవార్లగారి కుమారుడు
నాగమల్లయ్య అయ్యవార్లగారు. సిద్దిపేట
కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, సిద్దిపేట
చందా రు 100 ల వల్ల వచ్చేవడ్డి రు 10 లు మాత్రిం ప్రతిసంవత్సరము ఇవ్వ
నిర్ణయించుకొనినవారు
మ॥ రా॥ శ్రీ కామర్స నాగేశ్వరరావుగారు, కరణం ముద్దాపురం.

### —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారికులు.

| | | |
|---|---|---|
| 1 | భండారు మల్లిఖార్జునరావుగారు | |
| 2 | భండారు వీరభద్రరావుగారు | |
| 3 | భండారు వీర్రాజుగారు | 60—0—0 |
| 4 | భండారు వీరబసవరాజుగారు | |
| 5 | భండారు చెన్నబసవయ్యగారు | |
| 6 | భండారు చిన మల్లిఖార్జునుడుగారు | |

### —: ప్రధాన పోషకులు :—

| | | |
|---|---|---|
| ,, | ముదిగొండ లింగయ్యశాస్త్రిలుగారు సికింద్రాబాదు | 12—0—0 |
| ,, | ముత్యంపేట శంకరారాధ్యులుగారు, లచ్చపేట | 10—0—0 |
| ,, | శివలంక తాయన్నగారు, పోణంగి | 10—0—0 |
| ,, | ముదిగొండ వీరభద్రయ్య అయ్యవారుగారు, ఈమని | 10—0—0 |
| ,, | శివపురపు రాజయ్యగారు, సికింద్రాబాదు | 10—0—0 |
| ,, | కొడిమేల భోగసోమలింగారాధ్యులుగారు. శ్రీగురుతత్వ సంస్థానం, వరంగల్ | 10—0—0 |
| ,, | శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు - నిర్మల | 10—0—0 |
| ,, | కాశీనాధుని అల్లమయ్య అయ్యవారుగారు యలమర్రు అగ్రహారం | 10—0—0 |
| ,, | శివలంక శంభులింగం అయ్యవారుగారు బెజవాడ | 10—0—0 |
| | [illegible], వరంగల్ | 12—0—0 |

శ్రీ శివాయ గురవేనమః

## శైవరహస్యబోధినీ పత్రికా విజయము.

పాఠకమహాశయులారా!

ఈ పత్రికామతల్లి నాల్గవయేట కారణోత్తమము దివ్యాగమము ను పూర్తిగాఁ బ్రకటించెను. ఆహ్నికవిధిని శివధ్యానపద్ధతి మొదలుగా వైశ్వదేవము వఱకుఁ బ్రచురించెను. మహాశివపూజావిధిని వెల్లడించెను. షట్కాలశివపూజయెడ విమతులు గనఁబఱిచిన యాక్షేపణాభాసముల వారించెను. శైవగణార్చనమునెడ పలువురకుగల సంశయముల నిరాకరించి సప్రమాణతను నతివిపులముగా వెలయించెను. మతవినోదచర్చయందు శివసాయుజ్యము ననేకవిధముల విశదీకరించెను. శైవపూర్వాచారనిందకులై తన్మూలమున నీపత్రికయెడను నసూయాగ్రస్తులై బైలువడిన విపశ్చితులఁ గొందఱ యాటోపము నాగెను. ఈవిధమున నీపత్రిక శైవసంఘమునకు నత్యుపకారకమైనను శైవసంఘమునకు నిండుఁ దగు నాదరణ లేకుంట శోచనీయము. ఈ కారణమున నీపత్రిక నాల్గవసంవత్సరము నారంభమున ద్విమాసపత్రికగా జరుగుటయె దుశ్శకమను స్థితికి రాగా శ్రీ దేవిడీ సంస్థానాధీశులగు శ్రీ రాజా ఇజ్జితాసాన్ కంచుమూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారువార లిద్దానిని మాసపత్రికగా జరుగునట్లు లనుగ్రహించి శ్రీపరమేశ్వరపారమేశ్వరానవధికానుగ్రహమునకు భాజనులైరి. ఏతన్మూలమునను నీపత్రిక సుస్థిరజీవనయగుటనె సర్వాంశములయందు విజయము నొందఁగలుగుచున్నది. మీ యనుగ్రహమున నాల్గవవత్సరము నతిక్రమించి పంచమవార్షికోత్సవముగాంచి యీసంవత్సరారంభముననె ‘తెలుగునాటి యారాధ్యులు పూర్వకాలమున లింగధారులు గారు’ అను వాదమును ఖండింప నుత్సాహ మొందు

చున్నది. ఇట్లు శైవమహాజన ప్రతిష్ఠాప్రతిష్ఠాపకమైన యీపత్రికా రత్నమును, ఏతత్సంరక్షకులగు శ్రీదేశీడీ సంస్థానాధీశులను, నింకను పత్రికాపోషకులను పాఠకులనుగూడ పరమేశ్వరుడు మనుచుగాత.

ప॥ సం॥

---

శ్రీశివాయగురవేనమః

# బసవపురాణ పీఠికా
## విమర్శనము.

శైవమహాజనులారా!

శ్రీపాల్కురికి సోమనాథుడు రచించిన బసవపురాణము బ్ర॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన గొప్ప పీఠికతోగూడ మహారాజరాజశ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారిచే నాంధ్రపత్రికా కార్యాలయమున నతిరమణీయముగా ముద్రితమై ప్రకాశితమగుట పలువురెఱింగిన యంశమే.

పూర్వకాలమున బసవేశ్వరుని భక్తివైభవంబును, సోమనాథుని రచనాసామర్థ్యంబును నీగ్రంథముయొక్క ప్రచారమునకు గారణములైయుండెను. కాని వానియందు విశ్వాసము విరళమైన యిక్కాలముననైనను శ్రీశాస్త్రులవారి పీఠికానిర్మాణంబును, శ్రీపంతులవారి ప్రచురణంబును మాత్రమె యీగ్రంథముయొక్క యత్యంతవ్యాప్తి నిదానములనుట యతిశయోక్తి గానేరదు.

బహుగ్రంథశోధకులును, రచనావిశారదులును నస్మత్పరమ మిత్రులు నగు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు రచించిన బసవపురాణపీఠికయె వారి వైదుష్యమును వ్యక్తీకరించుచున్నది. ఆపీఠికయందుగల సోమనాథునిచరిత్రము మొదలగు పెక్కునంశములు ప్రశంసనీయములె.

## విమర్శనావశ్యకత.

ప్ర॥ అట్లేని నీవిమర్శనోద్యమము దేనికి?

ఉ॥ కొన్నియంశములలో నభిప్రాయభేదమున్న కారణమున.

ప్ర॥ అంతమాత్రమున విమర్శనారంభము తగవులకు నిదానముకాదా?

ఉ॥ విజ్ఞులు వాదశోధంతురుగాక యని పీఠికాకర్తలు వచించి నందున నట్లుకాదనియె నానమ్మకము. అట్లుగాక యంకొకవిధమున నైన నేమిచేయవలయు? ఈయెడ శ్రీశాస్త్రిలవారే వారిపీఠికయందు భావిఫలితమును దెలిపియున్నారు.

ప్ర॥ ఏమని?

ఉ॥ బసవపురాణపీఠిక 73 వ పేజీ, ఈవిషయము తగవులకు దానకమగునని నేనెఱుగుదును. అయినను నాకు వాస్తవముగాఁ దోఁచినదానిని దెలుపుచున్నాఁడను. అని తమకుగల జ్యోతిర్విద్యా వైశద్యమునుగూడ వెలిబుచ్చియున్నారు.

ప్ర॥ వారికి వాస్తవముగాఁ దోఁచినదిగాన వారట్లు దెలిపిరి. మీకిందేమి యవసరము?

ఉ॥ నాకును వాస్తవముగా దోఁచినదిగాన నే దెలుప నవసరమయ్యెను.

ఇదిగాక అనావశ్యకములు, నపరిచితములు, దుర్విజ్ఞేయములునగు శైవమతప్రభేదములు మున్నగువానిని యథేచ్ఛముగా వారుపన్యసించుటంజేసి పాఠకులకు సంశయములు గలిగియున్నప్పుడువానిని యథామతి వారించుట నీపత్రికా కృత్యమైయుండగా నుపేక్షింప నెట్లగును?

ప్ర॥ బసవపురాణపీఠికయందు శైవమతప్రభేద నిరూపణము ఆవశ్యకము గాదా?

ఉ॥ బసవపురాణపీఠికయందు బసవేశ్వరుని శైవమతమెట్టిదో తన్నిరూపణము మాత్ర మావశ్యకముగాని కడమమతముల నిరూపణ మంత యావశ్యకముగాఁ గన్పట్టదు.

ప్ర॥ ప్రసక్తానుప్రసక్తిచే కడమ శైవమతముల నిరూపణము మాత్రమావశ్యక మేలకాదు?

ఉ॥ ప్రసంగసంగతిచే కడమ మతములు ప్రస్తావగోచరము లైనను నయ్యవి యపరిచితములు దుర్బోధము లగుటంజేసి వానిని నిరూపింప నశక్యము.

ప్ర॥ అయ్యవి యపరిచితములు దుర్బోధము లనుట యెట్లు?

ఉ॥ వీరు నిరూపించిన శైవమత ప్రభేదములలో నొక్కటి యేని వీరికి స్వీయమతముగాదు. దానంజేసి యిందొక్కయెడనైన వీరికి విశ్వాసము శూన్యము. ఇఁక పాశ్చాత్యులు వేదములనుగూర్చి ఉత్పత్తి కాలాదులను వ్రాసినట్లు వీరును శైవమతవిశేషములనుగూర్చి విమర్శనము వ్రాసినను నీచరిత్రములు తత్తన్మతస్థులకు నుపాదేయము లెంతమాత్రముగా నేరవు.

శైవమతప్రభేదము లపరిచితములు దుర్బోధములు ననుటకు వారు వ్రాసిన పీఠిక 68 పేజీ పై శైవమతముల సూక్ష్మభేదములను స్పష్టముగా గనుగొనుటకు బలవత్తరములైన యాధారములు నేను దొరక కున్నవి. శైవగ్రంథములందుదహృతములైన యాగమతంత్రశ్లోకములను బట్టి యాయామతముల స్థూలస్వరూపమును మాత్రము గనుగొన సాధ్యమగును. ఆకాలపు దంత్రగ్రంథములును, నాగమగ్రంథములును నాయామతములవారి యనుష్ఠాన నిబంధనములును నేడు పర్యాప్తముగా మనకు దొరకుటలేదు. అని వ్రాసిన వాక్యములే నిదర్శనము లగును.

కాలాముఖ శైవపరిష్కార విమర్శనము.

ప్ర॥ ఆవాక్యములను బట్టి శైవమతముల సూక్ష్మభేదము దుర్బోధమని యేర్పడినను కొన్ని శ్లోకములనుబట్టి స్థూలస్వరూపము సుబోధమేయని తెలియుచున్నదిగాదా?

ఉ॥ అంతమాత్రముచే శైవమతముల స్థూలరూపము దెలిసె నని తాము మాత్రము సంతసపడవలయునేగాని దాని నెరులకు దెలుప నవుపడదు. ఇట్లనుటకుఁ దార్కాణమేమనిన, వీరు కాలా ముఖమను శైవమతస్వరూపమును నిరూపించిన విధము చూడుడు.

పీఠిక 72 పేజీ.

వీరి సిద్ధాంతమేదో స్పష్టముగా దెలియరాదు. గాని వీరు శక్తి పూజనుగూడఁ జేయువారుగా గానవచ్చుచున్నారు. మండలార్చనా దులు శాక్తసాంప్రదాయములు వీరికి గొన్ని గలవు. లింగార్చనము శక్తిశివసంయోగ రూపమైనదే. శక్తి చిహ్నము పానవట్టము, శివచిహ్నము లింగము నగును. అని మొదలుగా వ్రాసియున్నారు.

వీరి సిద్ధాంతమేదో స్పష్టముగా దెలియరాదు. ఇదియు కాలా ముఖశైవలక్షణమగునా? మొదల ఇటనుట యపరిచయమును బోధింపదా? తెలియని దానిం దెలుపుమని యెవ్వరు నిర్బంధించిరి? ఇది పోనిండు. తరువాతి వాక్యములంబట్టి కాలాముఖశైవమునందు శక్త్యర్చనము విశేషమని తెలియుచున్నదిగదా. వీరు శక్తికి స్వాతం త్ర్యము నంగీకరించిరా? వారు శైవులే గాకపోదురు. పారతంత్ర్యము నొప్పి పూజించుట పాశుపతాదులయందును గలదు. పానవట్టము శక్తిచిహ్నమనుటయు - లింగము శివచిహ్నమనుటయు నన్ని శైవము లయందునున్న యంశమేగాన నిదియు కాలాముఖశైవ విశేషధర్మము గాదు. శ్లో॥ శివశ్శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం॥ అని ఈశాస్త్రులవారే కాలాముఖ శైవసిద్ధాంతమును శంకరాచార్యుల వారును ననువదించియున్నా[illegible] వ్రాసిరి. శ్రీశంక[illegible]చార్యులవారు

కాలాముఖశైవసంప్రదాయము వారని యంగీకరింపరుగదా? ఇఁక నీ ధర్మములనుబట్టి కాలాముఖశైవవిశేషధర్మము నెట్లు గ్రహింపవలయు?

ప్ర॥ ఇవిగాక మఱికొన్ని విశేషములను వ్రాసియుండలేదా?

ఉ॥ వ్రాసిరిగాని యెట్లున్నవో చూడుడు. పీఠిక 73 పేజీ కాలాముఖులు శక్త్యర్చనముగూడ గావింతురు. వారు నిత్య బ్రహ్మచారులు. గార్హస్థ్యము వారికిఁ దగదు. అనియున్నది. శక్త్యర్చనము సాధకముగాదని తెలుపఁబడియెను. నిత్యబ్రహ్మచారులు అనునది మాత్రము విశేషధర్మమేగాన సాధకమే అయియుండనగును. గార్హస్థ్యము వారికి దగదనుమాట నిత్యబ్రహ్మచారులన్నదానికి వివరణముగానె కన్పట్టుచున్నది.

ప్ర॥ ఇఁక దీనింబట్టి కాలాముఖశైవమత విశేషధర్మమును నిస్సంశయముగా నేల గ్రహింపఁగూడదు?

ఉ॥ ఈలక్షణము కాలాముఖ శబ్దసార్థకతనే వ్యక్తీకరించుచున్నదిగాన బాగుగనే గ్రహింపవచ్చును.

ప్ర॥ ఈలక్షణము కాలాముఖశబ్దమునకు నన్వర్థమనుటయెట్లు?

ఉ॥ కాలాముఖమనఁగా కాలునకు నాముఖము సమ్ముఖమని యర్థము. ఆశైవమునకు నాతరముతోనె కాలము మూడునని భావము. ఈభావమునె నిత్యబ్రహ్మచారులు అనువిశేషణము స్పష్టము చేయుచున్నది. వారు నిత్యబ్రహ్మచారులగుటంజేసి వారికి వివాహము లేదు. సంతానంబును లేదు. ఇఁక వారి మతము వారి తరముతో నంతరింపవలసినదె. గాక తరువాత నెట్లుండును?

ప్ర॥ నిత్యబ్రహ్మచారులన్నదానికి వివాహరహితులనియె యర్థమగునా?

ఉ॥ నిత్యబ్రహ్మచారులన్న దానికి నర్థాంతర మేదేనినున్నను గార్హస్థ్యము వారికిఁ దగదు. అను వాక్యమునకు నేమి యర్థమో గ్రహింపుడు. వారికి గార్హస్థ్యముతో పనిలేకయు సంతానప్రాప్తిసాధకమగు నేదేనొక యుపాయముండిననేతక్క నాశైవము త్తరకాలమున నిలుచునా! ఎందైన గ్రహించినవానితోనె సమాప్తినొందునది మతమనిపించుకొనునా! కాలాముఖమనునది శైవమతప్రభేదముగా శాస్త్రులవారంగీకరించి దాని స్థూలస్వరూపము నీవిధముగా వివరించిరి గదా! దీనింబట్టి యాశైవముయొక్క స్థూలరూపమును వారేమిగ్రహించినట్లు వ్యక్తమగుచున్నదో ఎదిరివారేమని గ్రహింపవలయునో యోజించుడు.

ప్ర॥ కాలాముఖశైవులిప్పుడు లేరుగాన వారివిషయమైన విమర్శనము దేనికి?

ఉ॥ ఇది నిజమే వారెవ్వరు లేరుగాన శాస్త్రులవారు వారిని నిత్యబ్రహ్మచారులన్నను నింకొకరు ఘోటకబ్రహ్మచారులన్నను బాధకము లేదు. ఇఁక నిది దేనికందురేని శైవమతస్థూలరూపమును శాస్త్రులవారెట్లు గ్రహించి వివరించినదియు వెల్లడింపమాత్రమే యుదాహరింపఁబడియెను.

## పాశుపత పరిష్కార విమర్శము.

ప్ర॥ బసవపురాణ పీఠికయందు పాశుపతమును నిరూపించినది సప్రమాణముగా నుండలేదా?

ఉ॥ అది విమర్శించిన మీఁదగదా తేలును.

ప్ర॥ అందు విమర్శనీయ మేమికలదు?

ఉ॥ పీఠిక 71 పేజీ, పాశుపతము. ఈవ్రత మథర్వ శిర ఉపనిషత్తునందుఁ జెప్పఁబడినది. శ్రీకంఠ భాష్యము గూడ దానినే పేర్కొనుచున్నది. అని యారంభించి పాశుపతు లద్వైతమతమును

మిక్కిలి గర్హించిరి. వారు జీవేశ్వరులకు భేదము చెప్పుదురు. పశువు లగు జీవులు పతియగు పరమేశ్వరుని యనుగ్రహముచే పాశమయిన సంసారము నుండి ముక్తులై మోక్షసుఖము ననుభవింతురు. జీవులకు పాశ బంధము తొలగును గాని పశుత్వము తొలగదని మల్లికార్జున పండితుడు చెప్పెను. అని మొదలుగా వ్రాసినదంతయు విరుద్ధమే.

ప్ర॥ అదియెట్లు?

ఉ॥ అద్వైతమును గర్హించువారును, జీవేశ్వరులకు భేదము చెప్పువారును పాశుపతులు మాత్రమే గాదు.

ప్ర॥ వీరికిదోడు మఱికొందఱు నట్టివారుందు రందురా?

ఉ॥ మఱికొందఱు మాత్రముగాదు వ్యాసతాత్పర్య నిర్ణయ మను గ్రంథ మొక్కటి గలదు. వ్యాససూత్రములకు పలువురు పలు విధముల భాష్యములు చేసియుండుటం బట్టి వ్యాసునకు నద్వైతము నందే తాత్పర్యమని నిర్ణయింప నెంచి యద్వైత మతస్థులే యాగ్రంథము రచించి కొనిరి.

వ్యాసునకు నద్వైతమునందే భావముగల దనుటకు నాగ్రంథమున నొక్క ప్రబల యుక్తి చెప్పఁబడియున్నది.

ప్ర॥ ఏమని?

ఉ॥ వ్యాసుడు తనకు సాటివారైన ఋషులయొక్క మతమునె ఖండించును. గాన, తనకు సాటివారును కల్ప సూత్రకారులును నగు నాపస్తంబుడు మొదలగువారు చేసిన ద్వైత సిద్ధాంతమును ఖండించి అద్వైతమునె స్థాపనము చేసెనని దీనివలన విశదమగుచున్నది. అని మొదలుగా నున్నది. ఈయుక్తినిబట్టి వ్యాసుని తాత్పర్యము తేలినను తేలకున్నను కడమ ఋషుల తాత్పర్యము స్పష్టముగా తేలినది.

ప్ర। ఏమని?

ఉ॥ చాలవరకు ఋషులందఱు నద్వైతము ఖండించిన వారే యని. ఇట్లు బ్రాహ్మణ్యమునకు నిదానభూతులగు కల్ప సూత్రకారులు మున్నగు ఋషులందఱు ఖండించిన యద్వైతమును పాశుపతులు గర్హించి నంతన వీరికేమి ఘనతవచ్చును? అద్వైతమునకేమి న్యూనత వాటిల్లును?

ఇట్లు సర్వఋషి సాధారణమైన యద్వైత గర్హణ మను నేరమును పాశుపతుల తలమీదనే యారోపించి వారిలక్షణముగా జెప్పుట యుచితమెట్లగునో యోజించుడు.

ఇదిగాక, పశువులగు జీవులు పతియగు రుద్రుని యనుగ్రహముచె పాశమైన సంసారమునుండి ముక్తులై మోక్షసుఖము ననుభవింతురు. జీవులకుఁ బాశబంధము తొలగునుగాని పశుత్వముతొలగదని మల్లికార్జున పండితుడు చెప్పెను. అనియువ్రాసిరి. గాని యిది కేవల మసత్యము.

ప్ర॥ క॥ గోపతి కృతమున భవ పా
శాపేతములైన పశువులట్టులు భవపా
శాపేతులైన పశువులు
ప్రాపింతురు మోక్షసుఖము పశుపతినీచేఁ.

ఈపద్యమున పశుత్వము తొలగఁదను నర్థము లేదా?

ఉ॥ అట్టియర్థ మాపద్యమున నేమియు గాన వచ్చుటలేదు. పశువులనఁగా జీవులు. వారు మోక్షసుఖము నొందుదురని యున్నది. అంతియగాని పశుత్వము తొలగదని యెందున్నది?

సంసారవర్తిన స్సర్వేపశవః పరికీర్తితాః అనున్యాయమును బట్టి సంసారబంధ సంబంధవ్యపదిష్టమగు పశుత్వము సంసారబంధము తొలఁగిన తరువాత నెట్లు నిలుచును.

శ్రీకంఠ భాష్యమును పాశుపత మతప్రతి పాదకముగానే శాస్త్రిల వారంగీకరింపరిగదా? ఆభాష్యమున నొందైన బంధని వృత్తి యయినను పశుత్వము తొలగదని యున్నట్లు చూచియుండిరా? అట్లు చూపగలరా?

శ్రీకంఠ భాష్యము జన్మాద్యధికరణమున 'పశుపతి శబ్దవాచ్యం పరం బ్రహ్మ। తథాహ శ్రూయతే॥ ఏషామీశే పశుపతిః పశూనాంచతుష్పదా ముతచద్విపదామిత్యాది॥ పాశసంబంధేన పశుత్వవ్యవహారాత్పశుగ్రహణాత్పశుపాశద్వయంచ గృహీతం భవతి॥ అనుటచే పాశ సంబంధముననే పశువులప వ్యవహార మేర్పడినదని స్పష్టీకరింపఁబడి యున్నది. ఇట్లుండగా సంసారపాశము తొలగినను జీవులకు పశుత్వము నివర్తింపదని మల్లికార్జునపండితుఁడెట్లు చెప్పును?

గోపతికృతమున అను పద్యమునందైన నట్టి యర్థముకలదా? లేదు. ఆపద్యము పశుత్వము తొలగునా, తొలగదా అను సంశయమును దీర్ప నేర్పడినదా! కాదు. ఇంకేమన, జీవులీశ్వరానుగ్రహముచే సంసారపాశనివృత్తినొంది మోక్షసుఖమునొందుదురని యందు స్పష్టముగా గానఁబడుచున్నది.

ప్ర॥ ఉపమానమునుబట్టి యట్టియర్థము గోచరమగుచుండ లేదా! ఎట్లనిన, ఓపశుపతీ! పశునాయకునిచే మెడత్రాడు విడువబడిన పశువులవోలే నీచే పాశవిముక్తినొందిన పశువులును మోక్షసుఖము నొందుదురనుటచే మెడత్రాడువిడిచినమాత్రన పశువులకు పశుత్వము తొలగదుగాన బంధనివృత్తినొందినను పశుత్వము తొలగదను నర్థమ ద్యోతకమగుట లేదా?

ఉ॥ అంతమాత్రన నట్టియర్థము ఋజుబుద్ధులకు యుక్తముగా దోపదు. బంధము దొలగించుట యజమానుని యధీనమనుటకును బంధవిమోచనము నొందినవారు మోక్షసుఖము నొందుదురనుటకును మాత్రమే యీయుపమానము నిర్దేశింపఁబడియెను. అట్లుగాక ఉప

మానగతధర్మముల నన్నిటిని నుపమేయమున సంబంధింపజూచినచో నాయుపమాన మలంకార మనిపించుకొనక వికారమనియె యనిపించుకొనును. ఆపద్యమునందు నుపమానోపమేయములకు మోక్షసుఖప్రాప్తిని సమానధర్మముగా గ్రంథకర్త గ్రహించియున్నను వీరు పశుత్వాదివృత్తిని గ్రహించుట యాశ్చర్యకరము.

ప్ర॥ ఇట్టి విశేషార్థమును సాధింప వీరికేమి యవసరము?

ఉ॥ కారణములేక కార్యమెన్నటికి గలుగనేరదు. వారట్టి విపరీతార్థమును సాధింప శైవమతములమీదగలపరిపూర్ణానుగ్రహమే యంతేచేసి. అదిలేనిచో వీరు శైవమతములనింత తేలికగా నుద్ధరించి యుండరు.

ప్ర॥ పీఠికా కర్తలు శైవమతముల కేమి లాఘవము గలుగజేసిరి?

ఉ॥ ఇంకేమి చేయవలయు? పీఠిక 76 పుట ఆంధ్రారాధ్య సంప్రదాయము పూర్వకాలమున శివాచార్య పరంపర వారి సంప్రదాయముగానె యుండెనని నేను దలచుచున్నాడను. పెక్కువిధముల జూడగా నాంధ్రారాధ్య సంప్రదాయ మిట్టిదిగా గానవచ్చుచున్నను లింగధారణము కరపీఠార్చనము షట్స్థల వివేకము మొదలగునవి వీరశైవసంప్రదాయోద్భూతములు గొన్నిగూడ గలిసి యుండెననియు 75 పేజీయందు, ఇటీవల వీరు లింగ ధారణముతో బాటు ఖననసంస్కా[illegible] మునుగూడ పరిగ్రహించి యుండవచ్చుననియు వ్రాయుటతో నాంధ్రారాధ్యమత ముద్ధరింప బడియెను. ఇది యెట్టిదైననగుగాక దీనికి మూలమగు వీరశైవము స్వప్రమాణము యగుగాదా యనియెంతురేమోయను నూహతో వీరశైవము బసవేశ్వరాద్యు [illegible]మని నిర్ధారణచేసిరి. ఈనిర్ణయముచే [illegible]మతము కుంకుమ వేళ్లలో [illegible] రితమైనది. ఎట్లన వీరశైవమతమునకు కర్తలు బసవేశ్వరా [illegible] పర

శైవ మతమునకు ప్రమాణమైన గ్రంధములు నప్పుడేర్పడినవే యనుటతో నా మతము నిర్మూలమని యేర్పడుచున్నదిగదా.

పాశుపత మతస్థు లిప్పుడెవ్వరు లేరుగాన దానిని కొంత భూషించియు, పాశుపత మతముమీద నెక్కుడులోపము నారోపింపనె వారికి ముక్తియందును పశుత్వము తొలంగనేరదని ప్రతిపాదించిరి.

ఈయర్థము పాశుపతసిద్ధాంతమునగాని వా రుదాహరించిన పద్యమునగాని లేశమైన లేదు.

శ్రీమల్లికార్జునపండితులవారు గోపతికృతమున నను పద్యము నకు దరువాతి పద్యమునందు విపరీతార్థ శంకలను మాన్పిసారు ఎట్లన!

క. త్రిమలకృతదుఃఖ సంసా
రమహాబ్ధినిమగ్న జీవరాసులు నీయు
త్తమ కారుణ్యవశంబున
విముక్తులై నీవపోలె వెలుగుదురు శివా॥

జీవులు నీయనుగ్రహమున ముక్తులై నీవపోలె వెలుగుదురను టచే సారూప్యముక్తి లభించునని తెలియుచున్నది. ఈశ్వర సమాన రూపత్వము సిద్ధించుననంగా పశుత్వము తొలంగదని యర్థమగునా? ఈనిర్ణయము శ్రీకంఠభాష్యమునకు విరుద్ధమేయని నిర్ధారణ చేయం బడియెగదా?

ఇదిగాక మఱియు వారుసన్యాసమును గర్హింతురు అన్నదియు విరుద్ధమే.

ప్ర॥ క. ప్రాజ్ఞులు వేదజ్ఞులు లో
కజ్ఞులు చేకొండ్రె గతశిఖాగాయత్రీ
యజ్ఞోపవీత నాస్తిక
లజ్ఞులు చేకొంద్రుగాక యద్వైతమజా॥

అను పద్యమును బట్టిసన్న్యాస గ్రహణము స్పష్టపడలేదా?

ఉ॥ ఆపద్యమునుబట్టి యద్వైతులాదరించిన పరమహంసాశ్రమము కలియుగ నిషిద్ధముగాన నదిమాత్రమె నిరాకరింపఁబడినట్లు తెలియుచున్నదిగాని సన్న్యాస సామాన్యము నిరాకృతమని తెలియుటలేదు.

ఇది గ్రహింపవలయు.

కుటీచకము,బహూదకము,హంస,పరమహంసఅని సన్యాసాశ్రమము నాలువిధములుగా నున్నది. ఇందు హంస పరమహంసలకు శిఖాసూత్రాదులు లేవుగాని కుటీచక బహూదకులకు గలవు. సన్న్యాసం పల పైతృకంఅనుటచే సన్న్యాసము కలియుగనిషిద్ధమైనను పరమహంసాశ్రమము గ్రాహ్యమే యని శంకరాచార్యులవా రంగీకరించిరి. సన్న్యాస నిషేధము పరమహంసాశ్రమ పరముగాన బహూదకము గ్రాహ్యమని నీలకంఠాచార్యుల వారంగీకరించిరి.

పరమహంసాశ్రమ ధర్మములను చెప్పునప్పుడు నేతిని నెత్తురుగాఁ జూడవలయుననియు, సువర్ణ రజతములను మలముగా నెన్నవలయుననియు మొదలుగానుపనిషత్తులయందెగలదుగాన పరమహంసాశ్రమము కలియుగమున ననుష్ఠింప దుశ్శకముగా దెలియుచున్న కతన నీలకంఠాచార్యప్రభృతులు కలియుగ నిషేధము పరహంసాశ్రమ పరమే యని నిర్ణయించి బహూదకమును గ్రహింప వలసివచ్చెను. ఏదియెట్లులైనను

సన్యాసము నాలువిధములుగా నుండుటయు, అందు కుటీచక బహూదకులకు శిఖాసూత్రము లుండుటయు సర్వప్రమాణ సమ్మతమై యున్నది. ఇట్లుండ గతశిఖా గాయత్రీ యజ్ఞోపవీతులనుటచే శిఖాసూత్రరహితులగు హంస పరమహంసలు మాత్రమె గ్రాహితులగుదురో లేక శిఖాసూత్రసహితులగు కుటీచక బహూదకులును గ్రాహితులగుదురో దీనింబట్టి పాశుపతులు సన్న్యాసమునే గ్రహింతురనుట యెట్లు లుచితమగునో విజ్ఞులు గ్రహింతురుగాక.

ప్ర॥ పీఠిక 73 పేజీ, దేవలకులు మంత్రదీక్షాప్రాప్తులును శైవ పాశుపతాది శాసనధరులు, వారి హారికలింగవంతులైచూచివారివారిక లింగవంతులైనారని, ఈ ప్రపదలుబసవేశ్వరుని యుద్బోధనమువలన లింగ ధారణము లేని పాశుపతాదులు కూడ లింగధారులయి వీరశైవమునం జేఱంజొచ్చిరని చెప్పుచున్నవి.

శ్లో॥ వ్రతంపాశుపతంచైవ కాలాముఖకపాలికె ।
లింగాంగసంగహీనత్వా త్తద్భిష్యోనరకంవ్రజేత్ ॥

వీరశైవాచార సంగ్రహము.

శ్లో॥ శైవాః పాశుపతాః వామాః కాలాముఖమహావ్రతాః ।
అతిరిచ్యతిదేవేశ ప్రాణలింగార్చనోటుధః ॥

పై శ్లోకములు పాశుపతులు, కాలాముఖులు, కాపాలికులు లింగధారులుగారనియు, అట్టివారి శిష్యుండగువాడు నరకము నందు ననియుం జెప్పుచున్నవి. ఇట్టిశ్లోకములు పెక్కులుగలవు అని వ్రాసి యున్నారు. ఇందులకు మీయభిప్రాయ మేమి ?

ఉ॥ బసవేశ్వరు నుద్బోధనమువలన లింగధారణము లేని పాశుపతాదులుగూడ లింగధారులై వీరశైవమునం జేరిరనుట విరుద్ధముగాదు. లింగధారణము గలది యొక్కటియు, లింగధారణము లేనిది వేరొకటియు నిట్లు పాశుపతము రెండువిధములుగా నున్నదని కాలాగ్నిరుద్రము, అథర్వశిరసు, మొదలగు నుపనిషత్తులు, శివపురాణము, లింగపురాణము మొదలగువానివలనను దెలియుచున్నది. దానింబట్టి లింగధారణము లేనిపాశుపతులు బసవేశ్వరునుద్బోధమువలన లింగధారులైనచో బాధయేదియు లేదు.

ప్ర॥ కడమశ్లోకములవలన పాశుపతాదులకు లింగధారణమే లేదని తెలియుటలేదా ?

ఉ॥ అంతమాత్రమున నట్లుగ్రహింపఁగూడదు. ఏలన, ఈశ్లోకములు వీరశైవ గ్రంథగతములు. ఏమతధర్మమును నిర్ణయింపవలసి వచ్చినప్పుడు ఆమతగ్రంథములనుండియే నిర్ణయించుట న్యాయ్యమగు గాని తద్విరుద్ధమతగ్రంథములవలన నిర్ణయించుటయుచితమనితోపదు. ఎట్లన, అద్వైతులకు దేవభక్తిశూన్యమని శైవగ్రంథములయందుం డును. శైవులకు కర్మాసక్తి మృగ్యమని యద్వైతగ్రంథములయం దుండును. ఈయిద్వరకు ముక్తియే పూజ్యమని వైష్ణవ గ్రంథముల యందుండును. కావున విమతగ్రంథములవలన నేమతధర్మమునైన నిర్ణయింపనుచితముగాదు. ఈశ్లోకములుచూడగా, తచ్ఛిష్యో నరకం వ్రజేత్ అని మొదలుగానుండుటచే పాశుపతాది మతనిందాశ్లోకము లని స్పష్టమగుచున్నది. ఇట్టిశ్లోకములనుబట్టి పాశుపతాదిమతధర్మ ముల పరిష్కరించుట యెట్లుచితమో విజ్ఞులాలోచింతురుగాక.

ఈశ్లోకములవల్లనైనను లింగధారణములేని పాశుపతాదుల కన్న లింగధారణముగల వీరశైవమే శ్రేయమను నాశయము వ్యక్త మగుచున్నది.

### ఆరాధ్యులు పూర్వకాలముననుు లింగధారులే.

ప్ర॥ తెలుగునాటి యారాధ్యులు వీరశైవులు గారు. అని పీఠికయందున్నది. దీనికేమి చెప్పెదురు?

ఉ॥ తెలుగునాటియారాధ్యులు వైదికవీరశైవులనియు, పూర్వ కాలమున వీరు లింగధారులేయనియుఁ జెప్ప[illegible]ము.

ప్ర॥ వీరశైవమున భేదము గలదా?

ఉ॥ కలదు. వర్ణాశ్రమాచార రహితమైనది యొక్కటియు, వర్ణా శ్రమాచార సహితమైనది వేరొక్కటియు నని యిట్లు వీరశైవము రెండు విధములుగా నున్నది. ఈయర్థము [illegible]సంహితాదులయందు గలదు. ఇందు తెలుగునాటి యారాధ్[illegible]వర్ణాశ్రమాచారసహిత మైన వైదికవీరశైవమునకు సంబంధించిన[illegible]

ప్ర॥ లింగము ధరించిన వీరమాహేశ్వరుడు (వీరశైవుఁడు) వర్ణాశ్రమధర్మములను, వైదికకర్మములను విడుచుటే వీరవ్రతము. అని పీఠికయందు గలదు. ఇట్లుండగా వైదికవీరశైవమని యొక్కటి కలదనుటయెట్లు?

ఉ॥ పీఠికయందట్లున్నమాటనిజమే. వారట్లు వ్రాయుట సాహసమెగాని ప్రమాణసిద్ధముగాదు. వర్ణాశ్రమధర్మములను విడుచుట వీరవ్రతమని యెందైనఁ గలదా? వీరశబ్దమున కీయర్థము విపరీతముగాని సహజముగాదు.

లోకమునందు వీరశబ్దము శూరులగు యోధులయందు ప్రయోగింపఁబడుచున్నది. వీరరసమునకు నాలంబనమైనవారు వీరులు.

ప్ర॥ వీరులు సంగ్రామములయందు వీరరసమును వైరులయందు వినియోగింతురు. అట్లే వీరశైవులునుఁ తమయందుగల వీరరసమును మతాంతరులయందు వినియోగించుటచే వీరికి వీరశైవులని సంజ్ఞ కలిగెనా?

ఉ॥ ఇదియు విపరీతశంకయె. ఏలన, వీరరసమునకు స్థాయిభావము ఉత్సాహము. వీరలు దమయుత్సాహమును వైదికకర్మములు విడుచుటయందుగాని ఎదిరిమతములవారిని విధ్వంసము చేయుటయందుగాని వినియోగించుటచే వీరపదమేర్పడినదిగాదు. ఇంకేమన, వీరపదము శైవపదముతో సామానాధికరణ్యము గలిగియున్నది. శైవపదమునకైననో శివభక్తుఁడని యర్థము. వీరుఁడైన శివభక్తుఁడనగా శివభక్తియందు నత్యంతోత్సాహముగలవాఁడనుట

లోకమునందు వీరపతివ్రతయని పతివ్రతయందును వీరపదము విశేషింపఁబడుచున్నది. అప్పుడు పాతివ్రత్యమున నుత్సాహవంతురాలని యర్థముగ్రహింపవలయుగాని కడమవారిని కలచుననియో రక్కుననియో యర్థము గ్రహింపఁబడునా ?

ఇదిగాక, దానవీరుడు, ధర్మవీరుడు అని మొదలుగా వ్యవహారంబునుగలదు. అట్టిమెడల దానగుణంబునను, ధర్మగుణంబునను నుత్సాహముగల వాడని యే యర్థమగుగాని కడమవారిలను, కడమ ధార్మికులను జంపువాడని యర్థము గ్రహింపనగునా.

ప్ర॥ బసవేశ్వరాదులు తమమతమునం జేరని మతాంతరులను వధించి వీరశైవమును నిల్పుటచే దానికాపేరు వచ్చియుండగూడదా ?

ఉ॥ మతప్రచారముచేయునప్పుడు ఎదిరిపుతములవారిని జంపుటలో జంకుగల మతాచార్యులెవరు ? శంకరాచార్యులేందఱనో జైన బౌద్ధాదులను గానుగలలో వేయించి త్రిప్పించినట్లు శాస్త్రములయందు లేదా? కావున వీరశైవమను పేరు కారణాంతరముచే వచ్చినదిగాదు.

ప్ర॥ వీరశైవులు ప్రాణలింగము లోపించునేని గండగత్తెర వేసికొని చనిపోవలసినదేకాని వారు జీవించియుండరాదు అని వ్రాసియున్నారు. ఇట్టి కఠినవ్రతములనుబట్టి వీరశైవమను పేరు కలిగియుండం గూడదా?

ఉ॥ కఠినవ్రతములనుబట్టి యట్టిపేరురాలేదు. వారికట్టి కఠిన వ్రతములు గలవనుట యార్షధర్మములనెరింగినవారికి వింతగలిగింపదు. వ్రతములే కఠినంబులు వ్రతభంగమునందు భృగుపతనాదమూలమున నామరణాంతప్రాయశ్చిత్తములను ధర్మశాస్త్రములయందు మహర్షులు విధించియుండిరి. గావున సిట్టివానిని వీరశైవాది లక్షణములగా చేసిన పరిష్కారము స్వమతముగాని యెదిరిమతముగాని యేదియు నెఱుంగనివారల కాలయాపనమునకు నుపయోగించునెగాని నిజము దెలుప నేమాత్రముపయోగింపదు.

ప్ర॥ పీఠికయందు 76 పేజీ, ఆంధ్రారాధ్య సంప్రదాయము పూర్వకాలమున నీశివాచార్యపరంపర వారిసంప్రదాయముగానె యుండెనని నేను దలంచుచున్నాడను. పెక్కువిధములం జూడగా నాంధ్రారాధ్యసంప్రదాయమిట్టిదిగా గానవచ్చుచున్నను . లింగధార

ణము, కరపీఠార్చనము, షట్స్థల వివేకము మొదలగునవి వీరశైవసంప్ర దాయోద్భూతములు గొన్నిగూడ గలసియుండుటచే వీరును వీరశైవు లేమోయనియు సంశయము గల్గును. అనియు, 78 పేజీ, దహనసం స్కారము నేడాంధ్రారాధ్య సంప్రదాయమున లేదు. కాని తావ న్మాత్రమున వీరు వీరశైవులనఁగాదు. ఇటీవల వీరు లింగధారణముతో బాటు ఖననసంస్కారమునుగూడ పరిగ్రహించియుండవచ్చును. అను టచే నారాధ్యులు లింగధారణము, కరపీఠార్చనము మొదలగువానిని మధ్యకాలమున జంగములనుజూచి పరిగ్రహించినట్లు సూచింప చున్నారు. దీనికేమి చెప్పెదురు?

ఉ॥ ఆరాధ్యులు జంగములనుజూచి లింగధారణాదులను గ్రహించిరనుట బ్రాహ్మణులు దేవాంగులనుజూచి యజ్ఞోపవీతధార ణమును పరిగ్రహించిరనుటను, ఆర్యులు అహింసాధర్మమును బౌద్ధ లనుజూచి పరిగ్రహించిరనుటను బోలియున్నది.

ఉత్తమధర్మమును నేరివద్దనుండిగ్రహించినను దోసఁగులేదు, శంకరాచార్యులవారు అద్వైతమును బౌద్ధులవద్దనుండి గ్రహించియుం డిరిగదా?

ప్ర॥ శంకరాచార్యులవారు శ్రు। ఏకమేవాద్వితీయం బ్రహ్మ ఈ మొదలగు శ్రుతులవల్లనుండి యద్వైతముగ్రహించిరిగాని బౌద్ధు లనుజూచి గ్రహించిరా?

ఉ॥ ఆరాధ్యులు శ్రు। నమోబ్రహణేధారణాంమేఅస్తు అనిరా కరణాం ధారయితాభూయాసం॥ లను॥ అమృతస్యదేవధారణోభూయా సం॥ ఈ మొదలగు శ్రుతులనుబట్టి లింగధారణము గ్రహించిరిగాని జంగమయ్యలనుజూచిగ్రహించిరా? లేదు. పీఠికాకర్తల మతమును బట్టి యట్లు చెప్పవలసివచ్చెను. వీరియభిప్రాయమునుబట్టి యారా ధ్యులు జంగమయ్యలను జూచియె లింగధారణము నవలంబించిరని గ్రహింతము. జంగమయ్యలెవ్వరినిజూచిగ్రహించిరో ఆయంశము దెల్పి

యున్నచో బాగుండును. అది దెలిపియుండలేదు. పాశుపతులు, కాలాముఖులనను వారికి లింగధారణ లేదనియె నిర్ణయించిరి. ఆరాధ్యులు వీరశైవులనుజూచి గ్రహించినవారలెగదా ? దీనింబట్టి లింగముధరించుట వీరశైవులకు వేరొకరితో పనిలేదు. గాని కడమవారికి మాత్రము కావలయుగాబోలు! ఆహా! వీరశైవు లెంతధన్యులు ఈశాస్త్రిలవారికి వీరశైవులమీద నిట్టియను గ్రహముగలుగ నేమి కారణమో తెలియదు. అదియుండుగాక, కరపీఠార్చనముకూడ వీరశైవధర్మమేయనిరి. పార్థివలింగమునకు నెందఱో స్మార్తులును కరపీఠార్చనమే చేయుచున్నారు. మహారాష్ట్రదేశమందంతటను బ్రాహ్మణులయందు కరపీఠార్చనమే సుప్రసిద్ధమైయున్నది. మాణిక్యప్రభువను సిద్ధుని మఠమునందు నేడునుకరపీఠార్చనమే జరుగుచున్నది. ఇట్టిధర్మములు జంగమయ్యల వద్దనుంచి గ్రహింపఁబడినవనుటకంటె సాహసము వేరొండుకన్పట్టదు.

ప్ర॥ తెలుగునాటియారాధ్యులు పూర్వకాలమున లింగధారులుగారు. వీరు శివాచార్యుల సంప్రదాయమువారని పీఠికాకర్తలు వ్రాసియున్నారు. ఇందుమీయభిప్రాయమేమి ?

ఉ॥ వీరు పూర్వకాలమునను లింగధారులేయగుదురు, గాననప్పుడును నారాధ్యసంప్రదాయమువారె! అట్లుగాక శాస్త్రిలవారు చెప్పినట్లులోకపక్షమున శివాచార్యసంప్రదాయమువారేయనియెంచుదము. అట్లైనను లోపముగానిపింపదు. ఏలన, స్మార్తులు, వైష్ణవులు మున్నగువారైనను శైవదీక్ష గ్రహించినచో నారాధ్యులనుగానె యెంచునప్పు సహజశివభక్తికలితులును పరమపాశుపతులునగుశివాచార్యసంప్రదాయమువారు లింగధారణదీక్ష గ్రహించియున్నచో బంగరునకు సౌరభమబ్బినట్లెగదా ?

ఆశివాచార్యులును జగద్గురుత్వమును వహించినవారే యని శాస్త్రిలవారే వారిని పెక్కువిధముల ప్రశంసించియున్నారు. వారు గొప్పవారు కానిండు. లేక సామాన్యులు కానిండు. దానికి మనమిప్పుడేమి చేయగలము?

మన గోత్రఋషులు మహాతపోధనులని గర్వపడుదుమా? వారి జన్మము లవిమర్శనీయములుగా నున్నవని విచారపడుదుమా?

దాననె మహాభారతము ప్రజాగరపర్వమున,

శ్లో॥ మునీనాంచ నదీనాంచ కులానాంచ మహాత్మనాం
ప్రభవోనాధి గంతవ్య స్త్రీణాం దుశ్చరితస్యచ॥

మునులయొక్కయు, నదులయొక్కయు, కులములయొక్కయు, మహాత్ములయొక్కయు, స్త్రీలదుశ్చరితముయొక్కయు మూలమును విమర్శింపగూడదనియున్నది. అయినను

ఈశాస్త్రిలవారు తెలుగునాటియారాధ్యుల పూర్వకాలస్థితిని మాత్రమేపరిష్కరింపఁ బూనిరో, అట్లుగాక వైష్ణవులు, అద్వైతులు మొదలగువారి యందఱియొక్క పూర్వకాలస్థితినిగూడ పరిష్కరింపఁ బూనిరో, ఆపరిష్కారముల నేగ్రంథమున విశదీకరించిరో తెలియదు.

కల్పసూత్రకర్తలగు ఋషులు చాలవరకు నద్వైతమును ఖండించి ద్వైతమును సిద్ధాంతము సేసియున్న కారణమున తమ పూర్వఋషి సంప్రదాయము వారందఱు నిజముగా ద్వైతులేయని తెలిసికొని యద్వైతు లిప్పుడేమి మార్గమవలంబింతురో. ఆరాధ్యులైనను తమపూర్వులు లింగధారులుగారని వీరి పరిష్కారమువలన గ్రహించి యట్టిమార్గమునే యవలంబింతురని గ్రహించుడు.

## పండితత్రయము-లింగధారణము గలదే?

ప్ర॥ తెలుగుదేశపువారగు పండితత్రయము (శివలెంకమంచెన పండిత, శ్రీపతిపండిత, మల్లికార్జునపండితులు) లింగధారులనుటకు బలవదాధారములు నాకు గానరాలేదు. మల్లికార్జునపండితారాధ్యుల గ్రంథమున నెక్కడను లింగధారణప్రశంసయే లేదుగదా? అని పీఠికయందు గలదు.

దీనింబట్టి పండితత్రయమునకు లింగధారణ లేదని స్పష్టమగు చున్నది. పండితత్రయమునకే లింగధారణ లేనప్పుడు పూర్వకాలమున లింగధారణమున్నదనుటయెట్లు?

ఉ॥ పండితత్రయమునకు లేదని తేలినప్పుడుగదా పూర్వకాలమున నున్నదనుట యెట్లని మీరు సంశయించుట.

ప్ర॥ పండితత్రయమునకు నున్నదని దేనినిబట్టి ధ్రువపరుతురు?

ఉ॥ లేదని మీరు దేనినిబట్టి ధ్రువపరుతురు?

ప్ర॥ పండితత్రయము లింగధారులనుటకు నాకు బలవదాధారములు గానరాలేదని పీఠికాకర్తలు వ్రాసియున్నారుగదా?

ఉ॥ బలవదాధారములు వారికి గానరాకున్నను మాకు గానవచ్చుచునేయున్నవి.

ప్ర॥ మీకుగానవచ్చిన బలవదాధారములెవ్వి?

ఉ॥ వారు లింగధారులుగారనుటకు బలవదాధారములు గావలయుగాని వారులింగధారు లనుటకు బలవత్తర ప్రమాణములతో బనిలేదు.

ప్ర॥ అదియేల?

ఉ॥ పండితత్రయముయొక్క వంశమువారు నెక్కరిప్పుడును గలరు. వీరందఱు లింగధారులుగా నేయున్నారు. దీనింబట్టి వీరి పూర్వులును లింగధారులేయని యనుమానప్రమాణముచే నేర్పడును. ఇదిగాక వీరు లింగధారులుగారని శాస్త్రులవారొక్క ప్రమాణమునైనం జూపియున్నారా? లేదు. ఇట్లుండ, వీరు లింగధారులు గారనుట యెట్లు?

ఇదిగాక పండితత్రయమనువార లప్రసిద్ధులుగారు. ద్వాదశ శైవాచార్యులలోం జేరినవారు. వారులింగధారిమతమును సిద్ధాంతము?

సేయుచున్నచో లింగధారిబ్రాహ్మణశాఖను నాచార్యకోటిలో నెట్లు సేయుదురు? వారిని నాచార్యులనుగా కడమవారెట్లులంగీకరింతురు? కాఁబట్టి పండితత్రయము లింగధారులేయగుట నిర్వివాదము.

ప్ర॥ అగుగాక, పండితత్రయము లింగధారులగుటకు ననుమాన ప్రమాణములుగాక శబ్దప్రమాణములను గనఁబరుపగలరా?

ఉ॥ అవసరమైనచో నట్లే దెలుపఁబడును.

మంచెనపండితుడు లింగధారియే.

ప్ర॥ మొదట శివలెంకమంచన పండితుఁడులింగధారియనుటకు శబ్ద ప్రమాణమేమిగలదు?

ఉ॥ శివలెంకమంచెన పండితునిచరిత్రమే ప్రమాణము.

ప్ర॥ ఆచరిత్రమెందున్నది?

ఉ॥ సోమనాథకృతమగు బసవపురాణమునందె కలదు.

ప్ర॥ బసవపురాణముననున్న యాచరిత్రమున మంచెన పండితుఁడు లింగధారియని బోధించు వాక్యమెద్ది?

ఉ॥ బసవపురాణము 198 పేజీ.

అక్కజంబుదంగ నన్యదర్శనుల ముక్కుపైఁ గత్తియనెక్కి మప్పురిని నెత్తించి 'వీరమాహేశ్వర పదమెయుత్తమ మీశ్వరుఁడొక్కండెకర్త!

యని ప్రతిష్ఠింపంగ నన్యదర్శనులు అని మొదలుగా గలదు. దీనింబట్టి వీరమాహేశ్వరపదమె యుత్తమమనియు, శివుఁడొక్కఁడె కర్తయనియు, మంచెనపండితుఁడు సిద్ధాంతము సేసినట్లు తెలియుచున్నది. ఆయన చేసినవానిలో మొదటి సిద్ధాంతము వీరమాహేశ్వరపద ముత్తమమని గదా? వీరమాహేశ్వరపదమునకు నర్థము తెలియునెడ నాసిద్ధాంతకర్త లింగధారి యగునో కాదో యను సంశయము నివర్తింపకమానదు.

ప్ర॥ వీరమాహేశ్వరపదమునకు నర్థమేమి?

ఉ॥ వీరమాహేశ్వరుఁడన్నను, వీరశైవుఁడన్నను పర్యాయపదములె యగుగదా?

ప్ర॥ ఈయర్థము నెల్లరు నంగీకరింతురా?

ఉ॥ కడమ వారంగీకరించిననుఁ నంగీకరింపకున్నను పీఠికాకర్తలగు శాస్త్రులవారుమాత్ర మంగీకరింపకతక్కరని యెంచెద.

ప్ర॥ అదియేల?

ఉ॥ బసవపురాణపీఠిక 74 పేజీయందు నీశాస్త్రులవారే వీరమాహేశ్వరుఁడనగా వీరశైవుఁడే యని యర్థము వ్రాసియున్నారు. దీనింబట్టి శివలెంకమంచెన పండితుఁడు కాశీపట్టణమునందు వీరశైవసిద్ధాంతముగావించినట్లు స్పష్టమగుచుండగా పీఠిక 79 పేజీయందు శ్లో॥ శివలింగం కరాద్యంగే వీరశైవస్తుధారయేత్॥ అను వచనమునుబట్టి లింగధారణము మాత్రమే వీరశైవాసాధారణధర్మమని పరిష్కరించిన శాస్త్రులవారు మంచెనపండితుఁడు లింగధారిగాడని యంగీకరింప సాహసింతురా?

ప్ర॥ మంచెనపండితుఁడు తాను లింగము ధరింపకయె లింగధారణసిద్ధాంతము సేసియుండఁగూడదా?

ఉ॥ అది సిద్ధాంతమేయగుచో నీవేల యాచరింపవని తన్నొరులడుగకుండరుగాన నట్టి తెలివిమాలిన పనికి సిద్ధాంతకర్తలు ప్రవర్తింపరు. కావున శివలెంకమంచెన పండితుఁడు లింగధారియే యనుట సప్రమాణము నిర్వివాదము నగును.

ప్ర॥ శివలెంక మంచెనపండితుఁడు సోమశంభుని మనుమడట గౌడదేశమున గోళకీ మఠమనుపేరనున్న గొప్ప శైవాచార్య మఠమునకు సోమశంభువు భావశంభువు మొదలగువార లధిపతులని తెలియుచున్నది. సోమశంభువు తన పేర నొకపద్ధతిరచియించెను. దానినిబట్టి

యీతడు పాశుపతశైవసంప్రదాయమువాఁడని తెలియుచున్నది. దీనిం బట్టి యీయనమనుమఁడైన శివలెంక మంచెన పండితుఁడును శివాచార్య సంప్రదాయమువాఁడె యగుఁగాని లింగధారణగలవాఁడెట్లగును?

ఉ॥ లోగడ మంచెనపండితుఁడు లింగధారియని సప్రమాణముగా దెలుపఁబడియెను గాన సోమశంభునకు మనుమఁడైనను తాను లింగధారణము గ్రహించియుండవచ్చును.

ఇదిగాక, సోమశంభుని పద్ధతి యనుగ్రంథము మాత్రమును బట్టి సోమశంభ్వాదులు లింగధారులుగారని నిర్ణయింప ననువుపడదు. సోమశంభుఁడు మొదలగువారు శివాగమ పారదృశ్వు లగుటంజేసి లోకోపయోగమునకై స్థావర పూజాపద్ధతులనుగూడ రచించియుందురు. దాక్షిణాత్యులగు గురుకులలు తమకు స్థావరపూజా పద్ధతి మాత్రమె యుపయుక్తమైనదగుటంజేసి యద్దానిని మాత్రమెప్రచారమునకుంచికొనియుందురు, గాన నీమాత్రమున వారు లింగధారులు గారనుట సహేతుకముగాదు.

మంచెనపండితుని వంశస్థులు నేటికిని, లింగధారులుగా నుండుటను, మంచెనపండితుడు లింగధారియని చరిత్రలవలన నేర్పడుటను నాయనకు తాతలైన సోమశంభ్వాదులునులింగధారులేయయియుండురని యూహించుటయె ఋజుపద్ధతియగును.

శ్రీపతిపండితుఁడు లింగధారియేయగును.

ప్ర॥ శ్రీపతిపండితుఁడు లింగధారియనుటయెట్లు ?

ఉ॥ చరిత్రలనుబట్టియె.

ప్ర॥ శ్రీపతి పండితునిచరిత్రమెవ్వరుచెప్పిరి ?

ఉ॥ కాశీనాథుని వీరారాధ్యుఁడు శ్రీపతి పండితుని చరిత్రమును చెప్పియుండెను.

ప్ర॥ అందేమికలదు ?

ఉ॥ ధర్మగుప్తాభ్యుదయమున నీకథ నిట్లువివరించి చెప్పినాడని బసవపురాణ పీఠిక 64 పుటయందు.

గీ॥ అరయఁదత్పండితేంద్ర నిజాంశభూతి
భవులు శ్రీపతిమంచెనపండితులును
మల్లికార్జున పండితుఁడెల్ల జనులు
వినుతులొనరింప వెలసిరుర్వీతలమున॥

గీ. వారు భువి వీరశైవప్రవర్తనంబు
బ్రాహ్మణాచారమగునంచుఁ బర్యమాన
వేదవేదాన్తసిద్ధాంతవిశ్రుతముగఁ
దెలియఁజేయుచు విలసిల్లి రలఘు మహిమ॥

అని యిట్లు పీఠికాకర్త లుదాహరించిన పద్యములలోనె శ్రీపతి పండితాదులు వీరశైవధర్మాచరణము బ్రాహ్మణానుష్ఠేయ మేయని సిద్ధాంతము చేసినట్లున్నది.

పీఠికాకర్తల యభిప్రాయమునుబట్టి చూచినను లింగధారణము లేని వీరశైవసిద్ధాంతము సంభవింపదుగదా? దీనింబట్టి పండితత్రయము లింగధారు లేయని స్పష్టమగుచున్నది.

తరువాత శ్రీపతిపండితుని చరిత్రమున,

సీ॥ సరవిఁ గృష్ణానదీస్నానంబుగావించి నిత్యకృత్యంబులు నెఱయఁదీర్చి
వచ్చుచోఁబురవీధివసుధేశుమదగజంబరుదేర దొలఁగుచునచటనొక్క
గొడగరి వాకిలిగడఁజొచ్చినిలిచిన నంతఁ దద్గృహమేధియరుగుదెంచి
శరణార్థి,గురురాయసతతంబునావ్రతంబార్యవరయ్యలకుశివార్పనఁబు

గీ॥ దగసలుపుచుండ నొకయయ్య తక్కువయ్యె। నేడు లింగైక్యమిఁక
నాకు నిక్కమనిన। మంచిదని వాని వ్రతమొనరించి వేడ్క।
వచ్చు దేశికుఁగని పరవాదులుదిరి॥

అని మొదలగు పద్యములుగలవు. అందు

శ్రీపతిపండితుఁడు కృష్ణానదియందు స్నానముచేసి నిత్యకృత్యంబులు దీర్చికొనివచ్చునెడ నెదురుగా మదగజంబొకటి వచ్చుచుండం గాంచి యొక్క గొడగరివాని వాకిట నొదిగి నిలిచియుండ నాయింటివాఁడు వచ్చి శ్రీపతిపండితునకు మ్రొక్కి స్వామీ! నాకు ప్రతిదినము నార్వురు మాహేశ్వరుల నారాధించు వ్రతము గలదు. నేడొక మాహేశ్వరుండుదక్కవచ్చెను. నాకు వ్రతము జరుగనియెడ లింగైక్యము తప్పదని వచింప నామహాత్ముఁడు దాని కియ్యకొని యాతని వ్రతంబు నెరపేర్చి వచ్చుచుండగా పరవాదులు గాంచి యీశ్రీపతి పండితుండు గొడగరివాని యింటియందు భుజించెనని రాజునకుం దెలిపి పండితునిం బహిష్కరించి పచనాదులకు నగ్ని నొసఁగమనుడు నప్పండితేంద్రుండు వీతిహోత్రు నాకర్షణంబుజేసి తనమీదనున్న పట్టుపచ్చడంబునం బంధించి శైవగృహంబులందక్క కడమయిండ్ల నుండకుమని యానఁబెట్టి విజయవాటికాపుర మల్లికార్జునదేవు నాగ్నేయదిగ్భాగముననున్న జమ్మికొమ్మనుం గట్టిన నంతఁ దద్గ్రామవాస్తవ్యులగు ప్రతివాదులకు నగ్ని కరవగుటయు రాజుతోగూడ నందఱును శరణార్థులయి తచ్ఛిష్యులైరనియుఁ దెలియుచున్నది.

ఆర్వురు మాహేశ్వరులవ్రతము షట్స్థలములకు, షడ్లింగములకును సంబంధించినదిగాన వీరశైవవ్రతమగుగాని వేరొకటిగా నేరదు. లింగధారి గానివాఁడీ వ్రతమున నుపయుక్తుఁడుగాడు గాన నీచరిత్రముంబట్టి శ్రీపతిపండితుఁడు లింగధారియేయని తెలియుచున్నది.

ప్ర॥ శ్రీపతిపండితుని చరిత్రము సింకెవరైన దెలిపియుండిరా?

ఉ॥ సోమనాథుఁడు బసవపురాణమునను, మల్లికార్జునపండితుఁడు శివతత్త్వసారమునను గూడ నీచరిత్రము జెప్పియుండిరి.

ప్ర॥ అదియెట్లు?

ఉ॥ బసవపురాణము 210 పేజీ.

భక్తుండు శ్రీపతిపండితుం డీసు భక్తుని కిలఁగోటిబ్రాహ్మణులైన నేనయన్న నాలుకనే గోసినైతుననుచు ననంతపాలుని సభాస్థలిని నెక్కొనగాఁ జంద్రడువ్వులుగాదె చక్కన పొత్తిపచ్చడమున ముడిచె. అనియు మల్లికార్జునపండితుఁడు శివతత్త్వసారమున

క॥ ఒక్కఁడె దైవముశివుఁడని
నిక్కము సేయుటకుముడిచె నిప్పులుసీరగా
స్రుక్కక శ్రీపతిపండితు
డక్కజముగవిజయవాడనలజమ్మిశివా ॥

ప్ర॥ బసవపురాణము, శివతత్త్వసారము ననువానినిబట్టి శ్రీ పతిపండితుఁడనంతపాలుని సభాస్థలమున ప్రతిజ్ఞసేసి జమ్మిచెట్టున నగ్నిని బంధించినట్లుమాత్రము దెలియుచున్నదిగాని యతఁడు లింగ ధారియని తెలియుచున్నదా ?

ఉ॥ బసవపురాణ శివతత్త్వసారములనుబట్టి యనంతపాలుని సభాస్థలిని చర్చఁజరిగినవిూద నగ్నిని బంధించెననిమాత్రము తేలినను నట్లు చర్చజరుగుటకును, నగ్నిని బంధించుటకును కారణము గొడ గరివాఁనివ్రతము నెగ్గించుటయని గ్రంథాంతరములవలన దెలియు చున్నదిగానను, ఆయన లింగధారిగానిది యట్లునెగ్గించుట యసంభ వము గానను శ్రీపతిపండితుఁడు లింగధారియనుట బసవపురాణ శివ తత్త్వసారములకును సమ్మతమేయని స్పష్టమగుచున్నది.

ఇదిగాక, శివభక్తునకు గోటిబ్రాహ్మణులైన సరికారనివాదించి నట్లు బసవపురాణమువలనఁ దెలియుచున్నది. ఈవాదము భక్తుఁ డైన గొడగరివానియొక్క యాధిక్యమును దెలుపనేయని విశదమగు చున్నది. ఈసందర్భములును గ్రంథాంతరోక్తచారిత్రమునె యనూ దించుచున్నవి గాన శ్రీపతిపండితుఁడు లింగధారియేయని స్పష్టమగు చున్నది.

## మల్లికార్జునపండితుఁడు లింగధారియేయగును.

### ప్రథమప్రమాణము.

ప్ర॥ మల్లికార్జునపండితుఁడు లింగధారియనుటకు నేమిప్రమాణము ?

ఉ॥ సోమనాథుడురచించిన మల్లికార్జున పండితారాధ్య చరిత్రమే ప్రమాణము.

ప్ర॥ అందు మల్లికార్జున పండితుడులింగము ధరించినట్లు గలదా!

ఉ॥ భవహరుసాతొదభవు జితభావ । భవుశివు శ్రీకోటిపల్లియారాధ్యదేవు శ్రీపాదు కేందీవరంబులకు । భావం బెలర్పనర్పణమాచరించి । పడసిప్రాణార్పణప్రాణలింగంబు ॥ అనుటచే లింగముధరించినట్లును, మఱిలింగధార ణమహిమ వేదముల నెఱుగరె సవియుదా నెయ్యవియనిన॥అను మొదలగు ద్విపదలచే మల్లికార్జున పండితుఁడు లింగధారణసిద్ధాంతము చేసినట్లును స్పష్టమగుచున్నది.

ప్ర॥ పీఠికాకర్తలు మల్లికార్జున పండితారాధ్యుల గ్రంథమున నెక్కడను లింగధారణప్రశంసయే లేదుగదా? అని వ్రాసియున్నారు. మల్లికార్జునపండితుఁడు లింగధారియే యైనచో తానురచించిన శివతత్త్వసారమున లింగధారణసిద్ధాంతము నేలసేయకుండును ? దీనింబట్టి యాయనకు లింగధారణము లేదని స్పష్టమగుచున్నది. సోమనాథుఁడు మల్లికార్జునపండితునకు లింగధారణముండునని యూహతోనో తానులింగధారిగాన యాయనయు లింగధారియనియో వ్రాసినను వ్రాయనగును.

మల్లికార్జునపండితుఁడు లింగధారి యగునా కాఁడా యని సంశయము గలిగినప్పుడు ఇతరుఁడు చేసిన గ్రంథముకంటె మల్లికార్జునపండితుని గ్రంథమునకే యెక్కువ ప్రామాణ్యముండునుగాన శివతత్త్వసారమునుబట్టి మల్లికార్జునపండితుఁడు లింగధారి కాఁడని

స్పష్టమగుచుండగా సోమనాథకృతులనుబట్టి యాయన లింగధారియని నిర్ణయించుట యెట్టులుచితమగును?

ఉ॥ ఇది యెట్టు లుచితమో యవధానముతో వినుము. శివతత్త్వసారమునుబట్టి మల్లికార్జునపండితుఁడు లింగధారి కాఁడని యేర్పడదు. ఏలన, శివతత్త్వసారము సంపూర్తిగ్రంథము లభింపనె లేదని ప్రకాశకులు తెలిపియున్నారు. ఇట్లుండ అసంపూర్ణమగు గ్రంథమును బట్టి గ్రంథకర్త లింగధారిగాఁడనుట న్యాయ్యముగాదు.

ఇదిగాక సంపూర్ణగ్రంథమున లింగధారణప్రశంస లేకున్నను నామాత్రమున మల్లికార్జునపండితుఁడు లింగధారి కాఁడనఁగూడదు. ఏలన,

కల్పసూత్రకారులైన పదునెనమంద్రు మహర్షులలో నొక్క బోధాయనుఁడుతక్క యజ్ఞోపవీతమును విధించినవాఁడె లేడు. ఈకారణమున కడమమునులందఱకు యజ్ఞోపవీతధారణము లేదని నిర్ణయింపనగునా?

అదిగాక, మల్లికార్జునపండితుఁడు శైవదీక్షను వివరించియెయుండెను, అది లింగధారణదీక్షయె యని యేల గ్రహింపరాదు?

మఱియు మల్లికార్జునసే పండితకృతినిబట్టి పీఠికాకర్తలు మల్లికార్జునపండితుఁడు లింగధారి కాఁడని నిర్ణయించుచున్నారో ఆశివతత్త్వసారమును, సోమనాథుఁడు చూడకుండెనా? చూచియుండినచో దానినిబట్టి గ్రంథకర్త నిజస్థితి యాయనకు మాత్ర మెట్లు తెలియకుండును? తెలిసినప్పుడు నిజముగ్రహింపఁజాలక మల్లికార్జున పండితుని చరిత్రమునూహించి వ్రాయవలసిన గ్రహచార మాయనకేలపట్టెను?

ప్ర॥ నిజము దెలిసినను సోమనాథుడు తాను లింగధారిగాన మల్లికార్జునపండితుఁడును లింగధారియేయని కల్పించి వ్రాసియుండఁగూడదా?

ఉ॥ అసత్యదోషమును మహనీయుఁడగు సోమనాథునిపైనారో పించుట మహాసాహసము.

లింగధారిగాని మల్లికార్జున పండితుని లింగధారినిగా గల్పింప సోమనాథునకేమియవసరమువచ్చెను. చరిత్రముఁవ్రాయ నాయనకు నిజమైన లింగధారి యెక్కడనుదొరకఁడయ్యెనా ?

లేనివానికి లింగమున్నదని గల్పింపఁజూచినచో నట్లు లిం గములేనివా రెందఱులేరు ? మల్లికార్జునపండితునకే గల్పింపనేల? మఱియు సోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమునందు

భవిగృహక్షేత్రాది పథవర్జితుండ, భవిజనదర్శనస్పర్శ నాలాప వివిధదానాదాన విషయదూరగుడ॥ ననుటచే భవిజనముయొక్క దర్శ నము, స్పర్శనము, ఆలాపము మొదలగునవి లేనివాఁడనని వ్రాసికొని యుండెను. ఆయనకేమల్లికార్జున పండితుఁడు లింగధారి కాఁడని తెలిసి యున్నచో గలలోనైన నీయననుగూర్చిన ప్రస్తావమునిచ్చగించునా ! అట్టివాఁడు నాలుగునూర్లపుటల కధికమగు గ్రంథముతో భవి నెట్లు వర్ణించును ? కావున మల్లికార్జున పండితుఁడు లింగధారి కాఁడనుట చారిత్రవిరుద్ధము.

ఇదిగాక మల్లికార్జునపండితుఁడు మనకంటె సోమనాథునకు చాలసమీపకాలమువాఁడు, కావున నాయనకుఁ దెలిసినదే నిజచరిత్ర విశ్వసింపకతీరదు.

పీఠిక 6 పుట,

1168 లో బసవేశ్వరుఁడు లింగైక్యమందెను. 1170 కే పండి తారాధ్యుడును లింగైక్యమందియుండును.

ఇట్టి పండితారాధ్యులవారి శిష్యునితో సంభాషించి బస పురాణకథార్థముల నెఱిఁగిన పాల్కురికి సోమనాథుఁడు 1190 ప్రాం

ములకంటెఁ దర్వాతివాఁడైయుండడు. అది రుద్రదేవుని పరిపాలన కాలమేకదా?

మఱియుఁ బండితారాధ్యులవారు లింగైక్యమందినపిదప వారి శిష్యుఁడైన దోనమయ్య, వారిప్రథమపుత్రుఁడైన కేదారయ్యకు లోకారాధ్య పట్టమునుగట్టి తాననర్గళముగా భక్తిరాజ్యమేలుచున్న ట్టును, గేదారయ్యయు నలుగురు పుత్రులంగాంచి వంశాభివృద్ధితో నున్నట్లును బండితారాధ్యచరిత్రమునఁ గలదు. పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రరచనాకాలమునకుఁ బండితారాధ్యులవారి శిష్యుఁడును, బుత్రుఁడును సజీవులైయున్నారని మనుమలు పేర్వెలయు చున్నారని దీనివలన నేర్పడుచున్నది. సోమనాథుని గ్రంథములలోఁ బండితారాధ్యచరిత్ర కడపటిది. ఈసాధనమును బట్టిచూచినను బండితారాధ్యుల లింగైక్యమునకుఁ దర్వాత నిర్వది ముప్పది యేండ్లకే రుద్రదేవుని పాలనకాలముననే (ఇంచుమించుగా1190) సోమనాథుఁడు ప్రసిద్ధగ్రంథకర్తయైనట్లు స్పష్టమగుచున్నది. అనియున్నది.

పండితారాధ్యుల లింగైక్యమున కిరువది ముప్పదియేండ్లకే పండితారాధ్యుల శిష్యుఁడు, పుత్రుడును సజీవులైయుండగనే సోమనాథుఁడు లింగధారణ లేని పండితారాధ్యునకు లింగధారణ మున్నదని యెట్లువ్రాయును. ఇట్టి యసత్య చరిత్రమునకు పండితారాధ్యుని శిష్య పుత్రాదులెట్లు సమ్మతింతురు? ఆగ్రంథము లోకమున నెట్లు ప్రకాశము నొందఁగలుగును? కాఁబట్టి సోమనాథుఁడు మల్లికార్జునపండితునకు లింగధారణము లేనిదే కల్పించి వ్రాసెననుట కల్ల. దానంజేసి మల్లికార్జునపండితుఁడు లింగధారియేయగుట యథార్థము.

ద్వితీయ ప్రమాణము. (2)

ఇదిగాక పీఠిక 5 పుట.

జంగమరత్నంబు శరణసమ్మతుఁడు

లింగైక్యవర్తి గతాంగవికారి
పండితారాధ్య కృపాసముద్గతుఁడు
మండితసద్భక్తి మార్గపరిచారి
విలసితపరమ సంవిత్సుఖాంభోధి
నలిఁగరస్థలి సోమనాధయ్యగారు

మొదలగు భక్తులను వేడి బసవపురాణ కథా వృత్తాంతము
దాను దెలిసికొన్నట్లు సోమనాధుఁడు బసవపురాణమునఁ జెప్పు
న్నాఁడు. మీఁది ద్విపదలలోఁ గరస్థలి సోమనాధయ్య పండితారాధ్య
కృపాసముద్గతుఁడని కలదు. పండితారాధ్యుల వారిశిష్యుఁడనియేని
తదనుగ్రహమున జనించిన వాఁడనియేని దానికర్థమగును. తచ్ఛిష్యు
డనుటే యుక్తతరము. పండితారాధ్యుఁడనగా మల్లికార్జున పండిత
రాధ్యుఁడే ఆయనశిష్యుఁడైన కరస్థలి సోమనాధయ్యకుఁ బాల్కు
సోమనసమకాలము వాఁడని దీనివలన నేర్పడుచున్నది, అనియున్న

దీనింబట్టి కరస్థలి సోమనాధయ్య మొదలగువారివలన సో
నాధుఁడు పూర్వవృత్తాంతముల నెఱిఁగియున్నట్లును, కరస్థలి సో
నాధయ్య మల్లికార్జునపండితారాధ్యుని శిష్యుఁడనియు విశదమగు
న్నది గదా.

జంగమరత్నంబు శరణసమ్మతుఁడు. ఈ మొదలగు విశేష
లనుబట్టి కరస్థలిసోమనాథయ్య లింగధారియె యనుట నిస్సంశయము.

ఇట్టి సోమనాధయ్యకు గురువైన మల్లికార్జున పండితు
లింగధారి కాఁడనుట పరిహాసావహము కాదా? కావున పండితు
లింగధారి కాకమానడు.

తృతీయ ప్రమాణము. (౩)

ప్ర॥ పీఠికాకర్తలు మల్లికార్జునపండితునిగూర్చి పీఠిక 74 పే

మల్లికార్జునపండితారాధ్యులకు బ్రాహ్మణ్యము మీద నాస్థగలదు. వర్ణాశ్రమధర్మసంబంధనము మీద దాత్పర్యము గలదు. శివభక్తియందు దన్మయత్వము గలదు. బసవేశ్వరుడు మహాశివభక్తుడని యాయన యెడల నద్భుతగౌరవమును, వైదికకర్మలను గర్హించి వర్ణాశ్రమాచారములను రూపుమాపుచున్నాడని యతృప్తియుఁ గాంచినవాడై బసవేశ్వరుని దర్శించి వాదించుటకై పోవుచుండఁ ద్రోవలో దన్మృతి వార్తవినవలసెననియు,భక్తిమీదవలపు,బ్రాహ్మ్యంబుతోఁబొత్తుఁబాయ లేను నేను బసవలింగ అనియాయన చెప్పెననియుఁ బ్రతీతికలదు. దీనింబట్టికూడ నాతఁడు బసవేశ్వరుని మతమువాఁడుకాడని స్పష్టముగా తెలుగనగును. అని వ్రాసియున్నారు. దీనింబట్టి మల్లికార్జున పండితుఁడు లింగధారి కాఁడని తెలియుటలేదా ?

ఉ॥ ఆచరిత్రమునంబట్టి బసవేశ్వరమతమువాఁడు కాఁడని తెలియఁగాని లింగధారిగాడని యేర్పడదు. బసవేశ్వర మతమువాఁడు గానిచో లింగధారణముండదను నియమమెందును లేదు. అది వైదిక వీరశైవమునను నుండునని వివరింపఁబడియెనుగదా?

మఱియు నీచరిత్రముఁబట్టియు మల్లికార్జునపండితుఁడు లింగధారియనియె యేర్పడును. ఎట్లన బసవేశ్వరునకు పండితునకును వర్ణాశ్రమధర్మములయెడనె మతభేదముగలదని యామైతిహ్యమును బట్టి దెలియుచున్నది. అది యిరువురు లింగధారులైననే సంభవించును. అందు నేఁకొక్కరు లింగధారిగానిచో లింగధారణంబును మతభేద మూలమైయుండునుగదా ? కావున నిరువురును లింగధారులైనను వర్ణాశ్రమధర్మము నెడనే వారికి నభిప్రాయభేదముగలదని యేర్పడు చున్నది.

### తురీయప్రమాణము (4)

ప్ర॥ శివతత్త్వసారమునుబట్టి మల్లికార్జునపండితుఁడు లింగధారియని నిరూపింపశక్యమగునా ?

ఉ॥ వలయుచో నదియుగక్యమే. ఎట్లనశివతత్త్వసారము.

క॥ జంగమ లింగంబగు భ
క్తుంగని పూజింపడేని గోటివిధములన్
లింగార్చనచేసిన వృధజంగమ
ముత్తమముగాన స్థావరమునకున్ ॥

అను పద్యమున మాహేశ్వరుని జంగమలింగముగా భావించి పూజింపవలయునని యున్నది. ఈభావము లింగధారులలో దక్షయుద్యులయందు నసంభవము. దీనింబట్టి మల్లికార్జునపండితుడు లింగధారియని యేర్పడును.

ప్ర॥ భక్తుడు జంగమలింగమనుట లింగధారణ సిద్ధాంతగతమే యనుట సర్వసమ్మతమగునా?

ఉ॥ ఇట్లనుట సర్వసమ్మతమైనదు గాకున్నను పీఠికాకర్తలకు సమ్మతమే. పీఠిక 74 పుట. వీరశైవులుజంగములైన (చరించునట్టి) శివలింగములేయని వీరశైవగ్రంథములు పలుకుచున్నవి. అని వారె వ్రాసియున్నారుగదా? దీనింబట్టి శివతత్త్వసారకర్త లింగధారి యని స్పష్టమగుటలేదా?

పంచమ ప్రమాణము. (5)

ఇదిగాక శివతత్త్వసారము 82 పేజీ.

క॥ కుసుమశరారీ శివలిం
గసమేతులు దక్కఁబొందఁగానోగి నిర్మా
ల్యసుఖంబని బఁడారువు
బసవన విసమెత్తిత్రావి బ్రతుకఁడెరుద్రా ॥

అనుపద్యమున శివలింగధారులుదక్క శివనిర్మాల్యము ననుభవింపరాదని చెప్పి బసవేశ్వరుఁడు విసముద్రావిన వృత్తాంతమునను

పాదించెను తాను శివలింగధారిగానిచో నీచరిత్రము నెట్టులుదాహ రించును ?

ప్ర॥ బసవేశ్వరునిచరిత్రము నుదాహరించినమాత్రన శివతత్త్వ సారకర్త లింగధారియని యెట్లు విశ్వసింపవలయును?

ఉ॥ అందు బసవేశ్వరునిచరిత్రము నుదాహరించుటమాత్రము గాదు. వేరొకవిశేషముగలదు ఏమనిన, మల్లికార్జునపండితుఁడు తాను శివనిర్మాల్యము ననుభవించువాఁడనుట స్పష్టము. అట్లు కానిది తన గ్రంథమున శివనిర్మాల్యముభోజ్యమని సిద్ధాంతము చేసియుం డునుగదా?

ఎటనైన లింగధారణలేనివాఁడు తాను శివనిర్మాల్యము భుజిం చుచు తన్నుంబోలువారలకు శివనిర్మాల్యము భోజనీయమే యని సిద్ధాంతముసేయుచు 'లింగధారణలేనివాఁడు శివనిర్మాల్యము భుజిం పఁగూడదను వాదము నంగీకరించునా? అట్టిచో నిట్టివాదమును గాక విసముద్రావి ప్రత్యక్షనిదర్శనముచూపి యీవాదమును దృఢపరిచిన బసవేశ్వరచరిత్రమునుగూడ తన గ్రంథమున నిబంధింపఁబూనునా?

కాఁబట్టి శివతత్త్వసారమునుబట్టి గ్రంథకర్తయగు పండితుఁడు లింగధారియేయనుటయుచితము. అయినను ఆగ్రంథకర్త లింగధారి గాడని యన సాహసింపఁబూనినచో దానిచే నంతమాత్రమెగాక యతఁడు పండితుఁడునుగాఁడనియే యంగీకరించినట్లగు.

ప్ర॥ శివతత్త్వసారకర్త భక్తునకు శివనిర్మాల్యము గ్రాహ్య మని సిద్ధాంతము సేసియుండెను. అంతమాత్రమున లింగధారియనుట యెట్లు?

ఉ॥ శివనిర్మాల్యముసిద్ధాంతముసేయునప్పుడుశివతత్త్వసారము

66 పుట.

క॥ గురుకృతశివదీక్షమెయిన్
విరహితమలదేహులగు పవిత్రులుభక్తుల్
హరనిర్మాల్యము గుడుతురు
పరమేశ్వరునందు దాసభావముతోడన్ ॥

అనుటచే గురునిచే నొసంగబడిన శివదీక్షచే త్రిమలము
నశించినకతన పవిత్రులైన భక్తులు శివనిర్మాల్యమును భుజింపనగునని
యున్నది. ఈగ్రంథము యొక్క పూర్వోత్తర సందర్భములనుబట్టి
యీశివదీక్ష లింగధారణదీక్షయేయని విశదమగుచున్నది.

అట్లుగాక, కేవలభక్తులని గ్రహించినను లింగధారులే యని
లోకవ్యవహారమువలన నేర్పడును. దాననే బలిమికి లింగముగట్టిన
భక్తుడగునా అనుసామెత ప్రవర్తించినది. లింగధారణ లేనివారిలో
కొందఱుభక్తులున్నను నీసామెత లింగధారణము భక్తలక్షణములలో
ముఖ్యమను నర్థమును బోధింపకమానదు.

మఱియు, శివతత్త్వసారమున శివాచారము, భృత్యాచారము
మొదలగు సంప్రదాయములును, శివభక్తుడు కులహీనుడైనను
సర్వోత్తముడనుటయు, శివనిందకుల జంపవచ్చునను నిర్ణయము
మున్నగు పెక్కునంశములు గ్రంథకర్త లింగధారి యనుటనే విశద
పరుచుచున్నవి. కావున, మల్లికార్జునపండితుడు లింగధారియే
యనుట బహుప్రమాణసిద్ధము.

ఉద్భటుడు లింగధారియే.

ప్ర॥ ఉద్భటునకు లింగధారణమున్నదనుట కేమి ప్రమాణము?

ఉ॥ ఉద్భటునకు లింగమున్నదనుటకు నుద్భటరాధ్యచరిత్రమే
ప్రమాణము.

ప్ర॥ దాని నెవ్వరు రచించిరి?

ఉ॥ తెనాలి రామలింగ కవి రచించెను. మఱియు నీగ్రంథమును నీపీఠికాకర్తలె పరిష్కరించి యుండిరి. అందు నుద్భటునకు లింగధారణముగలదను నెడసంశయము నైన వెలిబుచ్చియుండిరా లేదు.

ప్ర॥ పీఠిక 77 పుట:—ఉద్భటుడు భోజునకు దీక్షాగురుడని పండితారాధ్య చరిత్రమునను నుద్భట చరిత్రమునను గలదు. భోజుడు రచించిన శైవతంత్రము తత్త్వప్రకాశము నేడు సుముద్రితములైయున్నవి. అందు నేటి యారాధ్య సంప్రదాయ విషయము లేవియు గానరావు. గోళకీమఠ సంప్రదాయము వారు తమ గ్రంథములయందు భోజుని గ్రంథములను ప్రమాణముగా గొనియున్నారు. ఉద్భటుడీ భోజునకు గురువేయగునేని యాతడు నేటియారాధ్య సంప్రదాయము వాడుగా నేరడు. ఆయుద్భటుని వంశమువారగు నాంధ్రారాధ్యులు గూడ భోజ గ్రంథగోళకీమఠాచార్యకృత గ్రంథోపదిష్టమగు వైదిక శైవసంప్రదాయము వారేయగుదురు. అవి వ్రాయబడి యుండుటచే నుద్భటుడు లింగధారి గాడని యేర్పడుటలేదా?

ఉ॥ ఉద్భటుడు భోజుని గురువేయని యుద్భటారాధ్యచరిత్రమువలన దెలియుచున్నది. ఐనను శైవతంత్రాదులరచించిన భోజుడెవరో ఉద్భటునకు శిష్యుడైన భోజుడెవరో నిర్ణయింప నశక్యము అట్లుగాక శైవతంత్రాదులు రచించిన భోజుడె యుద్భటుని శిష్యుడైనను తానంగీకరించిన లింగధారణ సిద్ధాంతమును తారచించు గ్రంథములలో నెల్ల వ్రాయవలయునను నియమముండదుగాన శైవతంత్రాదులలో లింగధారణ సిద్ధాంతము లేనిమాత్రన నాతనికెగాక యాతని గురునకు గూడ లింగధారణము లేదని యనుమానించుట యసంగతము. ఎవడో భోజుడు రచించిన శైవ తంత్రాదులలో లింగధారణము లేదనిచెప్పి యంత మాత్రన భోజునకు గురువైన యుద్భటునకు లింగధారణము లేదని యనుమానించుటయు,

గోళకీమతమువారు లింగధారులు గారనియెంచి వారు భోజుని గ్రంథముల ప్రమాణీకరించిరి గాన భోజునకు గురుడైన యుద్భటునకు నులింగధారణము లేదనుటయు బలవత్తరాధారములు గాని వాటికి దోచినవి గాబోలును.

ఇందుఁ జూడుడు.

ఇప్పటి యారాధ్యులును నప్పయదీక్షితులవారి గ్రంథముల ప్రమాణముగా గ్రహింతురు. ఇట్టియెడ అప్పయదీక్షితులవారికి లింగధారణము లేదుగాన వారి గ్రంథములఁ బ్రమాణముగా గ్రహించిన యిప్పటి యారాధ్యులకును లింగధారణము లేదని సాధింతురా? అట్లుగాక, అప్పయదీక్షితులవారి గ్రంథములను లింగధారులు ప్రమాణముగా గ్రహించిరిగాన నప్పయదీక్షితులవారికిని లింగధారణము గలదని సాధింతురా! ఇట్లు సాధించిన నిర్ణయము యథార్థమగునా? కావున నీయనుమానములు మానములుగాఁజాలవు. ఇదిగాక, ఉద్భట వంశ్యులగు ముదిగొండ వారుపూర్వకాలమునుండి లింగధారులుగా నుండిరి గానను వీరికి కూటస్థుఁడగు నుద్భటుడులింగధారియే యనుట స్పష్టము.

పీఠిక 77 పుటయందు,

ప్ర॥ క్రీస్తు శ॥ ౧౩౪౦ నుండి ౧౪౪౦ దాక సుప్రఖ్యాతులుగానున్న కొండవీటిరెడ్లు, తన్మంత్రులు శైవమతాభినివిష్టులుగానుండిరి. వారికిని వారి మంత్రియగు మామిడి ప్రెగ్గడయ్యకును శంకరారాధ్యులనువారు గురువులుగానుండిరి. ఆశంకరారాధ్యులకే పెదకోమటి వేమారెడ్డి పినపాడను గ్రామము నగ్రహారముగా నొసగెను. దానికి శాసనముగలదు. తెనాలిదగ్గఱఁ బినపాటిలో నేఁడా శంకరారాధ్యుల వారివంశమువారు మృత్యుంజయారాధ్యులు గలరు. వీరిది యుద్భటారాధ్యవంశమట! కాని వీరికి లింగధారణము లేదు. బహుకాలమున

నుండి సుప్రఖ్యాతమైయున్న యీవంశమువారు లింగధారులు గాకుండుట వింతగాదా? అని వ్రాసియున్నారు. దీనింబట్టి యుద్భటారాధ్యవంశోద్భవులు కొందఱు లింగధారణ లేనివారుగానున్నారుగాన దీనింబట్టియుద్భటునకు లింగము లేదని విశదమగుట లేదా?

ఉ॥ ఉద్భటవంశ్యులగు పినపాటివారికి నేడు లింగధారణము లేదను కారణమున నుద్భటునకు లింగధారణము లేదని సాధింపఁబూనుట యుచితముగాదు. ఏమనఁగా ఉద్భటవంశ్యులగు ముదిగొండవారు నేడు, నూర్లకొలది కుటుంబములవారు గలరు. ఇట్లుండ నత్యధిక సంఖ్యాకులగు తద్వంశీయులనుబట్టి మూలపురుషునకు లింగధారణముగలదని యనుమానించుట న్యాయ్యమో? అత్యల్పసంఖ్యాకులగు పినపాటి వారిని బట్టి మూలపురుషునకు లింగధారణము లేదని సాధించుట న్యాయ్యమో బుద్ధిమంతులె గ్రహింపగలరు. ఏకారణముననైన లింగధారణము వారికి లోపించి యుండుటయె సంభావితము. లింగమునుధరించుట కన్న దానిని విడుచుట సులభము. దాననె ఇప్పుడెన్ని కుటుంబములవారో లింగధారణము మానుచున్నారు. క్రొత్తగా ధరించు వార లరుదుగదా? నిజమిట్లుండ నుద్భటునకు లేనిదే తద్వంశ్యులలో మధ్యకాలమున శతసంఖ్యాకులు లింగము ధరించి రనుట సంభావితమో, అల్పసంఖ్యాకులు మానివేసిరనుట సంభావితమో బుద్ధిమంతు లూహింతురుగాక.

ప్ర॥ పినపాటివారికి మొదటినుండి లింగధారణము లేదని పీఠికా కర్తలు వ్రాయుచున్నారు. వారికి మధ్య కాలమున లింగధారణము లోపించినదని మీరభిప్రాయపడుచున్నారు. ఇందు నిజమేదని గ్రహింప వలయు.

ఉ॥ ఉద్భటారాధ్య వంశ్యులమని వారు చెప్పుకొనుచున్న కారణమునను, ఉద్భటవంశ్యులు పెక్కురు లింగధారులుగానున్న కతనను వీరికి మధ్యకాలమున లోపించిన దనుటయె నిజము.

ప్ర॥ మధ్యకాలమున లోపించుటకు కారణమేమి?

ఉ॥ లింగధారణలేని వారితోఁగల సంబంధమె కారణమనుట విశదమే. నేడ నేరులట్టి సంబంధవశమున లింగధారణము మానివేయుచుంట కన్పట్టుచున్నదిగాదా?

ప్ర॥ పినపాటివారు నడుమ లింగధారణము మానివేసిరని నమ్ముటకు వీరికి తొల్లిధారణము గలదని యెందేనింగలదా? అది లేనిచో నీవు నడుమ మానిరనుట యెట్లు?

ఉ॥ పినపాటివారి యొద్దయందు వారి పూర్వులచరిత్రముల దెల్పు గ్రంధములు గలవు. వానిలో వారు లింగధారులెయనియు నిత్యము శివరాత్రి వ్రతము మొదలుగా శైవవ్రతముల నవలంబించిన వారనియు శ్లో॥ భీమలింగ ధరణాదిపు భీమం। ఈ మొదలగు శ్లోకములు బోధించుచున్నవి. కావున పినపాటివారు పూర్వకాలమున లింగధారులనుట నిక్కము.

ప్ర॥ అట్లైన వారి చరిత్రములను పీఠికాకర్త లెఱుఁగరా?

ఉ॥ బాగుగా నెఱుఁగుదురు.

ప్ర॥ ఎఱిఁగియున్నచో వారికి ధారణము లేదని యెట్లువ్రాయుదురు?

ఉ॥ వారికి లింగధారణమున్నదనియె వ్రాసిరి.

ప్ర॥ ఏగ్రంథమునందు వ్రాసిరి?

ఉ॥ బసవపురాణపీఠికా కర్తలగు శాస్త్రిలవారె. శృంగార శ్రీనాథమను గ్రంథము 119 పుటయందు పినపాడు తామ్రశాసనము వివరించునప్పుడు,

"ఇందుఁ బ్రతిగ్రహీతయగు శంకరగురువంశమువారు ఇప్పుడు పినపాడునందున్నారు. వారుద్భటారాధ్యసంతతివారట. కొన్ని పురుషాంతరములనుండి వారు లింగధారణము వర్జించినారు" అనిరి. దీని

బట్టి శివపాటివారు పూర్వము లింగధారులేయని పీఠికాకర్త లంగీకరించిన యంశమే.

ప్ర॥ వారాగ్రంథము వ్రాయునాటికి నుద్భటుని నిజస్థితి దెలియమిచే నుద్భటుడు లింగధారియే యనియెంచి తద్వంశ్యులగు శివపాటివారికి నేఁడు లింగధారణము లేదుగాన నటుల వర్ణించియుందురను నూహతో వ్రాసియుందురు. ఇప్పుడు విమర్శింపగా నుద్భటునకే లింగధారణము లేదని తెలిసెనుగాన దానింబట్టి శివపాటివారికి నెన్నడును లింగధారణమే లేదని వ్రాసియుండఁగూడదా?

ఉ॥ అవధరింపుడు. ఉద్భటునకు లింగధారణము లేదనుటకు మీరు వ్రాసిన కారణములు బలవత్తరములేయైనచో నట్లు భావింపవలయు. విమర్శింపగా నవి దుర్బలములుగానున్న కారణమున శృంగార శ్రీనాథము రచించునాటికి లింగధారణము పూర్వాచారసిద్ధము కాదని సిద్ధాంతము చేయు కుతూహలము వీరికి లేదుగాన నట్లు వ్రాసియు, ఈనడుమగల్గిన కౌతుకముచే నుద్భటవంశ్యులగు శివపాటివారికి ధారణము లేదుగాన నుద్భటునకును లింగధారణము లేదని స్వవచన విరుద్ధముగా సిద్ధాంతము సేయసమకట్టిరనియు, విమర్శింపగా నీసిద్ధాంతము కొందఱ బ్రహ్మసామాజికులగు నేటివిప్రులనుబట్టి వీరిపూర్వులకును యజ్ఞోపవీతధారణము లేదను వాదమును బోలియున్నదిగాన నసమంజసమనియు విశదమగుచున్నది.

ప్ర॥ పీఠిక 78 పేజి. బసవేశ్వరుని కాలమునందుండి యాంధ్ర దేశారాధ్యులు వీరశైవులై లింగధారులైయుండు రేని కర్ణాటదేశమున బోలె వీరికిని మఠములు గురుపరంపరలును నుండెడివి. ఆంధ్రదేశమున గోళకీమఠ సంప్రదాయమువారి మఠము లే యుండెడివి గాని నేటి యారాధ్యసంప్రదాయమువారి మఠములెన్నడునున్నట్లు దెలియరావు. పండితత్రయోద్భటారాధ్య వేమనారాధ్యాది వంశపరంపరల

వారాభిజాత్యముగల వారారాధ్యసంప్రదాయములవారు పలువుర వెలయుచున్నను లింగధారణాదిదీక్షలు గొనుటలో గురువంశములు, శిష్యవంశములు నను భేదములేక వీరిలో నెల్లరును సమానసమ్మానము నె పడయుచున్నారు. బహుకాలమునుండియు నిట్టి సంప్రదాయమే సాగుచున్న చో నిప్పుడు లేకున్నను పూర్వకాలమున నేని యట్టి మఠము లుండకపోవునా యని సంశయము. అని పీఠికాకర్తలు వ్రాసియున్నారు. ఇట్లుండ నీయారాధ్యసంప్రదాయము పూర్వకాలమున నున్నదనుట యెట్లు?

ఉ॥ పూర్వకాలమున నారాధ్యులకు మఠములు లేవనుట కల్ల. ఎట్లన;

పీఠిక 76 పుట. నేడద్వైతమతాచార్య పీఠములుగానున్న విరూపాక్ష, పుష్పగిరి పీఠములానాడు వీరు నెలకొల్పిన శైవమఠములే యని శాస్త్రులవారె వ్రాసియున్నారు. తొల్లి యామఠాధినేతలు శైవులేయని యెల్లరు నంగీకరించిన యంశమేయగుగదా! గోళకీ మఠము మొదలగు నాయా మఠాధిపతులు లింగధారణరహితులనుటకు బలవత్తరప్రమాణములు లేవు.

ఇదిగాక, శ్రీశైలమున నెలకొన్న పండితారాధ్యమఠము ఆరాధ్యులదనుటకు సంశయముండదుగదా?

శ్రీకాశీనగరమందుగల విశ్వారాధ్యమఠము నేడు జంగమయ్యల యధీనమునను న్నను పూర్వకాలమున నది యారాధ్యులదే యనుట విశదమేగాదా?

అట్లె, ఆరాధ్య త్రయ పండిత త్రయాదులలోఁ జేరినవారలకే గురుత్వమనియు, కడమవారికి శిష్యత్వమేయనియు విభాగంబును విశదమయ్యేయున్నది. కావున నారాధ్యసంప్రదాయము బహుకాలసమాగతమేయనుట నిర్వివాదము.

ప్ర॥ శ్రీశైలముననున్న పండితారాధ్యమఠంబును, కాశీనగరముననున్న విశ్వారాధ్యమఠంబును నారాధ్య సంప్రదాయము వారివే యనుట యెట్లు?

ఉ॥ ఆరాధ్యశబ్దమును బట్టియె.

ప్ర॥ ఆరాధ్యశబ్దము లింగధారణము లేనివారిని బోధింపదా?

ఉ॥ లింగధారణము లేని పాశుపతులకుగాని వర్ణాశ్రమధర్మరహితులగు జంగములకుగాని యారాధ్యసంజ్ఞవ్యవహారసిద్ధముగాదు. లింగధారణరహితులగు పాశుపతులెందును నారాధ్యపదమును వాడుకొనుట కనంబడదు. సోమనాథుండు బసవేశ్వరాదులను శివస్వరూపులనుగానె యుదాహరించెను. గాని యెక్కడనైన వారియందు నారాధ్యపదమును వాడియుండెనా? తక్కంగల కవులలో నొక్కరేనియల్లు వాగియుండిరా? లేదు.

దాననే బసవేశ్వరుండని వ్యవహరించిరిగాని బసవారాధ్యుండని యెక్కడనైన పేర్కొనరైరి.

కావున, లింగధారణరహితులగు విప్రులకుగాని, వర్ణాశ్రమధర్మరహితులగు లింగధారులకుగాని వాచకము గాక వర్ణాశ్రమధర్మకలితులును, లింగధారులు నగు విప్రులకే యారాధ్యపదము వాచకమగుచున్నది.

ప్ర॥ ఈనిర్ణయము నెల్లరు నంగీకరింతురా?

ఉ॥ లోకవ్యవహారము నెఱింగిన ప్రతిభాశాలు రెల్లరు నంగీకరింపకపోరు.

దాననే పీఠికాకర్తలును, పీఠిక 10 పేజి. శైవులైన బ్రాహ్మణులకే యారాధ్యనామ మానాడు చెల్లినది. బసవపురాణ పండితారాధ్య చరిత్రాదులు పరిశోధింపనగును. అనివ్రాసిరి.

ప్ర॥ పీఠిక 77 పుట:—ఇమఱియు, నాంధ్రదేశపు టారాధ్యుల కుటుంబములలో మిక్కిలి గౌరవము గడించినవారు లింగధారణము లేనివారింకను గొందఱు కలరు. గోదావరి మండలమున నయ్యగారివా రనియారాధ్యులు గలరు. వారికిని లింగధారణము లేదు. అనియున్నది. దీనింబట్టియు నారాధ్యులలో పూర్వకాలమున లింగధారణము లేదని తెలియుట లేదా?

ఉ॥ ఇట్టి నిదర్శనములంబట్టి యీమధ్య కాలమున పెక్కుర లింగధారణము మానివేసిరని తెలియును. ఇంతియగాని యది యిప్పుడు లేనికారణమున పూర్వకాలమున గూడ లేదను నర్థము గ్రాహ్యము గానేరదు. అయ్యగారివారి పూర్వుల చరిత్రముల దిలకించినను వారి లింగధారణ ముండియున్నట్లే స్పష్టమగును.

చానని కూచిమంచి తిమ్మకవి తనకు దొడ్డమలూరి లింగ నారాధ్యుని గురునిగాం జెప్పుకొని లింగధారులను గౌరవించి యుండెను శిష్యులందఱు అయ్యగారు అనుటచే నాయన తర్వాతి వారయ్యగా వారైనట్లు తెలియు చున్నదిగదా?

హైందవులకు నేడు స్వారాజ్యము లేని కతన వీరి పూర్వు లును లేదను చందమున నేడు కొందఱకు లేదుగాన వారిపూర్వు లకును లేదని చేయు తీర్మానమప్రమాణ మనుటవిశదము.

ప్ర॥ పినపాటివారును అయ్యగారి వారును మొదలుగా లింగ ధారణలేనివారును నారాధ్యులని పేర్కొన బడుచుండగా నారాధ్య పదము లింగధారులనే బోధించు ననుటయెట్లు?

ఉ॥ లింగధారణ లేనివారలకు నారాధ్య సంజ్ఞ యేనాడును లేదు. పినపాటి వారున్నను వార లారాధ్యులని పీఠికాకర్త వ్రాసినను దానికి వారెంతమాత్రము నంగీకరింపరు. ఇప్పుడు తామా రాధ్యులము కామని వచింపక మానరు. కావున నారాధ్యపదము లింగధారణ రహితుల బోధించు ననుట కల్ల.

ప్ర॥ పీఠిక 76 పుట:—ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో ౧౧-౫-౧౬ అని సంఖ్యగల ప్రాచీన తాళపత్ర గ్రంథమున గోదావరీతీరమున నొకస్వాములవారు ప్రాచీనగ్రంథములను శైవసంప్రదాయములను జక్కఁగాఁ బరిశోధించి, యక్కడి బ్రాహ్మణులకు వ్రాసిన పత్రిక యొక్కటి గలదు. అది యిప్పటికిన్నూరేండ్లక్రిందట వ్రాయఁబడినదై యుండును. ఆనాటికి రెండువందలయేండ్లకుఁబూర్వము ఆంధ్రదేశమువారు ౭౭ కుటుంబములవారు బ్రాహ్మణులు శ్రీశైలమునకేగి యక్కడ లింగధారణదీక్షఁగొనిరనియు, కొందఱక్కడనే వీరశైవులై యుండిరనియు, కొందఱు వైదిక ధర్మముతో లింగధారణమునుగూడ నాంధ్రదేశమునఁ బాటించుచుండిరనియు నందు గలదు. ఇది వాస్తవమేమో పరిశోధింపవలసియున్నది. ప్రాచీనారాధ్య సంప్రదాయగ్రంథములలో లింగధారణాదివిషయములు గానరాకుండుటచేతను, నాంధ్రారాధ్యులలో నిప్పటికిఁ గొన్ని కుటుంబములవారు లింగధారణము లేకయే యుండుటచేతను మీదివిషయము విశ్వాస్యమే యగునని నేదలంచుచున్నాఁడను. అని యున్నది.

దీనింబట్టి లింగధారణము ప్రాచీనము కాదని స్పష్టమగుట లేదా?

ఉ॥ పూర్వమెవరో స్వాములవారు తమ పత్రికలో కొందఱు బ్రాహ్మణులు మధ్యకాలమున లింగధారణదీక్షఁగ్రహించిరని వ్రాసిన మాత్రన లింగధారణమే ప్రాచీనము కాదని యెట్లు చెప్పుదురు? అంతకుమున్ను బ్రాహ్మణులలో లింగధారణమే లేనియెడ నప్పుడు మాత్రము బ్రాహ్మణులద్దాని నెట్లు గ్రహింతురు? గ్రహింపజాలరు గావున నా పత్రిక లింగధారణము ప్రాచీనము కాదను నర్థమును సాధింపఁజాలదు.

ప్రాచీనారాధ్యగ్రంథములలో లింగధారణము గానరాలేదనుట యసంగతము. లింగపురాణము, స్కాందపురాణము, శివ మహా

పురాణము మొదలగు ననేక గ్రంథములలో లింగధారణము రాద్ధాంతితమై యుండగా నిది ప్రాచీన గ్రంథములలో లేదనుటకంటె సాహసము వేరొండేమికలదు?

ఆంధ్రారాధ్యులలో నిప్పటికి గొన్ని కుటుంబములవారు లింగధారణము లేకయే యుండుట వీరు మధ్యకాలమున మానివేయుటను సంభవించినదేగాన నదియెంతమాత్రము పూర్వకాలమున లింగధారణము లేదనుటను సాధింపజాలదు. ఈవిధమున బసవపురాణ పీఠికాకర్తలు లింగధారణము పూర్వాచార్యానుష్ఠితము కాదని సాధింపగనజరిచిన యుక్తులలో నొక్కటియేని విచారమున నిలువమింజేసి యవి యాభాసము లేయనియు వారివాదము విచారాసహమనియు విశదీకరింపబడియెను.

ప్ర॥ పీఠిక 78 పేజి:- కృష్ణదేవరాయలకు బూర్వకాలమున నాంధ్రదేశమున నారాధ్య బ్రాహ్మణులు లింగధారులై యుండిరనుటకు బ్రబలాధారములు గలవేమో యింకను పరిశోధింప వలసియున్నది. అనియున్నది. దీనింబట్టి రాయలవారికిబూర్వము విప్రులలో లింగధారణము లేదనియేర్పడుచున్నది. రాయలవారికిబూర్వకాలమున బ్రాహ్మణులలో లింగధారణమున్నదనుటకు బలవత్తర ప్రమాణమేమి?

ఉ॥ శ్లో॥ శ్రుతిః ప్రమాణం స్మృతయః ప్రమాణం ధర్మార్థయుక్తం వచనం ప్రమాణం। యస్య ప్రమాణం నభవేత్ప్రమాణం కస్తస్య కుర్యాద్వచనం ప్రమాణం॥ అనగా,

ధర్మనిర్ణయమునెడ మొదట వేదము ప్రమాణము తరువాత స్మృతులు ప్రమాణము అనంతరము పూర్వాచార్యోక్తి ప్రమాణము ఇవన్నియు నెవ్వానికి బ్రమాణముకావో అట్టి వానిమాట నెవ్వా

ప్రమాణముగా గ్రహించును? వీనిమాట నెవ్వఁడును విశ్వసింపఁడని ధర్మశాస్త్రకర్తలు వచించియుండిరి. ఇట్లుండ,

శ్రు॥ అమృతస్య దేవధారణో భూయాసం ఈ మొదలగు ననేక శ్రుతులు లింగధారణము అవశ్యకర్తవ్యమని విధించుచున్నవి. అట్లె పెక్కు శివాగమములు శ్లో॥ ముఖేమంత్రం హృదిధ్యానం మస్తకే లింగధారణం ఈ మొదలగు స్మృతులును లింగధారణమును ప్రశంశించు చున్నవి.

అదిగాక లింగపురాణము, స్కాందపురాణగతశంకరసంహిత శివమహాపురాణగతవిద్యేశ్వరసంహిత మొదలగు పురాణసంహితలును లింగధారణము సర్వోత్తమమని యుద్ఘోషించుచున్నవి. పండితారాధ్యచరిత్ర మొదలగు ప్రాచీనగ్రంథములు లింగధారణమును రాద్ధాంతీకరించుచున్నవి.

ఇఁట బేర్కొనఁబడిన శ్రుతిస్మృత్యాదులు కృష్ణరాయలవారికి పూర్వకాలమునాటివో లేక తరువాతివో దెలిసినవారలకు రాయలవారికిఁ బూర్వకాలమున లింగధారణమున్నదియు లేనిదియు విశదము గాదా? ఇవన్నియు నటుండనిండు.

ఆనందగిరికృత శంకరవిజయమునందు- ఇష్టలింగధారులగు వజ్రనఖారాధ్యులు మొదలగువారు బ్రాహ్మణోత్తములు శంకరాచార్యులవారితో వివదించినట్లున్నది. ఆగ్రంథము శంకరాచార్యులవారి ముఖ్యశిష్యుఁడగు నానందగిరి రచించినదిగదా. వీరిలో శంకరాచార్యులుగాని, ఆనందగిరిగాని, వజ్రనఖారాధ్యులుగాని వీరందఱు రాయలవారికిని నర్వాచీనులే యగుదురా? పీఠికాకర్తలకు విమత గ్రంథములు ప్రమాణముగాకున్న పోనిండు. స్వమతగ్రంథములును నవిశ్వాస్యములే యగునా? ఇట్టి వాదము విచారక్షమమెట్లగును?

ఇట్లు శ్రుతిస్మృతిచోదితమై, పురాణనికరావేదితమై సర్వమున పూర్వాచార్యామోదితమైన లింగధారణప్రాచీనతయే మీకు సమ్మతముగానిచో శ్రుతులను వినకయు, స్మృతులను గొనకయు పురాణముల గనకయు, పూర్వాచార్యగ్రంథముల నమ్మకము యుక్త్యాభాసములతో స్వవచనవిరుద్ధముగాఁ జేసిన మీనిర్ణయమెవ్వారలకుఁ బ్రమాణమగును? దీనింబట్టి బసవపురాణ పీఠికాకర్తల పరిష్కారము ప్రామాణికులకు నసమ్మతమని విశదము.

ప్ర॥ వీరశైవుల మత మద్వైతము. పూజ్యులగు మల్లికార్జున పండితారాధ్యులు మొదలగు వార లద్వైతమును ఖండించిరి. అట్టి యెడ మల్లికార్జునపండితాదులు లింగధారు లనుట యెట్లు?

ఉ॥ మల్లికార్జునపండితాదులు శుద్ధాద్వైతమును ఖండించి యున్నను వారి మతము శివాద్వైతమె యగును. కావున నె శివతత్త్వసారమునందు,

క॥ అద్వైతైక స్థితి నీ
యద్వైతము కాన యీశ్వరాద్వైతము స
ర్వాద్వైతమనగ వేఱు జ
గద్విపరీతమగు తత్త్వగతిగలదె శివా॥

అనుచోట శివాద్వైతమె స్వీయమతమని వివరింపఁబడియెను.

ప్ర॥ లింగధారిమతమునందు లింగైక్యమను వ్యవహారము గలదు. లింగైక్యమను మాట బ్రహ్మైక్యమనుమాటకు బదులుగా నున్నదిగాన నిది శుద్ధాద్వైతమువనె సంభవించును. ఇట్లుండ శుద్ధాద్వైతమతమును ఖండించిన మల్లికార్జునపండితాదులు లింగధారులనుట యెట్లు?

ఉ॥ లింగైక్యమనుమాట శివాద్వైతమునందును సంభావితమే దాన నె శివతత్త్వసారమునందు

క॥ కలనైన నొండుదైవము
గలదనియెడు పలుకుదక్కి కలఁడొక్కఁడ కే
వల శివుఁడె దైవమని ని
శ్చలభక్తి శివైక్యుఁడుండు సంతతము శివా॥

ఈవిధమున శివైక్యపదము పలుమార్లు పేర్కొనఁబడియెను. గాన పూర్వులగు మల్లికార్జునపండితాదులు లింగధారులే యనుటకు సందియమేదియు లేదు.

ప్ర॥ పీఠికాకర్తలు శాసనముల నెదక్క చారిత్రగ్రంథములను విశ్వసింపరు. అట్టియెడ మీరు చరిత్రగ్రంథములనుబట్టి పూర్వులు లింగధారులెయని దెలిపిన నేమి లాభము! అట్లుగాక శాసనములను బట్టి పూర్వాచార్యులగు మల్లికార్జునపండిత ప్రభృతులు లింగధారులె యని నిర్ధారణచేయఁగలరా?

ఉ॥ పూర్వవృత్తాంతముల గ్రహింపఁ జారిత్రగ్రంథములకన్న వేరొండు నిదర్శనము లెందును నుండవు. శాసనముల కధిక ప్రామాణ్యమునె యొసగి యందున్నదాని గ్రహింపనగుగాని యందు లేని యంశములన్ని యగ్రాహ్యములనుట సాహసముగాన నన్నియు శాసనములనుబట్టియె విశ్వసింతుమని బుద్ధిమంతు లెవ్వరును వచింప బూనరు. పీఠికాకర్తలైనను శాసనములందక్కఁ జరిత్రగ్రంథముల విశ్వసింపమని వ్రాసియుండలేదు. ఇంకెవ్వరైన నట్టివారు వెల్వడునెడ వారి నీవిధమున సమాధానపరుచుము.

ప్ర॥ ఏవిధమున

ఉ॥ తొల్లి విప్రులకు యజ్ఞోపవీతధారణమున్నట్టు లేశాసనములవలన నిర్ధారణ సేయుదురు. మీపూర్వులు లాస్తికులైనట్లు లేశాసనములవలన నిర్ధారణసేయుదురు? ఇట్టి పురాతన సంగతములను శాస

నములవల్ల నెగాక గ్రంథాంతరములవల్ల విశ్వసింపమను నెడ నన్నియు ననిర్ధార్యములె గాకమానవు.

అట్లుగాక ఏపురాతనశాసనమున నైన పూర్వాచార్యులు లింగ ధారణరహితులనియున్నదా? లేదు గదా. అట్లుండియున్నచో శాసనవిరోధమునుబట్టి చారిత్రగ్రంథములు విశ్వాసార్హములుగావని నుడివిన నుడువనగును. అట్టి విరుద్ధశాసనము నొక్కదానినైన పీఠికా కర్త లుదాహరించియుండనికారణమున నట్టి శాసనములు లేవనియె స్పష్టమగుచున్నది. కావున చరిత్రములనుబట్టి పూర్వులు లింగధారు లనుట విశ్వాస్యమె కాకమానదు. ఈవిమర్శమునుబట్టి పీఠికాకర్తలు మల్లికార్జునపండితప్రభృతులు లింగధారులు గారనుటకు నుదాహ రించిన హేతువులు బల్బజములని నిరూపింపఁబడియెను. ఇవిగాక ఇంకనేవేని బలవత్తరప్రమాణముల నికమీద వారుదాహరింతురేని వానింబట్టి తమ పూర్వులు లింగధారులుగారని గ్రహించియు నిప్పటి లింగధారులేమి చేయవలయునో తోఁపకున్నది.

శంకరాచార్యులవారు శైవవైష్ణవాదులను, జైనబౌద్ధాదులను గూడ జయించి స్వీయమగు నద్వైతమతమునఁ జేర్చికొనినట్లు శంకర విజయమునుబట్టి విశదమగుచున్నదిగదా? దానింబట్టి తమపూర్వులు తొలుత నద్వైతమతస్థులుగారు. మతాంతరులే యగుదురని గ్రహిం చినవారలిప్పుడేమి ప్రతిక్రియ సల్పుకొనఁగలుగుదురో శైవులైన నంతియెగాక వేరేమియు సల్పుకొనఁజాలరు. కావున పీఠికాకర్తల పరిశ్రమము సర్వవిధముల ప్రయోజనకారి కానేరదనియే తోఁచెడిని.

ఇందిది ముఖ్యముగా గమనింపవలయు. ఒకమతముయొక్క గుణదోషవిమర్శనమునందు నెదిరిమతముయొక్క గుణదోషవిమర్శ మును నవశ్యప్రాప్తముగాకమానదు. ఎదిరిమతమును దృష్టాంతముగా జూపకున్నచో గుణదోషములువ్యక్తముగాఁజాలవు.విమర్శనావసరము నందు నుపాయాంతరము లేమిచే మతాంతర ప్రస్తావము విధిలే

యుదాహరింపవలసి వచ్చునుగాని ద్వేషమూలమున నెంతమాత్రము గాదు.

పీఠికాకర్తలు ప్రప్రథమమున శైవమతములకు లాఘవము గలుగునట్లు స్వేచ్ఛగా పరిష్కారము వ్రాసియున్నకతన మతాభిమానశాలురు కొందఱు సంశయించునప్పుడు పాఠకుల సంశయముల దీర్చుట శైవరహస్యబోధిని పత్రికా కృత్యమగుటం జేసి యుపేక్షింపవలనుగామిచే నారంభించి ప్రస్తావవశమున మతాంతరము నుదాహరణముగాఁ జూపవలసివచ్చినదానికి పాఠకమహాశయులు మన్నింతురు గాక.

ఇంక వీరశైవ పరిష్కారమెట్లున్నదో చూడుడు.

వీరశైవము శాస్త్రసిద్ధమేగాని
బసవేశ్వరాద్య పక్షము కాదు.

ప్ర॥ బసవపురాణపీఠిక 78 పుట.

లింగధారణమును జెప్పు శ్లోకములు గొన్ని యాగమములలో నివిగాను బురాణములలో నివిగాను, నిటీవలి వీరశైవగ్రంథములందు గలవు. ఆశ్లోకములెగాక కొన్నికొన్ని యా యాగమములుగూడ వీరశైవమతము వెలసినకాలమునను, నటుతర్వాతికాలమునను నేర్పడినవని నేను దలంచుచున్నాఁడను. వీరశైవసిద్ధాంతమును దెలుపు నాగమము వీరాగమమని యొకటి గలదు. అది యిట్టిదె.

ఏలనఁగా నిందుఁ బెక్కుచోట్ల నాల్గుశైవమతములు పేర్కొనఁబడినవి. నల్గురు శైవాచార్యులు పేర్కొనఁబడిరి.

శ్లో॥ రేవణోమరుసిద్ధేశో రామదేవో మునీశ్వరః
పండితారాధ్య ఇత్యేతే చతుర్మఠ మునీశ్వరాః॥

ఇందు నాల్గవవాఁడగు పండితారాధ్యుఁడు శివలెంకమంచ పండితుఁడైనను, శ్రీపతి పండితుఁడైనను, మల్లికార్జునపండితుఁడైనను బసవేశ్వరుని కించుమించుగా సమకాలమువాఁడే యగును. తక్కి వారుగూడ బసవేశ్వరుని నాటివారే. ఈయాగమమున వీరశై సంప్రదాయములెల్ల వివరింపఁబడినవి.

ఇది పురాతనగ్రంథమగుట నేవంగీకరింపఁజాలనయ్యె మఱియు, రేణుక (రేవణ) సిద్ధరచితమగు సిద్ధాంతశిఖామణి మాయిదేవరచితము శివానుభవసూత్ర [విశేషార్థప్రకాశిక] ము పద్మరసుదీక్షాబోధయు, నీలకంఠాచార్యుని క్రియాసారము గల్గ వీరశైవసిద్ధాంతమును నిరూపించు గ్రంథములలో మూలభూతములి ఈగ్రంథముల రచించినవారు బసవేశ్వరుని కాలమువారును దర్వా కాలమువారును నగుట విస్పష్టవిషయము. బసవపురాణమును అబ్లూరుశాసనమునుబట్టి యీమతము క్రీ. శ. ౧౧౫౦ ప్రాంతము నేర్పడినదిగానె తెలియనగుచున్నది. ప్రాచీనాగమగ్రంథములం దక్క డక్కడ వీరశైవసిద్ధాంతానుకూలములగు శ్లోకములు గొన్నియున్న వానినెల్ల నుద్ధరించి కులాచార నియమములను బ్రోచి వీరశైవమ క్రొత్త సిద్ధాంతము నెలకొల్పిన వారు మాత్రము బసవేశ్వరాదు లగుటకు సంశయముండఁ బనిలేదు. ఈయర్థమునకు సాధకములగు విషయములు పెక్కులు బసవపురాణమునఁగూడఁగలవు అనియున్నది.

దీనింబట్టి వీరశైవము బసవేశ్వరునిచేతనే నిర్మింపఁబడినమో యేర్పడుటలేదా?

ఉ॥ బసవేశ్వరాదులు వీరశైవమతమునకు ప్రచారకులగు టయు వీరశైవమతము బసవేశ్వరుని కాలమున నత్యంతాభివృద్ధి బడసెనను టయు నిజమే. కాని బసవేశ్వరాదులె వీరశైవమతమునకు సృష్టికర్తలగుట యంగీకారార్హము గాదు.

ప్ర॥ పెక్కు వీరశైవ గ్రంథములానాడు నిర్మింపఁబడినట్లు తెలియుచుండుటంబట్టియామతమప్పుడే బసవేశ్వరాదులచే సృజింపఁ బడియెనని యేలయేర్పడదు?

ఉ॥ మొదట శంకరాచార్యులవారద్వైత మతమును సిద్ధాంతముచేసియున్నను, శంకరాచార్యులవారికాలమునుండియే యద్వైత మతగ్రంథములు రచింపఁబడియుండినను అద్వైతమతము శాస్త్రసిద్ధమేయగుఁగాని శంకరాచార్య నిర్మితమని యెవ్వరువచింపసాహసింపరు.

అట్లె బసవేశ్వరాదులచే నానాడు వీరశైవము వ్యాపింపఁ బడినను నది తన్నిర్మితమనుట యుక్తియుక్తముగాదు.

ప్ర॥ పీఠిక 70 పుట. ఇట్టి ప్రాచీనసాంప్రదాయములను పరిపోషించుటవలన లాభమంతగా గానరాదని యెఱిఁగి యింతకంటెఁదీవ్రముగాఁ గర్ణాటదేశమునబసవేశ్వరుఁడు, ఏకాంతరామయ్య పద్మరసు మొదలగువారు వర్ణాశ్రమాచార కలితములైయున్న ప్రాచీన శైవ మతభేదములనెల్ల నడచిపుచ్చి, వానిలోనుండి వీరశైవమవిక్రొత్తశైవమును సర్వశైవమతసారముగా నుద్ధరించి నెలకొల్పిరి. దీనిచే ప్రాచీన శైవమతములలోఁదగవులు చల్లారి యైక్యమేర్పడెను. నూతనోత్తేజముగాంచి శైవమతము బలముగలదై నెలకొనెను. వర్ణభేదమును విడుచుటచే నీశైవము జైన బౌద్ధమతములవలె సర్వసాధారణమై సులువుగానందఱిచే నాదృతమయ్యెను. అని మొదలుగానున్నది.

దీనింబట్టి బసవేశ్వరాదులు వీరశైవమును క్రొత్తగా సృజించి వ్యాపింపఁజేసినట్లు తెలియుటలేదా?

ఉ॥ పీఠికాకర్తల వాక్యములనుబట్టి యట్లు తెలిసెడినిగానియది యెంతమాత్రము నిజముకానేరదు.

వర్ణాశ్రమధర్మముల నంగీకరించిన వీరశైవమొక్కటియు, వర్ణాశ్రమధర్మముల నంగీకరింపని వీరశైవము వేరొక్కటియు, నిట్లు వీరశైవము రెండువిధములుగానున్నది. ఈరెండువిధములును శాస్త్రసిద్ధములె.

శ్లో॥ శివాగమోపిద్వివిధః స్వతంత్రఇతరోమతః । శ్రౌతమనియు నశ్రౌతమనియు శివాగమము రెండువిధములుగా నున్నది. శ్రౌతశివాగమములయందు వర్ణాశ్రమధర్మసహితమగు వీరశైవము నిరూపింపఁబడియున్నది. తక్కువానియందు వర్ణాశ్రమ ధర్మరహిత వీరశైవము నిరూపింపఁబడియున్నది. కాన నీరెండును శాస్త్రసిద్ధములె.

మఱియు నీల కంఠాచార్యులవారు కర్మ జ్ఞానములకు సముచ్చయము నంగీకరించిరి. శంకరాచార్యులవారైననో కేవలజ్ఞానమే ముక్తిమూలమగుగాన దానికి కర్మంబు నపేక్ష లేదనిరి.

నీలకంఠాచార్యులవారు "సుప్తహస్తస్థపుష్పవత్" నిదురించు వాని చేతిలోనున్న పుష్పము నిద్రాపారవశ్యముచే దానియంతట జారిపోవునట్లు జ్ఞాననిష్ఠాపారవశ్యముచేత కర్మము దానియంతనతొలఁగవలయు గాని బుద్ధిపూర్వకృతకర్మత్యాగము కూడదనిరి.

శంకరాచార్యులవారైననో కర్మమును విడువకుండిన చో జ్ఞానాభ్యాసమునకు హాని సంభవించునుగాన 'సన్న్యస్యశ్రవణం కుర్యాత్" జ్ఞానశ్రవణమునకే కర్మత్యాగము పూర్వాంగమనిరి. ఇట్లే బసవేశ్వరుడును కర్మానుష్ఠానము భక్తినిష్ఠకు భంగకరమని యెంచి తదనుకూలశాస్త్రములనె ప్రమాణముగా గ్రహించి అద్వైతమునె సిద్ధాంతముగా సేకరించి శంకరాచార్యపరిష్కృతపథమును యవలంబించెను. గాని యిందొక్క విశేషము గలదు. ఏమనిన పరమార్థదృష్టిచే వర్ణాశ్రమధర్మానుష్ఠాన మనావశ్యకమె యైనను వ్యవహారదృష్టిచే నది యావశ్యకమెయని శంకరాచార్యులవారు నిర్ణయించిరి.

ఈనిర్ణయము బసవేశ్వరునకు రుచింపదయ్యెను. ఇందుఁ గారణ మేమన,

పరమార్థదృష్టిచే ననావశ్యకమైనది యథార్థవాదులకు నావశ్యకమెట్లగు? అట్లయిన నది వ్యవహారదృష్టితో నావశ్యకమనుట యమ్మహనీయునకుఁ గపటమార్గముగా దోచెనుగాని సత్యమార్గముగా దోచదయ్యెను. దానంజేసి యాపద్ధతి నాయమాయకుఁడు గ్రహింపలేదు. ఇట్లు బసవేశ్వరుఁడు వర్ణాశ్రమధర్మానుష్ఠానము నంగీకరింపకున్నను భక్తజనకైంకర్యరూపభక్తినిష్ఠకు లోపమువచ్చుననునూహతో వివాహము నంగీకరించెను. అయినను పెక్కు నంశములయందు బసవేశ్వరునకు మార్గదర్శకుఁడు శంకరాచార్యులవారె యనుట నిజము.

శ్రీమల్లికార్జునపండితప్రభృతులైననో నీలకంఠుని నిర్ణయము ననుసరించి శివాద్వైతమునె సిద్ధాంతీకరించి కర్మజ్ఞానసముచ్చయమునె యంగీకరించి వర్ణాశ్రమధర్మసహితశైవమును బలపరిచిరి.

కావున సిద్ధాంతకర్త లెవ్వరైనను శాస్త్రప్రామాణ్యమును బట్టియు. పూర్వాచారమార్గములనుబట్టియు సిద్ధాంతము సేయుదురుగాని, శాస్త్రప్రామాణ్యము స్వీకరింపకయు పూర్వాచార్యపద్ధతి ననుసరింపకయు సిద్ధాంతీకరింపరనుట యథార్థము.

అట్లుగాక, అశాస్త్రసిద్ధమగు నూత్నసిద్ధాంతమును గల్పించునెడ లోకులంగీకరింతురనుట కల్ల.

బసవేశ్వరాదులు శాస్త్రములయందుగాని, లోకమునగాని యెందును నగోచరమగు క్రొత్తసిద్ధాంతమునుగల్పించి దానికిదగు ప్రమాణములనుగూడ నానాఁడే సృష్టించి వానితో సిద్ధాంత గ్రంథ

ములనుగూడ నప్పుడెనిర్మించి లోకులకు బోధించినప్పుడుగదా శైవము బసవేశ్వరాద్యుపజ్ఞమగుచు.

అట్లు సర్వమునప్పుడెకల్పించి బోధించినమాత్రన నాసిద్ధాం ముసు స్వీకరింపలోకులు కేవలమంథప్రాయులుగా నున్నారని యంగీ రింపవలయునుగదా? నేటికన్న వేదశాస్త్ర విశ్వాసము మిక్కుటము నున్నయక్కాలమున నిరాధారమగు సిద్ధాంతమును బసవేశ్వరునప్పు సృజించి బలపరిచి, బోధించి లోకమున నత్యధిక వ్యాప్తిగావించెనన యమ్మహనీయు నీశ్వరాంశత్వమును దృఢపరుపకమానదు. దానినా యోజించినను నాతడు చేసినది శాస్త్రసిద్ధము మటనే దృఢపరు చున్నది.

ప్ర॥ వర్ణాశ్రమధర్మసహితము, తాదృశధర్మరహితము ననిప స్పరవిరుద్ధములగు నీరెండుమతములును శాస్త్రసిద్ధము లేయగుచో దానినెల్లరు నేలగ్రహింపరాదు?

ఉ॥ కర్మానుష్ఠానము, నైష్కర్మ్యము నీరెండును శాస్త్రసిద్ధ ములె. సగుణము, నిర్గుణము నను నీరెండు తత్త్వములును శాస్త్ర సమ్మతములెయని యద్వైతమతస్థు లంగీకరించుచున్నారు. అట్లే యీరెండును శాస్త్రసిద్ధములెయైనను దేనికిం దగు నధికారులా మార్గము నవలంబింతురు గాన నెల్లరు నొక్కమార్గమునె యవలం బింప వలయునను నియమముండదు. తానవలంబింపని కారణము స్వేతర మార్గము లశాస్త్రీయములనుట సాహసమే కావున బసవే శ్వరుడు సిద్ధాంతము సేసిన వీరశైవము శాస్త్ర సమ్మతమగుటచే లోకసమ్మతి నొందగలిగెను. అనుట న్యాయ్యము.

ప్ర॥ అదియెట్లు? వర్ణభేదమును విడుచుటచే నీశైవము జైన బౌద్ధమతములవలె సర్వసాధారణమై సులువుగా నందఱచే నాదృత మయ్యెనని పీఠికా కర్తలు వ్రాసియున్నారు. వీనింబట్టి అనుష్ఠాన సౌ

భ్యమునని బసవేశ్వరమత మందఱచే నాదరింప బడినట్లు తెలియు చున్నది గాదా?

ఉ॥ మతముయొక్క యత్యధిక వ్యాప్తికి సౌలభ్యంబును నొక కారణమగు ననుట నిజము కాని కేవల మదియొక్కటి కారణమనుట సమంజసము గాదు.

శ్రీశంకరాచార్యులవా రద్వైతమును ప్రచారము సేయున ప్పుడును, శివ అనిననుసరే కేశవ అన్నను సరే రెండు అన్ననుసరే రెండు అన కున్నను సరే, అని కనఁబరచిన సౌలభ్యంబును శైవ వైష్ణవాది మతస్థు లందఱు నద్వైతమునఁ జేరుటకు సాధన మయ్యెను. అంతమాత్రమున నిదిమాత్రమే యద్వైతవ్యాప్తి సాధనమని నుడువ నగునా? మతాంతరముల వ్యాప్తికి సాధనమేదైన నగుగాక. మరణము కన్న కష్టకరము వేరొక్కటి లేదని యెల్లరకు దెలియును. అట్టియొక లింగము పోయినచో ప్రాణము విడువ వలయునను నిర్ణయము నంగీ కరించి ప్రాణమును తృణముగా నెంచు వీరశైవులు భక్తిగౌరవమును బట్టి యామతమున జేరుదురో సౌలభ్యమును బట్టి జేరుదురో బుద్ధి మంతులకు విశదము గాక మానదు.

యోజింపఁగా సర్వకాలముల యందును జాతి, మతమునను నవి యుద్ధారకుల దృష్టికి నరిష్టములుగా గోచరించునట్లు దోచెడిని అద్వైతమునఁ స్థాపించునాటికి జాతి భేదమూలములగు కలహములు బయలుపడక శైవ వైష్ణవాది మతభేదమూలములగు కలహములెయని వార్యములుగా నున్నకతన నాకలహములు చల్లార్పనె యద్వైతము సంకల్పిత మైనట్లు తోఁచెడిని.

ప్ర॥ ఈర్థము దేనింబట్టి తెలియఁచున్నది?

ఉ॥ సిద్ధాంతస్వరూపమునుబట్టియె దెలిసెడిని. ఎట్లన, శంకరా చార్యులవార ద్వైతమును స్థాపించునాటికి శైవాది షణ్మతములునధిక

ప్రచారమునను న్నట్లు ఆనందగిరి విద్యారణ్యకృతములగు రెండు శం
కరవిజయములనుబట్టియు విశదమగుచున్నది. శివుఁడెజగత్కర్త, ఉపా
స్యుఁడనని శైవుల సిద్ధాంతము. విష్ణువె జగత్కర్త ఉపాస్యుఁడు
వైష్ణవుల రాద్ధాంతము. శాక్తాది సమయములు నిట్లెయుండు
తత్త్వము సగుణమా? నిర్గుణమా అనువిచారమె నాటికిలేదు.

అట్టియెదనున ఓజనులారా, శివవిష్ణ్వాది తత్త్వములనుగూర్చి
వ్యర్థముగా మీరేల కలహించుచున్నారు? శివుఁడు, విష్ణువు ఇద్దరు
కల్పితులు, ఏలన, నిజమైనతత్త్వము నిర్గుణమొక్కటె. దానికే శివు
డని విష్ణువని మొదలగు నామములును, శంఖచక్రధరుఁడని, త్రిశూ
ధరుఁడని మొదలగు రూపములును కల్పితములు.

శివవిష్ణ్వాదులయేనామరూపములకైమీరుకలహించుచున్నా
ఆనామరూపములు కల్పితములైనవిగాన మిథ్యయైనప్పుడు వానిను
శించి కలహముతోనేమి? అని బోధింపఁగా శైవవైష్ణవాదుల
శివకేశవాదుల నామరూపములు మిథ్య అని తోచుటతోనె స్వమతా
భిమాన మస్తమించెను.

ప్ర॥ నామరూపములు కల్పితములనుట శాస్త్రసిద్ధముగాదా

ఉ॥ శ్రు. నామరూపే వ్యాకరవాణి॥ అను శ్రుతినిబట్టి నా
రూపములు కల్పితములనియె యేర్పడుచున్నది.

ప్ర॥ అద్వైత మతాచార్యులు శ్రుతుల యందున్న దా
బోధించి నంతన లోపమేమి?

ఉ॥ అది లోపమని యెవ్వరు చెప్పిరి? అయిన నందొక్క
షము కలదు. ఏమనిన తాను జగమునకు నామరూపముల కల్పిం
ననిపరమేశ్వరుఁడు సంకల్పించె నని శ్రుతులయందున్నది. ఇట్లు

పరమేశ్వరుని నామరూపములను గూడతామె కల్పించినట్టుల ద్వైత మతాచార్యు లభిప్రాయ పడుచున్నారు.

ఎట్లైననేమి? అద్వైతాచార్యుల కల్పనాశక్తి శైవవైష్ణవాదుల దైవభక్తిని మతాసక్తిని రూపుమాపెను. తత్వము నిర్గుణమనుటయు, శివవిష్ణ్వాదుల నామరూపములు కల్పితములనుటయు సర్వమతోపసంహారమునకుఁ గారణముగాఁ గన్పట్టుచున్నకతన నీకల్పనము సర్వమత కలహశాన్తికై యేర్పడినట్లు స్పష్టమగుచున్నది.

ఈవిధమున నద్వైతాచార్యులు జ్ఞానమునె ప్రధానీకరించి శైవ వైష్ణవాది సర్వమతముల నేకమతము గావించుట నూహించి బసవేశ్వరుఁడును భక్తినె ప్రధానీకరించి సకలజాతులను వీరశైవమునఁజేర్ప మొదలిడెను. అప్పటి కదియె యేకీభావమునకుఁ బరమసాధనముగా సమ్మహాత్మునకుఁ దోచెను గాబోలు.

ప్ర॥ జాతిభేదనిరాసము నద్వైతాచార్యు లంగీకరించిరా?

ఉ॥ అద్వైతాచార్యులు జాతిభేదనిరాసమును అనుష్ఠానమునఁ బెట్టకున్నను సిద్ధాంతమున నంగీకరించెయున్నారు.

ప్ర॥ అది యెట్లు?

ఉ॥ శ్లో. వర్ణాశ్రమవయోవస్థాభిమానోయస్య విద్యతే
తస్యైవచనిషేధాశ్చవిధయస్సకలాఅపి॥

వర్ణాశ్రమాద్యభిమానము గలవారికే విధినిషేధములతో నవసరముగాని కడమవారికిఁ బనిలేదని విద్యారణ్యులవారె చెప్పియుండిరి. "నిస్త్రైగుణ్యేపథివిచరతాం కోవిధిః కోనిషేధః అని శంకరాచార్యుల వారును చెప్పియుండిరి. అద్దానిని బసవేశ్వరాదులు నడవడిలోనికి దెచ్చిరి.

నేటి గ్రంధకర్తలకునుసిప్సితతమమగు జాతిమతోచ్ఛేదము పూర్వాచార్యులె తలపెట్టియుంట యాశ్చర్యకరము. కానియందొక విశేషము కలదు. ఏమనిన,

పూర్వాచార్యులు జ్ఞానమునో, భక్తినో ప్రధానముగా గ్రహించి జాతిని, మతమును ననాదరము సేసిరి. నేటి సంస్కర్తలైన భక్తి మొదలగువానితో బనిలేకయె సర్వమును వదలుచున్నారు. ఇది యెట్లన, యజ్ఞాది విషయమునను, దేవతావిషయమునను పూర్వులంగీకరించిన పశుహింసను గర్హించి కొందఱాధునికు లాహారవిషయమున నాదరించుటను బోలియున్నది.

నేటి సైద్ధాంతికులకు శాస్త్రంబు నపేక్షణీయమేగాని పూర్వాచార్యులు శాస్త్రప్రామాణ్యము విడనాడి యుచ్ఛృంఖలముగా సిద్ధాంతములు సేసిరనుటయు, శాస్త్రమూలములుగాని సిద్ధాంతములనప్పు ప్రజలంగీకరించిరనుటయు విశ్వాసార్హములుగావు.

ఇదిగాక, జ్ఞానంబు దగుగౌరవమునుబట్టియో భక్తిదగు ప్రాశస్త్యమునుబట్టియో పరమపురుషార్థసాధనైకకార్యులగు పూర్వాచార్యులు వర్ణాశ్రమకర్మబంధము నెడ లక్ష్యము నిలుపకున్నను సాధ్యమును మాత్రమే ప్రయోజనముగానెంచి, జాతిమతోచ్ఛేదము సహింప నిప్పటి సంస్కర్తలలోఁ గొందఱువోలె వారు నాస్తికులనొప్పుదుగదా?

కావున శాస్త్రవిశ్వాసవిరళములగు స్వీయభావముల దోషిమహనీయులపై నారోపించి వారినిఁ జులుకనసేయుటయు మానమె శూన్యముగా నున్న యిక్కాలమున మతచర్చకుఁ సంగి తన్మూలమున నాధునికులకు మతమువీద నింకను జుగుప్సగింపఁబూనుటయు సహృదయహృదయాహ్లాదకరములగునో యని నిర్ణయించు భారము విపశ్చిదులదే యగును.

మఱియు, బసవపురాణపీఠిక 68 పుట.

శంకరాద్వైతము ప్రబలిన పిదప నాగమతంత్రమతముల వారుగూడ దమమతములు బ్రహ్మసూత్రాభిప్రేతములె యని నిరూపించుటకు యత్నించిరి. స్వసిద్ధాంతానుసారముగా బ్రహ్మసూత్రములకు భాష్యముల రచించిరి. ఈపూర్ని- శంకరులకు పూర్వకాలమున నున్నట్లు గానరాదు. అనియు,

పీఠిక 81 పుట.

శివకవులు.

శివకవులు భవికవుల గర్హించిరి. కవితలోఁగూడ వారు వేఱు మతము వారయిరి. అనియు నున్నది.

ఈమొదలగు నంశములు రాబోవు పత్రికయందు విమర్శింపఁ బడును.

ప॥ సం॥

శ్రీశివాయ గురవేనమః

# విజ్ఞాపనము

---

పాఠకమహాశయులారా!

ఈ పత్రికకు నాల్గవయేడు గడచి యేనవయేడు వచ్చె. ఇది యారంభముననుండి శక్తివంచనలేక లింగధారి శైవమతము స్వప్రమాణతను వెల్లడించుచు నెయున్నది. అయినను శైవమత లకు నీపత్రికయెడ నాదరము లేశమైన గలుగమి శోచనీయము.

లింగధారి శైవసంఘము పూర్వముండిన దానిలో సాంశమైన నేడు లేదని పలువురకు దెలియును. తండ్రితాతల లింగధారణముండి నేడు మానినవారు నూర్లకొలది యింటిపేర్ల కలరుగదా? ఇప్పుడున్నవారిలో సహస్రాంశమువారైన నీపత్రి జూచువారు లేరనుట యతిశయోక్తిగాదు.

ఈ సంఘమువారిని దిలకింపఁగా తమపూర్వులకు లింగ ణము లేదనుటకాదు. తాము ధరించిన లింగముల నొరులు కొనిపోయినను చలింపని ధీరశాంతులని మెతోచెడిని.

ఇందున్న పండిత ప్రవరులనఁ జూతమా నీపత్రికా సం కుని సాధించు నుపాయముల నెమకు నేకాగ్రచిత్తతో నున్నవా టంజేసి పలుకఁదొడగుటకైన నోపకున్నారు.

ఇందుఁ బ్రచురించు నంశము లనావశ్యకములై య నేమో యని యోజించినను శైవగణార్చనము మొదలుగా సక శ్యకములెయని నాచిత్తమునకు దోచెడిని. లింగధారణము మననేమి యనియాలోచించి చూతము.

అవహితులరగుడు.

ఇంతకుమున్న శైవుల సమాధిసంస్కారము నడుమవచ్చినదె గాని ప్రాచీనముగాదనియుఁ దానంజేసి యది పరిత్యజింపఁదగినదనియు దహనసాపిండ్యవాదులు వాదించుచున్నారు. అది యట్లుండ లింగధారణమే యీ నడుమ వచ్చినదనిచేయు పరిష్కార మీ శైవసంఘమున కెంత యుపకారకరమో గౌరవకరమో బుద్ధిమంతులకు విదితమేకదా?

అదిగాక

శైవసిద్ధాంతకర్తలైన యారాధ్యత్రయము పండితత్రయము నని మొదలగు శైవాచార్యులె లింగధారణ రహితులనుట లింగధారణ సిద్ధాంతమునకు నెంత యప్రతిష్ఠాకరమో, ఉద్భటారాధ్య వంశస్థులమనియు, శివలెంక మంచెన పండిత వంశస్థులమనియు, శ్రీపతిపండిత వంశస్థులమనియు, మల్లికార్జున పండిత వంశస్థులమనియు, మొదలుగా వంశగౌరవముంగోరి యేగురుపరంపర వారివంశస్థులమని చెప్పుకొనుచున్నారమో అట్టి మనకూటస్థులె యలింగులనుట మనకు నెంత యగౌరవకరమో?

యోజించునెడ నీ విమర్శన మావశ్యకమగునని తోఁచుననియె యెంచెద. అయినను నావశ్యకము కాదనియె మీ చిత్తములకు తోఁచునెడ నామిత్రులైన శ్రీశాస్త్రులవారికి లింగధారణ నవీనతా నిరూపణమెట్లులావశ్యకమని తోఁచెనో అట్లులె లింగధారణ ప్రాచీనతానిరూపణము నాకు నావశ్యకముగాఁ దోఁచెనన్న గ్రహించుడు! తోఁచిన కొలది యిందు విమర్శము వివరింపఁబడియె. మఱియు విశేషాంశముల నెవ్వరైన వ్రాసియనిపినచో వానినెగాక, దీనిమీద నెవ్వరైన నాక్షేపము వ్రాసి యిచ్చటి కనిపినను నిందుఁ బ్రచురింపను దోఁచిన కొలఁది సమాధానము వ్రాయను నాటంకము లేదు.

కాన సరళస్వభావముతో నీవిమర్శము నాత్మనీననిర్వ్యాజ ముగా భావించి, సారము గ్రహించి, లోపముల మన్నించి, ప్రాచీనము ధర్మములఁ బ్రమాణీకరించి, వీనిని దృఢచిత్తతతో నవలంబించి మహ దేవునదుగ్రహంబు గాంచి, యపారమగు నిహపరసుఖము వడయుదురు గాకయని ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు,

శైవమహాజన విధేయుఁడు,

ప॥ సం॥

మునిగొండ నాగలింగశాస్త్రి.

---

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ కోమరువెల్లి కాళయ్యగారు వరంగల్ | 12—0—0 |
| ,, రామిని మల్లయ్యగారు ... | 12—0—0 |
| ,, తుర్లపాటి వెంకటేశ్వరరావుగారు, బా. ష్ట. రు. బెజవాడ | 10—0—0 |
| ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్న గార్లు, శికింద్రాబాదు | 10—0—0 |
| ,, కైలాస శరభయ్యగారు, ... | 10—0—0 |
| ,, బెల్లె రామన్న కుమారుడు, జగదీశ్వరయ్య ... | 10—0—0 |

—♦ పోషకులు ♦—

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యవార్లంగారు, ఈమని | 5—0—0 |
| ,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని | 5—0—0 |
| ,, కామర్సు రాజశేఖరరావుగారు, కరణం నవాబుపాలెం | 5—0—0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రులుగారు, తొండపి | 5—0—0 |
| ,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు | 5—0—0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల | 5—0—0 |
| ,, చప్పి మల్లనారాధ్యులవారు, లచ్చుపేట | 5—0—0 |
| ,, చప్పి వీరన్నారాధ్యులవారు ... | 5—0—0 |
| ,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చుపేట | 5—0—0 |
| ,, భూపతి రత్నంగారు, వరంగల్ | 5—0—0 |
| ,, మల్లంపల్లి మల్లిఖార్జునుడుగారు, అయితెంపూడి అగ్రహారం | 5—0—0 |
| ,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ | 5—0—0 |
| ,, శ్రీపతిపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని | 5—0—0 |
| సోమవరపు బసవేశ్వరరావుగారు, మానుకోట | 5—0—0 |
| ,, యిరుసళ్ళ శ్రీశైలం, మచ్చవాడ | 5—0—0 |
| ,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు | 5—0—0 |
| ,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు | 5—0—9 |
| ,, బీపేట విశ్వనాధశాస్త్రిగారు, సిద్దిపేట | 5—0—0 |
| ,, ముత్యంపేట మల్లయ్యగారు ,, | 5—0—8 |
| ,, కాళేశ్వరం నాగభూషణంగారు ,, | 5—0—0 |
| ,, కొడిచేల సీతారామయ్యగారు ,, | 5—0—0 |
| ,, బిక్కవోలు స్వామిగారు, విజయనగరం | 5—0—0 |

# ప్రకటనము.

అర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:— ఈ గ్రంథమునందు బ్రా
ణులు మొదలగువారు వేకువజామున నిద్ర లేచినది మొదలుకొని రా
పండుకొనునందాక చేయవలయు స్నానసంధ్యాది సకలధర్మములకు
వైద్యశాస్త్ర ప్రామాణ్యమునుబట్టి ఆరోగ్యరూపమగు ప్రత్యక్షఫల
కలదని ఋజువుచేయఁబడియున్నది. వెల రు ౧—౦—

కారణోత్తరమను దివ్యాగమము:— ఇయ్యది శైవుల లింగధా
ణము మొదలగువానియెడల గలసకల సంశయముల వారించు నిదర్శ
మానమైనది. వెల రు ౧—౦—

అహ్నికవిధి:— ఇందు స్నానము సంధ్య మొదలుకొని
దేవమువరకుగల సకల నిత్యకర్మములు సస్వరాంధ్ర ప్రయోగము
గలవు. వెల రు ౧—౮—

మకుటోత్తరము అను దివ్యాగమము:— ఇందు శివపూ
విశేషములు, శైవోత్పత్తి విధానము మొదలగు ననేక విశేషము
గలవు. వెల రు ౦—౮—

బ్రహ్మతర్క స్తవము:— శ్రీ మదప్పయ్య దీక్షిత విరచిత
ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, స్మ
వాసిత్వము, బాణాసుర యుద్ధమున నోడిపోయెనన్న దానికి సమాధా
మొదలగు ననేక విషయములు గలవు. వెల రు ౧—౦—

మహాశివపూజా విధి:— ఇయ్యది లింగనిరీక్షణమున విని
గించు దశావధాన విధానముతోను, సస్వరాంధ్ర ప్రయోగముతో
శాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦—

చతుర్వేద తాత్పర్య సంగ్రహము:— శ్రీ హర దత్తా
విరచితము. ఆంధ్ర తాత్పర్యసహితము. వెల రు ౧—౦—

వలయువారు:—

ముదిగొండ నాగలింగశాస్త్రి

రామలింగేశ్వరపేట, తెనాలి.

అనివ్రాయవలెను.

Reg. No. M- 2284.

శ్రీ

శివాయ గురవేనమః

# శైవరహస్యబోధిని.

ఇది

శ్రీ దేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జితాసార్
శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని
సాహాయ్యమున వెలువడుచు
శైవధర్మములను, వాని ప్రామాణ్యమును దెలుపు
మాసపత్రిక.

| సంపుటము 5. | విభవనామ సంవత్సర జ్యేష్ఠమాసము. | సంచిక 3. |
|---|---|---|

సంపాదకుడు:-ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।
విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ।
అశేషశంకానుయపంకశోధినీ।
జయత్వియం శైవరహస్యబోధినీ।



తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

చందా సం॥ రు 2-0-0.

1928.

## శాశ్వత ప్రధాన పోషకులు.

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగ మయ్యావార్లగారి కుమా
నాగమల్లయ్య అయ్యావార్లగారు. సిద్దిపేట
కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, రామన్నవగైరా సిద్దిపేట

## —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారీకులు

| | | |
|---|---|---|
| 1 | భండారు మల్లిఖార్జునరావుగారు | 60—0—0 |
| 2 | భండారు వీరభద్రరావుగారు | |
| 3 | భండారు వీర్రాజుగారు | |
| 4 | భండారు వీరబసవరాజుగారు | |
| 5 | భండారు చెన్నబసవయ్యగారు | |
| 6 | భండారు చిన మల్లిఖార్జునుడుగారు | |

## —: ప్రధానపోషకులు :—

మరాశ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రిులుగారు సికింద్రాబాదు
,, శివలంక తాయన్నగారు, పోణంగి
,, ముదిగొండ వీరభద్రయ్య అయ్యావారుగారు, ఈమని
,, శివపురపు రాజయ్యగారు, శికింద్రాబాదు
,, కొడిమేల భోగసోమలింగారాధ్యులుగారు, శ్రీగురుతత్వ సంస్థానం వరంగల్
,, శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు నిర్మల
,, కాశీనాధుని అల్లమయ్య అయ్యావారుగారు యలమర్రు అగ్రహారం
,, శివలెంక శంభులింగం అయ్యావారుగారు బెజవాడ
,, ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్

శ్రీ శివాయగురవేనమః.

# బసవపురాణ పీఠికా విమర్శనము.



పాఠకమహాశయులారా!

గత సంచికలయందు శ్రీమల్లికార్జునపండితుఁడు మొదలగు శైవాచార్యులు లింగధారులే యని నిరూపింపంబడియెను. దానింబట్టి లింగధారణము ప్రాచీనమె యని యేర్పడుచునెయున్నది. మఱియు, ఉద్భటారాధ్యచరిత్రమునుఁబట్టియు లింగధారణము ప్రాచీనమే యనుట విశదము.

ఉద్భటారాధ్యచరిత్రమునకుఁ గర్త తెనాలి రామలింగకవి. కృతిపతి ఊరదేచమంత్రి. దేచమంత్రి శైవాచారపరాయణుఁడు, ప్రోలనారాధ్యుని వంశమువాఁడగు చంద్రశేఖరవాచంయముని శిష్యుఁడు.

శ్లో॥ యస్మాదస్త్రీశమాఁదాదఖిలమనుపతిం దేచయామాత్య వర్యాసో
యం శ్రీచంద్రమౌళిర్జయతిగురువరః ప్రోలనారాధ్యవంశ్యః॥

(ఈగురునిగూర్చి ఉద్భటారాధ్యచరిత్రము నవతరణికను గ్రంథావసానమునుగూడ జూచునది.) అని బ్ర॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు వ్రాసిన యుద్భటారాధ్యచరిత్ర పీఠిక 11వ పేజీయందుగలదు.

ప్రోలనారాధ్యుండును, చంద్రశేఖరుండును నుద్భటవంశ్యులే యని యుద్భటారాధ్యచరిత్రము 110, 111 పేజీలయందున్నది. ఎట్లన,

గీ॥ సకలదేశిక రాజన్య మకుట నూత్న
రత్నకోరకమై బుధారాధ్యుఁడైన
యుద్భటారాధ్యవంశపయోధి బుట్టి
నట్టి గురుచంద్రు లఖిల ధర్మార్థవిదులు॥

..........మల్లికార్జునగురుం డుదయించు నతండు॥

క॥ ఆమల్లికార్జున గురు। స్వామికిఁ బ్రోలయ గురుండు జనియించిదిశా
సామజకర్ణపుటీతట। చామరలతికాయ మానసాంద్రయశుండై॥

అని మొదలుగా బ్రోలనారాధ్యునకు స్వయంభువుగారును వారికి శంకరదేశికుండును, నమ్మహనీయునకు సోమనాథయ్యయు, నాయనఘునకు లింగనారాధ్యుండును, నప్పుణ్యాత్మునకు మనుమయ్యయు, నాయనకు మల్లికార్జునుండును, నాయారాధ్యవర్యునకు చంద్రశేఖరుండును, నాగురుచంద్రునకు మనుమారాధ్యప్రభృతులును గలిగినట్లు తెలియుచున్నది.

ఇందు మొదటఁ బేర్కొనఁబడిన మల్లికార్జునగురుఁడు ప్రతాపరుద్రుని మంత్రియైన శివదేవునిచేఁ గాశీనగరమునుండి యేకశిలానగరమునకుఁ గొనిరాబడి ప్రతాపరుద్రునిచే ముదిగొండ మొదలగు నగ్రహారములఁ బడసెను.

స్వయంభుని పుత్రుఁడగు శంకరదేశికుఁడు పెదకోమటివేమారెడ్డికి గురువై యాయనవలన పినపాడను నగ్రహారము గ్రహించెను.

తరువాతివాఁడైన చంద్రశేఖరుఁడు ఉద్భటారాధ్యచరిత్ర కృతిపతియైన యూరదేచమంత్రికి గురువు. 'యస్మాదస్త్రేశమాదాత్' అను శ్లోకమునుబట్టి ఊరదేచమంత్రి ముదిగొండ చంద్రమౌళ్యారాధ్యునివలన నఘోరాస్త్రవిద్యను గ్రహించినట్లు తెలియుచున్నది. అఘోరాస్త్రవిద్య ముదిగొండవారికి సంప్రదాయసిద్ధమనుట స్పష్టము

మఱియు, ఉద్భటారాధ్యచరిత్ర 109 పేజీ.

ఉ॥ ఉత్తర శైవదీక్షుల గురూత్తముఁడుద్భటుఁడీద్విజాతియం
దుత్తము లిష్టలింగులని సూక్తులు చెప్పియు లింగధారణల్
హత్తుకలందుఁ గొందఱకుఁ గూర్పఁగ రాజులు మంత్రివర్గముల్
చిత్తములుం జిగుర్పగను శిష్యులునై గురుపూజ సేయగాఁ॥

అనియు, 28 పేజీ,

సీ॥ నిఖలశైవారాధ్య నేతృత్వమహిమచే
బరగుచు గురు సార్వభౌము లనగ
దుర్మత ధ్వంస బంధురులౌచు బ్రతివాది
జనభయంకర యశస్సాంద్రులనగ
షట్కాల శంభు పూజాపరాయణవృత్తి
జరుపుచు గురురాయ శరభులనగ
గొలుచువారికి నిష్టఫలదులై నిజశిష్య
బహుళ దారిద్ర్యవిఘాళులనగ

గీ॥ నన్ను సర్వంబునందుఁ గానంగఁజాలు
ఘనత చేపట్టి వేదమార్గప్రతిష్ఠ
బదిలులన నుండుదురు భవద్భావివంశ
జాతు లాచార్య ముఖ్యులు చారుచరిత॥

ఈ మొదలగు పద్యములనుబట్టి యుద్భటారాధ్యుఁడు లింగధారణ సిద్ధాంతము చేసినట్లును, తద్వంశ్యులును షట్కాల శివపూజా పరాయణులై మతోద్ధరణము చేయుచున్నట్లును, షట్కాలశివపూజ యెడ కొండఱకుగలిగిన విరుద్ధభావము శాస్త్రవిరుద్ధభావమె యనియు విశదమగుచున్నది.

## ఉద్భటారాధ్యచరిత్ర రచనా కాలము.

కొండవీడు దుర్గాధ్యక్షుఁడుగానున్న నాదెండ్ల గోపమంత్రికడ ముఖ్యోద్యోగియైన యారదేచమంత్రి యుద్భటారాధ్యచరితము కృతి గొన్నాడు. అది మెల్లఁ గృత్యవతరణికలోఁ జూడనగును. శ్రీకృష్ణదేవ రాయడు క్రీ. శ. 1515 సం॥ కొండవీడు జయించెను. అది మొదలుగా కృష్ణదేవరాయల యేల్బడిలోనది లోఁబడినది. రాయల మంత్రి యగు సాళ్వ తిమ్మరసు కొండవీటి పాలనమును దన మేనల్లుడగు నాదెండ్ల

గోపమంత్రి కప్పగించెను. నాదెండ్ల గోపమంత్రి సుప్రఖ్యాతుఁడు. గోపమంత్రి క్రీ. శ. 1517 సం॥ దేచమంత్రి కొక యగ్రహారము నొసగెను.

.........దేచమంత్రి గోపమంత్రిచే నగ్రహారాది సమ్మానముఁ బడసి సుప్రఖ్యాతుఁడైన పిదపనే యుద్భటచరిత్రము కృతినందియుండును. ఆకాల మించుమించుగా క్రీ. శ. 1525 అని తలపవచ్చును. దీనిచేఁ దెనాలి రామలింగకవి కృష్ణదేవరాయల సభలోనున్నాఁడన్న లోకప్రతీతి సదాధారమయి సంరక్షితమగుచున్నది. అని యుద్భట చరిత్ర పీఠికయందు తత్కర్తలు వ్రాసియున్నారు.

కావున నాలుగునూర్ల సంవత్సరములనాటికే లింగధారణము గల యారాధ్యశాఖ బ్రాహ్మణ్యాది చాతుర్వర్ణ్యగురుత్వమహిమతో నొప్పారుచున్నదని తెలియుచున్నది.

ప్ర॥ దీనింబట్టి కృష్ణదేవరాయల కాలమునాటికి లింగధారి బ్రాహ్మణశాఖ యున్నట్లు తెలియుచున్నది. ఈసంగతి బసవపురాణ పీఠికాకర్త లంగీకరించియే యున్నారు. వారంగీకరింపనిదేమనిన బసవపురాణపీఠిక 88 పేజీయందు కృష్ణదేవరాయలకు బూర్వకాలమున నాంధ్రదేశమున నారాధ్యబ్రాహ్మణులు లింగధారులైయుండిరనుటకుఁ బ్రబలాధారములు గలవేమో యింకను బరిశోధింపవలసియున్నది అని వ్రాసియున్నారు. రాయలవారికిఁ బూర్వకాలమున బ్రాహ్మణులు లింగధారులుగా నున్నారన్నదానికి బలవదాధారము కావలయును.

ఉ॥ ఉద్భటచరిత్రపీఠిక 14 పుట,

క॥ శృంగార రసాలింగిత
రంగత్కవితా నదీతరంగము హృదయ
త్వంగద్భుజంగమాంగద
లింగమ్ము తెనాలి రామలింగముఁ దలతున్॥

(పృథుచరిత్రము-సరస్వతీ సోమయాజీ.)

పై పద్యమాతఁడు లింగధారియనికూడ చెప్పుచున్నది. అని యున్నది. దీనింబట్టి రాయలవారి కాలమున తెనాలి రామలింగకవి మొదలగు కవీశ్వరులును లింగధారులైయున్నట్లును, ముదిగొండ చంద్రమౌళ్యారాధ్యుఁడు కౌండిన్యసగోత్రుఁడగు సూరదేచయామాత్యునకు గురువనుటచే మంత్రులు, ప్రభువులును నారాధ్యులకు శిష్యులైయున్నట్లును తెలియుచున్నది గదా.

అంతకుఁ బూర్వకాలమున లింగధారి బ్రాహ్మణశాఖ లేకయే యానాఁడు మాత్ర మెట్టులింత ప్రబలముగా నేర్పడియుండును? కావున రాయలవారికిఁ బూర్వకాలమునను నున్నదనుటయె నిక్కము.

ఇదిగాక ఉద్భటచరిత్ర పీఠిక 17 పుట. ఉద్భటుడు కాశ్మీర రాజగు జయాడుని సభలో విద్యాపతిగా నుండెనని (క్రీ శ 779 నుండి 813 వఱకు) రాజతరంగిణిలో నున్నది. అని యున్నది. ఉద్భటుఁడు లింగధారియై లింగధారణసిద్ధాంతము చేసియున్నట్లు ఉద్భటచరిత్రాదులవల్ల తెలియుచున్నదిగాన క్రీ.శ. 779 నాటికే లింగధారి బ్రాహ్మణశాఖ వ్యాపకమైయున్నదని విశ్వసించుట న్యాయ్యమగును.

ఉద్భటచరిత్రము శైలి మృదువైనది.

గీ॥ శైవులగువారు చెప్పిన జాడయందు
నడువనేరదు మూఢుల గడుసు బుద్ధి
వానపై వాన గురిసిన నాను నొక్క
సహజ కాఠిన్య ముడిగి పాషాణకులము॥

ఈపద్యముంబట్టి పూర్వమునుండియు శైవమతమునకు విరుద్ధవాదులుండుచున్నట్లు తోఁచెడిని.

మఱియు, శివనిష్ఠాగరిష్ఠుఁడగు యథావాక్కుల అన్నమయ్యగారు రచించిన సర్వేశ్వర శతకము లింగధారి బ్రాహ్మణశాఖ రాయలవారికిఁ బూర్వకాలమున నున్నదనుటకు సాధకముగాదా?

సర్వేశ్వరశతకము.

శా॥ శాకాబ్దంబులు వార్ధిషట్కపురజిత్సంఖ్యం బ్రవర్తింపను
శ్లోకానందకరంబుగాగ మహిలో శోభిల్ల సర్వేశ్వర
ప్రాకామ్య స్తవమొప్పఁజెప్పె శుభకృత్ప్రవ్యక్తవర్షంబునన్
శ్రీకారాధనవంతమై వసుధలోఁ జెన్నొంద సర్వేశ్వరా॥

అను పద్యమునుబట్టి శాలివాహనశకము ౧౧౬౪ వ వత్సరమునకు సరియైన శుభకృత్ వత్సరమున రచింపఁబడినట్లున్నది. దానింబట్టి యాగ్రంధము నేటికి ౬౮౬ వత్సరములనాడు నిర్మితమని తెలియు చున్నది గదా?

సర్వేశ్వర శతకము ౨౨ పద్యము.

మ॥ ఇల సద్భక్తులపాదధూళిపటలంబే మర్త్యఫాలంబునం
జిలికె న్వాడపవర్గనాధుఁడనిరన్ సిద్ధంబుగా వాని ని
ర్మల హస్తార్పితభూతిఁ బ్రీతినొసలారన్ బూయు విశ్వాసికిన్
ఫలమూహించి విధింప నెవ్వరికిఁ జెప్పన్వచ్చు సర్వేశ్వరా॥

భక్తులు మాహేశ్వరుల పాదములయందు వారిపాదధూళి యంటునట్లు దమనొసలి నునుచుటయు, భక్తులఫాలమునందు మాహేశ్వరులు తమ చేతితో విభూతి నునుచుటయు లింగధారిశాఖయందే యీయాచారము సంప్రదాయసిద్ధముగా నున్నది. నైజాంరాష్ట్రమునందు నేటికిని నీయాచారము నడవడిలోనున్నది. ఈశిష్టాచారము ప్రశంసించుటె గాక,

సర్వేశ్వరశతకము ౧౧౧ పద్యము.

మ॥ శివసాహిత్యుల సత్కరస్థలము కాశీక్షేత్రమాహాత్తదే
శ విశాలోన్నత శాఖలారయఁగఁ బంచక్రోశమాపాణి సం
భవ శోభాన్విత చిత్రరేఖలు మహాభాగీరథీతీర్థముల్
శివలింగం బల విశ్వనాథుఁ డరయన్ సిద్ధంబు సర్వేశ్వరా॥

ఇందు లింగధారులకరస్థలము కాశీక్షేత్రమనియు, నందున్న వ్రేళ్ళు పంచక్రోశమనియు, నాచేతియందగు రేఖలు గంగాతీర్థమనియు నందున్న యిష్టలింగము విశ్వనాథుఁడనియు నిరూపించుటంబట్టియు గ్రంథకర్త లింగధారియె యని స్పష్టమగుచున్నది మఱియు,

మ॥ కమనీయంబగు సర్వతీర్థములు లింగంబున్నచో మూర్తిమం
తములై యొప్పుచునుండు లింగమును దాత్పర్యంబుగాభక్తగా
త్రములందెప్పుడునుండుగాన మహిలోఁ దత్త్వార్థమూహింపఁదీ
ర్థములందెల్లను దివ్యతీర్థము భవద్భక్తుండు సర్వేశ్వరా॥

రమణీయములైన సకల తీర్థంబులు శివలింగ సాన్నిధ్యము నందుండును. అట్టి శివలింగము భక్త గాత్రమునందుండును గాన శివ భక్తుఁడె దివ్యతీర్థమని తెలిపెను.

౧౨౬

మ॥ తమ లింగంబునకంటె జంగమము సౌందర్యంబుగాఁగొల్చుటు
త్తమభక్తస్థితి లింగజంగమలసత్సామ్యంబుగాఁజేత మ
ధ్యమభక్తస్థితి లింగపూజ నధముండై జంగమోపాసనా
తముఁడైయుండుట భక్తియందును గనిష్ఠత్వంబు సర్వేశ్వరా॥

ఈ మొదలగు సంప్రదాయములనుబట్టి సర్వేశ్వరశతకకర్త లింగధారి యనుట నిక్కము. దాననే యీకవి వీరశైవుఁడని బ్ర॥ శ్రీ జయంతి రామయ్యపంతులవారు సర్వేశ్వరశతక పీఠికయందు వ్రాసి యున్నారు. వీరశైవుఁడనగానె గ్రంథకర్త జంగము అని తలంప గూడదు. ఏలన, సర్వేశ్వరశతకము ౧౨౭వ పద్యము,

మ॥ అభిరమ్యంబుగ దూదికొండ మహనీయారాధ్యసోమేశ్వర
ప్రభుకారుణ్యవసంతసంజనిత సద్భావప్రసూనావళి
న్విభవం బొప్పగగూర్చి యెంతయు లసద్విఖ్యాతిసంపత్సుఖ
ప్రభవంబైన భవత్పదద్వయము నారాధింతు సర్వేశ్వరా॥

ఇందు దూదికొండ సోమేశ్వరారాధ్యులవారి శిష్యుఁడు గ్రంథకర్త వ్రాసికొనియెను. జంగము లెందును నారాధ్యుల శిష్యులమని వ్రాసికొను సంప్రదాయము లేదు.

అదిగాక సర్వేశ్వరశతక పీఠికయందు

యథావాక్యాల అన్నమారాధ్యుఁ డాత్రేయసగోత్రుఁ పుడు, యజుశ్శాఖాధ్యాయి, గోదావరీతీరవాసి అని మొదలుగా నున్న దానింబట్టియు, అన్నమారాధ్యుని వంశావళియును గ్రంథముంబట్టియు నీగ్రంథకర్త బ్రాహ్మణుఁడే యని స్పష్టమగుచున్నది.

ఆపీఠికయందె కృతికాలముందెలుపు ౧౨౮ పద్యము మూల ప్రతులయందు నుండుటవలన నది ప్రక్షిప్తమనుట కవకాశము లేదు. ఈశుభకృద్వర్షము క్రైస్తవమానమున ౧౨౪౨వ సంవత్సరమునకు సరిపోవుచున్నది. అని కలదు. దీనింబట్టి నేటికిఁ బూర్వము సుమారు ఏడు వందల సంవత్సరములనాడు లింగధారి బ్రాహ్మణశాఖ గోదావరీమండలమున వ్యాపించియున్నట్లు తెలియుచున్నదిగదా? అది రాయలవారి బూర్వకాలము గాదా? వారున్నది ఆంధ్రదేశముగాదా?

మఱియు ప్రతాపరుద్రు నాస్థానమున శివదేవుఁడు మంత్రియై యున్నట్లు చరిత్రలయందు గలదు. శివదేవుఁడు లింగధారి బ్రాహ్మణుఁ డనుట సుప్రసిద్ధము. దీనింబట్టి ప్రతాపుని కాలమునగూడ లింగధారి బ్రాహ్మణులు త్రిలింగదేశమున ప్రధానస్థానము నాక్రమించియుండి రనుట విశదమే. శ్రీశంకరాచార్యులవారితో వజ్రనఖారాధ్యుల మొదలగువారు వివదించినట్టు లానందగిరికృత శంకరవిజయమునందున్న దని లోగడ దెలుపఁబడియె. ఇట్టి నిదర్శనములంబట్టి ఘనాదిగ బ్రాహ్మణులు లింగధారులుగా నున్నారని స్పష్టమగుచున్నదిగదా? కృష్ణదేవరాయలకుఁ బూర్వకాలమున నాంధ్రదేశమున నారాధ్య బ్రాహ్మణులు లింగధారులైయుండిరనుటకుఁ బ్రబలాధారములు

వేమో యింకను బరిశోధింపవలసి యున్నది. యని బసవ పురాణ పీఠికా కర్తలు వ్రాయుట పరిహాసావహముగానున్నది. గాన నిది విమర్శన సహము గానేరదు.

## శైవభాష్య ప్రాచీనత.

### మఱియు. బసవపురాణపీఠిక 68 పుట.

శంకరాద్వైతము ప్రబలిన పిదప నాగమతంత్ర మతములవారు గూడ దమమతములు బ్రహ్మసూత్రాభిప్రేతము లేయని నిరూపించుటకు యత్నించిరి. స్వసిద్ధాంతాను సారముగా బ్రహ్మసూత్రములకు భాష్యములరచించిరి. ఈపూర్ని శంకరులకు పూర్వకాలమున నున్నట్టుగానరాదు అని నుడివి యున్నారు.

ఇందు శంకరాద్వైతము ప్రబలిన పిదప ననుటంబట్టి ఆర్యమతములలో నద్వైతము ప్రథమమనియు, ఆగమతంత్రమతముల వారనుటచే శంకరాచార్య మతముకన్న నితరమతములవారు వైదికమతముల వారు గానేరరనియు, తమమతములు బ్రహ్మసూత్రాభిప్రేతము లేయని నిరూపింప యత్నించిరి అనుటచే శంకరభాష్యముమాత్రమే బ్రహ్మసూత్రములకు సరిపడినదిగాని కడమ భాష్యములు బ్రహ్మసూత్రముల యభిప్రాయమునకు విరుద్ధములనియు, మొదలగు భావములు వ్యక్తమగుచుండుటేగాక, తమమతములు బ్రహ్మసూత్రాభిప్రేతము లె యనుటచే తమకు గడమ మతముల మీాదగల యేవగింపును సువ్యక్తమగుచునే యున్నది. స్వమతాభి మానము నామావశిష్టముగా నున్న యీకాలమున పీఠికా కర్తలకు నిట్టి స్వమతాభి మానోద్రేకము గలిగి యుంట యలంకారమే. కాని యిట్టి వీర లేకాగణమునను బసవపురాణమునకు పీఠిక వ్రాయవలసి వచ్చి యందు శైవ మతముల పరిష్కరింప వలసి వచ్చిన గ్రహచారము శోచనీయము.

ఆర్యమతములలో శాంకరా ద్వైతము ప్రాచీనమని చె
లుగా గల పీఠికా కర్తల యాశయము లన్నియు నిజమునకు వ్యతి
ముగా నున్నవేయని తెలుపవలసి వచ్చినదానికి చింతిల్లు చున్నా
డను. వీరలిట్టి తమ యాశయములను స్వమతస్థుల ప్రరోచనము
స్వమత గ్రంథములయందు వ్రాసికొని యున్నచో విమర్శనము
నాస్పదముగాకుండును. అట్లుగాక, బసవపురాణ పీఠికయందు 
మతములను పరిష్కరింతుమని యారంభించి అందును నాకు వా
వముగా దోచిన దానిని దెలుపు చున్నాఁడనని వ్రాయుటచే స
మునే దెలుపునట్టు లభినయించి శైవమతమునకు నవమాన క
లును సత్యమునకు విరుద్ధములును నగు నిజాభి ప్రాయములను వి
రించుటంజేసి, నిజము దెలుపక తీరదయ్యెను. ఏలన, ఎంతయే
రుచితో బసవ పురాణమును జూడఁ బూనిన శైవ మహాజనులు ద
మొదటనే యున్న పీఠికను జూడకుండరు గదా? పీఠికను జూచిన
సామాన్య జనులకు సందియము లెట్లు గలుగ కుండును? కావు
బసవపురాణ పీఠికలోని పెక్కునంశములు మతాంతరుల పరిహాస
నకును, అల్పబుద్ధుల బుద్ధిభేదమునకును. శైవమహాజనుల యస
నమునకును, గారణముగా నుండుటగాక చాలవరకు సత్యము
విరుద్ధముగా నున్నవిగాన విమర్శింపవలసి యందు నుపాయాంతర
లేక శాంకర మతము యొక్క నిజస్థితి విశదీకరింపవలసి వచ్చినదా
పాఠక మహాశయులు మన్నింప ప్రార్థితులు.

## శైవాదిమతములే ప్రాచీనములు.

వైదిక మతములలో శంకరా ద్వైతము ప్రాథమిక మన
యభిమాన మాత్రము. ఏలందు రేని,

శంకరాచార్యులవారు స్వమత ప్రచారము చేయు నాటికి
వైష్ణవాది మతములు ప్రబల ప్రచారమున నున్నవని శంకరవి

ముల వల్లనె తెల్లమగు చున్నదని లోగడ దెలుప బడియె గదా. ఇదిగాక, స్మార్తులచే శైవ చిహ్నములైన భస్మరుద్రాక్షములు ధరింపఁ బడుచుండుటను తమ మతమునకు నుపాస్యదేవత వేరొక్కటి లేమిచే శైవ వైష్ణవాది మత దేవతలైన హరి హరాదులె పూజింపఁ బడు చుండుటను స్మార్తమతము కన్న శైవ వైష్ణవాది మతములె ప్రాచీనములని యేర్పడుచున్నది.

ఇఁక శాంకర మతమె వైదిక మనుటయు మృగ్యమె. ఏలన, బ్రహ్మసూత్రము లేమతమున ఋజువుగా నన్వయించునో అదియె వైదిక మనఁజెల్లుగాన బ్రహ్మసూత్ర సమన్వయమునకు పదంపడిగాని వైదికమత మేదైనది నిర్ణయింప ననువు పడదు. ఆనిర్ణయ మనంతర మగుగాక, బ్రహ్మసూత్ర భాష్యకర్తలలో మొదటివాడు శంకరుఁడా? లేక నీలకంఠుడా? అని విచారించుట ప్రకృతము. శంకర నీలకంఠ భాష్యముల యందు ననూదించి ఖండింప బడిన పెక్కుమతములు గన్పట్టు చున్నవిగాన నీరెండిటి కంటెను ప్రాచీనము లెన్నియో గల వను నర్థము విస్పష్టమగుచునే యున్నది. దీనింబట్టి సూత్రభాష్య కర్తలలో శంకరుఁడె ప్రథముఁడనియు, ఈపూర్వ శంకరులకుఁ బూర్వకాలమున నున్నట్లుగాన రాదనియు దెలిపిన పీఠికా కర్తల యాశయము నిరాధారమె యనుట విశదమే అయినను, శంకరాచార్యుల వారిని జూచి కడమ మతస్థులు బ్రహ్మసూత్రములకు భాష్యములఁ జేసికొన యత్నించిరను భావ మొంతనిజమో దెలుప నవసరముగాన శంకర నీలకంఠ భాష్యములలో నెద్ది ప్రాచీనమని విచారించుట ప్రకృతము.

## నీలకంఠ భాష్యమె ప్రాచీనము.

బ్రహ్మ మీమాంసారంభమున, అథాతో బ్రహ్మ జిజ్ఞాసా అను సూత్రములోని 'అథ' అను శబ్దమునకు ధర్మవిచారా నంతరము అని నీలకంఠుఁడు చెప్పిన యర్థము ఖండించి శంకరాచార్యులవారు

సాధనచతుష్టయ సంపత్త్యనంతరము అని సిద్ధాంతము చేసిరి. గాక, ధర్మబ్రహ్మ మీమాంసలు రెండునేక శాస్త్రమను వాద కర్మజ్ఞాన సముచ్చయ వాదము, మొదలుగానే యేవాదములు శం రాచార్యునిచే ఖండింపఁబడియెనో అవియన్నియు నీలకంఠుఁడు తన మ్యమున సిద్ధాంతము చేసినవిగాఁ గన్పట్టుచున్నవి. మఱియు, శం గుఁడు ఏసవిశేష వాదమును ఖండించి ముఖ్యముగా నిర్విశేషము సిద్ధాంతము చేసియుండెనో ఆసవిశేష వాదంబును నీలకంఠుఁడు సిద్ధా తము చేసినదేయగును.

శబ్దాదేవప్రమితః, అనుసూత్రమున. శబ్దాత్, ఈశానశ దేవ, అని వ్రాసినవాక్యమునె శంకరాచార్యాదులు వ్రాసియున్నా ఇట్టి విశేషములు లింక నెన్నియోగలవు, ఈ కారణములం పూర్వోత్తర మీమాంసలకు నావాసంబైన కావేరీ మండలము నున్న శాంకరమతస్థులే శంకర భాష్యమునకన్న శ్రీకంఠభాష్య ప్రాచీనమని నిర్ణయించియుండిరి, డానవే శ్రీకంఠభాష్యము ముద్రింపించిన శ్రీహాలాస్య నాథ శాస్త్రిగారు దాని భూమికయం తత్తత్కాలేషు క్రమేణ కృతావతారై ర్భగవదంశభూతైః శ్రీకం శంకర రామానుజానంద తీర్థాద్యైరితి, ఆయాకాలముల యం గ్రమముగా నవతరించిన శ్రీకంఠ శంకరరామానుజ మధ్వాచా లునను చోట శ్రీకంఠాచార్యుడు మొదటనవతరించిన వాఁడుగ దెలుపబడియెను.

మఱియు నందె, పరంత్వాదిమ మప్యన్యేషాం త్రయాణామి శ్రీకంఠీయం శైవాద్వైతపరం భాష్యం, శంకర భాష్యాదులు మూ టికిని శివాద్వైత పరమైన శ్రీకంఠభాష్యము మొదటిది, అని దెలిపియున్నారు.

శంకరవిజయమును బట్టియు శంకరభాష్యముకన్న నీలకం

భాష్యమే ప్రాచీనమని యేర్పడును. ఎట్లన, శంకరాచార్యులవారు వివాదమున నీలకంఠుని జయించినట్లు కలదుగదా?

శ్లో॥ ఇతితం వచనం నిశమ్య సమ్య
గ్గ్రథితానేక నిబంధ రత్నహారః॥
శివతత్పర సూత్ర భాష్యకర్తా
ప్రహసన్ వాచ మువాచ శైవవర్యః॥

అను శ్లోకమును బట్టి వీరి వివాదమునకుఁ బూర్వమే నీలకంఠుఁడు సూత్రభాష్యమును రచించి నట్లున్నది.

ఇదిగాక, శంకరాచార్యుల వారికంటెఁ బూర్వులైన యుదయన భాస్కర ప్రభృతులెందరో శంకరాచార్యునొద్ద పరాజితు లైనట్లు శంకర విజయమునఁ గలదుగాన వారివలె నీలకంఠుఁడును బూర్వుఁడ యని విశద మగుచున్నది. దీనిం బట్టియు శంకర భాష్యము కన్న నీల కంఠ భాష్యమె ప్రాచీన మని నిర్ణయ మగుచున్నది.

ప్ర॥ భాష్యము పూర్వ మైననేమి? పరమైననేమి? ఏది సూత్ర ములకు ననుగుణమగునో యదియె యుత్తమ మగును. ఈరెంటిలో సూత్రములకు ననుగుణముగా నున్న దెద్ది?

ఉ॥ ఎద్ది సూత్రానుసారముగా నున్నదో అదియే యుత్తమ మనుటయు, సూత్రాను సారముగానిది ప్రాచీనమైనంత మాత్రన దాని వలన ప్రయోజనము లేదనుటయు నిజమే. అయినను, భాష్యప్రాచీన తను బట్టి మతముయొక్క ప్రాచీనత యేర్పడుగాన మొదట భాష్య ప్రాచీనత విమర్శింపఁ బడియెను. ఇఁకమీఁద సూత్రాను గుణ్యమిందు దేనికిఁ గలదను సంశయము విమర్శించుట ముఖ్యము.

శాంకరభాష్యము బ్రహ్మసూత్రానుగతముకాదు.

బ్రహ్మసూత్రములయందు సూ॥ భేదవ్యపదేశాచ్చ॥ అను నీమొదలగు

సూత్రములయందు జీవేశ్వరులకు భేదము గలదని నిర్ణయింపఁబడి యుం డగా, జీవేశ్వరులకు భేదము లేదని శంకర భాష్యమున నిర్ణయింపఁబడి యున్నది. మీమాంసయందంతటను ఒక్కొక్క విషయ వాక్యము గ్రహించి యిది జీవపరమా? ఇతరపరమా? లేక పరమేశ్వర పరమా యని శంకించి జీవపరముగాని యితరపరముగాని గాదు. కేవలము పరమేశ్వర పరమేయని కొనకు నిర్ణయింపఁ బడు చున్నది. జీవేశ్వరులకు భేదము వాస్తవమైననేగాని యిట్టినిర్ణయము సంభవింపదు. కావున జీవేశ్వరులకు భేదము లేదనుట సర్వశాస్త్రవిరుద్ధము.

మఱియు, ఆత్మకృతేః పరిణామాత్, అనుసూత్రమున పరిణామ కారణవాదము సిద్ధాంతము చేయఁబడి యుండగా, శాంకరభాష్యము నందు వివర్తవాదము సిద్ధాంతము చేయఁబడియున్నది. బ్రహ్మమీమాంసా సూత్రములలో నెందును వివర్తమను పేరే లేదుగదా?

ఇదిగాక, కర్తాశాస్త్రార్థ వత్త్వాత్, అనుసూత్రమునందు జీవుడు కర్తయని నిర్ణయింపఁబడి యుండగా, శంకరభాష్యమునందు జీవుడు కర్తగాడని సిద్ధాంతము సేయఁబడి యున్నది.

జన్మాద్యస్యయతః, అనుసూత్రమునందు జగజ్జన్మ జీవనాది కారణత్వము బ్రహ్మ లక్షణమని సిద్ధాంతము చేసి, ఈక్షతేర్నాశబ్దం, అను సూత్రమునందు, జగము చేతనకర్తృకముగానె యుండవలయు గాన నచేతన మగు ప్రధానము జగత్కారణము కానేరదని నిర్ణయింపఁబడి యుండగా, జగమే మిథ్యయని శంకర భాష్యమునందు సిద్ధాంతము సేయఁబడియున్నది?

జగము మిథ్యయె యైనచో దీనికారణ విచారము పరిహాసావహము కాకపోదు, త్రాడునందు భ్రాంతిచే దోచిన సర్పమువోలె జగము భ్రాంతిచేతనే బ్రహ్మము నందు దోచినదె యగునేని అధిష్ఠా

నము చేతనుఁడే యయి యుండవలయునను నియమ ముండదుగాన నయ్యది యచేతనముగా నైన నుండవచ్చును. కాఁబట్టి యీసిద్ధాంతము చేతనుఁడె కర్తగా నుండవలెనని నిర్ణయించిన సూత్రమునకు విరుద్ధము కాక మానదు.

వైధర్మ్యాచ్చన స్వప్నాదివత్, అనుసూత్రమున జగము స్వప్న తుల్యమైనది గాదని నిర్ణయింపఁ బడియుండగా శంకర భాష్యము నందు జగము స్వప్న తుల్యమె యని నిర్ణయింపఁ బడియున్నది.

సర్వధర్మోపపత్తేశ్చ అను సూత్రమునందు బ్రహ్మము సర్వజ్ఞత్వ సర్వశక్తి మత్వాది ధర్మములు గలది యని నిర్ణయింపఁ బడియుండగా శంకర భాష్యమునందు బ్రహ్మము నిర్ధర్మకము అని సిద్ధాంతము సేయఁ బడియెను.

ఉత్క్రాంతి గత్యాగతీనాం అను సూత్రమునందు జీవుడు అణుపరిమాణుఁడని సిద్ధాంతము సేయఁబడి యుండగా భాష్యమునందు జీవుఁడు విభువని నిర్ణయింపఁ బడియున్నది.

గుహాంప్రవిష్టా వాత్మానౌహి తద్దర్శనాత్ అను సూత్రము నందు హృదయాకాశమున నున్నవారు జీవేశ్వరులని నిర్ణయింపఁ బడియుండగా భాష్యమునందు బుద్ధిజీవులేయని సిద్ధాతము సేయఁబడి యున్నది.

ఆనంద మయోఽభ్యాసాత్ అను సూత్రమునందు ఆనందమయ శబ్దవాచ్యుడు బ్రహ్మయని నిర్ణయింపఁ బడియుండగా భాష్యము నందు ఆనందమయ శబ్దవాచ్యుఁడు జీవుఁడెయని నిర్ణయింపఁబడి యున్నది.

ఈవిధమున బ్రహ్మసూత్రములను వాని దిగువనున్న శాంకర భాష్యమును రెంటిని పరిశోధించునెడ పైసూత్రములలోని సిద్ధాంతము భాష్యమునందుఁ బూర్వపక్షమగుననియు, సూత్రములలోని పూర్వ

పక్షము భాష్యములో సిద్ధాంతమగుననియు స్పష్టముగాఁ దోపక పోవుచున్నదు.

ఆకారణముననె సూ॥ కార్యం బాదరి రస్యగత్యుపపత్తేః అను సూత్రము మొదలగు సూత్రములయందు అమానవ పురుషుడు ముక్తులను కార్యబ్రహ్మ యొద్దకే గొనిపోవునని బాదరి చెప్పునని మొదలుగ పూర్వపక్షము చెప్పి, తరుచాత,

పరంజైమిని ర్ముఖ్యత్వాత్ అనుసూత్రమున ముక్తులను పర బ్రహ్మయొద్దకె గొనిపోవునని జైమిన్యాచార్యుఁడు నిర్ణయించుచున్నా డని సిద్ధాంతముచేసి యుండగా

మొదటనున్న కార్యం బాదరిః ఈమొదలగు సూత్రము యందు కార్యబ్రహ్మయొద్దకు గొనిపోవుననునదియె సిద్ధాంతమని చెప్పి తరువాతనున్న, పరంజైమినిః అను సూత్రమునకు వ్యాఖ్యానము చేయునప్పుడు, కంపునఃపూర్వపక్షఃనాశంక్యాయం సిద్ధాంతః ప్రతిష్ఠా పితః కార్యంబాదరి రిత్యాదినేతి॥ స ఇదానీం సూత్రై రేవోపదర్శ్యతే ఏపూర్వపక్షమును శంకించుకొని సూత్రకారుఁడు కార్యం బాదరి అని సిద్ధాంతము సెప్పెనో ఆపూర్వపక్షము నిప్పుడు చెప్పుచున్నా అని యవతారిక వ్రాసి చివరనున్న సూత్రమును పూర్వపక్షసూత్ర మునుగా శంకరాచార్యులవారు నిర్ణయించియున్నారు.

పూర్వపక్షమనగా, ముందుండునదియనియు ఉత్తరపక్షమనగా చివరనుండునదియనియు పూర్వపక్షసిద్ధాంతము లనుశబ్దములవల్ల లోకమున విశదమైయున్నది. ఇట్లుండగా' సూత్రకారుఁడు సిద్ధాంత మునె ముందుఁజెప్పి పూర్వపక్షమును తరువాతఁ జెప్పునని విశ్వసింప నగునా? అట్లు చెప్పెనేని సూత్రకారుఁడు వంచకుడని యాయనను లోకము తలంపకుండును.

దీసింబట్టి బ్రహ్మసూత్రములలోని పూర్వపక్షమె శంకరభాష్యములోని సిద్ధాంతమనియు, సూత్రములలోని సిద్ధాంతమె శంకర భాష్యములోని పూర్వపక్షమనియు స్పష్టమేగదా ? ఇట్లుండగా, శాంకరభాష్యమె బ్రహ్మసూత్రములకు ననుగుణముగా నున్నదనుటకు నందగు నభిమానముకన్న వేరగు మానము లేదనుటనూనము.

ఇదిగాక, అనావృత్తిశ్శబ్దాత్ అనుచరమ సూత్రమున, నసపునరావర్తతే అను శ్రుతియందు ముక్తికిఁబోయినవాఁడు తిరిగిరాడు అని యుండుటచే ముక్తునకు పునరావృత్తి లేదని సిద్ధాంతముసేసి పోవుట సగుణముక్తియందె లభించుగాన నీసూత్రంబును సగుణముక్తిని నిరూపించెను. కాఁబట్టి తాము సిద్ధాంతముసేసిన నిర్గుణముక్తుల నుద్దేశించి సమ్యగ్దర్శన విధ్వస్త తమసాంతు సిద్ధైవానావృత్తిః, అని పునరావృత్తి యుండదని స్వవాక్యముతోనె శాస్త్రసమాప్తి చేయఁబడియెను, ఇట్లు అనావృత్తిశ్శబ్దాత్ అను నుపసంహార సూత్రమెగాక, జన్మాద్యస్య యతః అను నుపక్రమ సూత్రంబును సగుణపరంబుగానె సమన్వయించుచున్నది. ఇట్లు ఉపక్రమోపసంహారములతోగూడ బ్రహ్మమీమాంసయంతయు సగుణపరమేయగుటంజేసి యది మఱల్ప నశక్యమను నూహతోనె శాస్త్రారంభమున నధ్యాసభాష్యము రచింపఁబడియెను. అధ్యాసభాష్యమువలని ప్రయోజనమేమియన, అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతె జీవుఁడు ఈశ్వరుఁడు భేదము జగము మొదలుగా సర్వంబును నధ్యారోపముగా నేర్పడినవి, నిజముగా నివి లేవని నపవాదముచేయునెడ బ్రహ్మాత్మైక్యము సిద్ధించునని యద్వైతసిద్ధాంతము. ఇదియంతయు నధ్యాసభాష్యమున సిద్ధాంతము సేయఁబడియెను.

అధ్యారోపాపవాదములను మొదట విశ్వసించిన తరువాత జన్మాద్యస్యయతః, అని మొదలుగా, జగమున్నదని చెప్పనీ, దానికి గారణము ఈశ్వరుఁడని చెప్పనీ, జీవుఁడు పరతంత్రుడని చెప్పనీ, వినిన

వాఁడేమి గ్రహించును? అధ్యారోపమున నిన్నియు నిజమేగాని ... మార్థదృష్టిలో నేదియు లేదు అని తప్పక గ్రహించును. బ్రహ్మసూత్రకారుఁడెగాక, ఎందఱు శాస్త్రకారులు తలలు వ్రయ్యలు కొట్టుకొనను అధ్యాసమును విశ్వసించినవాని చిత్తమును గదల్పఁజాలరు.

సాక్షి చిత్తవిభ్రమకముగలవాఁడు అని న్యాయవాది చెప్పిన మాటను విశ్వసించిన యధికారి యెదుట నాసాక్షి యెంత గట్టిగఁ జెప్పినను వానిమాటయందు నధికారికి విశ్వాస మెట్లు నిలుచును?

కావున, శాస్త్రములనంతను తలక్రిందు సేయ నేర్పడిన యధ్యాస భాష్యమనుట నిజము.

ప్ర॥ ఈయధ్యాసము శాస్త్రసమ్మతమే యని యేల విశ్వసింపరాదు,

ఉ॥ ఇది శాస్త్రమున నెందైన నుండియున్నచో అవశ్య విశ్వాస్యమే అయి యుండును! అది శాంకర వచనముల యందు గాక వేరుచో గానంబడదు. అయినను నిది శాస్త్రసిద్ధమే యని యెంచిన నేమి బాధకమగునని యడుగుదు రేని? శాస్త్రమంతయు బాధితమగుటయే బాధకమని గ్రహించుడు.

ప్ర॥ జగదీశ్వర జీవాది సిబంధన మంతయు నధ్యారోప మూలమున వచ్చినదనుట సూత్రకారుని యాశయమే యేలయయి యుండఁ గూడదు?

ఉ॥ ఇది ముఖ్యమైన ప్రశ్నము, ఇన్ని సూత్రములు చేసి సూత్రకారుఁడు తాను చేసిన విచారమంతయు నధ్యాస దశను బట్టి యనియు, అపవాదమున నిది యేదియు లేదనియు రెండుమాటలు వచింపనేలఁ జాలడయ్యెనో యోజించుడు. ఆయన కేమి మాటలు కరువయ్యెనా? ఈరహస్యమును లోకము గనిపెట్టునో లేదో అను ... త్కారము చూడఁదలంపునా? లేక నిజము గ్రహించి లోకము ...

పడు నెమో యను చింతనా ? అని విచారింపగా నిందేదియు నుచిత
ముగా లేదుగాన నది సూత్రకారునకు సమ్మతమె యని గ్రహింప
ననువుపడదు.

ప్ర॥ ఈ రహస్యమును శంకరాచార్యులవారి వలన గ్రహిం
చినం దప్పేమి ?

ఉ॥ ఈ రహస్యము శాస్త్రమునకు బాధకము గానిదేయై
యున్నచో నెవరు చెప్పినను బాగుగ గ్రహింపనగును. ఈ రహ
స్యము సామాన్యమైనది గానేరదు. ఏలన జగము ఈశ్వరుఁడు,
జీవుఁడు, కర్మము మొదలుగా శాస్త్రమూలమగు సకల పదార్థజాత
మును నపవాదముసేయ మూలహేతువై వేదవ్యాసునిచే నెందును
వ్యక్తీకరింపఁబడనిదై తక్కుమహర్షులచే నిరాకరింపఁబడినదైయున్న
యధ్యాసము శాస్త్రవిశ్వాసము గలవారలకు నెట్లు గ్రాహ్యమగునో
ఇది నిర్ణయించుపని నిష్పక్షపాతులగు బుద్ధిమంతులదై యున్నది.

విమర్శింపగా బ్రహ్మసూత్రములలోని పూర్వపక్షసిద్ధాంత
ములు శంకరభాష్యమునందు తారుమారైయున్న కారణమునను
సర్వశాస్త్రార్థమును తలక్రిందుఁజేయఁ గల్పింపఁబడిన యధ్యాసభా
ష్యము శాంకరభాష్యముననేయున్న కారణమునను, శాంకరభాష్యము
బ్రహ్మసూత్రములకు నెంతమాత్రము ననుగతమైనది కాదనుట విస్పష్ట
మగుచున్నది.

శంకరభాష్యము బ్రహ్మసూత్రములకు ననుగతము కాదనుట
మతాంతరుల యభిప్రాయము గాన నిది యకించిత్కరమని తలంపఁ
గూడదు. ఏలందురేని శాంకరమతస్థులే పెక్కురీ భావమును విశ
దీకరించి యున్నారు.

భగవద్గీతలకు నిరుపమానమైన గూఢార్థదీపికయను వ్యాఖ్యా
నమును రచించినవాడును, అద్వైతమును నిరసించిన మాధ్వప్రకరణ

ములను ఖండించి యద్వైత సిద్ధియను గ్రంథమున నద్వైతమును స్థా
పినవాడునునగు మధుసూదన సరస్వతి యను మహావిద్వాంసుఁ
దశశ్లోకికి వ్యాఖ్యానమైన సిద్ధాంత బిందువు అను గ్రంథమునందు.

శ్లో॥ నస్తౌమితం వ్యాస మశేషమర్థం
సమ్యజ్ఞ సూత్రైరపియోబబంధ।
వినాపితై స్సంగ్రథితాఖిలార్థం
తంశంకరం నౌమి సురేశ్వరంచ॥

కావలసిన సకలార్థమును సూత్రములయందు బాగుగాఁ జెప్పి
నట్టివ్యాసుని నేను స్తుతింపను. సూత్రములతో పనిలేకయె వలసి
సకలార్థమును గూర్చి చెప్పిన శంకరాచార్యుని, సురేశ్వరాచార్యు
ప్రణమిల్లు చున్నాను. అని చెప్పియున్నాడు.

దీనింబట్టి పెక్కురు శాంకరమతస్థులలో వ్యాసుఁడు సరిగాఁ
జెప్పనంతమాత్రన నుపనిష త్తాత్పర్యమును విడువ నగునా? శంకరా
ర్యులవారు నిర్ణయించినదె యుపనిషదర్థము, కాన నదియే ముఖ్య
మనువారు గొందఱును, ఈసూత్రములను రచించినవాఁడు నిజమై
వ్యాసుఁడు గాడని మఱికొందఱును, వేదవ్యాసుఁడె యీ సూత్రము
లను సామాన్యుల కొఱకు రచించెగాని జ్ఞానుల కొఱకు గాదని యిం
గొందఱును, నుడువు చున్నారు. ఇంక యోజింపఁగా,

సూత్రములను వేదవ్యాసుఁడు గాని వేరొకఁడుకాని ఎవఁ
చేసినను వీనియందు నుపనిషదర్థము న్యాయ్యముగా నిర్ధారణ
చేయఁబడియున్నదని తోఁచినచో నాసూత్రములను ప్రమాణము
గ్రహించి వానికి ననుగుణముగా వ్యాఖ్యానము చేయ వలయు
వీనియందు నుపనిషదర్థ నిర్ధారణము సరిగాలేదని తోఁచినచో సూ
త్రములు ప్రమాణముగావని త్రోసిపుచ్చి స్వతంత్రముగా నిర్ధారణ
చేయవలయును.

న్యాయ్యమిటులుండగా- సూత్రము లను ప్రమాణముగా గ్రహించినట్టులభినయించి- వానికి వ్యాఖ్యానము జేయ నారంభించి- మూలమునకు వ్యతిరేకముగా సిద్ధాంతముసేసి, ఇదేమనిన సూత్రములు సరిగా లేవనుట యెట్టులుచితమో పండితుల కెరుకయెఱుక. బ్రహ్మసూత్రములు సరిగా లేవనుట మహాసాహసము. ఏలన, వేదములు విభజించుటచే వేదవ్యాసుఁడని పేరుగాంచి పురాణముల సంగ్రహించి, పంచమవేదమనంబరగు భారతసంహితరచించి, పరమపురుషార్థసిద్ధికై బ్రహ్మమీమాంసనిర్మించిన సాత్యవతేయునికంటె నార్యమతస్థులకుఁబరమాప్తుండు వేరొకండు గలఁడా? ఎందును లేఁడు, దాననే వేదవ్యాసునిఁ బ్రమాణముగా నంగీకరింపకున్నవాఁ డార్యులలో ననె పరిగణింపఁబడఁడు. ఆకారణముననె హిందూమతాచార్యులందఱును సూత్రములకు సరిపడినను సరిపడకున్నను తమతమ మతములు వ్యాససమ్మతములెయని వెల్లడింపనె తప్పక బ్రహ్మసూత్రములకు భాష్యముల రచింపవలసినవారైరి. దాననె వ్యాసునకు మాయావాదమునందె తాత్పర్యముగలదని సాధింపఁబండితులు నేటికిని తమతమశక్తిని వినియోగించుచునె యున్నారు.

నిజమిట్టులుండ బ్రహ్మసూత్రములకు శాంకరభాష్యమె సమ్మతమనియు, తక్కుభాష్యము లాగమ తంత్రమతములవారిచే నసంగతముగా వ్రాసికొనఁబడినవనియు, తమదెవైదికమతమనియు స్వీయమత గ్రంథములయందైనగాక శైవమతపరిష్కార సందర్భమున వ్రాయ సాహసించుట యెంతయుచితజ్ఞతయో బుద్ధిమంతులు గ్రహింతురు గాక.

బసవపురాణ పీఠికలో నందును శైవమతపరిష్కార ఘట్టమున శైవమహాజనులకు సంశయజనకముగా వ్రాసిన కారణమున నిందుఁ గొంచెము శాంకరభాష్యయాథార్థ్యము విన్నవింపక తప్పదయ్యెను.

అంతి యెగాని, శాంకరమతస్థులు తమదె వైదికమతమనియు

తమ భాష్యమే యగ్రగణ్యమనియు, తమ యాచార్యుండె వేదవ్యాసు
నకండె తత్త్వవేత్తయనియు నెన్నివిధముల దుర్భరాభిమానము
వహించినను నెకులకుంజింత యావంతయునుండదు.

శుద్ధాద్వైత మిట్లు బ్రహ్మసూత్ర విరుద్ధమగుటనే శైవులు
శివాద్వైతమును గ్రహించిరి. కావున బసవపురాణ పీఠిక ౮౦ పుట
యందు వీరశైవ మద్వైత సిద్ధాంతమునను సరించును. అని పీఠికాకర్త
లు వ్రాసినది సరికాదు కొన్నిచోట్ల అనుభవాద్వైతము శైవగ్రంథ
ములయందున్నను నిది శైవాచార్యులు సిద్ధాంతముగా పరిగ్రహించినది
కాదు. కావుననే శ్రీమల్లికార్జున పండిత సోమనాథాదులు అద్వైత
సిద్ధాంతము ననేకవిధముల ఖండించియుండిరి. అదిగాక సర్వేశ్వర
శతకము 73, 74 పద్యములు.

శా. మోహాధ్వాంతములో మునింగిన మహామూఢుండతిభ్రష్టుడై
సోహంబంచుందొడంగి నీకుంగడు దూరాత్ముండగుంగాని దు
ష్టాహంకార గుణంబుమాని మది సాంసారంగ సద్భక్తి దా
సోహంబన్న భవత్పదార్చకుండు నీవైయుండు సర్వేశ్వరా.

శా. చావంబుట్టుచుం బుట్టంజచ్చుచు మహాచండాల సంసార పా
రావారంబునంగూలి తాంజెడుటకుంబ్రవ్యక్తిగా నాత్మలో
నేవంబొందక యేను నీవనుట తానే జ్ఞానమో శ్రీమహా
దేవా యిట్టి కుతర్కముంగలదె చింతింపంగ సర్వేశ్వరా.

అను వానియందు నద్వైతము నిరసింపబడియున్నది, గాన దీని
బోవిడిచి వేరొక యంశము విమర్శించుట యుచితము.

ప్ర. బసవ......పీఠిక ౮౧ పుటయందు, శివకవులు అని యు
క్రమించి వీరశైవులలోంగ వీశ్వరులగు వారు శివునిమీదను, తద్భక్తు
లమీదను దక్క నితరులగు భవులమీద నెప్పుడును గృతులంజెప్ప
డివారుగారు. కావున వారికి శివకవులని పేరుగల్గెను కర్ణాటాంధ్ర
గ్రంథములలో శివకవుల ప్రశంస పెక్కుచోట్లగలదు. శివకవుల

భవికవుల గర్హించిరి. కవితలోగూడ వారు వేరుమతము వారైరి. అని పీఠికకాకర్తలు వ్రాసియున్నారు. దీని యభిప్రాయమేమో దెలుపుడు.

ఉ॥ భవికవుల మతము కన్న శివకవులమతము వేరనుట విశదమే. ఇంతియేగాక కవితలోగూడ వారిమతము వేరెయనగా శివకవులమత మన్నిటలోకవిరుద్ధమెగాన నది పరిహాసావహము. అనునాశయము వ్యక్తమగుచున్నది.

భవికవులేపాటి మనుజునైనఁ బొగడి ధనముగడించి యైహిక సుఖముగాంతురు. శివకవులైననో యైహిక సుఖమునొల్లక పరమపురుషార్థము నెగోరి శివుఁ, లేక శివభక్తులను మాత్రమే ప్రశంసింతురు. మఱియు, వారుకుకవులనుంబలె భవికవుల దెగడుటయు గలదు. దానసె,

శ్లో॥ ఆదరేణ యథాస్తౌతి ధనవంతం ధనేచ్ఛయా।
తథాచేద్విశ్వకర్తారం కోనముచ్యేత బంధనాత్,

కవీశ్వరుఁడు ధనకాంచచే ధనికునెంత యాసక్తితో స్తుతించునో అంత యాసక్తితో పరమేశ్వరునింబొగడెనేని వాఁడు మోక్షము నెట్లు పొందకుండును? అని మహాకవి నీలకంఠుఁడును భవికవులఁదూల నాడెను, శివకవులు భవికవుల గర్హించిరి. అని పీఠికాకర్తలు తమకు వారితోగల సహజవైరమును తొలుత దెలిపియే కవితలోగూడవారు వేరుమతము వారైరి అని వారినిఁజులుకనసేయ నారంభించిరి. ఇది విరుద్ధముగాదు. ఏలన,

శ్లో. లుబ్ధానాం యాచకశ్శత్రుశ్చోరాణాం చంద్రమారిపుః,
జారస్త్రీణాం పతిశ్శత్రుర్మూర్ఖాణాం బోధకోరిపుః.

లోభులకు యాచకుఁడు శత్రుఁడు, చోరులకు జంద్రుఁడు శత్రుఁడు, జారస్త్రీలకు భర్త శత్రుఁడు, మూర్ఖులకు బోధకుఁడు శత్రుఁడు నగు

గాన లోభులు యాచకులను, యాచకులు లోభులను పరస్పరమును గర్హించుకొనుచుంట సహజమే.

కాని, శివకవియగు సోమనాథుని గ్రంథముంగూర్చి భవికవులు పీఠిక వ్రాయవలసివచ్చిన కతన శివకవుల కవితయేగా వారి మతంబును పరిహాసభాజనమగుట విచారకరము కాకపోదు,

శివకవుల కవితామతంబులు భవిసంఘముల యాదరమునకు నాస్పదముగాకున్నను భక్తసంఘముల యధికాదరమునకుం బాత్రము గాకపోవుగాన వారికి నేమియుగొరంతలేదు. పూర్వకాలమున పరమేశ్వరునో లేక పరమేశ్వర భక్తులనో మాత్రమెగాక తక్కువారి స్తుతింపరాదు అను భావము పెక్కురు కవీశ్వరులకు నుండినట్లు కన్పట్టుచున్నది. దాననే శ్రీ నన్నయభట్టారకుఁడును రాజరాజ నరేంద్రుని బ్రశంసించునప్పుడు.

క, వీరశ్రీవనితాశ్రిత
భూరిస్థిర బాహుదండ బుధనుత సుగుణా
ధార కలియుగ పవిత్ర పు
రారాతి పదాబ్జపూజనాసక్తమతీ. అను పద్యమున

అతఁడు శివపూజా పరాయణుఁడై అని చెప్పి శివభక్తేతరులను బొగడెనను నపవాదము తనమీఁదకిరాకుండఁ గాపాడికొనియెను,

శివకవుల మతరహస్యంబును, భవికవుల మతయాథార్థ్యంబును నీ పత్రికయందు బెక్కువిధముల వివరింపఁబడుచున్నదిగాన నా నిమైయిప్పుడు విన్నవింప ననవసరము.

శివకవుల కవితావిశేషముంగూర్చి వ్రాయఁబూనినచో గ్రంథవిస్తరముగాక మానదు.

సోమనాథుఁడు ద్విపదయందు ప్రాసయతి నంగీకరించుటంజేసి ఛందస్స్వాతంత్ర్యము నవలంబించినట్లు పీఠికాకర్తలు వ్రాసియున్నారు

కాని ఆ మహాకవి, అనియతగణైః ప్రాసోవా, యతిర్వా అని యాకాల మున వాడుకలోనున్న సూత్రములను ప్రమాణముగాఁ గనఁబరిచియె యుండెను. దానింబట్టి యాయన స్వాతంత్ర్యము నవలంబించి నట్లుగన బడదు.

మఱియు, ప్రాసవిశేషములు యతి విశేషములు మున్నగువానిని గనఁబరిచియు. నట్టివిశేషములు జాలవరకు నితరప్రాచీన మహాకవి కృతులందును గలవని పీఠికాకర్తలె దెలిపియున్నారు. నామాఖండ యతిమున్నగువానికి భారతాదులయందె లక్ష్యములఁజూపి యుండిరి గాన నవి శంకనీయములుగావు.

ఇదిగాక, వైరిపదములు మొదలగు నసాధారణ ప్రయోగము లు సోమనాథకృతులందు గలవని వ్రాసియున్నారు. అట్టివానిని నన్న యాదులె గొన్నిటి బ్రయోగించియుండిరి. మఱియు, కొన్ని సోమనాథ కృతులందున్నను నయ్యవి యాకాలమునకు నార్యవ్యవహార సిద్ధము లుగానె యున్నవని పీఠికాకర్తలె సమర్థించి యుండిరిగదా?

సోమనాథుని కృతులలో గొన్నితావుల వ్యాకరణవిరోధములు నుగలవని వచించిరి. సోమనాథుని కృతులు తగినంత పండిత పరి ష్కారము నొందకుండుటంజేసి యవి లేఖకప్రమాదకృతములనియె నమ్మదగును.

భారత గ్రంథమనంతపాఠప్రభేదములతో నున్నను నద్దానిని పండితులు పరిష్కరించి ప్రచురించియున్నారు గదా? అట్లు పరిష్క రింపక తాటియాకులలో నున్నతీరుననే ముద్రించియున్నచో నది యెట్లుండును? గావున నట్టివి సోమనాథుని లోపములనుగా గ్రహింప రాదు. పీఠికాకర్తలు కవితయందు శివకవులమతము వేరెయని యేలకోవ్రాసినను, బసవపురాణ కృతియందగు గుణమును వివరించు నెడను, లోపములని యొరులు భ్రమించువాని సమర్థించు నెడనుచేసిన పరిశ్రమము ప్రశంసనీయము.

సోమనాథకృతిలోని విశేషములకు గారణము పీఠికాకర్తలే పీఠిక ౧౨౩ పుట.

సోమనాథుఁడు తనగ్రంథములయందుపయోగించిన భాష ప్రాచీనతచేతను, కర్ణాటాంధ్రదేశములకూడలిపట్టున వాఁడికగలదగుట చేతను, మఱియు సోమనాథుని బహుదేశ భాషాపరిజ్ఞానముచేతను. వైలక్షణ్యముగాంచి. నేఁడు మధ్యాంధ్ర దేశవాస్తవ్యులయి కర్ణాటద్రవిడ భాషాపరిచయము౦చుకయుఁ బొందనివారికిఁగొంత వింతఁగొల్పుచుఁ గొన్నిపట్టులఁ గొఱుకఁబడనిదైయుండును. అని తెలిపియున్నారు.

సోమనాథుని వైదుష్యము పీఠిక ౨౭ పుటయందు.

సోమనాథుని పాండిత్య విశేషము చతుర్వేదసారమునను పండితారాధ్యచరిత్రమునను బసవరాజీయము (సోమనాథభాష్యమునను గాననగును. వేదములనుండి పురాణములనుండి శివపారమ్య ప్రతిపాదకములైన వాక్యముల నీతఁడు హెచ్చుగాఁ జూపినాఁడు. వేదములు, వేదభాష్యములు, కొన్నిచోట్ల వేదభాష్యముల ప్రతీకముల నిచ్చినాఁడు. ఆభాష్యము లెవ్వరివో? విద్యారణ్య భాష్యమప్పటికి పుట్టలేదుగదా? పూర్వోత్తర మీమాంసలు పురాణములు, మొదలుగా మతాచార విధులకు సంబంధించిన సంస్కృత గ్రంథములనెల్ల నీతఁడు శోధించి నాఁడు. పాండిత్యమిట్లుండఁగా, నీతఁడు సంస్కృతాంధ్ర కర్ణాట ద్రవిడ మహారాష్ట్ర భాషలలోఁ గవితఁ జెప్పనేర్చినవాఁడు. సంస్కృతాంధ్ర కర్ణాటకభాషలలో నీతఁడు రచించిన గ్రంథములే కలవు. కాని యీతని సంస్కృతకవితయంత రసవంతమైనది కాదు, సంస్కృత వచనరచనము నంత మేలయినది కాదు. ఆంధ్రదేశమునను, ఆంధ్ర వాఙ్మయమునను గడించిన గౌరవమునకంటె సోమనాథుఁడు కర్ణాట దేశమునను గర్ణాట వాఙ్మయమునను హెచ్చుగౌరవము గడించెనని మొదలుగాగలదు.

ఇందు. ఈతని సంస్కృత కవిత యంత రసవంత మైనది గాదు అను నీమొదలగు వాక్యము నకుఁ గారణము గన్పట్టదు.

పీఠికయందు వారుదాహరించిన సోమనాథ రచనల గాంచిన వారికి సోమనాథుని సంస్కృత రచనా వైశద్యము వెల్లడి యగుచునే యున్నది గదా?

సంస్కృతమున వేదతదీయభాష్య సర్వశాస్త్ర పరిజ్ఞానము నుండుటయెగాక సంస్కృతాంధ్ర కర్ణాట ద్రవిడ మహారాష్ట్ర భాష లలోఁ గవితఁ జెప్పనేర్చిన వాఁడని తామె వచింపుచు నీతని సంస్కృ తకవితయంత రసవంతముగా లేదనుటయెంతయో రసవంతముగానున్న దని నిబంధించినవారి దృష్టికిఁ గొంత రసవంతముగా నున్నదని తోఁచు టయే యధికము.

చతుర్వేద సారము మొదలగు గ్రంథములంబట్టి సోమనాథుని సకలవేద పరిజ్ఞానము వ్యక్తమే. అదిగాక సర్వశాస్త్ర వేత్తృత్వ మద్వి తీయము. అదియటుండ నానాదేశ భాషాకవిత నిరుపమానము. ఇంత మాత్రముగాక, ఈయనఘుఁడు చతుష్షష్టి శీలసంపన్నుఁడు, షట్కాల శివపూజాపరుఁడు, అనుదినమష్టోత్తరైక వింశతి సహస్రసంఖ్యాక శ్రీపంచాక్షరీమంత్ర జపపరుఁడు. నిగ్రహానుగ్రహ సమర్థుఁడు. జైన మస్తక విన్యస్త శాతశూల కలిత బిజ్జల తలగుండు గండబిరుదాభి మండితుఁడు. దాననే ప్రత్యక్ష భృంగీశావతార, అని మొదలగుబిరుద ములు గలవని కర్ణాట కవి చరిత్రకారులు వ్రాయుట వింతగాదు. ఇట్టి మహాత్ము నుద్దేశించి,

సోమనాథుని నిష్ఠలు నియమములు, అని పీఠిక ౨౬ పుట యందు, ఈతఁడు చతుష్షష్టి శీలసంపన్నుఁడని పలువురు చెప్పిరి. ... భవిజనదర్శన స్పర్శనాలాప వివిధదానాదాన విషయదూరగుడనని యాతఁడు చెప్పికొన్నాడు, శైవేతరుల (భవుల) మొగముఁ జూడ మని శైవులును, వైష్ణవేతరుల మొగముల జూడమని వైష్ణవులును వ్రతములు పూనుటగలరు! అట్టివారు నేఁడునున్నారు! అనియున్నది, ఇట్టి వ్రతములు నేడు శైవవైష్ణవేతరులకు పరిహాసాస్పదముగా దోఁచి నను నాడు గౌరవావహములు గానెయుండెను. అట్టివారనగా నొరుల మొగములు జూడమనువారు గదా యిప్పుడున్నారు. యింతియెగాని పాండిత్యమునగాని, కవితయందుగాని, మాహాత్మ్యముగాని సోమనాథు నింబోలువార లిప్పుడెందేనిం గలరా? అట్టివారలు నాడుండుట మె చ్చరుడు. నేడెట్టులుందురు? ఇదియంత విమర్శనీయముగాదు. పీఠికాక

సోమనాథుఁడు తన గ్రంథముల యందుపయోగించిన భాష ప్రాచీనతచేతను, కర్ణాటాంధ్రదేశములకూడలిపట్టున వాడికగలదగుట చేతను, మఱియు సోమనాథుని బహుదేశ భాషాపరిజ్ఞానముచేతను. వైలక్షణ్యముగాంచి. నేఁడు మధ్యాంధ్ర దేశవాస్తవ్యులయి కర్ణాటద్రవిడ భాషాపరిచయమించుకయుఁ బొందనివారికిఁగొంత వింతఁగొల్పుచుఁ గొన్నిపట్టులఁ గొఱుకఁబడనిదై యుండును. అని తెలిపియున్నారు.

సోమనాథుని వైదుష్యము పీఠిక ౨౬ పుటయందు.

సోమనాథుని పాండిత్య విశేషము చతుర్వేదసారమునను పండితారాధ్యచరిత్రమునను బసవరాజీయము (సోమనాథభాష్యమునను గాననగును. వేదములనుండి పురాణములనుండి శివపారమ్య ప్రతిపాదకములైన వాక్యముల నీతఁడు హెచ్చుగాఁ జూపినాడు. వేదములు, వేదభాష్యములు, కొన్నిచోట్ల వేదభాష్యముల ప్రతీకముల నిచ్చినాడు. ఆభాష్యములెవ్వరివో? విద్యారణ్య భాష్యమప్పటికి పుట్టలేదుగదా? పూర్వోత్తర మీమాంసలు పురాణములు, మొదలుగా మతాచార విధులకు సంబంధించిన సంస్కృత గ్రంథముల నెల్ల నీతఁడు శోధించినాడు. పాండిత్యమిట్లుండగా, నీతడు సంస్కృతాంధ్ర కర్ణాట ద్రవిడ మహారాష్ట్ర భాషలలోఁ గవితఁ జెప్ప నేర్చినవాఁడు. సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలలో నీతఁడు రచించిన గ్రంథములే కలవు. కాని యాతని సంస్కృతకవితయంత రసవంతమైనది కాదు, సంస్కృత వచనరచనము నంత మేలయినది కాదు. ఆంధ్రదేశమునను, ఆంధ్ర వాఙ్మయమునను గడించిన గౌరవమునకంటె సోమనాథుఁడు కర్ణాట దేశమునను గర్ణాట వాఙ్మయమునను హెచ్చుగౌరవము గడించెనని మొదలుగాగలదు.

ఇందు. ఈతని సంస్కృత కవిత యంత రసవంత మైనది గాదు అను నీమొదలగు వాక్యము నకుఁ గారణము గన్పట్టదు.

పీఠికయందు వారుదాహరించిన సోమనాథ రచనల గాంచిన వారికి సోమనాథుని సంస్కృత రచనా వైశద్యము వెల్లడి యగుచునే యున్నది గదా?

సంస్కృతమున వేదతదీయభాష్య సర్వశాస్త్ర పరిజ్ఞానము నుండుటయెగాక సంస్కృతాంధ్ర కర్ణాట ద్రవిడ మహారాష్ట్ర భాషలలోఁ గవితఁ జెప్పనేర్చిన వాఁడని తామె వచింపుచు నీతని సంస్కృతకవితయంత రసవంతముగా లేదనుటయెంతయో రసవంతముగానున్నదని నిబంధించినవారి దృష్టికిఁ గొంత రసవంతముగా నున్నదని తోఁచుటయే యధికము.

చతుర్వేద సారము మొదలగు గ్రంధములంబట్టి సోమనాధుని సకలవేద పరిజ్ఞానము వ్యక్తమే. అదిగాక సర్వశాస్త్ర వేత్తృత్వ మద్వితీయము. అదియటుండ నానాదేశ భాషాకవిత నిరుపమానము. ఇంత మాత్రముగాక, ఈయనఘుఁడు చతుష్షష్టి శీలసంపన్నుఁడు, షట్కాల శివపూజాపరుఁడు, అనుదినమట్యుత్తరైక వింశతి సహస్రసంఖ్యాక శ్రీపంచాక్షరీమంత్ర జపపరుఁడు. నిగ్రహానుగ్రహ సమర్థుఁడు. జైన మస్తక విన్యస్త శాతశూల కలిత బిజ్జల తలగుండ గండబిరుదాభిమండితుఁడు. దాననే ప్రత్యక్ష భృంగీశావతార, అని మొదలగుబిరుదములు గలవని కర్ణాట కవి చరిత్రకారులు వ్రాయుట వింతగాదు. ఇట్టి మహాత్ముని నుద్దేశించి,

సోమనాధుని నిష్ఠలు నియమములు, అని పీఠిక ౨౯ పుటయందు, ఈతఁడు చతుష్షష్టి శీలసంపన్నుఁడని పలువురు చెప్పిరి ... భవిజనదర్శన స్పర్శనాలాప వివిధదానాదాన విషయదూరగుడనని యాతఁడు చెప్పికొన్నాఁడు, శైవేతరుల (భవుల) మొగములఁ జూడమని శైవులును, వైష్ణవేతరుల మొగముల జూడమని వైష్ణవులును వ్రతములు పూనుటగలదు!. అట్టివారు నేఁడును న్నారు! అనియున్నది, ఇట్టి వ్రతములు నేడు శైవవైష్ణవేతరులకు పరిహాసాస్పదముగా దోఁచినను నాడు గౌరవావహములు గానెయుండెను. అట్టివారనగా నెదుల మొగములు జూడమనువారు గదా యిప్పుడున్నారు. యింతియెగాని పాండిత్యముననగాని, కవితయందుగాని, మాహాత్మ్యముగాని సోమనాధుసంబోలువార లిప్పుడెందేనిఁగలరా? అట్టివారలు నాడుండుటయె యరుదు. నేడెట్టులుందురు? ఇదియంత విమర్శనీయముగాదు. పీఠికాక

ర్తలే పీఠిక ౧౧౬ పుట,

శబ్దరత్నాకరకారులు మనసోమనాథుని గ్రంథములను స్వ[illegible]ముగాఁ దలస్పర్శముగాఁ బరిశోధించినట్లు గానరాదు. అట్లు పరి[illegible]ధించి యుండురేని బసవపురాణ పండితారాధ్య చరిత్రములలోని [illegible]దలనే యన్యగ్రంథములలోని వానిగా నుద్ధరించుటగాని యనేకశబ్[illegible]లను విడుచుటగాని సంభవింపదు. సోమనాథుని గ్రంథము[illegible] మొదటి తరగతిలోఁ జేరవలసినవైనను వారైదవ తరగతిలోఁ జే[illegible] అని మొదలుగా సోమనాథుని గ్రంథముల ప్రశంసించి యున్నారు.

శబ్దరత్నాకర కారులు సోమనాథుని గ్రంథములఁ జూడ[illegible]డుటకు, అట్టివారు నేడు నున్నారని పీఠికాకర్తలు చెప్పినచొప్పున [illegible] రత్నాకర కారులగు సీతారామాచార్యుల వారికి వైష్ణవేతరు[illegible] గాక వైష్ణవేతరుల గ్రంథములనుగూడ జూడమను వ్రతము కలదే[illegible] యని యెన్నవలసి వచ్చుచున్నది. అట్లులేనిచో సకలాంధ్ర వాఙ్మ[illegible] మునుగాంచి పెద్దనిఘంటువు నిర్మించిన వారేల చూడకుందురు?

వీరవైష్ణవుడైన శబ్దరత్నాకర కారుడు వీరశైవాగ్రేసరుడైన సో[illegible] నాథుని గ్రంథముల నైదవ తరగతిలోనైనఁ జేర్చియుంటకు సంతసిం[illegible] వలయునెగాని మొదటితరగతిలో నేల చేర్చలేదని యోజింప న[illegible] శ్యకము కన్పట్టదు.

కావున, పాఠక మహాశయులారా, ఎంతటి విపశ్చిదులనైన[illegible] విమతద్వేష పిశాచిక యావహించి యుండునందాక సత్యమా[illegible] రతి యలభ్యము గాన నీయెడ నెక్కుడుగావిన్నవింప నవనావశ్య[illegible]

ఆధునిక విమర్శకులు స్వధర్మానుష్ఠానము నెడ స్వమత[illegible] మానము వహింపకున్నను విమత ప్రస్తావముల యందైన సద్భా[illegible] గోదువ లేకుండ వినియోగించుట శ్రేయమే.

కాఁబట్టి, యీపీఠికలోని శైవమత కవితాది పరిష్కార[illegible] యందగు గుణములు సహజములనియు, లోపములు కారణాంతర[illegible] తము లనియు గ్రహింతురుగాక.

ఇట్లు,
ప॥ సం॥

మ॥ రా॥ శ్రీ కొమరువెల్లి కాశయ్యగారు వరంగల్ 12-0-0

,, రామిని మల్లయ్యగారు ... 12-0-0

,, తుర్లపాటి వెంకటేశ్వరరావుగారు, బారిష్టరు, బెజవాడ 10-0-0

ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్నగార్లు, సికింద్రాబాదు 10-0-0

,, కైలాస శరభయ్యగారు, ... 10-0-0

,, బెల్దె రామన్న కుమారుడు, జగదీశ్వరయ్య ... 10-0-0

## —— పో ష కు లు ——

మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యవార్లంగారు, ఈమని 5-0-0

,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని 5-0-0

,, కామర్సు రాజశేఖరరావుగారు, కరణం, నవాబుపాలెం 5-0-0

,, ముదిగొండ వీరభద్రశాస్త్రులుగారు, తొండపి 5-0-0

,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు 5-0-0

,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల 5-0-0

,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చుపేట 5-0-0

,, భూపతి రత్నంగారు, వరంగల్ 5-0-0

,, మల్లంపల్లి మల్లికార్జునుడుగారు, అయితంపూడిఅగ్రహారం 5-0-0

,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ 5-0-0

,, శ్రీపతిపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని 5-0-0

,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు 5-0-0

,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు 5-0-0

,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్దిపేట 5-0-0

,, ముత్యంపేట మల్లయ్యగారు ,, 5-0-0

,, కాశేశ్వరం నాగభూషణంగారు ,, 5-0-0

,, కొమరువెల్లి బాలరాజుగారు, వరంగల్ 5-0-0

,, గన్రెపల్లి రామన్నగారు. మిడిదొడ్డి 5-0-0

# ప్రకటనము.

ఆర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:- ఈ గ్రంథమునందు బ్రాహ్మణులు మొదలగువారు వేకువజామున నిద్రలేచినది మొదలుకొని రాత్రి పండుకొనునందాక చేయనగు స్నానసంధ్యాది సకలధర్మములకును వైద్యశాస్త్ర ప్రమాణ్యమునుబట్టి ఆరోగ్యరూపమగుప్రత్యక్షఫలము కలదని ఋజువుచేయఁబడియున్నది. వెల రు ౧-౦-

కారణోత్తరమను దివ్యాగమము:.ఇయ్యది శైవుల లింగధారణము మొదలగువానియెడలగల సకలసంశయములు వారించు నిరుపమానమైనది. వెల రు ౧-౦-

ఆహ్నికవిధి:—ఇందు స్నానము సంధ్య మొదలుకొని నైవేద్యమువరకుగల సకల నిత్యకర్మములు సస్వరాంధ్ర ప్రయోగముతో గలవు. వెల రు -౮-౦

మకుటోత్తరము అను దివ్యాగమము:- ఇందు శివపూజా విషయములు, శైవాంత్యేష్టి విధానము మొదలగు ననేక విశేషములు గలవు. వెల రు ౧-౮-౦

బ్రహ్మతర్క స్తవము:- శ్రీమదప్పయ దీక్షిత విరచితము. ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, స్మశానవాసిత్వము, బాణాసురయుద్ధమున నోడిపోయెనన్న దానికి సమాధానము మొదలగు ననేక విషయములు గలవు. వెల రు ౧-౦-౦

మహాశివపూజా విధి:- ఇయ్యది లింగనిరీక్షణమున వినియోగించు దశావధాన విధానముతోను, సస్వరాంధ్రప్రయోగముతోను శాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦-౮-౦

ధర్మసంగ్రహము అంత్యేష్టికాండము:- ఇందు శైవులాచరించు సమాధ్యారాధనవిధులు శాస్త్రసిద్ధములని పలువిధముల నిరూపింపఁబడియుండుటెగాక, అపరకాండ సందర్భమునగల సర్వవిధకృత్యములకుఁదగు ప్రమాణముల గనబరిచి సకల సంశయములు వారింపఁబడెను. ఆంధ్ర తాత్పర్యసహితము. వెల రు ౨-౦-౦

వలయువారు:— ముదిగొండ నాగలింగశాస్త్రి.

రామలింగేశ్వర పేట, తెనాలి. అని వ్రాయవలెను



Reg. No. M- 2284.

శ్రీ

శివాయ గురవేనమః

# శైవరహస్యబోధిని.

ఇది

శ్రీ దేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జతాసార్

శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని

సాహాయ్యమున వెలుపడుచు

శైవధర్మములను, వాని ప్రామాణ్యమును దెలుపు

మాసపత్రిక.



| సంపుటము | విభవనామ సంవత్సర | సంచిక |
|---|---|---|
| 5. | ఆషాఢమాసము. | 4. |



సంపాదకుడు:_ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।

విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ।

అశేషశం కామయపంకశోధినీ।

జయత్యియం శైవరహస్యబోధినీ।



తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

చందా సం॥ రు 2-0-0.

1928.

## శాశ్వత ప్రధాన పోషకులు.

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగ మయ్యావార్లగారి కుమా
నాగమల్లయ్య అయ్యవార్లగారు. సిద్దిపేట
కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, రామన్నవగైరా సిద్దిపేట

## —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారీకులు

1 భండారు మల్లిఖార్జునరావుగారు
2 భండారు వీరభద్రరావుగారు
3 భండారు వీరరాజుగారు
4 భండారు వీరబసవరాజుగారు
5 భండారు చెన్నబసవయ్యగారు
6 భండారు చిన మల్లిఖార్జునుడుగారు

60—0—0

## —: ప్రధానపోషకులు :—

మరాశ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రిలుగారు సికింద్రాబాదు
,, శివలంక తాయన్నగారు, పోణంగి
,, ముదిగొండ వీరభద్రయ్య అయ్యవారుగారు, ఈచని
,, శివపురపు రాజయ్యగారు, శికింద్రాబాదు
,, కొడిమేల భోగసోమలింగారాధ్యులుగారు, శ్రీగురుత్వ సంస్థానం వరంగల్
,, శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు నిర్మల
,, కాశీనాధుని అల్లమయ్య అయ్యవారుగారు యలకుర్రు అగ్రహారం
,, శివలెంక శంభులింగం అయ్యవారుగారు బెజవాడ
,, ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్

శ్రీ శివాయగురవేనమః,

శ్రీ చంద్రజ్ఞానే ఉత్తరభాగే

శివశాసనే

క్రియాపాదే ప్రథమః పటలః.

ప్రారభ్యతే.

---

మూ॥ కలధౌతా చలోత్తుంగ శృంగరంగ న్నికేతనం।
ధర్మమూర్తి ధరశ్రీమన్మహా వృషభ కేతనం॥ ౧
అనంతరుద్రప్రమథ పరిషన్నిక షోజ్జ్వలం।
అనంతరుద్రమాసాద్య ధిషణో ధిషణోన్నతః॥ ౨
పరిస్పృశన్ శ్రీపదాబ్జ పీఠం మూర్ధ్నా ముహుర్ముహుః॥
బద్ధాంజలిస్సుప్రసాద్య నీచైర్వాచముమువాచహ॥ 3

తా॥ శ్రీకైలాస శిఖరమున నున్నవాడును, ధర్మరూపమగు వృషభమేధ్వజముగా గలవాఁడును, అసంఖ్యాకులగు రుద్రప్రమధులతో గూడియున్నవాఁడును నగు ననంత రుద్రునొద్దకు బృహస్పతి పోయి యద్దేవు పాదపీఠమును తనశిరము దాకునట్లు పలుమారు ప్రణమిల్లి దోయిలిబట్టుకొని సుప్రసన్నుని గావించి మెల్లగా నిట్లమె.

బృహస్పతిరువాచ-బృహస్పతి యిట్లనియడిగెను.

మూ॥ భగవన్కరుణాసింధో సర్వజ్ఞాన సమాశ్రయ।
నావిష్కృతా శ్చేద్భవతా స్ఫుటమాగమ సంహితాః॥ ౪
జగత్కలాంధ తామిస్రే నిమజ్జే జ్ఞానవర్జితం॥

తా॥ దయాసముద్రుఁడవును సర్వవిధజ్ఞానములకు నాధారభూతుఁడవునునగు నీశ్వరా, మీచేత నాగమ సంహితలు వెల్లడింపఁబడకుండినచో జగమంతయు నజ్ఞానాంధకూపమున మునిఁగి పోయి యుండును.

మూ॥ అవిజ్ఞాయైన యోలోకే భవదాగమ సంహితాః॥
విపశ్చిదంస్వంమను తే నతస్మాద్విద్య తేపశుః॥

తా॥ లోకమునందు శివాగమ సంహితలను దెలిసి కొనక
తాను పండితుఁడనని యెవ్వాఁడుతలంచునో వానికంటెనజ్ఞాని వే
కఁడుండడు.

మూ॥ భవత్ప్రసాదసంపత్త్యా భవదీయాగమామృతం ॥
నిపీయైవామరగురు రభవంసిద్ధసాధనః ॥

తా॥ మీయనుగ్రహంబున శివాగమామృతమును గ్రో
టనే కృతకృత్యుఁడనై దేవతలకును గురుఁడనైతిని.

మూ॥ ఆకర్ణితామయాభాగా శ్చంద్రజ్ఞానగతాశ్శుభాః ॥
బహవస్తదిహాబ్రూహి కృపయాశివశాసనం ॥
మోక్షధర్మావిశేషేణ తత్రోచ్యన్త ఇతిశ్రుతం॥
అస్మిఞ్శ్రుతేనయేనస్యాం విదితాశేషవేదనః ॥

తా॥ చంద్రజ్ఞానమను శివాగమములోని పెక్కుభాగము
వినియుంటిని. కాన నిప్పుడు దయతో నుత్తరభాగములోని శివశా
మును తెలుపుము. అందుముఖ్యముగా మోక్షధర్మములున్నవని
యున్నాఁడ. ఆభాగమునుగూడ విందునేని యేనుసకలము తెలి
వాఁడనే యగుదుగదా కాన యనుగ్రహింపుము.

అనంతరుద్ర ఉవాచ—నావిని యనంతరుద్రుండిట్లని యానతిచ్చె

మూ॥ యుక్తంపృష్టంహిసుధియా త్రిదివేశగురోత్వయా ॥
శ్రుణుష్వావహితోభూత్వా వక్ష్యామిశివశాసనం ।

తా॥ దేవతాగురుఁడవగు నోవాచస్పతీ, బుద్ధిశాలివగు
ముఖ్యమైన విషయమునేఁడిగితివి. కావున శివశాసనమును
చున్నాను వినుము.

మూ॥ బ్రహ్మాద్యాస్థావరాంతాశ్చ దేవదేవస్యశూలినః ॥ ౧౦
పశవఃపరికీర్త్యన్తే సంసారవశవర్తినః ।

తా॥ బ్రహ్మదేవుఁడు మొదలుకొని స్థావరములవఱకు సంసార వశముననున్న జీవులందఱు దేవదేవుండగు నీశ్వరునకుఁ బశువులని నిగమాగములయందు చెప్పఁబడుచుందురు.

మూ॥ తేషాంపతిత్వా ద్విశ్వేశశ్శివఃపశుపతిస్స్మృతః ॥ ౧౧
మలమాయాదిభిః పాశైస్సబధ్నాతిపశూన్పతిః ॥

తా॥ ఈపశువులకు బ్రభువుగాన శివుఁడు పశుపతియని చెప్పఁబడును. అద్దేవుఁడీపశువులను పాపములు, మాయ మొదలగు పాశములతో బంధించుచున్నాఁడు.

మూ॥ సఏవమోచకస్తేషాం భక్త్యాసమ్యగుపాసితః ॥ ౧౨
చతుర్వింశతితత్త్వాని మాయాకర్మగుణా అమీ।
విషయాఇతికథ్యన్తే పాశాజీవనిబంధనాః ॥ ౧౩

తా॥ భక్తితో తనను బాగుగా నుపాసించినవారల నద్దేవుఁడే బంధమునుండి విడిపింపఁగలఁడు. ఇరువది నాలుగు తత్త్వములును, మాయయు, కర్మగుణంబులును నను నీవిషయములన్నియు జీవులను బంధించు పాశములని చెప్పఁబడుచుండును.

మూ॥ బ్రహ్మాదిస్తంబపర్యన్తాన్పశూన్బధ్వామహేశ్వరః ।
పాశైరేతైఃపతిర్దేవః కార్యంకారయతిస్వకం ॥ ౧౪

తా॥ బ్రహ్మదేవుఁడు మొదలుకొని తృణమువరకుగల పశువుల నందఱను పతియగు మహేశ్వరుం డీపాశములతో బంధించి తనకార్యముల చేయించుకొనుచుండును.

ప్ర॥ ఇచట మహేశ్వరుఁడు తన కార్యముల చేయించుకొనుచున్నాఁడు అనియున్నది. శ్రు॥ నతస్యకార్యం కరణంచవిద్యతే ॥

ఈశ్వరునకు కార్యముగాని సాధనముగాని యేదియు లేదని శ్రుతి చెప్పు చున్నదిగాన యిది శ్రుతివిరుద్ధముగాదా?

ఉ॥ చూడగానే అట్లేతోచుగాని యాలోచింపగా శ్రుతివిరోధము కానిపింపదు. ఏలన,

లోకమునందు జనులు రాజ కార్యముల నొనరించు చున్నను నాకార్యములు ప్రజల యుపయోగమునకే వినియోగించు చున్నవి. అట్లే బ్రహ్మాదులకృత్యము లీశ్వరకార్యములయినను జీవకోటి యొక్క కర్మఫలానుభవమునకె వినియోగించెడిని. ఈశ్వరునకుఁ గార్యము లేదనగా స్వలాభమునకుపయోగించు పని లేదనియర్థము.

ప్ర॥ లోకమునందు రాజకార్యములు రాజునకు నుపయోగింపవా ?

ఉ॥ రాజు స్వార్థపరుఁడైనప్పుడట్లే వినియోగించును, కాని యతడు ప్రజాక్షేమ తత్పరుఁడై యైనప్పుడెంతమాత్రము రాజునకు నుపయోగింపవు. లోకమున తరుచుగా రాజులు స్వార్థపరులై యుండుకతన నట్లు కనఁబడుచున్నను ప్రజాప్రభుత్వములయందు రాజ కార్యములన్నియు ప్రజలయుపయోగమునకె వినియోగించుట యనుభవసిద్ధమైయున్నది.

ప్ర॥ అట్లేనియవి ప్రజాకార్యములె యగుగాని రాజకార్యములని యేల వ్యవహరింపఁబడును?

ఉ॥ ఇట్టి కార్యములు ప్రజాకార్యములె యైనను సోమరితన మనునది జీవసాధారణ ధర్మమగుటచే నీశ్వరునివలని భయము లేనిచో దేవతలైనను తమతమ విధ్యుక్తధర్మములను గొరతలేకుండ నెఱ వేర్పఁజాలరు గాన పరమేశ్వరు నానతిచే నాచరింపఁబడుటంజేసి యీశ్వర కార్యములెయని వ్యవహరింపఁబడుచుండును. అంతమాత్రమున నక్కార్యములీశ్వరునకు లాభకరములని తలఁపఁగూడదు.

ప్ర॥ ఈశ్వరునకు సాధనముగాని సాధ్యముగాని యేదియు లేదని శ్రుతిచెప్పెను. ఇంతియెగాని దేవుఁడందఱిచే పనిచేయించు చున్నాఁడని యెచ్చటనైనఁ జెప్పెనా?

ఉ॥ శ్రు॥ భీషాస్మాద్వాతఃపవతే। భీషోదేతిసూర్యః। భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమఇతి ॥

గాలి ఒక్కక్షణముసేపు వీవకున్నచో ప్రజలు జీవింపఁజాలరు గాన గాలి వీచుచుండుట ప్రజలకొఱకే. అయినను పరమేశ్వరుని వలన భయములేనిది విశ్రాంతి నెంతమాత్రమైన గోరక గాలివీచునా? వీవదు. కాననె పరమేశ్వరునివలన భయముననె గాలియెల్లప్పుడువీచు చున్నదనియు, అగ్నిసూర్యుఁడు మొదలుకొని మృత్యువుదనుక నెల్లరు పరమేశ్వరభయముననె నరుకుచు తమతమకార్యముల దీర్చుచున్నా రనియు శ్రు॥ మహద్భయంవజ్రముద్యతం॥ పరమేశ్వరుఁడు వజ్రాయుధము పైనికెత్తికొనియున్నట్లు నెల్లరకు మహాభయంకరుఁడుగా నున్నాఁడనియు శ్రుతి చెప్పుచున్నది. కావుననె సృష్టి పరార్థము గాని స్వార్థముగాదనుట యథార్థము. దానంజేసి శ్రుతివిరోధమేమియు లేదు. ఈశ్వరునంగీకరించునెడ నద్దేవునకు భ యుపడక తీరదు. సృష్టి సత్యమని యంగీకరించునెడ దానికిఁ గర్తయగు నీశ్వరు నంగీకరింపకుండ దారిలేదు. గాన సృష్టియేమిథ్యయని కొందఱంగీకరించిరి. ఈయర్థమును, అసత్యమప్రతిష్ఠన్తే జగదాహురనీశ్వరాః ॥ నాస్తికులు జగమ సత్యమని చెప్పుచున్నారని భగవద్గీత నుడువుచున్నది. అదియిందుఁ బ్రకృతముగాదు.

మూ॥ తస్యాజ్ఞయామహేశస్య ప్రకృతిఃపురుషోచితాం।
బుద్ధింప్రసూతేసాబుద్ధి రహంకారమహంకృతిః ॥ ౧౭

ఇంద్రియాణి దశైకంచ తన్మాత్రాపంచకంతథా ॥
శాసనాద్దేవదేవస్య శివస్యశివదాయినః॥ ౧౮

తా॥ ఆపరమేశ్వరు నానతిచేతనే మూలప్రకృతి పురుషునకు దగిన బుద్ధిని కలిగించుచున్నది. ఆబుద్ధి యహంకారమును బుట్టించుచున్నది. మంగళప్రదుఁడును దేవదేవుఁడును నగు శివు నానతిచే నాయహంకారము, నోరు, చేతులు, కాళ్లు, గుదము, ఉపస్థము, నను నైదుకర్మేంద్రియములను, చర్మము, కన్నులు, నాలుక, ముక్కు, చెవులు, నను నైదుజ్ఞానేంద్రియములను, మనసును, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము నను నైదు తన్మాత్రలను బుట్టించుచున్నది.

మూ॥ తన్మాత్రాణ్యపి తస్యైవశాసనేన మహీయసా।
మహాభూతాన్య శేషాణి భావయన్త్యను పూర్వశః॥ ౧

తా॥ శబ్దము మొదలగు తన్మాత్రలు పరమేశ్వరు నానతిచేత ఆకాశము, గాలి, నిప్పు, నీరు, నేల అను నైదు మహాభూతములను క్రమముగాఁ బుట్టించుచున్నవి

మూ॥ బ్రహ్మాదీనాం తృణాం తానాం దేహినాం దేహసంగతిం।
మహాభూతా న్యశేషాణి జనయన్తి శివాజ్ఞయా॥ ౧

తా॥ శివాజ్ఞచేతనె మహాభూతములన్నియు బ్రహ్మదేవుఁడు మొదలుకొని తృణముదనుక నున్న దేహధారులకు కర్మానుగుణములగు దేహములను గలిగించుచున్నవి.

మూ॥ అధ్యవస్యతి వైబుద్ధి రహంకారోభి మన్యతే।
చిత్తం చేతయతేచాపి మనస్సంకల్ప యత్యపి॥
శ్రోత్రాదీనిచగృహ్ణన్తి శబ్దాదీన్విషయాన్పృథక్।
స్వానేవనాన్యాన్ దేవస్యదివ్యే నాజ్ఞాబలేనవై॥ ౧

తా॥ శివాజ్ఞచేతనె బుద్ధి నిశ్చయించుచున్నది. అహంకారమభిమానించుచున్నది. చిత్తము తెలిసికొనుచున్నది. మనసు సంకల్పించుచున్నది. శ్రోత్రము మొదలగు జ్ఞానేంద్రియములు వేర్వేరు

శబ్దము మొదలగు తమ తమ విషయములను మాత్రమె గ్రహించు చున్నవి.

మూ॥ వాగాదీన్యపి యాన్యాసంస్థాని కర్మేంద్రియాణిచ ।
యథాస్వంకర్మకుర్వన్తి నాన్యత్కించిచ్ఛి వాజ్ఞయా ॥ ౧౧
శబ్దాదయోపి గృహ్యన్తే క్రియన్తే వచనాదయః ।
అవిలంఘ్యాహి సర్వేషా మాజ్ఞాశంభోర్గరీయసీ ॥ ౧౨

తా॥ శివాజ్ఞచేతనె వాక్కు మొదలగు కర్మేంద్రియములు పలుకుట మొదలగు పనులుచేయుచును, శ్రోత్రాది జ్ఞానేంద్రియ ములు శబ్దాదుల గ్రహించుచునున్నవి. శివునాజ్ఞ యెల్లరకును మీరరానిదిగదా?

మూ॥ అవకాశ మశేషాణాం భూతానాం సంప్రయచ్ఛతి ।
ఆకాశః పరమేశస్య శాసనాదేవ సర్వగః ॥ ౧౩

తా॥ పరమేశ్వరునిశాసనమువలననె ఆకాశము సర్వభూత ములకు నవకాశము నొసగుచున్నది.

మూ॥ ప్రాణాద్యైశ్చతథానామభేదైరన్తర్బహిర్జగత్ ।
బిభర్తి సర్వంశర్వస్య శాసనేన ప్రభంజనః

తా॥ వాయువు శివునానతిచేతనె ప్రాణాపానాది నామభేద ములతో లోపలిభాగములయందును, నిజరూపములతో వెలుపలను నిట్లు జగమునంతను పోషించుచున్నాడు.

మూ॥ హవ్యంవహతిదేవానాం కవ్యం కవ్యాశినామపి ।
పాకాద్యంచ కరోత్యగ్నిః పరమేశ్వరశాసనాత్ ॥

తా॥ అగ్నిహోత్రుఁడు పరమేశ్వరుని శాసనమువలన దేవత లకు హవ్యమును, పితరులకు కవ్యమును జేర్చుటగాక బాహ్యమున పాకాదులను నిర్వర్తించుచు నిఖిల జీవకోటియొక్క యుదరమునందు

జఠరాగ్ని రూపముననుండి భుజించినపదార్థమును జీర్ణింపఁజేయుచు నున్నాఁడు.

మూ॥ సంజీవనాద్యంసర్వస్య కుర్వన్నాప శ్శివాజ్ఞయా।
విశ్వంభరా జగన్నిత్యం ధత్తేవిశ్వేశ్వరాజ్ఞయా॥ ౧౫

తా॥ నీరు శివాజ్ఞచేతనే సర్వప్రాణికోటికి జీవనము నొసగుచున్నది. భూమి సర్వేశ్వరునాజ్ఞచేతనే జగము నెల్లపుడు ధరించుచున్నది.

మూ॥ దేవాన్పాత్యసురాన్హన్తి త్రిలోకానభిరక్షతి।
ఆజ్ఞయాతస్యదేవేంద్రః స్సర్వదేవైరలంఘ్యయా॥ ౧౬

తా॥ అలంఘ్యమగు శివాజ్ఞ చేతనే దేవేంద్రుఁడు దేవతలఁ పాలించుచును, రక్కసులవధించుచును, త్రైలోక్యమును రక్షించుచు నున్నాఁడు.

మూ॥ జీవతాంవ్యాధిభిః పీడాం మృతానాంచైవయాతనాః
అధార్మికాణాం ధర్మేశః కరోతి శివశాసనాత్॥ ౧౭

తా॥ శివశాసనమువల్లనె యముఁడు జీవించియున్న పాపాత్ములకు వ్యాధులచేత బాధను, మృతినొందిన పాపులకు నరకయాతనలను గలిగించుచున్నాఁడు.

మూ॥ నిరృతిర్విధిహీనానాం ఫలంహరతికర్మణాం।
నిశాచరాధిపత్యంచ కురుతేశంకరాజ్ఞయా॥ ౧౮

తా॥ నిరృతి, శివాజ్ఞచేతనే విధిహీనములగు కర్మముల ఫలంబునపహరించుచు రాక్షసుల పాలించుచున్నాఁడు.

మూ॥ ఆధిపత్యమపాంనిత్యం కురుతేవరుణోపిచ।
పాశైర్బధ్నాతి బధ్యాంశ్చ పరమేశ్వరశాసనాత్॥ ౧౯

తా॥ పరమేశ్వరుని శాసనమువలననె వరుణుఁడు జలములకు నాధిపత్యంబుసేయుచు, బంధనార్హులను పాశములతో బంధించుచు నున్నాఁడు.

మూ॥ దదాతినిత్యం యక్షేశో ద్రవిణం ద్రవిణేశ్వరః।
పుణ్యానురూపం భూతేభ్యః పురశాసనశాసనాత్ ॥ 30

తా॥ పరమేశ్వరుని శాసనమువలననె కుబేరుఁడు వారివారి పుణ్యమునకు దగునట్లు ప్రజలకు ధనము నొసఁగుచున్నాఁడు.

మూ॥ కరోతి సంపదశ్చైశ్వ జ్ఞానంచాపి సుమేధసాం।
నిగ్రహంచాప్యసాధూనామీశానశ్శివశాసనాత్. 31

తా॥ శివాజ్ఞవలననె ఈశానుఁడు పుణ్యవంతులకుసంపదలను, బుద్ధిమంతులకు జ్ఞానమును, దుష్టుల నిగ్రహించుటను నెరవేర్చుచున్నాఁడు.

మూ॥ ధత్తేతుధరణీంమూర్ధ్నా శేషశ్శివనియోగతః।
సృజత్యశేషమీశస్య శాసనాచ్చతురాననః ॥ 33
తిసృభిర్మూర్తిభిఃస్వాభిః పాతిచాన్తేనిహన్తిచ।

తా॥ శివాజ్ఞవలన నాదిశేషుఁడు భూమిని శిరముచే ధరించుచున్నాడు. బ్రహ్మదేవుఁడు తన మూఁడు రూపములచేత జగమును సృజించుచు పాలించుచు సంహరించుచునున్నాఁడు.

మూ॥ విష్ణుః పాలయతేవిశ్వం విశ్వేశ్వర నియోగతః ॥ 34
సృజతేగ్రసతేచాపి స్వకాభిస్తనుభిస్తథా ॥

తా॥ శివునాజ్ఞవలననె మహావిష్ణువు తనమూఁడుమూర్తుల చేతను జగముసృజించుచు పాలించుచు, సంహరించుచు నున్నాఁడు.

మూ॥ హరత్యన్తేజగత్సర్వం హరస్తస్యైవశాసనాత్ ॥ 35
సృజత్యపిచవిశ్వాత్మా త్రిధాభిన్నస్తురక్షతి ॥

తా॥ శివాజ్ఞవల్లనె హరుండును. తన మూడుమూర్తులచేత
జగమును సృజించుచు పాలించుచు, సంహరించుచునున్నాఁడు.

ప్ర॥ సకలప్రమాణములయందును బ్రహ్మదేవుఁడు సృజించు
ననియు విష్ణువు పాలించుననియు, రుద్రుఁడు సంహరించుననియుగల
ఇందు నొక్కొకనికిని మూడేసి యధికారములునున్నట్లు చెప్పఁబడి
యెను. ఇది సర్వశాస్త్ర విరుద్ధముగాదా ?

ఉ॥ బ్రహ్మాదులకు సృష్ట్యాదులలో నొక్కొకపనియందె యధి
కారమున్నట్లు ప్రమాణాంతరములలోనున్నమాటనిజమే. అట్లైన
బ్రహ్మకు సృష్ట్యాదులగు మూడుపనులయందు నధికారము గలదని
కొన్ని పురాణముల యందును, అట్లే విష్ణురుద్రులకును నున్నట్లు
పెక్కుపురాణముల యందును నుండియెయున్నదిగాన నిదివిరుద్ధము
గాదు.

ప్ర॥ ముగ్గురకు మూడధికారములు గలిగియుండుట గ్రంథాం
తరవిరుద్ధము గాకపోనీ, అయినను, నిది జగన్నిర్వాహమునకు విరుద్ధ
మెట్లుగాదు ?

ఉ॥ ఆలోచింపగా జగన్నిర్వాహంబునకును నిది విరుద్ధముగాదు.
ఏలన, పురాణములయందే కాలభేదమున బ్రహ్మాదులకు సృష్టిస్థితిలయ
కారణత్వము చెప్పబడియున్నది. దానంజేసి యట్టిశంకకవకాశము లేదు.

ప్ర॥ త్రిమూర్తులకు సృష్ట్యాదులలో నేకైక కారణత్వముగా
సృష్టిస్థితిలయకారణత్వము నంగీకరించునెడ సర్వకారణమగు పరమే
శ్వరునకు త్రిమూర్తులకును గల విశేషమేమి?

ఉ॥ త్రిమూర్తులకుగల సృష్టిస్థితిలయకారణత్వము పరమేశ్వ
రదత్తమైనదిగాన కృత్రిమము. అదియేపరమేశ్వరునకైననో స్వతస్సిద్ధము.
ఇదిగాక, త్రిమూర్తులకుగల యధికారము కాలముచే మారిపోవు

గాని పరమేశ్వరు నధికారము మారిపోవునదిగాదు. ఇదిగాక, సృష్ట్యాది కర్తృత్వము కాలమునకును గలదని పైశ్లోకమునఁ జెప్పఁబోవు చున్నాడు.

అదికాక, సృష్టిస్థితిలయకారణత్వము బ్రహ్మవిష్ణురుద్ర సాధారణమేయైనను సృష్టిస్థితిలయ తిరోధానానుగ్రహ రూప పంచకృత్య కారణత్వము పరమేశ్వరాసాధారణ లక్షణమై యున్నది. కావున త్రిమూర్తులకన్న పరమేశ్వరునందు పెద్దవిశేషము కలిగియేయున్నది.

మూ॥ కాలఃకరోతిసకలం కాలస్సంహరతిప్రజాః ॥ 3౬
కాలఃపాలయతేవిశ్వం కాలకాలస్యశాసనాత్।

తా॥ కాలకాలుఁడగు పరమేశ్వరుని శాసనమువలన కాలము సర్వమును సృజించుచును, పాలించుచును, సంహరించుచునుండును.

మూ॥ త్రిభిరంశైర్జగద్బిభ్రత్తేజోభిర్వ్యాప్తిమాదిశ్ ॥
దివివర్షత్యసాభానుర్దేవదేవస్య శాసనాత్॥ 3౭

తా॥ దేవదేవుఁడగు పరమేశ్వరుని శాసనమువలన నీసూర్యుండును మూఁడురూపములతో జగము భరించుచును, తేజముచేజలము నాకర్షించుచును, మేఘమైవర్షించుచున్నాఁడు.

మూ॥ పుష్యత్యోషధిజాతాని భూతాన్యహ్లాదయత్యపి ॥ 3౮
దేవైశ్చపీయతేచంద్ర శ్చంద్రభూషణశాసనాత్ ।

తా॥ చంద్రశేఖరుని శాసనమువలన చంద్రుఁడును ఓషధులను పోషించుచును, సర్వభూతముల నాహ్లాదింపఁజేయుచును. దేవతలచే భుజింపఁబడుచునున్నాఁడు.

మూ॥ ఆదిత్యావసవోరుద్రా అశ్వినౌ మరుతస్తథా ॥ 3౯
ఖేచరాబుుషయస్సిద్ధా భోగినోమనుజామృగాః ॥
పశవఃపక్షిణశ్చైవ కీటాద్యాః స్థావరాణిచ ॥ ౪౦

నద్యస్సముద్రాగిరయః కాననానిసరాంసిచ ।
వేదాస్సాంగాశ్చశాస్త్రాణి మంత్రాస్తోమమఖాదయః ॥ ४०

కాలాగ్న్యాదిశివాన్తాని భువనానిసహాధిపైః ।
బ్రహ్మాణ్డాన్యప్యసంఖ్యాని తేషామావరణానిచ ॥ ४३

వర్తమానాన్యతీతాని భవిష్యన్త్యపి కృత్స్నశః ।
దిశశ్చవిదిశశ్చైవ కాలభేదాః కలాదయః ॥

యచ్చకించిజ్జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతేపివా ।
తత్సర్వం శంకరస్యాజ్ఞాబలేన సమధిష్ఠితం ॥ ४४

తా॥ మఱియు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, సర్పములు, మనుజులు, మృగములు, పశువులు, పక్షులు, కీటములు, స్థావరములు, నదులు. సముద్రములు, పర్వతములు, అడవులు, సరస్సులు, సాంగములగు వేదములు, శాస్త్రములు, మంత్రములు, స్తోమములు యజ్ఞములు, కాలము, అగ్ని మొదలుకొని శివుని వరకు గల సకలభువనములు, సకల భువనాధిపతులు, అసంఖ్యములైన బ్రహ్మాండములు, వాని యావరణములు, ఇపుడున్నవి, నశించినవి, ముందు రాఁగలయవి, దిక్కులు, విదిక్కులు, కాలభేదములైన కల మొదలైనవి, మఱియు జగమున నెయ్యవి కనఁబడుచున్నవో ఎయ్యవి వినఁబడుచున్నవో అవి యన్నియు పరమేశ్వరు నాజ్ఞాబలమువనె నిలిచియున్నవి.

మూ॥ ఆజ్ఞాబలాత్తస్యధరాస్థితేవా
ధరాధరావారిధరాస్సముద్రాః।
జ్యోతిర్గణాశ్శక్రముఖాశ్చదేవా
స్థిరంచరంవాచిదచిద్యదస్తి॥ ४५

తా॥ అద్దేవు నాజ్ఞాబలమువనె భూమి నిలిచియున్నది. పర్వతములు, మేఘములు, సముద్రములు, సర్వ జ్యోతిస్సులు, ఇంద్రా

దేవతలు, స్థావరజంగమములు ఇట్లు చేతనాచేతనాత్మకమగు జగమంత యు పరమేశ్వరుని శాసనమున నె ప్రవర్తించుచున్నది.

మూ॥ ఏతావతాం పశూనాంహి ద్విపదాంచ చతుష్పదాం
ఈశశ్శివోబంధమో క్షౌతద్వ శైతిష్ఠతో ధృవం॥ ౪౬

తా॥ రెండు కాళ్లు, నాలుగు కాళ్ళునుగల సకల జీవకోటికిని నధిపతి శివుఁడే యగును. కావున నీజీవులయొక్క బంధమోక్షములు శివుని వశమున నె యుండుననుట నిజము. నాలుగుకాళ్ళను ట యింకను నెక్కుడుకాళ్ళుగల జంతువులకును నుపలక్షణమే యగును. కావున శరభము, సర్పములు మొదలగునవియు గ్రహింపఁబడును.

మూ॥ అనంతజన్మమరణకారణాత్పాశసంచయాత్
ముముక్షురాచరే ద్దీక్షాం శాంభవీం పాశకృంతనీం॥ ౪౭

తా॥ అనంతములగు జననమరణములకు గారణమైన పాశ బృందమునుండి ముక్తినొందవలయునను కోరికగలవాఁడు పాచచ్ఛేదక మైన శాంభవదీక్షను గ్రహింపవలయు.

మూ॥ నవినాతత్ప్రసాదేన ప్రాణినాం బంధవిచ్యుతిః
లభ్యతే తత్ప్రసాదోపినానయాదీక్షయావినా॥ ౪౮
వేదానుశాసనమిదమేతద్వై శివశాసనం॥

తా॥ శివుననుగ్రహము లేనిచో బంధమునుండి విముక్తి సంభ వింపదు. ఈదీక్షను గ్రహింపనిచో శివు ననుగ్రహము లభింపదు. ఇది వేదానుశాసనంబును, శివశాసనంబును నగును. కావుననే

శ్రు॥ వ్రతమేతచ్ఛాంభవం తత్సమాచరేన్ముముక్షురపునర్భవాయ॥

అనుశ్రుతి మోక్షము గోరువాడు శాంభవవ్రతము నవలంబింప వలయునని విధించెను.

మూ॥ వేధామన్త్రక్రియాభిఖ్య దీక్షాత్రయ శోభితం॥
షడధ్వశుద్ధి కలితం గురుకారుణ్యసంభృతం
భస్మరుద్రాక్షశ్రీలింగధారణాత్మక ముత్తమం॥
శాంభవవ్రతమేతద్ధి వేద శాస్త్రైక-చోదితం
ఇదం శివప్రసాదైక కారణం భవహారణం॥

తా॥ ఈశాంభవవ్రతము వేధమను క్రియలను మూడుదీక్షల
గూడినదియు షడధ్వశోధనముతో నొప్పునదియు, గురుకారుణ్యము
సిద్ధించునదియు, భస్మరుద్రాక్షలింగధారణాత్మకమైనదియు, వేదశాస్త్ర
విహితమైనదియు నగు ఇది కేవలము శివానుగ్రహమునకు కా
మైనదియు సంసారబంధమును వారించునదియు నగును.

మూ॥ ఏకైక మపిచాస్యాంగం ముక్తిదం కీర్తితంశ్రుతౌ
కిమువాచ్యంను సర్వాంగకలితం మోక్షదంత్వితి॥

తా॥ ఈశాంభవవ్రతములోని యొక్కొక యంగమే ము
నొసఁగునని వేదమునందు గలదు. అట్లుండ నన్ని యంగముల
గూడిన శాంభవవ్రతము ముక్తి నొసగునని యేమి చెప్పవలయు

ఇతి శ్రీచంద్రజ్ఞానే ఉత్తరభాగే

శివశాసనె

క్రియాపాదె

ప్రథమః పటలః

## ద్వితీయః పటలః

బృహస్పతిరువాచ = బృహస్పతి యిట్లని యడిగెను.

మూ॥ సర్వజ్ఞానసుధాంభోధే కరుణైకవిభూషణ।
శాంభవీయవ్రతాంగానాం మాహాత్మ్యం వినిబోధయ॥ ౧

తా॥ సకలమైన జ్ఞానామృతమునకు సాగరముం బోలినవాఁడవును. కరుణయె యలంకారముగా గలవాఁడవును నగునో దేవా, శాంభవవ్రతము నంగములను, వాని మహిమను దేలుపుము.

అనంతరుద్ర ఉవాచ = అని యడుగగా, అనంతరుద్రుండిట్లనె.

మూ॥ గురుర్లింగం జంగమశ్చ తీర్థం చైవ ప్రసాదకః।
భస్మరుద్రాక్ష మంత్రాశ్చేత్యష్టావరణ సంజ్ఞితాః॥ ౨

తా॥ గురువు, శివలింగము, మాహేశ్వరుఁడు, తీర్థము, ప్రసాదము భస్మము, రుద్రాక్ష, మంత్రమునను నెనిమిదియు అష్టావరణములని చెప్పంబడు చుండును.

మూ॥ ఇమానిశివభక్తానాం భవదోషతతేస్సదా।
నివారణైక కార్యాణి ఖ్యాతాన్యావరణాఖ్యయా॥ ౩

తా॥ సంసారసంబంధమగు దోషజాతము భక్తులయొద్దకురాకుండ శారదోలఁజాలునవిగాన నీ యెనిమిదియు నావరణములని ప్రసిద్ధి నొందియున్నవి.

మూ॥ అష్టానా మాదితస్త్వేషాం స్వరూపం మహిమాపిచ।
సంగ్రహేణ ప్రవక్ష్యామి శృణుష్వైకాగ్రచేతసా॥ ౪

తా॥ మొదటినుండి ఈయష్టావరణములయొక్క స్వరూపమును చెప్పెద నవహిత చిత్తుండవై వినుము.

మూ॥ మోక్షస్యదీక్షాసంప్రాప్త్యై గురుస్స్యాన్మూలకారణం।
నవినాగురుణా సిద్ధ్యై సాధనాని భవన్త్యలం॥ ౫

తా॥ మోక్షమునకుగాని, దీక్షాసంప్రాప్తికిగాని గురువేమూల కారణమగును. గురుఁడు లేనిచో సాధనము లున్నను నవి యిష్టసిద్ధి నొసఁగ జాలవు.

మూ॥ శిష్యస్తు శిక్షణీ యత్వాద్గురుర్గౌరవ కారణం।
తస్మాత్సర్వ ప్రయత్నేన గురోర్గౌరవ మాచరేత్॥ ౬

తా॥ శిక్షింపఁ దగిన వాఁడగుటచే శిష్యుఁడగును. గౌరవింపఁ దగిన వాఁడగుటచే గురువని చెప్పం బడుచున్నాఁడు.

మూ॥ యోగురుస్సశివః ప్రోక్తో యశ్శివస్స గురుస్స్మృతః।
గురుర్వాశివ ఏవాథ విద్యాకారేణ సంస్థితాః॥ ౭

తా॥ గురువే శివుఁడు. శివుఁడే గురువు. గురువు, శివుఁడు, మంత్రము ననువానికి రూపమున భేదమేగాని వస్తుభేద మెంతమాత్రము లేదు.

మూ॥ యథాశివ స్తథావిద్యా యథావిద్యా తథాగురుః।
శివవిద్యా గురూణాంచ పూజయా సదృశం ఫలం॥ ౮

తా॥ శివునం దెంత మాహాత్మ్యముగలదో మంత్రమునందు నంత మహత్త్వ మున్నది. మంత్రమునం దది యెంతగలదో నామహిమము గురువునందును గలదు. గాన నీమువ్వురిలో నెవ్వరిని పూజించినను ఫలము సమానమే యగును.

మూ॥ సర్వదేవాత్మక శ్చాసౌ సర్వమంత్ర మయోగురుః।
తస్మాత్సర్వ ప్రయత్నేన తస్యాజ్ఞాం శిరసావహేత్॥ ౯

తా॥ గురువు సర్వదేవరూపుఁడును, సర్వమంత్రరూపుఁడు నగును. కావున సర్వప్రయత్నములచేతను గురునాజ్ఞను శిరసావహింప వలయును.

మూ॥ శ్రేయోర్థీయది గుర్వాజ్ఞాం మనసాపిన లంఘయేత్ ।
గుర్వాజ్ఞా పాలకోయస్మా జ్ఞానసంపత్తి మశ్నుతె॥ ౧౦

తా॥ శ్రేయస్సు కావలయునని కోరికొనువాఁడు గురునాజ్ఞను మనసుననైన దిరస్కరింపరాదు. గురునాజ్ఞను మీరనివాఁడె జ్ఞాన సిద్ధి నొందును

మూ॥ గచ్ఛంస్తిష్ఠ న్స్వపన్భుంజ న్నాన్యత్కర్మ సమాచరేత్ ।
సమక్షంయది కుర్వీత తత్సర్వం గుర్వనుజ్ఞయా॥ ౧౧

తా॥ ఏపనిచేసినను గురునకు ననిష్టమగు పనిచేయ గూడదు. గురుసమక్షమున నేపనిచేసినను గురు ననుమతి బడసియే చేయవలయు.

మూ॥ గురోర్గృహే సమక్షేవా నయథేష్టా సనో భవేత్ ।
గురుర్దేవో యతస్సాక్షా త్తద్గృహం దేవమందిరం॥ ౧౨

తా॥ గురు నింటియందుగాని గురునెదురగాని యథేష్టముగా (విరగబాటు తనముతో) గూర్చుండరాదు. గురుఁడు దేవుఁడెగాన గురుగృహము శిష్యునకు దేవాలయ తుల్యమె యగును.

మూ॥ పాపినాంచ యథాసంగాత్త త్పాపఫలభాగ్భవేత్ ।
తద్వ దాచార్య సంగేన తద్ధర్మఫలభాగ్భవేత్॥ ౧౩

తా॥ పాపాత్ముల సాంగత్యము వలన మనుజుడు పాపఫలము నెట్లుపొందునో అట్లే, గురుని సేవవలన పుణ్యఫలము నొంద గలడు.

మూ॥ యథేహవహ్ని సంపర్కా న్మలంత్యజతి కాంచనం ।
తథైవ గురుసంపర్కా త్పాపంత్యజతి మానవః॥ ౧౪

తా॥ నిప్పునందు పుటము వేయగా బంగారము మాలిన్యము వదలిపెట్టి ప్రకాశించునట్లు మనుష్యుఁడు గురుసేవ వలన పాపము వదలి నిర్మలుఁడగును.

మూ॥ యథా ప్రజ్వలితో వహ్నిర్నిష్ఠాం కాష్ఠస్య నిర్దహేత్ ।
తథాయమపి సంతుష్టో గురుః పాపం క్షణాద్దహేత్॥ ౧౫

తా॥ మండుచున్న యగ్ని దగ్గరనున్న కట్టెలను గాల్చునట్లు, సంతస పడినగురుఁడు పాపముల నెల్లను క్షణముసేపునఁ గాల్చి వేయును.

మూ॥ మనసా కర్మణా వాచా గురోః క్రోధం న కారయేత్ ।
తస్య క్రోధేన దహ్యన్తే హ్యాయుశ్శ్రీ జ్ఞాన సత్క్రియాః॥ ౧౬

తత్క్రోధకారిణో యేస్యుస్తేషాం యజ్ఞాశ్చ నిష్ఫలాః ।
యమాశ్చనియమాశ్చైవ నాత్రకార్యా విచారణా ॥ ౧౭

తా॥ మనోవాక్కాయ కర్మములలో దేనిచేనైనను గురునకు గోపము గలిగింపఁగూడదు. గురునకుఁ గోపము వచ్చెనేని శిష్యునియొక్క ఆయువు, సిరి, జ్ఞానము, పుణ్యము, నన్నియు నశించును. గురునకు గోపము వచ్చెనేని యజ్ఞములు యమనియమాదులు నన్నియు వ్యర్థమైపోవును.

మూ॥ గురోర్విరుద్ధం యద్వాక్యం నవదేజ్జాతుచిన్నరః॥
వదేద్యది మహాఘోరే రౌరవేపతతిధ్రువం ॥ ౧౮

తా॥ ఎప్పుడైనను గురునకు సమ్మతముగాని మాటను పలుకఁగూడదు. అట్లు పలికినవాఁడు నిశ్చయముగా భయంకరములగు రౌరవాది నరకములనొందును.

మూ॥ నైర్గుణ్యేఖ్యాపితేతస్య నైర్గుణ్య శతభాగ్భవేత్ ।
గుణేతుఖ్యాపితేతద్వత్సర్వంపుణ్యఫలంభవేత్ ॥ ౧౯

తా॥ శిష్యుఁడు గురుని దోషముల నెంతమాత్రమైన వెల్లడి చేయునెడ మహాదోషముల నొందును. గురుని గుణమును వెల్లడించె నేని సకలపుణ్యములు చేయఁగా నేమిఫలముగలుగునో ఆఫలము నం తను పొందును.

మూ॥ గురోర్హితం ప్రియంకుర్యా దాదిష్టోవానరస్సదా ।
అసమక్షం సమక్షంవా తస్యకార్యం సమాచరేత్॥ ౨౦

తా॥ గురుండానతి యిచ్చినను, ఇయ్యకున్నను, ఎప్పుడైనను గురునకు హితకరంబును, సంతోషకరంబును నగు కార్యమునె చేయవలయును. గురునెదుటగాని, చాటునగాని గురునకు సమ్మత మైన కృత్యమునె చేయవలయు.

మూ॥ గురుంస్వగృహమాయాన్తం దృష్ట్వాథ క్తియుతోజనః ।
నత్వాతదాసనందత్వా చాసీతతదనుజ్ఞయా ॥ ౨౧

తా॥ తానెటకైన పోవుచుండగా గురువు తనయింటికి వచ్చు చుండెనేని చూడగానె నమస్కరించి యింటికి దీసికొనివచ్చి, గురు ననుజ్ఞచే గూర్చుండవలయు.

మూ॥ స్వాచార్యచరణద్వంద్వ ప్రక్షాళిత జలంసదా ।
యఃపిబేద్ధారయేద్భక్త్యా సర్వపాపైః ప్రముచ్యతే ॥ ౨౨

తా॥ గురునియొక్క పాదయుగము గడిగిన జలము పానము జేసినను శిరమున ధరించినను సర్వపాప విముక్తుండగును.

మూ॥ చందనం చాక్షతంపుష్పం స్వర్ణం తాంబూల మంబరం ।
పాత్రేనిధాయగురవే శిష్యోదద్యాన్నపాణినా॥ ౨౩

తా॥ శిష్యుఁడు చందనము, అక్షతలు, పుష్పములు, హిర ణ్యము, తాంబూలము, వస్త్రములు, మొదలుగా గురునకేమి యీ దలచినను, వానినిపాత్రమున నుంచి యియ్యవలయుగాని వస్తువులనె చేతఁబట్టుకొని యియ్యఁగూడదు.

మూ॥ సంభోజయిత్వా స్వగురుం పశ్చాద్భుంజీత బుద్ధిమాన్ ।
గురోఃపురస్తాద్యో భుంక్తేగురుద్రోహీసఉచ్యతే ॥ ౨౪

తా॥ బుద్ధిమంతుఁడగు శిష్యుఁడు ముందు గురుని సంతృప్తి కలుగునట్లు భుజింపఁజేసి తరువాత తాను భుజింపవలయును. గురున కంటె తాను ముందు భుజించువాఁడు గురుద్రోహియగును.

మూ॥ తాంబూలముత్తమంతస్మై తతఃపాత్రేణదాపయేత్ ।
పశ్చాదిష్టానివస్తూనిదత్వా నత్వాక్షమాపయేత్ ॥ ౨౫

తా॥ గురుఁడు భుజించినతరువాత తాంబూలమును పాత్రము నందునిచి యియ్యవలయు. అనంతరము గురునకు నిష్టములైన వస్తువుల నొసఁగి నమస్కరించి క్షమింపఁగోరవలయు.

మూ॥ శుభకార్యేషుసర్వేషు వివాహాదిషుభక్తితః ।
గురుమభ్యర్చయేచ్ఛిష్యో వస్త్రైర్హేమాంగులీయకైః ॥ ౨౬

తా॥ శిష్యుఁడు వివాహము మొదలగు శుభకార్యములయందు గురునిఁ భక్తితోఁ బూజించి వస్త్రములను, సువర్ణాభరణములను నియ్యవలయు.

మూ॥ దరిద్రశ్చోదితేష్వేషు నిజశక్తిమవంచయన్ ।
అవశ్యమర్చయేచ్ఛిష్యో గురుంలబ్ధధనేనవా ॥ ౨౭

తా॥ శిష్యుఁడు నిర్ధనుఁడెయగునేని యాయాసమయములందు గురుని తనకు గలిగినట్లు శక్తివంచనలేక యవశ్యము పూజింపవలయు.

మూ॥ గురుయాత్రా దేవయాత్రా తీర్థయాత్రేతిచత్రిథా ।
ఆసాంత్రి విధయాత్రాణాం గురుయాత్రాఫలాధికా ॥ ౨౮

తా॥ గురుయాత్ర, దేవయాత్ర, తీర్థయాత్రయని పుణ్య యాత్రలు మూడు విధములు గలిగి యున్నవి. ఈ మూఁడిటిలో గురు యాత్రయే యధికఫలప్రదమైనది.

మూ॥ గురుసందర్శనార్థాయ భక్త్యాయాత్రాంకరోతియః ।
పుణ్యదేహీ సవిజ్ఞేయః సమస్తామరవల్లభః ॥ ౨౯

తా॥ ఏశిష్యుఁడు గురుదర్శనమునకై భక్తితో గురుయాత్ర నాచరించునో వాఁడు పుణ్యవంతుఁడై సర్వదేవతాశ్రేష్ఠుండగును.

మూ॥ శిష్యోగురుస్థితగ్రామం ప్రవిశన్వాహనాదికం ।
వర్జయేద్గృహసామీప్యే తథావైపాదుకానిచ ॥ ౩౦

తా॥ శిష్యుఁడు తనగురువు నివసించు గ్రామము ప్రవేశింపఁగానె వాహనము మొదలగువానినుండి దిగి, గురుని గృహసమీపము నకు రాగానె పాదుకలనుగూడ విడువవలయు.

మూ॥ గురుందిదృక్షుర్యశ్శిష్య స్సద్భక్త్యాఽనుదినంసదా ।
రిక్తపాణిర్నసంపశ్యే ద్యథారాజాతథాగురుః ॥ ౩౧
ఫలం ప్రసూనం తాంబూల మన్యత్కిమపివస్తుచ।
తేష్వేకం గురవేదత్వా నమస్కుర్యాత్తతోగురుం ॥ ౩౨

తా॥ శిష్యుఁడు గురుదర్శనమునకుఁ బోవునప్పుడు చేతియందే మియు లేకుండఁబోయి దర్శింపఁగూడదు. ఏలన, రాజు ఏలాటివాఁడో గురువు నట్టివాఁడే యగును. కావున ఫలమునో, పుష్పమునో, తాం బూలమునో వేరొక వస్తువునో తీసికొనిపోయి గురునకర్పించి నమస్క రింపవలయు.

మూ॥ శ్రీమానపితపస్వీచ శాస్త్రజ్ఞః కులశీలవాన్
కుర్యాద్దండ నమస్కారం నిర్లజ్జోగురుసన్నిధౌ॥ ౩౩

తా॥ శ్రీమంతుండైనను, తపోనిష్ఠుండైనను, శాస్త్రజ్ఞుండైనను, కులశీలసంపన్నుండైనను నిర్లజ్జుండై దీర్ఘదండ నమస్కారము చేయ వలయు.

మూ॥ ఉపచారేషు సర్వేషు ద్వావేవాత్యంతశోభనౌ
ప్రియవాణీ ప్రణామశ్చతౌవినాన్యే వృథాస్మృతాః॥ ౩౪

తా॥ సమస్తవిధములగు నుపచారములయందును ప్రియవాక్యంబును, నమస్కారంబును నను నీరెండే ముఖ్యములైనవి. కావున రెండును లేనిచో కడమ యుపచారములన్నియున్నను వ్యర్థమేయగు

మూ॥ అగ్రేదృష్ట్వానమస్కృత్వా ప్రదక్షిణమనుస్మరన్
ప్రదక్షిణంచకుర్వీత యథాశక్త్యనుసారతః॥

తా॥ గురువుకనఁబడగానె నమస్కరించి, యాని కానిచపా అను ప్రదక్షిణమంత్రము చదువుచు శక్తికొలది ప్రదక్షిణము సే వలయు.

మూ॥ ప్రదక్షిణజ్ఞోయోధీమాన్నతుదీర్ఘపదంన్యసేత్
నగచ్ఛేత్త్వరితో ధీమాన్ నజల్పేదితరైస్సహ॥
పదేపదాంతరం న్యస్యకరాచలన వర్జితౌ
స్తుతిం వాచా హృదా ధ్యానమేవంకుర్యాత్ప్రదక్షిణం॥

తా॥ ప్రదక్షిణము సేయునప్పుడు అంగలువేయుచు త్వ ముగా నడువఁగూడదు. ఇతరులతో సంభాషింపఁగూడదు. అ వెంబడి యడుగు నునుచుచు చేతులు కదల్పక నోట స్తోత్రము సే చును హృదయమున ధ్యానము చేయుచును ప్రదక్షిణము చే వలయును.

మూ॥ స్వగురోఃపురతశ్శిష్యోనేతరాన్కీర్తయేజ్జనాన్
అసత్యభాషణంచైవ నవదేదితరేతరం॥
నానృతం నాప్రియంవాక్యం నగుహ్యంచాపి భాషయేత్।
నాప్రచ్ఛన్నముఖో బ్రూయాద్గురోరగ్రేకదాచన॥

తా॥ శిష్యుఁడు తనగురునెదుట నితరులను ప్రశంసింపఁగూ గురునితో నసత్యముగాని, అప్రియముగాని, రహస్యముగాని ముగాగాని సంభాషింపఁగూడదు. తన నోరు వస్త్రముతో కొనక గురు నెదుట మాటాడరాదు.

మూ॥ స్వామిభట్టారకాచార్య దేవశ్రీగురునామభిః ।
వాచ్యస్సదాగురుశ్శిష్యై ర్జాతుచిన్నాన్యనామభిః॥ ౪౦

తా॥ స్వామీ, భట్టారకా, ఆచార్యా,దేవా, శ్రీగురూ అని యీనామములతోనె శిష్యుఁడు గురుని పిలువవలయుగాని వేరు విధముగాఁ బిలువరాదు.

మూ॥ త్వంశబ్దంనపరియుంజీత గురౌశిష్యః కదాచన ।
ఆజ్ఞాంనలంఘయేత్తస్య సమంనోపవిశేత్తథా ॥ ౪౧
ఆసనం వాహనం వస్త్రం భూషణం శయనం తథా ॥
నకుర్యాద్గురుసాదృశ్యం. గతిసిద్ధిహితేప్సుభిః ॥ ౪౨

తా॥ శిష్యుఁడు గురునితో నీవు అని పలుకఁగూడదు. గురునాజ్ఞ నతిక్రమింపఁగూడదు గురునితో సమముగాఁ గూర్చుండగూడదు. ఆసనము, వాహనము, వస్త్రము, భూషణము, శయనము మొదలగు వాని నుత్తమగతి గోరువాఁడు గురునితో సమముగా నేర్పరుచుకొనఁ గూడదు.

మూ॥ పాత్రంస్నాన జలంఛాయాం మాల్యోపకరణానిచ .
భక్తిహీనోపిపాదాభ్యాం నస్పృశేన్నైవలంఘయేత్ ॥ ౪౩

తా॥ గురుని పాత్రమును గురువు స్నానముచేసిన జలమును నీడను మాల్యమును, ఉపకరణములను భక్తిరహితుఁడైనను శిష్యుఁడు తనకాలితో దాకఁగూడదు.

మూ॥ యఃపశ్యతి గురుంశిష్య స్సాధారణమనుష్యవత్ ।
తస్యభక్తిర్వృథాబ్రహ్మన్ భవత్యత్రనసంశయః॥ ౪౪
మూ॥ సమస్తదేవతావాసం సర్వమంత్రాస్పదంగురుం ।
ఉపేక్షతేయః పాపాత్మా రౌరవం నరకం వ్రజేత్ ॥ ౪౫

తా॥ ఏశిష్యుఁడు తన గురు నందఱితోబాటుగా దలంచునో అతనిభక్తివ్యర్థమగును. సర్వదేవతలకు నావాసభూతుండును, సర్వ

మంత్రివిదుండగు గురునిజూచి యుపేక్షించిన శిష్యుడు రౌరవము నరకమును బొందును.

మూ॥ గురావత్యంతభక్తస్య శిష్యస్యేహాపరత్రచ ।
నకించిద్దుర్లభంబ్రహ్మన్ సమస్తంసులభంసదా ॥ ౭౬

తా॥ గురునందు నధికభక్తి గలిగియున్న శిష్యునకు నీలోకము నందును, పరలోకమునందును, నలభ్యమేమియు లేదు

మూ॥ ఇత్థమాచారవాన్భక్త్యా నిత్యముద్యుక్తమానసః ।
గురుప్రియకరశ్శిష్యస్సర్వా న్ధర్మాంస్తథార్హతి ॥ ౭౭

తా॥ గురుభక్తితో నట్టి యాచారముగలవాఁడును, ఉత్సాహవంతుఁడై గురునకుఁ బ్రియముఁగలిగించు శిష్యుఁడు సకల ధర్మకార్యములు సాధింప నర్హుఁడగును.

మూ॥ గురుశ్చగుణవాన్ప్రాజ్ఞః పరమానందభాసకః ।
తత్వవిచ్ఛివసంసక్తో ముక్తిదోనతుచాపరః ॥ ౭౮

తా॥ గురుండైనను గుణవంతుండును, పండితుండును, శివలోకము నెఱిఁగి యందె చిత్తము నునిచి పరమానందము నొందుచున్న వాఁడె ముక్తి నొసఁగఁ జాలుగాని యితరుఁడు శక్తుఁడుగాడు.

మూ॥ శైవసిద్ధాంత తత్వజ్ఞః ప్రతిష్ఠా మంత్రపారగః ।
మోక్షదః కరుణోపేతో వీతరాగోవిమత్సరః ॥

క్రియాదిజ్ఞాన పర్యన్తం శివతత్వవినిశ్చయః ।
సంప్రదాయాగతజ్ఞానో లోభదంభవివర్జితః ॥

లింగాంగస్థలభేదజ్ఞ షట్స్థలజ్ఞానతత్పరః ।
దీక్షాకర్మాదికుశల షడధ్వజ్ఞానవత్సలః ॥

అన్నం—అట్లు మీరు కనఁబరచినచో వారేల నప్పుకొనరు?

పండి—నారాయణమునందే॥ యో వేదాదౌస్వరః ప్రోక్తో వేదాన్తేచ ప్రతిష్ఠితః । తస్యప్రకృతిలీనస్యయఃపరస్సమహేశ్వరః॥ అను శ్రుతి ప్రణవము మహేశ్వరవాచకమేయని నిర్ధారణచేసినది. ఇంకేమి కావలయు?

అన్నం—ఆచార్యులవారూ? ఇది మీకు సమ్మతమేనా?

ప్రతి—ప్రణవము మహేశ్వరపరమని శ్రుతి చెప్పినమాట నిజమే కాని మామతస్థులు మహేశ్వరపదము నారాయణుని బోధించునని యంగీకరించుచున్నారు.

పండి—మీమతస్థులెట్లయిన నంగీకరింతురుగాక. అది మాత్రము న్యాయ్యముగాదు.

అన్నం—అదియేల?

పండి—శ్లో॥ మహేశ్వరస్త్ర్యంబకఏవనాపరః॥ అని మొదలుగామహాకవులును, ని॥ శివశ్శూలీమహేశ్వరః॥ అని మొదలుగా నిఘంటుకారులును మహేశ్వరపదము శివునందు రూఢమని నిర్ణయించియున్నారు.

అన్నం—ఆపదము యోగరూఢమేయగుగాక. అవసరమైనప్పుడాపదమును యౌగికముగా నారాయణపరమని యంగీకరించినం దప్పేమి?

పండి—యోగరూఢమైనపదమునకు యోగశక్తి, రూఢశక్తి యను రెండు శక్తులనుబట్టి శివుఁడను నర్థము సిద్ధించుచుండ నీయర్థమును గ్రహింపక ఒక్క యోగశక్తినిబట్టి యౌగికముగా నారాయణపరమని సాధించుట యన్యాయ్యము. శక్తిద్వయానుగ్రహలాభే ఏకశక్తిగ్రహణమన్యాయ్యం అని శాస్త్రకర్తలు నిర్ణయించియున్నారు.

అన్నం—ప్రణవము శివవాచకమేగానీ? ఎట్లయినను మాసిద్ధాంతమునకు బాధ యేమాత్రయు లేదు. కాని యిందొక్క విశేష స్ఫురించుచున్నది.

ప్రతి—అది యేది?

అన్నం—ప్రణవము శివవాచకము కావునని కాబోలు? మా వేదారంభమున శివవాచకపదమును మాత్రమె యుచ్చరి జాలదని విష్ణువాచకపదమైన హరి పదమును గూడ హరిః ఓం అని యుచ్చరించుచున్నారు. దీనింబట్టి హరి లిద్దఱు వేదారంభమున స్మరింపఁబడుట యుచితమేగదా?

పండి—మీరు చేయుపని మీకు నుచితముగా నెట్లు దోపకుండును

అన్నం—ఇది యనుచితమెట్లగును ?

పండి—వేదమునకు మొదట ప్రణవము నుచ్చరింపవలయునని కలదు. అట్లుండ దానితో సమానార్థకమైన హరపద నుచ్చరించుట యుచితమే యగుగాని, హరిః అని య మీకు నెట్లైన దోపనీ? యవిహితము మాత్రముగాకమా

అన్నం—ఆచార్యులుగారూ, ప్రణవము విష్ణువాచకమనుటకు ప్రమాణము దేనిని కనఁబరుపఁ జాలకపోయితిరి. ఆరాధ్య వారుకనబరిచిన శ్రుతిప్రమాణములనుబట్టి ప్రణవ వాచకమెయని యేర్పడియెనుగదా ?

ప్రతీ—ఆరాధ్యులవారి సిద్ధాంతమునకు మీరుమెచ్చవలసినదే. వీరే మాసంఘమున నిలిచిరేని వీరివాదమేమయియుండును

అన్నం—మీసంఘముతోనేల? రేపటిదినము నేనవీరిమతము ఖ చెద.చూచుదురులే. ఈనాడు మట్టమధ్యాహ్నముకావచ్చె ఇంతటితో సభ ముగింతములెండి. (అనియందఱు నిష్క మింతురు)

ఇది ద్వితీయాహ్నికము.

## మతవినోదచర్చ.

### తృతీయాహ్నికము,

(అందఱుతిరిగి సమావేశమగుదురు)

అన్నం—ఆచార్యులుగారూ, ఆరాధ్యులవారిని నేను కొన్ని ప్రశ్నము లడిగి వారిమతము బీభత్సరసాస్పదము గావింతుగానిమీ రాయిరు వురకు మీరలు మాధ్యస్థ్యము చేయవలయునుడీ ॥

ప్ర—తనలో (వీరిలో నెవరిమతము బీభత్సమైన మనకుమంచిదే అని ఉబ్బిపడుచు) త్వరగా నుపక్రమించుడు,

అన్నం—ఆరాధ్యులుగారూ, మీమతమునందు దేవతాంతరమును పూజించుట, దేవతాంతరనామము నుచ్చరించుట మొదలగు నవి యంగీకరింపఁబడునా ?

పండి—అంగీకరింపఁబడవు.

అన్నం—దానికిఁ గారణమేమి ?

పండి—వేదవిధియట్లుండుటయె గారణము.

అన్నం—వేదమున నెందేని దేవతాంతరమును బూజింపరాదని, దేవ తాంతరము నుచ్చరింపరాదనియున్నదా?

పండి—అధర్వశిఖయందు, శివఏకోధ్యేయశ్శివంకర స్సర్వమన్య త్పరి త్యజ్య అనియున్నది. దేవతాంతరమును వదలిపెట్టి శివుని మా త్రమె యుపాసింపవలయునని యర్థము. ఇట్లుండ, శివేతరదేవ తల నెట్లుఁ బూజింపనగును?

అన్నం—అట్లేని, నిత్యనైమిత్తిక కర్మములయందు దేవతాంతర భజ నము గలదుగాన మీమతమున నిత్యనైమిత్తిక కర్మములు లోపింపవా?

పండి__ఏవియు లోపింపవు.

అన్నం__నిత్యనైమిత్తికములలో మీామతమునకు విరుద్ధమగు దేవతాం తరభజనము ప్రాపింపదా?

పండి__ప్రాపింపదు.

అన్నం__ఎట్లు?

పండి__వేదము లీశ్వరాజ్ఞారూపములై. గాన వానిలో నిత్యనైమిత్తి ములయందు దేవతాంతరమును సేవింపుమని చెప్పిన యీశ్వ రాజ్ఞ నాచరింపగా నది యీశ్వరోపాసనముననె చేరుగాని యన్యదేవతోపాసమునఁ జేరదు.

రాజునుమాత్రమే సేవింతునను వీరభృత్యు నుద్దేశించి నాకుమారునెత్తుకొనుము, నామంత్రి చెప్పినపని యొనరింపు మని ప్రభువానతియిచ్చినప్పుడు వానికి రాజకుమారాదుల పరిచర్య చేయక తీరదు, అయిన నాపని రాజసేవయందే చేరునుగాని అట్లు చేరకపోదు.

ఎందైన మొదట రాజు భృత్యునుద్దేశించి నామంత్రి చెప్పిన పనిసేయుమని నియోగించి తరువాత నీవు నాసేవ చేయలేదని వానియందు లోపము నెంచునా? ఎంచడు. అట్లు డగా, ఈశ్వరుఁడు వేదమునందు నగ్న్యాదుల పరిచర్య చేయు మని యానతిచ్చి నీవు వేరొకని సేవించితివిగాన నాభక్తుఁడవు గావని దూరముసేయునా? చేయఁడు, కాఁబట్టి, నిత్యనైమిత్తిక కర్మములయందు దేవతాంతరము నుద్దేశించి, అగ్నయేస్వాహా అని మొదలుగా నాహుతులిచ్చినను వాఁడీశ్వరభక్తుఁడై యని పించుకొనును గాని దేవతాంతర భక్తుఁడనిపించి కొనఁడు. మాహా దానంజేసి భక్తికి లోపంబునురాదు. కావున నది మునకు విరుద్ధంబునుగాదు.

అన్నం—దేవతాంతర నామోచ్చారణాదికమును నిత్యనైమిత్తికముల యందంగీకరించినప్పుడు కడమసమయములయందంగీకరించినం దప్పేమి ?

పండి—రాజు తన భృత్యునుద్దేశించి యొరునిపని దీర్చుమని చెప్పినప్పుడు చేసినది రాజసేవయందె చేరుగాని తన యేలిక చెప్పకయె తనయిచ్ఛచొప్పున చేసిన యితరకైంకర్య మెన్నడైన రాజసేవలోఁ చేరునా? చేరదు. కావున కడమ సమయముల యందు దేవతాంతర భజనమంగీకార్యముగాదు.

అన్నం—దేవతాంతరములఁ దలంపమనుట కఠినవృత్తిగాదా? దాననె వీరశైవము పాషండమతమని పేరుగన్నది.

పండి—పతివ్రత పరపురుషుని ముఖము కన్నెత్తిచూడ దనుటయు నితరులకు కఠినవృత్తిగానె దోచును. దానికై పతివ్రత యేమిచేయగలదు ?

భట్టాచార్యులవారూ! పాషండపదమునకు నర్థమేమో విచారించినారా?

అన్నం—అదియె నాకుఁ దెలియదా? పాషండులనగా వేదములను ఖండించువారని యర్థముగాదా?

పండి—అట్లైని సర్వము వదలిపెట్టి శివునినే యుపాసింపవలయునను వేదవిధి నుల్లంఘించినకతన మీరు, మేము వైదికులమనియు వేదవిధిని శిరసావహించిన కతన శైవులు పాషండులనియు సిద్ధాంతము సేయుచున్నారేమి?

అన్నం—మీరు వైదికులనుచున్నారు. మేమెట్లును వైదికులమే. మా మతము వైదికముగాన ననాదిగా వైదికులను సంజ్ఞ మాకే చెల్లినది.

పండి—మీమతము వైదికమగుటనే మీకు వైదికులను సంజ్ఞ యే
 డినదా?

ప్రతి—లోకప్రసిద్ధమైన విషయమును గూర్చి వీరిని సిప్పుడడుగనే

అన్నం—లోకప్రసిద్ధమైనదేది?

ప్రతి—మీరు వైదికులనుటయే.

పండి—వీరి మతము వైదికమగుటనె వీరికి ననాదిగా వైదికులను పే
 గల్గినదా?

ప్రతి—లేదు. లేదు. వృత్తినిబట్టియె. వీరు చాలకాలమునుండి గ్రా
 పౌరోహిత్యమును వైదికవృత్తి నవలంబించి యున్నవారగుట
 వీరికి వైదికసంజ్ఞ యేర్పడియెను.

అన్నం—అట్లనుటకు గారణమేమి?

ప్రతి—పౌరోహిత్యము మీనడవడిలోనుండుటె గారణము.

అన్నం—మావారిలో నాగ్రహారికులు మొదలగువారెందఱు లే
 పౌరోహిత్యవృత్తి యందఱకు గలదా?

ప్రతి—అగ్రహారికులె గాదు. నేడు లౌకికవృత్తి నవలంబించి మీస
 దువ్వువారును పెక్కురున్నారు. అట్టివారికి వైదికసంజ్ఞ పె
 పెద్దలనాటిదిగదా?

అన్నం—ఎట్లైననేమి ? మా వైదిక సంజ్ఞయొక్క విచారమిప్పు
 దేనికి ?

ప్రతి—మీరుమితిదప్పి గర్వపడినదానికి.

అన్నం—ప్రకృతము విచారింపుడు.

పండి—పాషండులు వేదవిధి నవలంబించినవారా? లేకదాని నుల్లం
 చిన వారా ?

అన్నం—వేదవిధినుల్లంఘించినవారెయని రొప్పనక తీరదు.

పండి—చేసినవిచారమునుబట్టి శైవులు వేదవిధి నుల్లంఘించినట్లుగా
 మీరలవలంబించినట్లుగాని తేలినదా ?

ప్రతి—ఈరెండును వ్యతిరేకముగానె తేలినవి.

పండి—భట్టాచార్యులవారూ, నిఘంటుకారులు పాషండపదమునకు నేమని యర్థము వ్రాసిరో గమనించినారా?

అన్నం—పాషండాస్సర్వ లింగినః అని చెప్పియున్నారు

పండి—సర్వలింగినః అనగా నర్థమేమి?

అన్నం—సర్వేచ తేలింగినశ్చ సర్వలింగినః, లింగధారులందఱు నని యర్థము.

పండి—లింగి అని యున్నచో నెల్ల లింగధారియని యర్థము నంగీకరింతురా?

అన్నం—అట్లే యంగీకరింతుము.

పండి—మనుస్మృతి యందున్నట్టి

శ్లో॥ అలింగీ లింగివేషేణ యోవృత్తి ముపజీవతి ।
సలింగనాం వహ త్యేనస్తిర్యగ్యో నౌచజాయతే॥

అను శ్లోకమునందు, లింగిపదమునకు లింగధారియని యర్థము గ్రహింతురా?

అన్నం—ఆశ్లోకమునందు లింగియనఁగా బ్రహ్మచారియని యర్థము గ్రహించితిమి. బ్రహ్మచారిగానివాఁడు బ్రహ్మచారివేషముతో జీవించునెడ బ్రహ్మచారులయొక్క దోషమును పొందునని వ్యాఖ్యాత వ్రాసియున్నాఁడుగదా?

పండి—ఎవరైన వ్రాయనీ? అర్థముచితముగా నుండిననేగదా గ్రహింపవలయును.

అన్నం —ఆశ్లోకమునందు లింగి పదమునకు బ్రహ్మచారియనియర్థము గ్రహించినచో నందేమి యనౌచిత్య మున్నది?

పండి—బ్రహ్మచారి కానివాఁడు బ్రహ్మచారి వేషము ధరించుటదేనికి?

అన్నం—జీవనము కొఱకు. 'భిక్షాభ్రమణాదినాజీవతి' అని వ్యాఖ్యాత వ్రాసెను. భిక్షావృత్తితో జీవింపనెంచి బ్రహ్మచారి కానివాఁడు బ్రహ్మచారివేషము ధరించుట యేల సంభవింపదు?

పండి—ఇట్లు వృత్తికై బ్రహ్మచారివేషము నవలంబించువాఁడు ఇతర వర్ణస్థుఁడా? లేక ఇతరాశ్రమస్థుఁడా?

అన్నం—ఇతర వర్ణస్థుఁడనుట యుచితముగా లేదు. ఏలన, బ్రహ్మచారికానివాఁడు బ్రహ్మచారి వేషముతో ననుటంబట్టి యి[illegible]రాశ్రమస్థుఁడనియే గ్రహింపవలయును.

పండి—అట్లేని ఇతరాశ్రమస్థులలో నెవఁడుగా నుండవచ్చును.

అన్నం—గృహస్థుఁడు, వనస్థుఁడు, యతి యని మువ్వురు గలరు వారిలో నెవఁడో యొకఁడు అని గ్రహించిన నేమి?

పండి—వనస్థుఁడని గ్రహింపవచ్చునా?

అన్నం—అడవిలోనుండు వాఁడేల వచ్చును? గృహస్థుఁడో లే[illegible] యతియో అని గ్రహించుట యుచితము.

పండి—గృహస్థుఁడుగాని, యతిగాని బ్రహ్మచారివేషము నవలంబి[illegible]చుటకు గృహస్థునికన్నను, సన్యాసికన్నను వృత్తివిషయమై బ్రహ్మచారికి నెక్కుడు లాభమేమి గలదు?

అన్నం—భిక్షావిషయమున బ్రహ్మచారికి నధికార మెక్కుడుగాదా!

పండి—భిక్షాధికారము యతికి మాత్రము లేదా? అదిగాక, 'కాషాయదండమాత్రేణ యతిః పూజ్యో నసంశయః' అ[illegible] ప్రమాణమునుబట్టి యతిని చూడగానె పూజించి భిక్షనొ[illegible] దురుగాన యతియగువాఁడు వృత్తికై బ్రహ్మచారి వేష[illegible] ధరింపనవసరము కన్పట్టదు.

అన్నం—గృహస్థుఁడు కాగూడదా?

పండి—గృహస్థుఁడు నిజవేషముతో రాగానె అతిథిపూజ గా[illegible] సంతృప్తిగా భోజనము పెట్టునప్పుడు ఇల్లిల్లు భిక్షమెత్తు[illegible]టకై బ్రహ్మచారివేషము దాల్పవలసిన గ్రహచారమేల[illegible]

అన్నం—అతిథిపూజ నందఱు చేయుదురా? అది సంభవింపనప్పు[illegible] గృహస్థుఁడేమి చేయవలయు?

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ కొమరువెల్లి కాళయ్యగారు వరంగల్ | 12-0-0 |
| ,, రామిని మల్లయ్యగారు ... | 12-0-0 |
| ,, తుగ్గలపాటి వెంకటేశ్వరరావుగారు, బారిష్టరు, బెజవాడ | 10-0-0 |
| ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్నగార్లు, శికింద్రాబాదు | 10-0-0 |
| ,, కైలాస శరభయ్యగారు, ... | 10-0-0 |
| ,, బెల్దె రామన్న కుమారుడు, జగదీశ్వరయ్య ... | 10-0-0 |

## —॥ పోషకులు ॥—

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యవార్లంగారు, ఈమని | 6-0-0 |
| ,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని | 5-0-0 |
| ,, కామఋ్స రాజశేఖరరావుగారు, కరణం, నవాబుపాలెం | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రులుగారు, తొండపి | 5-0-0 |
| ,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల | 5-0-0 |
| ,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చుపేట | 5-0-0 |
| ,, భూపతి రత్నంగారు, వరంగల్ | 5-0-0 |
| ,, మల్లంపల్లి మల్లికార్జునుడుగారు, అయితంపూడిఅగ్రహారం | 5-0-0 |
| ,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ | 5-0-0 |
| ,, శ్రీపతిపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని | 5-0-0 |
| ,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు | 5-0-0 |
| ,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు | 5-0-0 |
| ,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్దిపేట | 5-0-0 |
| ,, ముత్యంపేట మల్లయ్యగారు ,, | 5-0-0 |
| ,, కాశేశ్వరం నాగభూషణంగారు ,, | 5-0-0 |
| ,, కొమరువెల్లి బాలరాజుగారు, వరంగల్ | 5-0-0 |
| ,, గర్రెపల్లి రామన్నగారు. ఖిడిదొడ్డి | 5-0-0 |

# ప్రకటనము.

ఆర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:- ఈ గ్రంథమునందు బ్రాహ్మణులు మొదలగువారు వేకువజామున నిద్రలేచినది మొదలుకొని రాత్రి పండుకొనునందాక చేయనగు స్నానసంధ్యాది సకలధర్మములకు వైద్యశాస్త్రప్రామాణ్యమును బట్టి ఆరోగ్యరూపమగుప్రత్యక్షఫలము కలదని ఋజువు చేయఁబడియున్నది. వెల రు ౧-౦

కారణోత్తరమను దివ్యాగమము:-ఇయ్యది శైవుల లింగధారణము మొదలగువానియెడలగల సకలసంశయముల వారించు నిరుపమానమైనది. వెల రు ౧-౦

ఆహ్నికవిధి:-ఇందు స్నానము సంధ్య మొదలుకొని శివపూజవరకుగల సకల నిత్యకర్మములు సప్వరాంధ్ర ప్రయోగములు గలవు. వెల రు -౮-

మకుటోత్తరము అను దివ్యాగమము:- ఇందు శివపూజా విధానములు, శైవాంత్యేష్టి విధానము మొదలగు ననేక విశేషములు గలవు. వెల రు ౧-౮

బ్రహ్మతర్క స్తవము:- శ్రీమదప్పయ దీక్షిత విరచితము ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, స్మశానవాసిత్వము, బాణాసురయుద్ధమున నోడిపోయెనన్న దానికి సమాధానము మొదలగు ననేక విషయములు గలవు. వెల రు ౧-౦

మహాశివపూజా విధి:- ఇయ్యది లింగనిరీక్షణమున వినియోగించు దశావధాన విధానముతోను, సప్వరాంధ్రప్రయోగములతో శాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦-౮

ధర్మసంగ్రహము అంత్యేష్టికాండము:- ఇందు శైవకులాచారసమాధ్యారాధనవిధులు శాస్త్రసిద్ధములని పలువిధముల నిరూపింపబడియుండుటెగాక, అపరకాండ సందర్భమునగల సర్వవిధకృత్యములకుఁదగు ప్రమాణముల గనబరిచి సకల సంశయములు వారింపఁబడెను. ఆంధ్ర తాత్పర్యసహితము. వెల రు ౨-౦

వలయువారు:— ముదిగొండ నాగలింగశాస్త్రి

రామలింగేశ్వర పేట, తెనాలి. అని (వ్రాయుడు)

Reg. No. M- 2284.

శ్రీ

శివాయ గురవేనమః

# శైవరహస్యబోధిని.

ఇది

శ్రీ దేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జితాసార్
శ్రీ కంచుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని
సాహాయ్యమున వెలువడుచు
శైవధర్మములను, వాని ప్రామాణ్యమును దెలుపు
మాసపత్రిక.

| సంపుటము 5 | విభవనామ సంవత్సర శ్రావణమాసము. | సంచిక 5 |
|---|---|---|

సంపాదకుడు:-ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।
విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ।
అశేషశం. కామయపంక శోధినీ।
జయత్యియం శైవరహస్యబోధినీ।



తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

చందా సం॥ రు 2-0-0.

1928.

## శాశ్వత ప్రధాన పోషకులు.

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగ మయ్యవార్లగారి కు
నాగమల్లయ్య అయ్యవార్లగారు. సిద్దిపేట
కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, రామన్నవగ్గెరా సిద్దిపేట

### —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారీకులు

1 భండారు మల్లిఖార్జునరావుగారు
2 భండారు వీరభద్రరావుగారు
3 భండారు వీరరాజుగారు } 60—0—0
4 భండారు వీరబసవరాజుగారు
5 భండారు చెన్నబసవయ్యగారు
6 భండారు చిన మల్లిఖార్జునుడుగారు

### —: ప్రధానపోషకులు :—

మరాశ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రిలుగారు సికింద్రాబాదు
,, శివలంక తాయన్నగారు, పోణంగి
,, ముదిగొండ వీరభద్రయ్య అయ్యవారుగారు, ఈచని
,, శివపురపు రాజయ్యగారు, శికింద్రాబాదు
,, కోడిమేల భోగసోమలింగారాధ్యులుగారు, శ్రీగురుత్వ సంస్థానం వరంగల్
,, శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు నిర్మల
,, కాశీనాథుని అల్లమయ్య అయ్యవారుగారు యలమర్రు అగ్రహారం
,, శివలెంక శంభులింగం అయ్యవారుగారు బెజవాడ
,, ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్

శివస్యచ గురోర్భక్తశ్శివైకాహితమానసః ॥
శివార్చనాసక్తచిత్తశ్శివధ్యానైక తత్పరః ॥ ౧౨

తా॥ శైవసిద్ధాంత మంతయుఁదెలిసినవాఁడును, ప్రతిష్ఠామంత్రముల నెఱింగిన వాఁడును. మోక్షపరుఁడును, దయాశాలియు, వైరాగ్యవంతుండును, మాత్సర్య రహితుండును, క్రియాపాదము మొదలుకొని జ్ఞానపాదమువరకు శివాగమముల నెఱింగినవాఁడును. పితృపితామహాది సంప్రదాయక్రమమున జ్ఞానమునార్జించినవాఁడును. లోభాదిరహితుండును, లింగాంగ స్థలవేదియు, షట్స్థల జ్ఞానయుతుండును, దీక్షాదికృత్యముల యందుఁ గౌశలముగలవాఁడును, షడధ్వజ్ఞానము గలవాఁడును, శివునియందును, గురునందును భక్తిగల్గువాఁడును, శివైక నిష్ఠగలచిత్తముగలవాఁడును, శివారాధనపరుండును, శివధ్యానయుతుండుననగు వాఁడు గురువు కాదగును.

మూ॥ గురుర్గృహస్థఏవస్యా న్నకదాచిద్యతీర్భవేత్ ।
వానప్రస్థయతీనాంతు గురుత్వం నిష్ఫలంభవేత్ ॥ ౧3

తా॥ గురువు గృహస్థుండుగానుండవలయునెగాని, సన్యాసి గురువు కాఁగూడదు. వానప్రస్థులను, యతులను గురువులనుగాఁ జేసికొనినచో నిష్ప్రయోజనమగును.

మూ॥ గురవోబహవస్సంతి శిష్యవిత్తాపహారకాః ।
దుర్లభోఽయం గురుర్లోకే శిష్యహృత్తాపహారకః ॥ ౧౪

తా॥ లోకమునందు శిష్యుల విత్తము నపహరించు గురువులెందఱేని కలరుగాని శిష్యుని హృదయతాపమును పోగొట్టు గురువు దొరకుట యరిది.

మూ॥ సంవిత్తిజననం సత్యం పదానంద సముద్భవం ।
తత్తత్త్వం విదితం యేన సఏవానంద దర్శకః ॥ ౧౫

తా॥ జ్ఞానము చేతనే తెలిసికొనఁదగినదియు, పరమా[illegible] జనకమైనదియు, నగు శివతత్త్వము నెఱింగినవాఁడె శిష్యు[illegible] నానందము నొసఁగగలఁడు.

మూ॥ సవుర్నామమాత్రేణ సువిత్తిరహితస్తుయః।
అన్యంనతారయేదజ్ఞః కిం శిలాతారయేచ్ఛిలాం॥
ఏషాతన్నామమాత్రేణ ముక్తిర్వైనామమాత్రికా।
వైైఃపునర్విదితం తత్త్వం తేముక్తామోచయంత్యపి॥

తా॥ రాయి వేరొకరాతిని నీటినుండ లేవదీయలేని చంద[illegible] జ్ఞానములేక పేరునకు మాత్రము గురువైనవాఁడు వేరొకని [illegible] జేయనేరఁడు. గురులక్షణములులేక గురువను పేరుమాత్రము ధ[illegible] వానివలన ముక్తియను పేరుమాత్రమే సిద్ధించుగాని నిజముగా [illegible] పదు. తత్త్వజ్ఞానముగలవారు తాము ముక్తులుగాన నొరులను[illegible] బంధమునుండి తరింపఁజేయఁజాలుదురు.

మూ॥ తత్త్వహీనేకుతోబోధః కుతోహ్యాత్మపరిగ్రహః॥
పరిగ్రహావినిర్ముక్తోపశురిత్యభిధీయతే।
పశుభిఃప్రేరితశ్చాపి పశుత్వంనాతివర్తతే॥
తస్మాత్తత్త్వంవిదిత్వైహముక్తోమోచకఇష్యతే॥

తా॥ జ్ఞానములేనివానికి శివతత్త్వమెట్లు లభించును. శివత[illegible] నెఱుగనివాఁడు పశువనియె చెప్పఁబడును. జ్ఞానములేనివాఁడు [illegible] వుగా వేరొకనికి జ్ఞానమెట్లు కలుగును? కావున శివతత్త్వము[illegible] తాను ముక్తి నార్జించికొనినవాఁడె యొరులకు బంధముక్తి [illegible] జాలుగాన నట్టివాఁడె గురుఁడు కాదగును.

మూ॥ సర్వలక్షణయుక్తోపి సర్వశాస్త్రవిదవ్యయం॥
సర్వోపాయవిధిజ్ఞోపితత్త్వహీనస్తునిష్ఫలః॥

తా॥ సర్వలక్షణములుగలవాఁడైనను, సర్వశాస్త్రములు [illegible] సినవాఁడైనను, సర్వోపాయముల నెఱింగినవాఁడైనను శివత[illegible] నెఱుంగనిచో ప్రయోజనము లేదు.

మూ॥ వ్యసనీవామనః కుబ్జోః కోపీచ కుటిలశ్వరః ॥ ౬౦
చపలోఽధికహీనాంగః పాపీయాన్సాచకోఽన్యజః ॥
వ్యాధిగస్తార్కి కశ్శూరః కాకనాదో బకవ్రతీ॥ ౬౧
గురుదేవద్విజాతీనాం నిందకో వృషలీపతిః॥
లంబోష్ఠోవక్రనాసశ్చ గలీనఃకలహప్రియః॥ ౬౨
పరాపవాదశీలశ్చ వర్జనీయో గురుస్మృతః ॥

తా॥ దుర్వ్యసనములుగలవాఁడును, పొట్టివాఁడును, కోపియు వక్రబుద్ధియు, నీచుఁడు, చపలచిత్తుఁడు, హీనాంగములు అధికాంగములుగాని గలవాఁడును, పాపకర్మకారియు, కొండెములు చెప్పువాఁడును కుండగోళకులలోఁ జేరినవాఁడును వ్యాధిగ్రస్తుండును, తార్కికుండును, శూరుండును, కాకస్వరము గలవాఁడును, బకవ్రతము గలవాఁడును, గురువును, దేవతల విప్రులను నిందించువాఁడును, శూద్రజాతి స్త్రీలతో సంపర్కముగలవాఁడును, వ్రేలాడుచున్న పెదవులు, వంకరముక్కు గలవాఁడును, కలహకారియు, పరుల నిందించువాఁడును, ఇట్టివాఁడు గురువు కాఁదగఁడు.

బకవ్రతమనగా,

శ్లో॥ అధోదృష్టిర్నైష్కృతికః స్వార్థసాధన తత్పరః ।
శఠోమిథ్యావినీతశ్చ బకవ్రతచరోద్విజః ॥

తాను వినయవంతుండని లోకమునమ్ముటకై నేలచూపు చూచుచు, తనపని నెరవేర్చుకొనుటయందును, ఇతరులపని చెరుచుటయందును నిపుణుఁడైనవాఁడు బకవ్రతము గలవాఁడని మనుస్మృతియందుగలదు. కొంగ చేపలను బట్టనెంచి మునివలె కదలక యుండును. అట్టివృత్తికి బకవ్రతమని పేరు.

మూ॥ యస్యానుభవపర్యంతా మతిస్తత్త్వే ప్రతిష్ఠితా॥ ౬3
తస్యావలోకనాద్యేశ్చ పరానందోఽభిజాయతే॥

తా॥ ఎవ్వనిచిత్తము తత్త్వానుభవముగలిగి శివతత్త్వముననిలిచియుండునో అట్టిగురునిసేవచే బ్రహ్మానందము గలుగును.

మూ॥ తస్మాద్యస్యైవసంపర్కాత్ప్రబోధానందసంభవః॥
గురుంతమేవవృణుయాన్నాపరం మతిమాన్నరః॥

తా॥ కాఁబట్టి యెవ్వని సేవింపగా జ్ఞానానందములు గలుగు
అట్టివానినే గురునిగాఁ జేసికొనవలయును.

మూ॥ తత్రాదావుపసంగమ్యబ్రాహ్మణం వేదపారగం॥
గురుమారాధయేత్ప్రాజ్ఞం సుభగంప్రియదర్శనం॥
సర్వాభయప్రదాతారం కరుణాక్రాంతమానసం॥
తోషయేత్తం ప్రయత్నేన మనసాకర్మణాగిరా॥
తావదారాధయేచ్ఛిష్యః ప్రసన్నోసౌ భవేద్యథా॥
తస్మిన్ప్రసన్నే శిష్యస్య సద్యఃపాశక్షయోభవేత్॥

తా॥ బ్రాహ్మణుఁడును, వేదవిదుండును, తత్త్వవిదుం
దయాశాలియు నగు గురునొద్దకుఁ బోయి యాయనను మన
కాయకర్మములతో నారాధించుచు సంతోషపెట్టవలయు. శిష్యు
అనుగ్రహము కలుగునందాక గురుని సేవింపవలయు. గురుండను
హింపఁగానె శిష్యునకు నప్పుడె పాశముక్తి సంభవించును

మూ॥ తస్మాద్ధనానిరత్నాని క్షేత్రాణిచగృహాణిచ॥
భూషణానిచవాసాంసియానశయ్యాసనానిచ॥
ఏతానిగురవేదద్యాద్భక్త్యావిత్తానుసారతః॥
విత్తశాఠ్యంనకుర్వీత యదిచ్ఛేత్పరమాంగతిః॥
సఏవ జనకో మాతా భ్రాతా బంధుజనస్స్వయం॥
సఖామిత్రంచయత్తస్మాత్సర్వంతస్మైనివేదయేత్॥

తా॥ కావున ధనములను, రత్నములను, క్షేత్రములను, గృ
ములను, భూషణములను, వస్త్రములను, వాహనములను, శయ్య
ఆసనములను శక్తికొలది భక్తితో గురునకు నియ్యవలయు.
నుత్తమగతి కావలయునను కోరికగలవాఁడు గురువునెడ ధనలో

వహింపఁగూడదు. తనకు తల్లి, తండ్రి, తోఁబుట్టువు, బంధుజనము, స్నేహితుఁడు మొదలుగా సర్వము గురువే యగుగాన తనకుగల సర్వమును గురునకు నర్పింపవలయు.

మూ॥ నివేద్య పశ్చాత్స్వాత్మానం సాన్వయంసపరిగ్రహం ॥ 20
సమర్ప్యసాదరంతస్మై నిత్యంతద్వశగోభవేత్ ॥

తా॥ ఇట్లు తనకుగల సర్వమును గురునకు నర్పించి మఱియు తనను, తనపరివారమును గూడ గురునకు నివేదించి యెల్లప్పుడు గురునివశమున నుండవలయు.

మూ॥ యదాశివాయస్వాత్మానం దత్తవాన్ దేశికాత్మనే ॥ 21
తదాశైవో భవేద్దేహీ నతతోస్తి పునర్భవః ॥
దేశికాకృతిమాస్థాయ పశోఃపాశాన శేషతః ॥ 23
ఛిత్వాపరంపదందేవో నయత్యేనమసంశయం ॥

తా॥ శిష్యుడు గురురూపుఁడగు శివునకు తననెప్పుడర్పించునో అప్పుడెవాఁడు శైవుఁడగును. కాన వానికి పునర్జన్మములేదు. శివుఁడె గురురూపము నవలంబించి యజ్ఞానియగు శిష్యుని పాశములనెల్ల భేదించి పరమపదము చేర్చును. ఇదియథార్థము.

మూ॥ గురుస్తు స్వాశ్రితం శిష్యంపరీక్షేద్వత్సర మేకకం 24
బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం ద్విత్రివర్షక మేవవా॥
ప్రాణద్రవ్య ప్రదానాద్యై రాదేశైశ్చ సమానమైః॥ 25
ఉత్తమాంశ్చాధమే కృత్వా నీచానుత్తమ కర్మణి॥

తా॥ గురువు తన్నాశ్రయించిన శిష్యుని నొకసంవత్సరము పరీక్షింపవలయు. లేక బ్రాహ్మణుని నొకవత్సరము, క్షత్రియుని రెండువత్సరములు, వైశ్యుని మూడువత్సరములు నీవిధమున నైన పరీక్షింపవలయు. ఎట్లనిన, ప్రాణములను, ద్రవ్యమును వ్యయఁబరచునవియు. కష్టకరములు నగు నాజ్ఞల చేతను, ఉత్తములను నీచకృత్యముల

యందును, నీచులనుత్తమ కృత్యములయందును నిట్లు హెచ్చుతగ్గులు గల పనులుచెప్పి శిష్యులను గురువు పరీక్షింప వలయు.

మూ॥ ఆకృష్టాస్తాడితావా యే విషాదం నైవయాంత్యపి॥ 26
తేయోగ్యాస్సతతం శుద్ధాశ్శివ సంస్కారకర్మణి॥

తా॥ గురువు, ఈడ్చినను. కొట్టినను నెవ్వారలు దుఃఖపడరో, అట్టి నిర్మలచిత్తులె శివసంస్కారమునకు నర్హులగుదురు.

మూ॥ అహింసకా దయావంతో నిత్యముద్యుక్తచేతసః॥ 22
అమానినో బుద్ధిమంతస్త్యక్తస్పర్ధాః ప్రియంవదాః॥
ఋజవోమృదవస్స్వచ్ఛావినీతాస్థిరచేతసః॥ 28
శౌచాచారసమోపేతాశ్శివభక్తాద్విజాతయః॥
ఏవంవృత్తసమోపేతావాఙ్మనఃకాయకర్మభిః॥ 25
శోధ్యాబోధ్యాయథాన్యాయ్యమితిశాస్త్రవినిశ్చయః॥

తా॥ సర్వభూతములకు బాధయొనర్పనివారును, దయాశీలురును, ఎల్లప్పుడు నుత్సాహవంతులును, గర్వరహితులును, బుద్ధిశాలులును, మాత్సర్యరహితులును, ప్రియభాషులును, ఋజుస్వభావులును, సుకుమారులును, నిర్మలచిత్తులును, వినయవంతులును, [illegible]చిత్తులును, సదాచారపరులును, శివభక్తులును. వాఙ్మనఃకాయ[illegible]ములతో నీయన్నిలక్షణములు గలవారు షడధ్వశుద్ధిచేసి తత్త్వ[illegible] బోధింప నర్హులని శాస్త్రములన్నియు నిర్ణయించియున్నవి.

మూ॥ శివేరుష్టే గురుస్త్రాతా గురౌరుష్టేనిజసద్గురో॥
త్రాతాశివస్తదేతస్మాద్గురుపూజారతోభవేత్॥

తా॥ శివుఁడు కోపించినను గురుఁడు రక్షించును. కాని గురువు కోపించెనేని శివుఁడు రక్షింపఁడు. కాన ముఖ్యముగా గు[illegible] పూజించుచుండవలయు.

మూ॥ యస్స్వస్య గురుపూజాంతు త్యక్త్వాశివపదంయజేత్॥
పరాఙ్ముఖశ్శివస్తస్యనరకం సంప్రయచ్ఛతి॥

ఏతత్సర్వం పరిజ్ఞాయ పూజాం కుర్యాద్గురోస్స్వయం॥ ౨౩
గురుపూజాభిసంతుష్టస్స్వసాయుజ్యం ప్రియచ్ఛతి॥

తా॥ ఎవ్వఁడు గురునిపూజింపకయె శివుని పూజించుచుండునో వానికి శివుఁడు విముఖుండై నరకమునె యొసఁగును. కావున గురునకు దాను తప్పక పూజయొనర్పవలయు. గురుని పూజించుచుండు నెడ శివుండు సంతసించి భక్తునకు తన సాయుజ్యముక్తి నొసఁగును.

మూ॥ కార్తికే సోమవారేచ పుష్పైః పత్రైఃఫలైర్యజేత్। ౨౩
శక్తశ్చేత్తస్య పూజాయాం మాసమేక మతంద్రితః॥
త్రికాలంవాథ షట్కాలం ప్రదోషేవా సమర్చయేత్॥ ౨౪

తా॥ కార్తికమాసమునగాని, సోమవారమునాడుగాని పుష్పపత్రాదులతో గురువును పూజింపవలయు. శక్తిగలవాడైనచో కార్తికమాసము నెలదినములును ప్రతిదినమున ముమ్మాఱుగాని, ఆరుమార్లుగాని, ప్రదోషకాలమున నొక్కమాఱుగాని పూజింపవలయు. ఎట్లనిన,

మూ॥ భూతిరుద్రాక్ష భూషాఢ్యః పంచాక్షర మనుంజపన్।
త్వరయా గురుసామీప్యంగతః స్తత్పాదపంకజే। ౨౬
నమస్కృత్వానయేద్భక్త్యా స్వగృహంప్రతితం గురుం॥

తా॥ శిష్యుఁడు భస్మరుద్రాక్షములను ధరించి, పంచాక్షర మంత్రము జపించుచు, గురునిసన్నిధికరిగి వారిపాదములకు నమస్కరించి, గురుని తనయింటికి తీసుకొని రావలయు. ఎట్లన,

మూ॥ ఆందోళికాయామారోప్య గజేవాపి తురంగమే। ౨౭
అనుగచ్ఛేత్స్వయం భక్త్యా వాద్యఘోష సమన్వితః॥

తా॥ పల్లకిలోగాని, ఏనుగుమీదగాని, గుఱ్ఱము మీదగాని గురుని కూర్చుండఁబెట్టి తాను వారితోగూడ నడచివచ్చుచు వాద్యఘోషములతో తీసికొని రావలయును.

మూ॥ గృహం నీత్వాగురుంషశ్చా త్ప్రాళయం స్తత్పదద్వయం।
తేనోదకేన శిరసిసంప్రోక్ష్య స్వజనైస్సహా।
దత్వాహస్తావలంబంచ తతోనీత్వా గృహాంతరం।
ప్రకల్ప్య చాసనంశ్రేష్ఠం నివేశ్యప్రీతిపూర్వకం।
యథావిధ్య వధానేన పూజయేద్గురు మవ్యయం॥

తా॥ ఈవిధమున తనయింటికి దీసికొనిపోయి గురుని పా
గడిగి యాజలమును తన బంధు జనములతోగూడ శిరమున జ
వారిచేయి బట్టుకొని, లోపలియింటిలోనికి దీసికొనిపోయి, శ్రే
ఠాసనమువిూదఁ గూర్చుండఁజేసి, శాస్త్రోక్తవిధానములో స
చిత్తుఁడై గురుని పూజింపవలయు.

మూ॥ గురోస్సమర్చాసమయే దీపానష్టోత్తరం శతం।
షట్త్రింశద్వాయథాశక్తిజ్వాలయే దస్వహంబుధః॥

తా॥ గురుని పూజించునప్పుడు ప్రతిదినము నూటయె
గాని. ముప్పదియాఱిటినిగాని దీపములను శక్తికొలది వెలిగింప

మూ॥ త్రయోదశ్యోః పూర్ణిమాయాం చతుర్దశ్యాంసి తేతరే
సహస్రమయుతంవా పిలక్షంవాజ్వాలయేత్సునః॥

తా॥ కార్తికమాసమున గురుపూజసేయునప్పుడు
ములలోని త్రయోదశులు, పూర్ణిమ, మాసశివరాత్రి అను
యందు వేయిగాని, పదివేలుగాని, లక్షగాని దీపములను
వలయు.

మూ॥ త్రియోదశ్యాదిషుగురుమర్చయేచ్ఛాన్యమంటపే।
ఉక్తం యద్గురుణాపూర్వంశక్యంవాశక్యమేవవా।
కరోత్యేవహిపూతాత్మాపాత్రైరపిధనైరపి॥

తా॥ త్రయోదశి మొదలుగా నీచెప్పిన తిథులయందు
మున నిర్మితమగు శూన్యసింహాసనమునందు నునిచి గురుని

వలయును. చేయ శక్యమైనను, శక్యముగాకున్నను ప్రాణములచేతను ధనములచేతను గురునిమాట చెల్లింపవలయు.

మూ॥ శరీరాద్యర్థకం సర్వం గురోర్దద్యాత్సశిష్యకః॥ ౯3
శివభక్తాన్సపత్నీకాన్పుత్రాన్యసహాద్పృథగ్వ్రతః॥
పూజయేద్భోజనాద్యైశ్చ పంచవాదశవాశతం॥ ౯౪

తా॥ శిష్యుఁడు శరీరమును, అర్థమును, ప్రాణమును, సర్వమును గురునకు నర్పించి తన భార్యతోఁగూడ ఐదుగురినో, పదుగురినో, నూర్వురనో సపత్నీకులగు శివభక్తులను బూజింపవలయు,

మూ॥ అగ్రపాకం నివేద్యాగ్రే భుంజీయాద్గుర్వనుజ్ఞయా॥
ధనరూపైః పాదుకాద్యైః పాదసంగ్రహణాదిభిః। ౯౫
స్నానాభ్యంజననైవేద్య భోజనైశ్చాపి పూజయేత్॥

తా॥ చేసిన పాకమునందు ముందుగా గురునిభుజింపఁజేసి గురునసుజ్ఞచే తాను భుజింపవలయు. ధనము నర్పించుట, పాదుకలు మొదలగు పరికరముల నొసఁగుట, కాళ్లుపిసుకుట, స్నానము చేయించుట, అభ్యంజన స్నానము చేయించుట, సకలకృత్యములు గురునకు దెలిపిచేయుట, భుజింపఁజేయుట యీ మొదలగు వానితో గురుని సంతోషపెట్ట వలయు

మూ॥ సుతారయతిసంసారాద్గురుర్వై సాధకః పితా। ౯౬
గురుపూజైవ పూజాస్యాచ్ఛి వస్యపరమాత్మనః॥
గురుశేషంతుతత్సర్వ మాత్మశుద్ధి కరంభవేత్॥ ౯౭

తా॥ సంసారమునుండి తరింపఁజేయుగాన గురుఁడె తండ్రియనం బరగు. గురుపూజ శివపూజయెయగును. గురుశేషంబంతయు తనకు పావిత్ర్యజనకంబునగును.

మూ॥ తస్మాద్గురుముఖాత్కర్మ జ్ఞానంచాపి విశేషతః।
జ్ఞాత్వాకర్తవ్య మఖిలం భోగమోక్షావ లబ్ధయే॥ ౯౮

తా॥ కాఁబట్టి కర్మమునుగాని. జ్ఞానమునుగాని, గురువుచెప్పిన చొప్పున జేయునెడ భోగమోక్షములు లభించును.

మూ॥ గురుప్రసాదపాత్రం యస్సహి మోక్షాయ కల్పతే।
నముక్తిమూల మన్యద్ధి విహాయగురుసత్కృపాం॥ ౯౯

తా॥ గురునను గ్రమునకుఁ బాత్రుఁడైనవాఁడే మోక్షమునొందును. గురునిదయ వినాగా ముక్తిసాధకమైనది వేరొక్కటిలేదు.

మూ॥ గురురూపం సురారాధ్య లోకానుగ్రహ కామ్యయా। ౧౦౦
ఆద్యమావరణం ప్రోక్తం కిమతశ్శ్రోతుమిచ్ఛసి॥

తా॥ దేవపూజ్యుడవగు నో బృహస్పతీ, లోకానుగ్రహము గోరినీవు గురురూపమైన ప్రథమావరణము వివరించితి ఇంకదేనిని వినఁ గోరెదవో తెలుపుము.

ఇతి శ్రీచంద్రజ్ఞానే ఉత్తభాగే
శివశాసనె
క్రియాపాదె
ద్వితీయః పటలః

---

## తృతీయ పటలః.

బృహస్పతిరువాచ = బృహస్పతి శివునిగానిట్లని యడిగెను.

మూ॥ అనంతజ్ఞాన నిలయ లోకానుగ్రహ తత్పర।
అనంతరుద్ర భగవన్నో భగవదనుగ్రహాత్॥

తా॥ అనంతమగు జ్ఞానమునకు నాధారమైనవాఁడవును. లోకానుగ్రహపరుఁడవును, భగవంతుఁడవును నగు ననంతరుద్రుఁడా! నీ యనుగ్రహంబునంజేసి కృతార్థుండనైతిని.

మూ॥ అసీమానంవరగురోర్ముఖమానంశ్రీమదాననాత్।
శ్రావంశ్రావంనిమగ్నోస్మినిర్భరానందవారిధౌ॥ ౨

తా॥ అంతములేని గురుని మహిమను మీముఖారవిందము నుండి విని విని యపారమగు నానందసాగరమున నిమగ్నుండనైతిని.

మూ॥ అథద్వితీయం శుశ్రూషుశ్శివలింగం సుపావనం।
తస్యరూపంమహాత్త్వంచ వదమేకరుణాకర॥ 3

తా॥ ఇఁకను ఇష్టలింగమను ద్వితీయావరణమును వినగోరు చున్నాఁడను. గాన నద్దాని రూపమును, మహిమను దెలుపుము.

అనంతరుద్రఉవాచ — నావిని యనంతరుద్రుఁ డిట్లనియె.

మూ॥ అహోనిబోధయిష్యామిమహాలింగస్యవైభవం
యజ్ఞాత్వాముచ్యతేజన్తురచిరేణబృహస్పతే॥ ౪
పూర్వమేకార్ణవేఘోరేనష్టేస్థావరజంగమే।
మధ్యేసముత్థితంలింగమైశ్వరంతైజసంపరం॥ ౫
జ్వాలామాలావృతందివ్యమప్రమేయమనామయం।
కల్పాన్తేతత్రలీయన్తేవర్తన్తే సర్వదేవతాః॥ ౬
హృదయేచైవగాయత్రీసర్వదేవోత్తమోత్తమా॥
లీయన్తేమూర్ధ్నివైవేదాస్సషడంగపదక్రమాః। ౭
జఠరేలీయతేసర్వం జగత్థావరజంగమం॥
పునరుత్పద్యతేయస్మాద్బ్రహ్మాద్యాశ్చ చరాచరం॥ ౮

తా॥ నీకుమహాలింగముయొక్క వైభవము దెలుపుచున్నాను. వినుము. ఇద్దానిం దెలిసికొనినవాఁడు నిస్సంశయముగ ముక్తినొందఁ గలఁడు. పూర్వకాలమునందు మహాప్రళయమున జంగమస్థావరా త్మకమగు జగమెల్ల నశించి. యొక్కటే మహాసముద్రముగా నుండి యున్నప్పుడు ఈశ్వరరూపంబును, తేజోమయంబును, జ్వాలామాలా

పరివృతంబును, అనంతంబును, ఆనందరూపంబును నగు మహాలిం
మావిర్భవింపగా సకలదేవతలు నాలింగమునందె లయమొందియు
దుచున్నారు. ఆలింగమునకు కుడివైపున బ్రహ్మయు ఎడమవైపు
నారాయణుండును, హృదయమునందు గాయత్రియు, శిరోభాగం
నందు, షడంగ పదక్రమములతో గూడిన వేదంబులును, గర్భమునం
చరాచరాత్మకమగు జగంబంతయు లయమొంది, తిరుగ సృష్ట్యారం
మునందు బ్రహ్మాది సకలదేవతలును సర్వజగంబును నమ్మహాలింగమ
నుండియే బైలు వెడలుచుండును.

మూ॥ అవ్యక్తం లింగమాఖ్యాత మనంత మజరం ధ్రువం॥
గుణత్రయం తదేవేశ స్సృజత్యవతి హంతిచ॥
తదేవ శివలింగం తు తస్యలింగం చతుర్విధం॥
పరోబిందుః పరోనాదస్త్వపరౌ బిందునాదకౌ॥
ఉపర్యధో భాగనిష్ఠాశ్చత్వారోపి సురార్చిత॥
అపరోబిందు నాదస్స్యా త్తదూర్ధ్వ మపరోధ్వగః।
తదూర్ధ్వంపరబిందుస్స్యాత్పరనాద స్తదూర్ధ్వగః॥
ప్రణవో వేదిరస్యాయం నాదోలింగాకృతిర్మునే।
బిందునాదమయేలింగే నిత్యం సన్నిహితశ్శివః॥

తా॥ అనంతంబును, జరామరణరహితంబును, గుణత్రయాత్మ
కంబునునగు మూలప్రకృతియే లింగమని చెప్పఁబడును. పరమే
రుండా ప్రకృతితోగూడియే సృష్టిస్థితిలయముల గావించుచుండు
లింగము మూలప్రకృతిరూపమైనను నీ ప్రకృతికిని, శివునకుం
యవినాభావసంబంధముంబట్టి రెంటికి భేదము లేదుగాన లింగ
శివుఁడని చెప్పఁబడును. ఈలింగమునందు పరబిందువు, పరనాదము
అపరబిందువు, అపరనాదము నని నాలుభాగములు గలవు.
మొదట అపరబిందువు, దానిమీద అపరనాదంబును, దానిపైన ప
బిందువు, దానిమీద పరనాదంబును నుండును. శివలింగమునకు ప్ర

వము పీఠంబును, నాదము లింగంబును నగును. ఇట్లు బిందునాదాత్మకమగు లింగమునందు నెల్లప్పుడు శివుండు సన్నిహితుండై యుండును

మూ॥ బిందునాదాత్మకం సర్వం జగత్స్థావరజంగమం।
బిందుశ్శక్తిశ్శివో నాదశ్శివశక్త్యాత్మకంజగత్॥ ౧౪

నాదాధారమయం బిందుర్బిందాధారమిదంజగత్।
జగదాధారభూతౌహి బిందునాదావ్యవస్థితౌ॥ ౧౫

బిందునాదయుతం సర్వం సకలీకరణంభవేత్।
సకలీకరణాజ్జన్మ జగత్ప్రాప్నోత్యసంశయం॥ ౧౬

బిందునాదాత్మకం లింగం జగత్కారణముచ్యతే।
తస్మాజ్జన్మనివృత్త్యర్థం శివలింగం ప్రపూజయేత్॥ ౧౭

తా॥ జంగమస్థావరాత్మకమగు సకలజగంబును బిందునాదస్వరూపమే యగును. వీనిలో బిందువే శక్తియు, నాదమే శివుండునుగాన జగమంతయు శివశక్త్యాత్మకమైయున్నది. నాదమే బిందువునకు నాధారంబును, బిందువే జగమునకు నాధారంబును నగుగాన బిందునాదములు జగమునకు నాధారములగును. బిందునాదములయొక్క సమ్మేళనమువలనంగాని జగం బేర్పడదు. కావున, బిందునాదరూపమైన లింగమే జగత్కారణమని చెప్పఁబడుచున్నది. ఆకారణమువలన జన్మపాశనివృత్తికై శివలింగమును బూజింపవలయు.

మూ॥ మాతా దేవీబిందురూపా నాదరూపశ్శివః పితా।
పితృభ్యాందత్తమైశ్వర్యం యథాభోగాయకల్ప్యతే॥ ౧౮
తయోరైశ్వర్యలాభార్థం శివలింగం ప్రపూజయేత్॥

తా॥ బిందురూపురాలైన దేవియే తల్లియు, నాదరూపుఁడగు శివుఁడే తండ్రియు నగుదురు. తలిదండ్రులొసఁగిన యైశ్వర్యము పుత్రునకు ననుభవనీయమగును. కావున వారిదగు నైశ్వర్యము

(ఈశ్వరత్వము) పొందఁగోరి శివశక్త్యాత్మకమగు లింగమును పూ
వలయు.

మూ॥ సాదేవీ జగతాంమాతా సశివో జగతఃపితా॥
పిత్రోశ్శుశ్రూషకే నిత్యంకృపాధిక్యంహి వర్ధతే।
కృపయా స్వగతైశ్వర్యం పూజకస్యదదాతిహి॥
తస్మాదంతర్గతానంద లాభార్థంమునిపుంగవాః।
పితృమాతృ స్వరూపంహి శివలింగం ప్రపూజయేత్।

తా॥ ఆదేవియే జగమునకుఁ దల్లియు, ఆశివుఁడే జగము
దండ్రియు నగుదురు. శుశ్రూష సేయువానియందు తలి దండ్రు
నెక్కువ దయగలిగి యుండును. కాన, తమనుఁ బూజించు
దయతో దమయందున్న యైశ్వర్యము నొసఁగుదురు. వారియ
నైశ్వర్య మానందమేగాన నట్టియానందము నొందఁగోరి పితృమా
స్వరూపమైయున్న శివలింగమును బూజింపవలయు.

మూ॥ నిష్కళం నిష్క్రియంశాంతం నిరవద్యం నిరంజనం।
నాన్యః పశ్యతి యద్విశ్వం నశృణోతి తదన్యథా॥
నాన్యద్విజానాతి తథాతన్మహా లింగముచ్యతే॥

తా॥ నిష్కళంబును, నిష్క్రియంబును, శాంతంబును
మంబును, నిస్సంగంబునునై చూచుటకు, వినుటకు, మనసుచే
కొనుటకు శక్యముగాని యేశివతత్త్వము గలదో అదియే మహా
మని చెప్పఁబడును.

మూ॥ ప్రత్యస్తమితభేదం యత్సత్తా మాత్ర మగోచరం।
వచసామాత్మ సంవేద్యం తన్మహాలింగ ముచ్యతే।

తా॥ భేదరహితమై, సత్తామాత్రమై, వాక్కులకు
ఆత్మసంవేద్యమైన బ్రహ్మతత్త్వమే మహాలింగమని చెప్పఁబడు

మూ॥ ఋతం సత్యం పరంబ్రహ్మ సచ్చిదానందలక్షణం॥
అన్యన్నపరమంబ్రహ్మ తదతోధ్యేయమాస్తికైః॥

తా॥ అసత్యపదార్థములకంటె వ్యతిరిక్తమైనదియు, సత్యమైనదియు, సచ్చిదానందస్వరూపమైనదియు, నగు శివతత్త్వమే పరబ్రహ్మముగాని తక్కినది పరబ్రహ్మము గానేరదుగాన నాశివతత్త్వమునె యాస్తికులైనవారు ధ్యానము చేయవలయును.

మూ॥ అతస్సర్వం పరిత్యజ్య మహాలింగైక తత్పరః॥ ౧౫
నిర్మమో నిరహంకార స్తద్ధ్యానపరమోభవేత్॥

తా॥ కావున, తదితరదేవతలనెల్ల వదలిపెట్టి మహాలింగమునందె యాసక్తి గలిగి నిర్మముఁడు, నిరహంకారుఁడునై శివతత్త్వమునె ధ్యానము చేయుచుండవలయు.

మూ॥ మహాలింగం త్రిధాజాతం సుజనానుజిఘృక్షయా॥ ౧౬
ప్రథమం భావలింగంతు ద్వితీయం ప్రాణలింగకం॥
తృతీయమిష్టలింగంస్యాదిత్యేవం త్రివిధం మతం॥ ౧౭

తా॥ సుజనుల ననుగ్రహించు నిచ్ఛచే నామహాలింగము మూఁడు విధములయ్యెను, అందు భావలింగము మొదటిది. ప్రాణలింగము రెండవది. ఇష్టలింగము మూఁడవదియు నని యెఱుంగునది.

మూ॥ నిష్కళం భావలింగంస్యాద్భావగ్రాహ్యం పరాత్పరం।
ప్రాణలింగం మనోగ్రాహ్యం భవేత్సకలనిష్కళం॥ ౧౮

తా॥ ఇందు భావలింగము నిష్కళమైనదిగాన భావముచేతనే యెఱుంగదగియున్నది. ప్రాణలింగము సకల నిష్కళముగాన మనోగ్రాహ్యమగును.

మూ॥ సకలం దృక్కలాగ్రాహ్యమిష్టలింగంప్రకీర్తితం।
ఇష్టసిద్ధికరం సమ్యగనిష్టపరిహారకం॥ ౧౯
ఇష్టసంపూజయానిత్యమిష్టం పూజితమాదరాత్॥

తా॥ కళాసహితమై, దృక్కుచే గ్రహింపఁబడునది యిష్టలింగమగును. ఇష్టసిద్ధిని గలిగించునదియు, ననిష్టముల దొలగించునదియు

ఇష్టమగు పూజచే పూజింపఁబడునదియు గాన నిష్టలింగమని చె
బడుచున్నది.

మూ॥ భావాది లింగత్రితయం ద్వివిధం ద్వివిధం భవేత్।
భావలింగం మహాలింగ ప్రసాదాభిఖ్యకం ద్వయం।
ప్రాణలింగం తథాచర శివలింగద్వయం భవేత్॥
ఇష్టంతు గురులింగాఖ్య మాచారాఖ్యం ద్వయంభవేత్।

తా॥ భావలింగము మొదలుగా మూఁడులింగములును రెం
విధములగును. ఎట్లన, భావలింగము, మహాలింగమనియు, ప్రసా
లింగమనియు రెండువిధము లగును. ప్రాణలింగము. చరలింగమని
శివలింగమనియు, రెండువిధములు. ఇట్లే, ఇష్టంగంబును గురులిం
మనియు, నాచారలింగమనియు రెండువిధములని యెఱుంగునది.

మూ॥ ఆచారలింగ మాఖ్యాతం సద్యోజాత ముఖాత్మకం॥
గురులింగం తథా వామదేవ వక్త్రాత్మకంభవేత్॥
శివలింగం తథాఘోర ముఖరూపం భవేత్పునః॥
చరలింగం భవత్యేవ తత్పురుషము ఖాత్మకం॥
ప్రసాదలింగం కథితమీశాన ముఖసంజ్ఞకం॥
మహాలింగం తథాఖండ శివరూపం ప్రకీర్తితం॥

తా॥ ఆచారలింగము సద్యోజాత ముఖమనియు, గురులింగ
వామదేవ ముఖమనియు, ప్రసాదలింగము ఈశాన ముఖమనియు
మహాలింగము అఖండ శివరూపమనియు, నెఱుంగవలయు.

మూ॥ లింగే సంపూజనాద్ధ్యానా చ్ఛంభుస్సమ్య క్ప్రసీదతి॥
ధ్యాయతే పూజ్యతేచైవ లింగే సన్నిహితశ్శివః॥

తా॥ లింగమునందె శివుని పూజించినను, ధ్యానించినను
వాఁడు శీఘ్రముగ సుప్రసన్నుఁడగును. గావున లింగమున నెల్లప్పు
సహితుఁడైయుండు పరమేశ్వరుఁడు పూజింపఁ బడుచును, ధ్యాన
చేయఁబడుచు నున్నాఁడు.

మూ॥ ఇష్టలింగే తతోనిత్యం పూజనీయః పరశ్శివః॥ ౩౬
ధ్యేయశ్చ సతతం బృహస్పతే లింగరూపోఽంబికాపతిః॥

తా॥ కావున నోబృహస్పతీ, పరమేశ్వరు నెల్లపుడు నిష్టలింగము నందే పూజించుచు ధ్యానము చేయుచు నుండవలయును.

మూ॥ ఆధారే కనకప్రఖ్యం హృదయే విద్రుమప్రభం॥ ౩౭
భ్రూమధ్యే దీపసంకాశం ప్రాణలింగం ప్రకీర్తితం॥

జ్యోతిర్లింగమిదం విద్ధ్వ ధ్యానస్థానం మహేశితుః॥ ౩౮
జ్యోతిర్లింగం విభావ్యైవ తత్ర ధ్యేయః పరశ్శివః॥

తా॥ మూలాధారమునందు సువర్ణరూపంబునను, హృదయంబునందు ప్రవాళరూపంబునను, కనుబొమలనడుమ దీపాకారంబునను నుండునది ప్రాణలింగమని చెప్పఁబడును. ఈజ్యోతిర్లింగము పరమేశ్వరధ్యానమునకు స్థానమగుగాన తొలుత నిట్టి జ్యోతిర్లింగమును భావించి యందుఁ బరమేశ్వరుని ధ్యానముచేయవలయు.

మూ॥ ప్రాణేష్వంతర్మనః స్థానం హృదయాబ్జ గతం శివం॥ ౩౯
లింగం యత్తదిహాగ్రాహ్యం ప్రాణలింగ సమాహ్వయం॥

తా॥ శ్రు॥ ప్రాణేష్వంతర్మనసో లింగమాహుః అనియు లింగే సుషుప్తిః అనియు హృదయకమలమునందు ప్రాణములకు మనసునకును స్థానముగా నుండునది యని శ్రుతులయందుఁ జెప్పఁబడుచున్నదే ప్రాణలింగమగును.

మూ॥ జ్యోతీరూపం తదేవస్యాత్స్థానం ముఖ్యం మహేశితుః ౪౦
తత్రనిధ్యాయమానస్తుశంభుర్మోచయేత్ చిరాత్॥

తా॥ జ్యోతీరూపమగు నాప్రాణలింగము పరమేశ్వరునకు ముఖ్యస్థానమగును. అందుఁ బరమేశ్వరుని ధ్యానము సేయునెడ నప్పుడు సాధకునకు శీఘ్రకాలముననే ముక్తి నొసఁగును.

మూ॥ సచ్చిత్సుఖమయం శాంత మాదిమధ్యాంతవర్జితం॥ ४१
నిష్కలం శాంభవం యత్తదరూపం రూపముచ్యతే।
తద్భావనాస్పదం బ్రహ్మన్భావలింగం ప్రకీర్తితం॥ ४२

తా॥ సచ్చిత్సుఖాత్మకంబును, శాంతంబును, ఆదిమధ్యాంత రహితంబును, నిష్కలంబును, కరచరణాద్యవయవ రహితంబునునై యఖండమగు నే శివరూపము గలదో దానిని భావింప నాస్పదమైనది భావలింగమని చెప్పఁబడును.

మూ॥ భావగ్రాహ్యం మనోతీతం భావాభావ కరంశివం।
కలాసర్గకరం సత్యం భావలింగం ప్రకీర్తితం॥ ४३

తా॥ భావముననె గ్రహింపఁ దగినదియు, మనసునకు నతీతమైనదియు, భావాభావముల గలిగించునదియు, సర్వకలలను సృజించునదియు భావలింగమని చెప్పఁబడును.

మూ॥ ప్రత్యావృత్తేంద్రియగ్రామై రమనస్క పదాస్పదైః।
పదేతురీయాతీతాఖ్యే భావనీతుంతు యోగిభిః॥ ४४

తా॥ విషయముల మీఁదినుండి యింద్రియముల నాకర్షించి మనసును మరచిన యోగులు తురీయాతీతమునందు భావలింగమును భావింపవలయు.

మూ॥ విస్మృతేతర భావానుభావితాఖండ తత్త్వకైః।
యోగిభిర్భావ్యతేనిత్యం భావలింగం మహాత్మభిః॥ ४५

తా॥ ఇతర పదార్థముల నెల్ల మరచి, యఖండమగు శివతత్త్వమును భావించునట్టి మహాత్ములగు యోగులచే నెల్లపుడు భావలింగ స్వరూపం బనుభవింపఁ బడుచుండును.

మూ॥ భావలింగాను భావాత్తపరానం దామృతాబ్ధయః।
నిస్పృహా నిర్భయాశ్శాంతా జీవన్ముక్తా నసంశయః॥ ४६

తా॥ భావలింగము ననుసంధానము చేయుటచే నిరతిశయా నందమను నమృత సముద్రమునొంది ప్రపంచ సంబంధమగు వాంఛయు, జననమరణంబుల వలని భయంబును, తాపత్రయము వలని కలవరంబు నులేని మహానుభావులు జీవన్ముక్తులని చెప్పం బడుచుందురు.

మూ॥ జ్యోతీరూపం ప్రాణలింగం హృదయాబ్జేప్రతిష్ఠితం।
హృదయేవాభ్రువోర్మధ్యేతురీయేధ్యేయమాస్తికైః॥ ४८

తా॥ జ్యోతిర్మయమగు ప్రాణలింగము హృదయకమలమునం దున్నది. ఆలింగమును హృదయమునందుగాని, కనుబొమలనడుమ గాని ధ్యానముచేయవలయు.

మూ॥ ధ్యానస్యశంభోఃపూజాయాస్థానమిష్టంభవేద్బహిః।
జాగ్రద్దశాయాం సంసేవ్యం భోగమోక్ష ఫలార్థిభిః॥ ४९

తా॥ జాగ్రద్దశయందు సాధకుఁడు వెలుపట పరమేశ్వరుని ధ్యానము సేయను, పూజింపను స్థానమైనది యిష్టలింగమగును. కావున భోగ మోక్షములను గోరువార లిష్టలింగమును సేవింపవలయు.

మూ॥ తథైవాన్తరగంస్థానం ప్రాణలింగం ప్రకీర్తితః।
సేవ్యమేతత్తురీయేస్యాద్భవబంధ ముముక్షుభిః॥ ५०

తా॥ ఆవిధముననే అంతఃకరణమునందు పరమేశ్వరుని పూజింప ను ధ్యానము సేయను స్థానమైనది. ప్రాణలింగమగును. కావున, బంధ ముక్తిని గోరువారు ప్రాణలింగమ ను తురీయమను దశయందు సేవింప వలయు.

మూ॥ ఇష్టం స్థూల తనోర్ధార్యం ప్రాణం సూక్ష్మతనోఃస్మృతం।
భావాఖలిం కారణస్యైవం తనుత్రయగతం త్రయం॥ ५१

తా॥ స్థూల శరీరమునకు నిష్టలింగంబును, సూక్ష్మ శరీరము నకు ప్రాణలింగంబును, కారణ శరీరమునకు భావలింగంబును నిట్లు మూడు శరీరములకు మూడు లింగములును ధార్యములగును.

ప్ర॥ ఇష్టప్రాణ భావములను మూడు లింగములును స్థూల సూక్ష్మ కారణములను మూడు శరీరము లకును సంబంధించినవని యిపుడిందుఁ జెప్పఁబడియెను. ఈయర్థము ఇతర గ్రంథముల యందును గలదు. ఇట్లుండగా, ఈగ్రంథముననే కొంచెములోగడ ఇష్టలింగము జాగ్రద్దశయందు సేవనీయ మనియు, ప్రాణలింగము తురీయదశయందు సేవనీయ మనియు, భావలింగము తురీయాతీత దశయందు భావనీయ మనియు చెప్పఁబడి యున్నది. ఇది యెట్లుకుదురును?

ఏలందు రేని, స్థూల సూక్ష్మ కారణములను మూడుశరీరములకును జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తియను మూడవస్థలు సంబంధించి యున్నవి. ఈమూడుగాక, తురీయము, తురీయాతీతమునని మఱి రెండుదశలు యోగులకుమాత్రమే వేద్యములై యున్నవని శాస్త్రములయందు గలదు గాని, స్వప్నావస్థకు గోచరమగు సూక్ష్మశరీరమునకు సంబంధించిన ప్రాణలింగము సుషుప్తికన్న నతీతమగు తురీయము యందు ధ్యానింపఁ బడుటయు, సుషుప్తదశకు గోచరమగు కారణ శరీరమునకు సంబంధించిన భావలింగము సర్వాతీతమగు తురీయాతీత మునందు భావింపఁ బడుటయు నెట్లు సంభవించును?

ఉ॥ స్వప్నదశ సూక్ష్మశరీరము నకును, సషుప్తిదశ కారణశరీరమునకును సంబంధించినవైనను, ఆరెండుదశలు నుపాసనకు నుపయోగించునవికావు, ఏలనగా, సుషుప్తిదశయందు నజ్ఞానమే ప్రకాశించుచుండుటను, స్వప్నదశయందు బాహ్యాజ్ఞానము తిరస్కృత మగుటచేతను నారెండుదశలు నుపాసనకు నుపయోగింపవు

ఇఁక తురీయదశయందు ప్రాణలింగము ధ్యానింపఁబడుటకు శ్లో॥ స్వప్నస్సమాధిరిత్యుక్తధియామభిన్నః॥ స్వప్నదశకు సమాధికిని నధికభేదము లేదని పెద్దలంగీకరించియున్నారుగాన తురీయమను సమాధియందు సూక్ష్మశరీరమునకు సంబంధించిన ప్రాణలింగము ధ్యానింపఁబడుట విరుద్ధము కానేరదు. అట్లే కారణశరీరమునకు స

బంధించిన భావలింగము తురీయాతీతమునందు భావింపఁబడుటయు విరోధింపదు. ఏలనగా, తురీయాతీతమందైనను నాత్మ లేకుండడుగదా ఆత్మయున్నవరకు నాతనికి కారణశరీరమెట్లు విడుచును? విడువదు. కావున కారణశరీరమునకు సంబంధించిన భావలింగము తురీయాతీత మునందు భావింపఁబడుట యుచితమేయగును. ఇదిగాక స్థూలసూక్ష్మ కారణములను మూఁడుశరీరములు జాగ్రత్స్వప్నసుషుప్తులను మూఁడవ స్థలయందు స్పష్టముగా గోచరించుటంజేసి యామూఁడవస్థలు మూఁడు శరీరములకు సంబంధించినవని చెప్పఁబడుచున్నవిగాని యాశరీరములు నాయా యవస్థలయందుమాత్రమే యుండుగాని యితరావస్థలయందు నుండవను నియమము లేదు. కావున నిట్టి శంకకు నవకాశము లేదు.

మూ॥ ఆణవం మాయికంచైవ కార్మికంచ యథాక్రమం।
మలత్రయమనాదీదం తనుత్రయ గతంభవేత్॥ ౫౧

తా॥ ఆణవము, మాయికము, కార్మికము నను ననాదులగు నీమూఁడుమలములును, కారణము, సూక్ష్మము, స్థూలమునను మూఁడు శరీరముల నాశ్రయించియుండును.

మూ॥ తనుత్రయగతానాది మలత్రయమిదం గురుః।
దీక్షాత్రయేణ నిర్దగ్ధ్వాలింగత్రయ ముపాదిశేత్॥ ౫౨

తా॥ గురువు మూఁడుశరీరముల ననాదిగా నాశ్రయించియున్న యీమూఁడు మలములను వేధా మనుక్రియలను మూఁడు దీక్షలచే దహించి యిష్టప్రాణభావములను మూఁడులింగములను నామూఁడు శరీరములకు ధరింపఁజేయవలయు.

మూ॥ పూజయన్నిష్టలింగంతుని ధ్యాయన్ ప్రాణలింగకం।
భావయన్భావలింగంవై మృత్యుపాశాంశ్ఛినత్తిసః॥ ౫౩

తా॥ ఇష్టలింగమును పూజించుచును, ప్రాణలింగమును ధ్యానించుచును, భావలింగమును భావించుచును నుండువాడు మృత్యుపాశములను ఛేదించి ముక్తినొందును.

మూ॥ సర్వదేవ మయంలింగం తస్మిన్నానుభూత్ శివస్స్వయం।
అనుగ్రహాయ వసతి తస్మాల్లింగం ప్రపూజయేత్॥

తా॥ లింగము సర్వదేవాత్మకమైనది. అట్టిలింగమునందు పరమేశ్వరుఁడు లోకానుగ్రహము గోరి వసించుచున్నాఁడు. కావున, శివలింగమును పూజింపవలయు.

మూ॥ పృథివ్యాం యాని తీర్థాని పుణ్యాన్యాయతనాని చ।
లీయన్తే లింగమూలేతు తస్మాల్లింగం ప్రపూజయేత్॥

తా॥ భూమియందుగల సకలతీర్థంబులును లింగము యొక్క మొదట గలవు, గావున లింగమును బూజింపవలయు.

మూ॥ ఆకాశం లింగమిత్యాహుః పృథివీతస్య పీఠికా।
ఆలయస్సర్వ భూతానాం లయనాల్లింగ ముచ్యతే॥
యస్తు పూజయతే నిత్యం లింగం త్రిభువనేశ్వరం।
ససర్వమోక్ష రాజ్యస్య క్షిప్రంభవతి భాజనం॥

తా॥ ఆకాశమే లింగంబును దానికి భూమియె పీఠంబును సకలభూతకోటికి నావాసంబుగానను, సర్వమునకు లయస్థానము నను లింగమని చెప్పఁబడును. అట్టిలింగమును పూజించువాఁడు సమగుమోక్షసామ్రాజ్యమునకును పాత్రుఁడగును.

మూ॥ సర్వేలింగమయాలోకాస్సర్వం లింగేప్రతిష్ఠితం।
తస్మాత్సం పూజయేల్లింగం యదిచ్ఛేత్సిద్ధిమాత్మనః॥

తా॥ సర్వలోకంబులును లింగరూపంబులు. సర్వంబును లింగమునంద నిలిచియున్నది. కావున మోక్షసిద్ధిని కోరినవాఁడు లింగమును బూజింపవలయు.

మూ॥ హన్యాత్క్రుద్ధోపిచాకాశం క్షుధార్తఃఖాదయేద్విషం।
త్యక్త్వాలింగార్చనం మూఢైర్భోక్తవ్యంనకదాచన॥

తా॥ కోపించి యాకాశంబును గొట్ట నారంభించుట యెట్లు నిరర్థకమో, ఆకలిగొని విషము భక్షించినచో నదియెట్లు లనర్థకరమో అట్లె అశుచ్యాది సమయములయందైనను లింగార్చనము సేయక భుజింపగూడదు. అట్లు భుజించెనేని యది నిరర్థకమేగాక యనర్థకరంబు నగునని యెఱుంగవలయు.

మూ॥ శివలింగస్వరూపంచ మహిమానంచ శాశ్వతం।
న్యబోధయం దేవగురో కిముత్తశ్రోతు మిచ్ఛసి॥ ౬౦

తా॥ ఓబృహస్పతీ! నీకు శివలింగముయొక్క స్వరూపమును మహిమనుగూడ దెలిపితిని. ఇఁకమీద నెద్దాని వినఁగోరుదువో అడుగుము.

ఇతి శ్రీచంద్రజ్ఞాన ఉత్తరభాగే
శివశాసనే
క్రియాపాదే
తృతీయ పటలః



అథ
చతుర్థ పటలః.

బృహస్పతిరువాచ = బృహస్పతి తిరుగా నిట్లని యడిగెను.

మూ॥ కరుణాకరసర్వజ్ఞ భక్తానుగ్రహతత్పర।
సర్వాగమామృతసభేఽనంతరుద్రనమోస్తుతే॥ ౧
ధన్యోస్మి శివలింగస్య వైభవాకర్ణనాదహం।
లక్షణం జంగమ స్యాపి మాహాత్మ్యం బ్రూహ్యనుగ్రహాత్॥ ౨

తా॥ దయాశాలివి, సర్వజ్ఞుఁడవు, భక్తుల ననుగ్రహించు శ క్తిగలవాఁడవును, సర్వమగు నాగమామృతమునకు సాగరమంబో వాఁడవును నగు నోయనంతరుద్రా! నీకు నమస్కారము. శివలిం యొక్క వైభవము వినుటంజేసి యేను ధన్యుండనైతి. ఇఁక జంగ మాహాత్మ్యముం దెలిపి యనుగ్రహింపుము.

మూ॥ అహోనిబోధయామ్యద్య శృణుజంగమవైభవం।
నిగూఢమాగమాంతేషు యజ్ఞాత్వామృతమశ్నుతే॥

తా॥ ఓబృహస్పతీ! ఆశ్చర్యజనకమైన జంగమవైభవ నీకు దెలిపెదను వినుము. ఆగమాంతములయందు రహస్యముగా యీమహిమను వినినవాఁడు ముక్తి నొందును.

మూ॥ జంగమం స్థావరం చేతి శంభోరూపద్వయం స్మృతం।
స్థావరంచ స్వయం వ్యక్తం ప్రతిష్ఠితమితిద్విధా॥
స్వయం వ్యక్తం తత్రభవేత్కాశీవిశ్వేశ్వరాదికం।
ప్రతిష్ఠితం కర్షణాద్యైస్సంస్కృతం మానుషైర్భవేత్।

తా॥ స్థావరము, జంగమము నని పరమేశ్వరునకు రెండు ములు గలవు. అందు స్వాయంభువము, ప్రతిష్ఠితము నని స్థా రెండు విధములు. కాశీవిశ్వేశ్వరలింగము మొదలైనవి స్వాయ ములును, మనుష్యులు కర్షణాదిసంస్కారములతో ప్రతిష్ఠించిన ములు ప్రతిష్ఠితములు నగును.

మూ॥ జంగమం ద్వివిధం ప్రోక్తం మాంత్రికం సహజంత్వి॥
మాంత్రికం మంత్రసామర్థ్యాదావాహితముదీరితం॥
ధ్రియమాణం మహాశైవైశ్వరలింగాదికం యథా॥
సహజం జంగమం మాహేశ్వరఇత్యభిధీయతే॥

తా॥ మాంత్రికమనియు, సహజమనియు జంగమము రెండు విధములు. అందు మంత్ర సామర్థ్యమువలన నావాహి

పండి—భిక్షుమాత్రము నందఱు పెట్టుదురా? అదియు దొరకనిచో నేమి చేయును? ఇదిగాక, సంకటము వచ్చినప్పుడు గృహస్థుఁడు మాత్రముభిక్షావృత్తి నేల యవలంబింపరాదు? భిక్షావృత్తియె గదా బ్రహ్మచారికిగల మహాభాగ్యము. మధుకరవృత్తియను నీమహాభాగ్యము సాధింపనెంచి గృహస్థాదులు కపటబ్రహ్మచారి వేషము నవలంబింతురనుటకన్న పరిహాసావహ మేమి యుండును?

అన్నం—మను వట్లు చెప్పెను. దాని నధిక్షేపింపనగునా?

పండి—మనువు చెప్పిన శ్లోకమునకు మీరట్టి యపార్థముచెప్పి యట్లు మనువుచెప్పెననుట యుచితమగునా?

అన్నం—లింగమనగా, బ్రహ్మచర్యంబునునగుగాన నది కలవాఁడు లింగి=బ్రహ్మచారియని వ్యాఖ్యాత వ్రాసెను. అట్లేల గ్రహింపఁగూడదు?

పండి—లింగమనగా బ్రహ్మచర్యమని యెందేని గలదా? లేదు. అట్లు లేనప్పుడు ఆపదమునకు గార్హస్థ్యమని మొదలగు నర్థమేల గ్రహింపరాదు.

అన్నం—లింగి అను పదమునకు బ్రహ్మచారి యను నర్థమును మా మతమున నంగీకరింతుము.

పండి—అట్లేని, సన్న్యాసవిధిని చెప్పునప్పుడు లింగి అని లింగిశబ్దవాచ్యుఁడు సన్న్యాసము గ్రహింపనర్హుఁడు కాఁడనియున్నది. అచ్చట లింగి యనగా బ్రహ్మచారియని గ్రహించుదురా?

అన్నం—గ్రహించిన నేమి?

పండి—బ్రహ్మచారి సన్న్యాసము నవలంబింపఁగూడదు. అనుట మీకు సమ్మతమగునా?

అన్నం—అగుననుకొనుడు. అప్పుడు బాధకమేమి?

పండి___అట్లేని, శంకరాచార్యులవారు బ్రహ్మచర్యమునుండియె సన్న్యాసాశ్రమము నెట్లు గ్రహించిరి?

అన్నం___సన్న్యాసనిషేధప్రకరణమునందు లింగి యనగా లింగధారి యని యర్థము గ్రహింతుము.

పండి___ఇదియుండనిండు. మహాభారతమున ఆనుశాసనికపర్వమునందు

శ్లో॥ కిమాహుర్భరతశ్రేష్ఠ విప్రాః పాత్రం సనాతనం।
లింగినం బ్రాహ్మణంచైవ బ్రాహ్మణంవాప్య లింగినం॥

లింగిబ్రాహ్మణుఁడు, అలింగిబ్రాహ్మణుఁడు నను నిద్దరిలో దానపాత్రుఁడెవ్వఁడని ధర్మరాజు భీష్ముని నడిగినప్పుడు,

శ్లో॥ సద్వృత్తిమపి విజ్ఞాయ లింగినే చేతరాయచ।
దేయమాహుర్మహారాజఉభావేతౌ తపస్వినౌ॥

సత్ప్రవర్తనమునుగూడ దెలిసికొని లింగికిగాని, అలింగికిగాని యిద్దరికిని దానము చేయనగునని యున్నది. అచట లింగి పదమునకు నేమి యర్థము గ్రహింతురు?

అన్నం___అందు లింగి యనఁగా బ్రహ్మచారియని గ్రహింతుము.

పండి___బ్రాహ్మణులలో బ్రహ్మచారి, తదితరుఁడునని రెండు భేదములు గలవా? బ్రహ్మచారియెడ దానపాత్రతకై సంశయము గలిగినప్పుడు గృహస్థునియెడ నేల గలుగకుండును?

అన్నం___అచ్చట నట్లె గ్రహింతుము.

పండి___అది యుండనిండు. నామలింగానుశాసనము, బ్రహ్మవర్గమున అను చోట

శ్లో॥ ధర్మధ్వజీ లింగవృత్తి రవకర్ణీ క్షుతవ్రతః॥
లింగవృత్తిః అనగా నేమియర్థము?

అన్నం___అచట లింగవృత్తిః లింగధారి యని యర్థము.

పండి___ఆచార్యులు వారూ, లింగిపదమునకు వీరెట్టులర్థము చెప్పుచున్నారో వినుచున్నారా?

ప్రతి—బాగుగా వినుచునే యున్నాను, నిందార్థకమైనచో లింగిపదమునకు లింగధారియనియు, పూజ్యార్థకమైనచోట నాపదమునకే బ్రహ్మచారియనియు నర్థము చెప్పుచున్నారు.

పండి.—భట్టాచార్యులవారూ, ఆపదమునకు నిందా బోధకమైన చోటనె బ్రహ్మచారి యనియు, పూజావహమైనచోటనే లింగధారియనియు నేల గ్రహింపరాదు?

అన్నం—మీరల్లే నిర్ణయించు కొనుడు.

ప్రతి—పదమునకు న్యాయ్యమగు నర్థమేదో అదియే గ్రహింపవలయుగాని మీయిష్టమువచ్చినట్లు మీరును, వారియిష్టము వచ్చినట్లు వారును గ్రహించుటయుచితమగునా?

అన్నం—ఆపదమునకు న్యాయ్యమగు నర్థమిది యేయని యెట్లు నిర్ధార్యమగును?

ప్రతి—ఆరాధ్యులవారూ, లింగవృత్తి పదమునకు మీరేమని యర్థము చెప్పెదరు?

పండి—లింగవృత్తిః, అనగా, లింగమును వృత్తికై ధరించినవాఁడు, జీవనార్థము లింగము ధరించిన కపట లింగధారియని యేర్పడుచున్నది.

ప్రతి—లింగవృత్తి పదమునకు వాఖ్యాత యేమని యర్థము వ్రాసెను?

పండి—లింగాభట్టీయమునందు ధర్మధ్వజీలింగవృత్తిః । ఈపదములకు వ్యాఖ్యానము మిథ్యానుష్ఠాన లక్షజీవి కావతో నామాని, అని వ్రాయఁబడియున్నది. జీవనార్థమై కపటవేషము ధరించినవాని పేర్లని యర్థము. దీనింబట్టి లింగవృత్తిపదమునకు కపటలింగధారియను నర్థము వ్యాఖ్యాతకు సమ్మతమైయని స్పష్టమగుచుండలేదా?

ప్రతి—లింగవృత్తిపదమునకు కపటలింగధారియను నర్థము సంగ్ర రింపక తీరనట్లు తోఁచుచున్నది. ఆపదమునకు నిజమైన లిం ధారియను నర్థ మెట్లగును? అప్పుడు వృత్తిపదము వ్యర్థ గాదా? వృత్తిపదమునుబట్టి జీవనముకొఱకు కపటము లింగము ధరించినవాఁడని యర్థముగాదా?

అన్నం—లింగవృత్తియనఁగా జీవనము కొఱకు కపటముగా బ్రహ్మ ర్యము నవలంబించినవాఁడని యర్థమేల కాఁగూడదు. అప్ప కపటవేషధారియను నర్థమును వ్యక్తీకరించిన లింగాభ మేము చెప్పిన యర్థమునకు ననుకూలుఁడేయగుగదా?

ప్రతి—అలింగీలింగివేషేణ అను మనుస్మృతి వచనము కపటబ్ర చారి పరమైనట్లే యిచ్చట లింగవృత్తిపదంబును కపటబ్ర చారిపరమేయనిగదా మీయభిప్రాయము.

అన్నం—అగును.

ప్రతి—అట్లేని వృత్తికై కపటబ్రహ్మచారి వేషమును ధరించినవా గృహస్థుఁడా? లేక సన్యాసియా? అని వికల్పించి వారెవ్వ జీవనముకొఱకు బ్రహ్మచర్యము నవలంబింపదగు విశేష లేదని లోగడ నారాధ్యులవారు చెప్పినదానికి మీరేమి సమా ధానము చెప్పియుంటిరి?

అన్నం—అప్పుడు చెప్పకున్న నేమి? ఇప్పుడు చెప్పఁగూడదా?

ప్రతి—ఇప్పుడే చెప్పుడు.

అన్నం—లింగవృత్తి యనగా, ఇతరాశ్రమస్థుఁడు వృత్తికై బ్రహ్మ ర్యము నవలంబించినవాఁడని కాదు.

ప్రతి—ఏమని?

అన్నం—బ్రహ్మచారియే తాను బ్రహ్మచర్యమును వృత్తియందుమాత్ర యుపయోగించుకొనుచు, బ్రహ్మచర్యమునకు విహితము

కడమ ధర్మములను నాచరింపనివాఁడు కపట బ్రహ్మచర్యము గలవాఁడుగాన, వీనికి, లింగవృత్తియని యమరసింహుఁడును, మిథ్యానుష్ఠాన వంతుఁడని లింగాభట్టును, లింగివేషేణ అని మనువును, నిక్లేతద్వ్యాఖ్యాతయు దెల్పియున్నారు. ఈయర్థము న్యాయ్యముగాదా?

ప్రతి—భట్టాచార్యులవారూ, మీరుచెప్పినది చాల యుక్తియుక్తముగా నున్నది. ఈనిర్ణయమునకు తిరుగులేదు. ఆరాధ్యులవారు లింగవృత్తి పదమునకు కపట లింగధారియని యర్థముచెప్పిరి. బ్రహ్మచారికానివాడు గృహస్థుడా? లేక యతియా? కపట బ్రహ్మచారి వేషము ధరించునని యసందర్భ వికల్పముగావించి, కొనకు మను వచనమునకును లింగధారి కానివాఁడు లింగధారివేషముతో నెవడు జీవించునో అని యర్థముచెప్పి మన యిర్వురనుగూడ తలక్రిందుసేయు సంకల్పముతో నున్నట్లు కనఁబడెను. కాని యిప్పుడు మీరుచేసిన యర్థనిర్ణయమును బట్టి వారి సంకల్పము కొనసాగదని ధ్రువమైనది. ఆరాధ్యులువారూ, లింగవృత్తిపదము మొదలైనవి కపట బ్రహ్మచారి పరములైనవని యనేక గ్రంథకర్తల యాశయమునుబట్టి స్పష్టమైనది. ఈయర్థమును మీరంగీకరింతురా? లేదా?

పండి—ఆపదములకు నాయర్థము సహేతుకముగా నున్నచో నేను మాత్రమేల యంగీకరింపను?

ప్రతి—ఇందఱు గ్రంథకర్తలు నిర్ణయించినను మీచిత్తమునకు సహేతుకముగా నుండనియట్లే గోచరించు చున్నదా?

పండి—మనుస్మృతి వ్యాఖ్యాత యొక్కఁడుదక్క. కపట బ్రహ్మచారి యని తెల్పినవాడు వేరొక్కఁడెవ్వఁడు?

ప్రతి—అంతియే?

పండి—మనుస్మృతి వచనము, అమరసింహుని వచనము నస్పష్టార్థ

ములు. మిథ్యానుష్ఠాన వంతుడను లింగాభట్టు నాకయు రెండర్థములకు ననుకూలమే. ఇంతగాక, యేమియున్నది!

ప్రతి—లింగవృత్తి అను పదంబును అలింగీ లింగివేషేణ అను వచనంబును కపట బ్రహ్మచారి పరములని యేల యంగీకరింపఁ గూడదు?

పండి—కపట లింగధారిపరములని యేల యొప్పుకొనఁ గూడదు?

ప్రతి—భట్టాచార్యులవారూ, ఇందు మీ యభిప్రాయమేమి?

అన్నం—నాయభిప్రాయమిదివఱకే యారాధ్యులవారికి తెలిపితిని.

ప్రతి—ఏమని?

అన్నం—మేము వానిని కపటబ్రహ్మచారి పరముగా నంగీకరింతుము. మీరు కపటలింగధారిపరముగా నంగీకరించుడని

ప్రతి—అట్లేని కపటచక్రాంకునిపరముగా మేమేల సిద్ధాంతము చేసి కొనఁగూడదు?

అన్నం—కూడదని యెవ్వరు చెప్పిరి? మీరట్లే సిద్ధాంతము చేసి కొనుఁడు.

ప్రతి—బాధకమేదియు లేదా?

అన్నం—ఏమియు లేదు.

ప్రతి—ఆరాధ్యులవారూ, ఈయెడల నెవరికి వీలైనట్లు వారలర్థము చెప్పికొన మీరంగీకరింతురా?

పండి—ఆచార్యులవారూ, అట్లు చెప్పికొనవద్దని నేను మిమ్ము నిర్బంధించినచో మీరు మానుదురా?

అన్నం—బాధకము లేనప్పు డెవరికి వీలైనట్లు వారు గ్రహించుటలో దోషమేమి?

పండి—బాధక మున్నదో లేదో అను విచారమవ్వలనుండనిమ్ము. మనము ముప్వురము మూడువిధములుగా నర్థము గ్రహించుచుంటిమి

మనుకొనుడు. ఇందు గ్రంథకర్తకు నొక్కయర్థమే సమ్మతమై యుండునా? లేక మూడర్థములు సమ్మతములైయుండునా?

అన్నం—ఒక్కయర్థమే గ్రంథకర్తకు సమ్మతమనుకొనుఁడు. గ్రంథకర్తకు నిం దేయర్థముసమ్మతమో దానిని కనిపట్టు నుపాయమేది?

పండి—నిజమైన యర్థమునే గ్రహింపవలయునను న్యాయ్యదృష్టి యున్నచో నద్దానికిఁ దగు నుపాయమేలదొరకదు?

అన్నం—మనము మువ్వురము న్యాయ్యదృష్టితో నిజమైనయర్థమున గ్రహింతము. దానిం దేల్చు నుపాయమేదో త్వరగా దెలుపుడు.

పండి—ఏయర్థమునెడ బాధ యావంతయు నుండదో, ఏయర్థము క్లిష్టముగాక స్పష్టముగనుండునో అదియే గ్రంథకర్తకు సమ్మతమని గ్రహింపవలయు.

అన్నం—అట్లేని పరికృతవచనము కపటబ్రహ్మచారి పర మనుటకు బాధయావంతయు లేదుగాన నదియే గ్రంథకర్తకు సమ్మతము.

ప్రతి—ఆవచనము కపటచంద్రాంకుని పరముగా గ్రహించుటకు మాత్రమేమి బాధయున్నది?

అన్నం—అందేమి బాధకలదో ఆరాధ్యులవారి నడుగవలసినదే.

పండి—కపటచంద్రాంకుని పరమగునా? కాదా యను విచారమటుండ నిండు. భట్టాచార్యులవారూ, కపటబ్రహ్మచారి యను నర్థము గ్రహింప నేమిబాధయు లేదా?

అన్నం—అది మీకు దెలియవలసినదే.

పండి—అట్లేని నిందు కొంచెమవధానమొందుఁడు. వృత్తికై కపట బ్రహ్మచారిగానున్నవాఁడు గృహస్థుఁడు మొదలుగా నితరాశ్రమస్థుఁడా? లేక బ్రహ్మచారికి విహితములగు ధర్మాంతరములు

నవలంబింపక బ్రహ్మచర్య వృత్తిమాత్రముననె జీవించు
బ్రహ్మచారియే యగునా?

అన్నం—ఇతరాశ్రమస్థుఁడని యెంతమాత్రమంగీకరింపము. స్వా
ధర్మరహితుఁడై బ్రహ్మచారికిఁ జెప్పినవృత్తిమాత్రమవలంబి
బ్రహ్మచారియే అని యంగీకరింతుము. ఇందేమి బాధకి
చెప్పుడు.

పండి—భట్టాచార్యులవారూ, ఇప్పుడు అలింగీలింగివేషేణ అను
మునకు నర్థము చెప్పుడు.

అన్నం—అలింగీ = బ్రహ్మచారికానివాఁడు, లింగివేషేణ = బ్ర
చారి వేషముతో

పండి—కొంచెమాగుడు.

అన్నం—దేనికి?

పండి—అలింగీ అను శ్లోకమునకు ప్రతిపాద్యుఁడు ఇతరాశ్రమస్థు
గాఁడు. బ్రహ్మచారియేయని యింతకుముందుఁ జెప్పితిరి. ఇప్పు
శ్లోకమునకు నర్థము చెప్పనారంభించి బ్రహ్మచారి కాని
డని యారంభించితిరి. ఇందేది నిజము?

అన్నం—ఇట్లు చెప్పినంగాని యాశ్లోకమునకునర్థము కుదరదు.
చేయవలయు?

పండి—మీసిద్ధాంతమున నాశ్లోకమునకు నర్థమెట్లో కుదుర్పుడు.

ప్రతి—ఆశ్లోకమునకు భట్టాచార్యులవారి మతమున నర్థము కుదు
లేదు. బ్రహ్మచారియనినను కుదురలేదు. బ్రహ్మచారి కా
వాఁడన్నను కుదురలేదు. భట్టాచార్యులవారూ,
డును కానివాఁ డెందేని గలఁడా?

అన్నం—ఆశ్లోకమునకు మీరాయిచ్చవచ్చినట్లే యర్థము చేసికొను

ప్రతి—భట్టాచార్యులవారి సిద్ధాంతము సాంతమైనది. కుదరనప్పుడ

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ కొమరవెల్లి కాళయ్యగారు వరంగల్ | 12-0-0 |
| ,, రామిని మల్లయ్యగారు ... | 12-0-0 |
| ,, తుగ్లపాటి వెంకటేశ్వరరావుగారు, బారిష్టరు, బెజవాడ | 10-0-0 |
| ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్నగార్లు, సికింద్రాబాదు | 10-0-0 |
| ,, కైలాస శరభయ్యగారు, ... | 10-0-0 |
| ,, బెద్దె రామన్న కుమారుడు, జగదీశ్వరయ్య ... | 10-0-0 |

—♦ పోషకులు ♦—

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యవార్లంగారు, ఈమని | 5-0-0 |
| ,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని | 5-0-0 |
| ,, కామర్సు రాజశేఖరరావుగారు, కరణం, నవాబుపాలెం | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిలుగారు, తొండపి | 5-0-0 |
| ,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల | 5-0-0 |
| ,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చుపేట | 5-0-0 |
| ,, భూపతి రత్నంగారు, వగంగల్ | 5-0-0 |
| ,, మల్లంపల్లి మల్లికార్జునుడుగారు, అయితంపూడిఅగ్రహారం | 5-0-0 |
| ,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ | 5-0-0 |
| ,, శ్రీపతిపండితారాఘ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని | 5-0-0 |
| ,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు | 5-0-0 |
| ,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు | 5-0-0 |
| ,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్దిపేట | 5-0-0 |
| ,, ముత్యంపేట మల్లయ్యగారు ,, | 5-0-0 |
| ,, కాళేశ్వరం నాగభూషణంగారు ,, | 5-0-0 |
| ,, కొమరవెల్లి బాలరాజుగారు, వరంగల్ | 5-0-0 |
| ,, గర్రెపల్లి రామన్నగారు, ఖిడిదొడ్డి | 5-0-0 |

# ప్రకటనము.

ఆర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:- ఈ గ్రంథమునందు బ్రా
ణులు మొదలగువారు వేకువజామున నిద్రలేచినది మొదలుకొని రా
పండుకొనునందాక చేయనగు స్నానసంధ్యాది సకలధర్మముల
వైద్యశాస్త్ర ప్రామాణ్యమును బట్టి ఆరోగ్యరూపమగు ప్రత్యక్షఫ
కలదని ఋజువు చేయఁబడియున్నది. వెల రు ౧-

కారణోత్తరమను దివ్యాగమము:-ఇయ్యది శైవుల లింగధా
ణము మొదలగువానియెడలగల సకలసంశయముల వారించు
నిరుపమానమైనది. వెల రు ౧-

ఆహ్నికవిధి:-ఇందు స్నానము సంధ్య మొదలుకొని శ
దేవమువరకుగల సకల నిత్యకర్మములు సప్రమాణాంధ్ర ప్రయోగము
గలవు. వెల రు -౮-

మకుటోత్తరము అను దివ్యాగమము:- ఇందు శివపూజా
ల్పములు, శైవాంత్యేష్టి విధానము మొదలగు ననేక విశేష
గలవు. వెల రు ౧-౮

బ్రహ్మతర్క స్తవము:- శ్రీమదప్పయ దీక్షిత విరచిత
ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, శ్మ
వాసిత్వము, బాణాసురయుద్ధమున నోడిపోయెనన్నదానికి సమా
నము మొదలగు ననేక విషయములు గలవు. వెల రు ౧-

మహాశివపూజా విధి:- ఇయ్యది లింగనిరీక్షణమును వి
గించు దశావధాన విధానముతోను, సప్రమాణాంధ్రప్రయోగముల
శాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦-

ధర్మసంగ్రహము అంత్యేష్టికాండము:- ఇందు శైవులాచా
సమాధ్యారాధనవిధులు శాస్త్రసిద్ధములని పలువిధముల నిరూ
బడియుండుటెగాక, అపరకాండ సందర్భమునగల సర్వవిధ్యో
లకుఁదగు ప్రమాణముల గనబరిచి సకల సంశయములు వారిం
యెను. ఆంధ్ర తాత్పర్యసహితము. వెల రు ౨-

వలయువారు:- ముదిగొండ నాగలింగశాస్త్రి

రామలింగేశ్వర పేట, తెనాలి. అని వ్రా

Reg. No. M- 2284.

శ్రీ
శివాయ గురవేనమః

# శైవరహస్యబోధిని.

ఇది
శ్రీ చేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జితాసార్
శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని
సాహాయ్యమున వెలువడుచు
శైవధర్మములను, వాని ప్రామాణ్యమును దెలుపు
మాసపత్రిక.



| సంపుటము | విభవనామ సంవత్సర | సంచిక |
|---|---|---|
| 5. | భాద్రపదమాసము. | 6. |



సంపాదకుడు:-ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।
విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ।
అశేషశంకానుయసంకశోధినీ।
జయత్వియం శైవరహస్యబోధినీ।



తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

చందా సం॥ రు 2-0-0.

1928.

# శాశ్వత ప్రధాన పోషకులు.

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగ మయ్యవార్లగారి కుమారుడు
నాగమల్లయ్య అయ్యవార్లగారు. సిద్దిపేట
కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, రామన్నవగైరా సిద్దిపేట

## —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారీకులు

| | | |
|---|---|---|
| 1 | భండారు మల్లిఖార్జునరావుగారు | 60—0—0 |
| 2 | భండారు వీరభద్రరావుగారు | |
| 3 | భండారు వీరరాజుగారు | |
| 4 | భండారు వీరబసవరాజుగారు | |
| 5 | భండారు చెన్నబసవయ్యగారు | |
| 6 | భండారు చిన మల్లిఖార్జునుడుగారు | |

## —: ప్రధానపోషకులు :—

మరాశ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రిలుగారు సికింద్రాబాదు 12.0

,, శివలంక తాయన్నగారు, పోణంగి 10.0

,, ముదిగొండ వీరభద్రయ్య అయ్యవారుగారు, ఈమని 10.0

,, శివపురపు రాజయ్యగారు, శికింద్రాబాదు 10.0

,, కొడిమేల భోగసోమలింగారాధ్యులుగారు, శ్రీగురుతత్వ సంస్థానం వరంగల్ 10.0

,, శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు నిర్మల 10.0

,, కాశీనాధుని అల్లమయ్య అయ్యవారుగారు యలమర్రు అగ్రహారం 10.0

,, శివలెంక శంభులింగం అయ్యవారుగారు బెజవాడ 10.0

,, ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్ 12.0

సేయఁబడిన చరలింగములు. అనగా మహాశైవులు ధరించునవి. తది తరులు పీఠముమీదనునిచి పూజింపగ్రహించిన బాణలింగము మొదలైనవియు మాంత్రికములని చెప్పఁబడును. ఇఁక మాహేశ్వరుఁడే సహజజంగమరూపమని చెప్పఁబడును.

మూ॥ మాహేశ్వరశ్చరోభక్తశ్శైవో జంగమ ఇత్యపి।
సహజస్యాభిధానాని భవంతీశ్వరశాసనాత్॥ ౮

తా॥ మాహేశ్వరుఁడు, చరుఁడు, భక్తుఁడు, శైవుఁడు జంగముఁడు, శివయోగి యనునీమొదలైనవి పర్యాయపదములగును.

మూ॥ బ్రహ్మచారీ గృహీచైవ నిరాభారీతి తే త్రయః।
యథోత్తరం విశిష్యన్తే పూజనీయా యథావిధి॥ ౯

తా॥ ఆమాహేశ్వరులు బ్రహ్మచారియనియు, గృహస్థుఁడనియు నిరాభారియనియు మూఁడువిధములుగా నుందురు. వీరిలో బ్రహ్మచారికన్న గృహస్థుఁడును, గృహస్థునికన్న నిరాభారియు నధికులు. గాన వారిని తగునట్లు పూజింపవలయు.

మూ॥ వక్ష్యామి భక్తిచిహ్నాని ప్రీతీరుద్రాక్షధారణే।
భస్మత్రిపుండ్రే విశ్వాసశ్శ్రద్ధా పంచాక్షరే శుభే॥ ౧౦
ఆసక్తిశ్శివశబ్దే చాత్యాదరో లింగధారణే।
భక్తాంతరే పరాప్రీతిశ్శివకార్యే మనోజయః॥ ౧౧
శైవశాస్త్రే పరా శ్రద్ధా తదధ్యాపనమన్వహం।
స్వాయమధ్యయనంచాపి భక్తలక్ష్మాణి షిశ్చను॥ ౧౨

తా॥ ఇప్పుడు భక్తిచిహ్నములు చెప్పెద వినుము. అవి యెవ్వియనిన, రుద్రాక్షధారణమునందుఁ బ్రీతియు, భస్మత్రిపుండ్రమునందు విశ్వాసంబును పంచాక్షరమంత్రమునందు శ్రద్ధయు, శివశబ్దమునందు నాసక్తియు, శివలింగధారణమునందు నత్యాదరంబును, శివభక్తునందు పరమానురాగంబును, శివకార్యంబునందు పరమోత్సాహంబును,

శివాగమములయందు నధికవిశ్వాసంబును, శివాగమముల నొరు
జెప్పుటయు, తాను జదువుచుండుటయు నను నివి శివభక్తలక్షణ
లని నిశ్చయింపుము.

మూ॥ తేషాం బాహ్యాని చిహ్నాని దశసంతి బృహస్పతే।
ప్రథమం భస్మరుద్రాక్షలింగధారణమీరితం॥
ద్వితీయం గురుసేవాచ శివస్తోత్రం తృతీయకం।
నామోచ్చారణమీశస్యచతుర్థం పరికీర్తితం॥
పంచమం దేవదేవస్య పూజనం సముదీరితం॥
షష్ఠం శివాగమార్థాను సంధానమితిచోదితం॥
తథాశివపురాణానాం శ్రవణం సప్తమంవిదుః।
నమస్కారస్తు భక్తానామష్టమం ప్రథితంఖలు॥
నవమం శివభక్తానాం గృహభోజనమీరితం।
దానంచదశమంజ్ఞేయం శివభక్తేగురావపి॥
ఏవంబాహ్యానిచిహ్నాని కథితానిద శైవతు॥

తా॥ ఓబృహస్పతీ! ఆభక్తులకు బాహ్యచిహ్నములు
గలవు. వానిలో భస్మ రుద్రాక్ష శివలింగధారణము మొదటిది. గు
సేవ రెండవది. శివస్తోత్రము మూడవది. శివనామసంకీర్తనము నా
వది. శివపూజ ఐదవది. శివాగమములలోని యర్థము ననుసంధించు
ఆఱవది. శివపురాణములను వినుట యేడవది. భక్తులకు నమస్కా
రము సేయుట యెనిమిదవది. తనయింటియందు శివభక్తులను భోజ
జేయుట తొమ్మిదవది. శివభక్తులకును, గురువునకును దాన
సేయుట పదియవది. ఇవి బాహ్యములగు భక్తిచిహ్నములని
గ్రహింపుము.

మూ॥ త్రీణ్యాంతరాణిచిహ్నాని కథితాని మహాత్మనాం॥
శ్రుణుతాని యథావిద్వాన్మానసః ప్రథమోజపః।

పూజాచమానసీజ్ఞేయా ద్వితీయా పరమేశితుః॥ ౧౯
సాక్షాత్కారస్తృతీయస్తు స్వాంతరే పరమేశితుః॥

తా॥ ఈచెప్పిన బాహ్యచిహ్నములుగాక, భక్తులకు నభ్యంతర చిహ్నములు మూడు గలవు. వానిలో మానసికమగు జపము మొదటిది. పరమేశ్వరునకు మానసపూజసేయుట రెండవది. తనహృదయము నందు పరమేశ్వరరూపము నెప్పుడు భావించుచుండుట మూడవదియు నగును.

మూ॥ అంతరాణ్యపిబాహ్యాని యేషాంసంతియదాపునః। ౨౦
తదాపరాణిచిహ్నాని దశ తేషాంభవన్తిహి॥
కంఠేవికారః ప్రథమం గద్గదాఖ్యం ద్వితీయకం॥ ౨౧
జిహ్వాస్పందస్తృతీయంతుస్ఫురణంత్వోష్ఠయోరపి।
కంపనంచశరీరస్యచతుర్థం భక్తిలక్షణం॥ ౨౨
రోమాంచఃపంచమంజ్ఞేయం షష్ఠస్స్వేదోపికీర్తితం।
స్ఖలనం స ప్తమంజ్ఞేయమష్టమం బాష్పనిర్గమః॥ ౨౩
రోదనం నవమంచిహ్నం దశమం పారవశ్యకం।
ఏతానిదశచిహ్నానిభక్తేరుక్తాని శూలినా॥ ౨౪
ఉక్తాన్యేతానిచిహ్నానియేషాంసంతి మహాత్మనాం।
తే భక్తాశ్శంకరేజ్ఞేయాస్సర్వలోకైకపావనాః॥ ౨౫

తా॥ ఈచెప్పఁబడిన యాంతరచిహ్నములు, బాహ్యచిహ్నములును గలవారలకు మఱియుఁ బదిలక్షణములు గలుగును. అవి యెవ్వియనిన, కంఠమునందు వికారము గలుగుట మొదటిది. గద్గద స్వరము రెండవది. నాలుక, పెదవులును గదలుచుండుట మూడవది. శరీరము వడకుట నాల్గవది. రోమములు గగుర్పొడుచుట యైదవది చెమట గలుగుట యాఱవది. తొట్రుపాటు ఏడవది. కన్నీరు వెల్వడుట యెనిమిదవది. రోదనము తొమ్మిదవది. మైమరచుట పదియవది.

ఈపదియును నంతరంగభక్తిచిహ్నములగును. ఇట్టి లక్షణములు గల శివభక్తులు సర్వలోకమును పవిత్రము గావింతురు.

మూ॥ అపారోభక్తమహిమాతద్వక్తుం కేనశక్యతే।
స్వభక్తాన్నేవ దేవోపి యత్స్వస్మాన్మనుతేఽధికాన్॥

తా॥ అనంతమగు శివభక్తుల మహిమము వచింపనెవ్వరితరము! ఏలన, పరమేశ్వరుండును తనభక్తులు తనకంటెనధికులని తలంచుచుండుగదా?

మూ॥ భిన్దన్తి శైలానుదధీన్పిబన్తి
వ్యత్యాస యన్తి క్షితి మన్తరిక్షం।
తృణీకృతబ్రహ్మ పురన్దరాణాం
కిందుష్కరం శంకర కింకరాణాం॥

తా॥ శివభక్తులు పర్వతముల భేదించుచున్నారు. సముద్రము పానముచేయుచున్నారు. భూమ్యాకాశములను తలక్రిందు సేయుచున్నారు. బ్రహ్మేంద్రాదులను తృణముగాదలంచు శంకరకింకరులకసాధ్యమగుపని యేమికలదు? పరశురాముడు క్రౌంచగిరిని భేదించుటయు, అగస్త్యుడు సముద్రముల పానముసేయుటయు, ఆమహర్షియే హైమవతీ వివాహసమయమునందు, సకల భూతకోటియు హిమాద్రిప్రాంతము సేరుటచే నుత్తరపుదిశను క్రుంగినభూమిని శివాజ్ఞాతానుమాత్రము దక్షిణపుదిశకేగి సరిపరుచుటయు మొదలగు కృత్యములు శివభక్తి ప్రభావముననే చేసిరిగాన శివభక్తుల మహిమము వచింపశక్యముగాదని భావము.

మూ॥ అగస్త్యః కుంభజన్మాతు శివభక్త్యైవకేవలం।
పపౌసముద్రమతులం శివశక్త్యాప బృంహితః॥

తా॥ కడవయందుఃబుట్టిన యగస్త్యుండు కేవలము శివభక్తిచేతనే తనయందు శివునిశక్తి ప్రవేశించుటంజేసి సకలమగు సముద్రమును పానముచేసెను.

మూ॥ పితృహత్యాదిమోక్షాయ యేషాం వైపర్యవస్యతి ।
ఘటితాఘటనాస్సర్వే ప్రసిద్ధాఉత్తమోత్తమాః॥ ౨౯

తా॥ శివభక్తులుచేసిన పితృహత్యయు మోక్షమునకు సాధన మగుచున్నది. ఎట్లన, పూర్వకాలమున, కాటకోటడనునొక గొల్ల వాడు మేకపెంటికను లింగముగా భావించి పాలతోనభిషేకము సేయుచుండగా వానితండ్రివచ్చి నవ్వుచు నామేకపెంటికను కాలితోదన్నను అదిగాంచి వానిపుత్రుండు కోపించి గండ్రగొడ్డలితో తనతండ్రి తల డొల్లి నేలపడునట్లు వేసెను. దానితో తనదు సంసారవ్యాఘ్రంబు తలయు దెగిపోయెనో యన నాకాటకోటండు శివానుగ్రహంబును జేసి ముక్తుండయ్యెను. అని పురాణగాధగలదు. మఱియు ఘటితమైనదాని విఘటనసేయుటయందును, విఘటనము గలవానిని సంఘటన సేయుటయందును శక్తిగలవారు శివభక్తులని యెఱుంగనగును.

మూ॥ అణుర్మహాత్వంసంయాతి మహచ్చాణుత్వమావ్రజేత్ ।
స్థలంజలధితాంయాతి జలధిస్థలతాంవ్రజేత్ ॥ ౩౦

సంకల్పమాత్రతోయేషాం శివానుభవశాలినాం ।
మహిమావాఙ్మనోదూరస్తేషాం కైర్వాత్యతేకథం॥ ౩౧

తా॥ శివానుభవము గల మహనీయుల యొక్క సంకల్పమాత్రముచేత అణువు మహత్తుగాను, మహత్తు అణువుగాను, స్థలము సముద్రముగాను, సముద్రము స్థలముగాను నగును. అట్టి మహాత్ములయొక్క వాఙ్మనసులకు నందని మహిమము నెవ్వరేవిధమునం జెప్పఁగలరు? ఎవరలును నెట్లును చెప్పఁజాలరు.

మూ॥ తస్మాత్సర్వోత్తమాభక్తాశ్శివేనైవోదితంపురా ।
యత్సృదిచ్ఛంతిమేభక్తాస్త్రైలోక్యేపిచదుర్లభం ॥ ౩౨
తత్సద్యస్సాధయిష్యామి వ్రతమేతత్సదామమ ।

తా॥ కావున, నాభక్తులు సర్వాధికులనియు, నాభక్తులెద్దిగోరుదురో అది త్రైలోక్యంబున నందరానిదైనను దానినప్పుడె సాధించుటే నావ్రతమనియు శివుఁడె చెప్పియుండెను.

మూ॥ ఐహికాముష్మికాభోగా మోక్షస్తత్సంగతోభవేత్।
భక్తసంగస్తుసర్వేషాం సర్వకామఫలప్రదః ॥
తత్పాదపాంసుభిః పూతం భవనం చేతరద్వనం ॥

తా॥ ఐహికములు నాముష్మికములు నగు భోగములును మోక్షంబును భక్తసేవచే కలుగును. భక్తజనసాంగత్యము సర్వజనులకు సర్వఫలంబుల నొసంగును. మఱియు, శివభక్తుల పాదధూళిచే పవిత్రమైనదే భవనమనియు, కడమది వనమనియు ననఁబడును.

మూ॥ తద్యథాశక్తి సంపూజ్యాశ్శివభక్తాహి తేప్పునా।
యదమీమానుషాకారాః ప్రత్యక్షపరమేశ్వరాః॥

తా॥ శివభక్తులు మనుష్యరూపముదాల్చిన ప్రత్యక్షపరమేశ్వరులేగాన తనకు హితము గోరినవాఁడు శివభక్తులను శక్తికొలది యెప్పుడు పూజించుచుండవలయు.

మూ॥ భక్తేఽధికాస్వేష్టలింగాదుత్తమాభక్తిరుచ్యతే।
భక్తేష్టలింగయోస్తుల్యామధ్యమేతినిగద్యతే॥
భక్తేన్యూనాస్వేష్టలింగాత్కనిష్ఠాభక్తిరీర్యతే।
తస్మాద్ధీకుశలోనిత్యముత్తమాం భక్తిమాశ్రయేత్॥

తా॥ తన యిష్టలింగముమీఁదికన్న భక్తునందు నధికభక్తిగలిగియుంట యుత్తమభక్తియని చెప్పఁబడును. తన యిష్టలింగముమీఁదను భక్తునిమీఁదను సమానమగు భక్తిగలిగియుంట మధ్యమభక్తియనఁ బెన్నఁబడును. తనయిష్టలింగముకంటె భక్తునందు తక్కువభక్తిగలిగి యుంట కనిష్ఠభక్తియని చెప్పఁబడును. కావున బుద్ధిమంతుఁడు ఉత్తమభక్తినె సంపాదింపవలయు. మాహేశ్వరునినె యధికముగాఁ బూజింపవలయుననుట.

మూ॥ సర్వతీర్థాభిషేకాచ్చ సర్వయజ్ఞవిధానతః।
సర్వదేవారాధనాచ్చ భక్తపూజాగరీయసీ॥ ౩౮

తా॥ సకలపుణ్యతీర్థములయందు స్నానము చేయుటకంటెను, సర్వయజ్ఞములుసలుపుటకంటెను, సర్వదేవతలనుపూజించుటకంటెను, శివభక్తులను పూజించుట అధికఫలప్రదమగును.

మూ॥ భక్తావంకురితాయాం బంధుమతిర్భక్తపుంగవే భవతి।
తస్యాంతు పుష్పితాయాం భక్తే నరనాథభావనోదేతి॥ ౩౯
ఫలితాయాం కిల తస్యాం భక్తస్సాక్షాచ్ఛివస్స్ఫురతి।
ఏవంభక్తివిశేషాత్పుంసాం భక్తోహిభాసతేబహుధా॥ ౪౦

తా॥ శివభక్తి యంకురించినమీద శివభక్తుఁడు బంధువుఁడుగా దోఁచును. ఆభక్తి యధికమైనప్పుడు భక్తుఁడు ప్రభువుగాదోఁచును. మఱియు నాభక్తి సంపూర్ణమైనప్పుడు శివభక్తుఁడు సాక్షాత్తు శివుఁడుగానె దోఁచును. ఇట్లు తనకుగల భక్తియొక్క తారతమ్యమువలన శివభక్తుఁడు నానావిధములుగా గనఁబడుచుండును.

మూ॥ తస్మాద్గ్రాహ్యం ధనం భూయస్తస్మైదేయంచ సర్వదా।
భక్తాద్భక్తాయ నాన్యస్మాదిత్యేవం శివశాసనం॥ ౪౧

తా॥ ధనమును భక్తునివల్లనె గ్రహింపవలయు. భక్తునకే యియ్యవలయుగాని యితరునివల్ల గ్రహించుటయు, ఇతరునకు నిచ్చుటయుఁ గూడదని శివశాసనము గలదు.

మూ॥ యస్తుమల్లాంఛనధరస్సచపూజ్యోయథావ్యహం।
భక్తద్రోహీమమద్రోహీత్యేతద్ధి శివశాసనం॥ ౪౨

తా॥ నాలాంఛనములైన భస్మరుద్రాక్షశివలింగములను ధరించినవానిని నన్నుఁ బూజించినట్లు పూజింపవలయు. నాభక్తునకు ద్రోహము చేసినవాఁడు నాకు ద్రోహము చేసినవాఁడే యగునని శివశాసనము గలదు.

మూ॥ బంధవోమమభక్తాస్స్యుర్భక్తానాంబంధురస్మ్యహం।
ఇతినిశ్చయవాన్భక్త ఇత్యే తచ్ఛివశాసనం॥

తా॥ నాకు శివభక్తులే బంధువులు. నేను శివభక్తులకే బం
ధువుఁడను. అను నిశ్చయభావముగలవాఁడు భక్తుఁడగుగాని యితరుఁ
నాభక్తుఁడుగాఁడని శివశాసనము గలదు.

మూ॥ కాంక్షేప్రసాదం భక్తానాం భక్తాఏవగతిర్మమ।
భక్తదాస్యంభావనీయమిత్యేతచ్ఛివశాసనం॥

తా॥ నేను శివభక్తుల యనుగ్రహము గోరుచున్నాను. నా
శివభక్తులుదక్క వేరుగతిలేదు. నేను శివభక్తులకు దాసుఁడను.
భక్తుఁడెల్లపుడు భావించుచుండవలయునని శివశాసనము గలదు.

మూ॥ దూరేవిలోక్యమద్భక్తా నభిగమ్యాభివాద్యచ।
గృహమానీయ యష్టవ్యమిత్యేతచ్ఛివశాసనం॥

తా॥ దూరమునందుండగానె నాభక్తులనుచూచి యెదు
నమస్కరించి, యింటికి గొనివచ్చి, శక్తికొలది పూజింపవలయు
శివశాసనము గలదు.

మూ॥ భక్తోలోకహితార్థీస్యాదహంభక్తహితేరతః।
ఇతిభక్తాన్సుయష్టవ్యమిత్యేతచ్ఛివశాసనం॥

తా॥ భక్తుఁడు లోకహితము గోరువాఁడు. నేనైననో భ
హితమును గోరువాఁడను. ఈనిశ్చయము నెఱింగి భక్తులను బూజిం
బూజింపవలయునని శివశాసనము గలదు.

మూ॥ మద్భక్తానసమర్చ్యైవ మత్పూజాక్రియతేయది।
సాపూజావిఫలైవస్యాదిత్యేతచ్ఛివశాసనం॥

తా॥ నాభక్తులను బూజింపక నన్నుమాత్రము పూజించి
అట్టిపూజవ్యర్థమేయగునని శివశాసనము గలదు.

మూ॥ తదాత్మహితమాకాంక్షమాణోభక్తాన్స్వపూజయేత్।
తేషాంయథామనస్తృప్తిస్సైవపూజానిగద్యతే॥ ౪౯

తా॥ కావున, తనకు మేలుకోరినవాఁడు భక్తులను పూజింపవలయు. భక్తుల మనస్సు సంతోషపెట్టుటయే వారిని పూజించుటయని యెఱుంగవలయు.

మూ॥ ఇదంతే భక్తమాహాత్మ్యం భోగమోక్షార్థసిద్ధిదం॥
అబ్రువం సంగ్రహేణాథకిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి॥ ౫౦

తా॥ భోగమోక్షసాధనమగు శివభక్తమహిమమును సంగ్రహముగా నీకిపుడు చెప్పితిని. ఇఁకమీఁద నెద్దాని వినగోరుదువో తెలుపుము.

ఇతి శ్రీచంద్రజ్ఞానే
ఉత్తరభాగే
శివశాసనే
క్రియాపాదే.
చతుర్థః పటలః.



పంచమః పటలః.

ఆరభ్యతే.

బృహస్పతిరువాచ = బృహస్పతి యీగతి నిట్లని యడిగెను.
మూ॥ అశేషజ్ఞాన నిలయ లోకానుగ్రహ తత్పర।
అనంతమహిమాంభోధేఽనంతరుద్ర నమోస్తుతే॥ ౧

తా॥ సకలజ్ఞానములకు స్థానమైన వాఁడవును, లోకముల ననుగ్రహింప నాసక్తి గలవాఁడవును, అనంత మహిమమునకు సాగరముం బోలువాఁడవు నగు నోయనంత రుద్రుఁడా, నీకునమస్కారము.

మూ॥ మహిమాన మిహానంతం భక్తానాం శివయోగినాం।
కృతకృత్యోస్మి సంజాత ఆకర్ణ్య శ్రీమదాననాత్॥ 2

తా॥ శివధ్యాన పరులగు భక్తులయొక్క యనంతమగు మహిమమును మీవలన విని కృతార్థుఁడనైతిని.

మూ॥ శుశ్రూషురద్య భూమానం పాద తీర్థప్రసాదయోః।
తమప్యావేద్య విశ్వేశ కృప యానుగృహాణమాం॥ 3

తా॥ ఇప్పుడు పాదతీర్థముయొక్కయు, ప్రసాదముయొక్కయు మహిమమును వినగోరుచున్నానుగాన దయతో వీనినిగూడదెలిపి యనుగ్రహింపుము.

అనంతరుద్ర ఉవాచ = నావిని యనంతరుద్రుఁడిట్లనియె.

మూ॥ శ్రుణుతే కథయిష్యామి పాదతీర్థ ప్రసాదయోః।
స్వరూపమపి మాహాత్మ్యమీశ్వరేణ ప్రకాశితం॥

తా॥ పాదతీర్థ ప్రసాదములస్వరూపమును, మాహాత్మ్యమును పూర్వమీశ్వరుండు తెలిపియుండెను. దానిని నీకుఁ జెప్పుచున్నాను వినుము.

మూ॥ పాదతీర్థం త్రిధా శంభోర్గురుజంగ మయోరపి।
దీక్షాశిక్షా జ్ఞానమితి త్రిసంజ్ఞం తద్భవత్యహో॥

తా॥ గురుపాదోదకము, శివపాదోదకము, మహేశ్వర పాదోదకమునని పాదతీర్థము మూఁడువిధములు. ఈమూఁడిటికిని దీక్షాపాదోదకమనియు, శిక్షాపాదోదకమనియు, జ్ఞానపాదోదకమనియు మూఁడు పేర్లుగలవు.

మూ॥ పాదతీర్థం సదా పేయం భవబంధ ముముక్షుభిః।
గురోరభీష్ట లింగస్య చరస్యాపి విశేషతః॥

తా॥ సంసారబంధము క్తిని గోరువారు గురువుయొక్కయు, ఇష్ట లింగముయొక్కయు, మాహేశ్వరునియొక్కయు పాదోదకమును పానము సేయుచుండవలయు. ఎట్లన,

మూ॥ గురోశ్చ్వరస్యచాలాభ ఇష్టలింగ పదోదకం।
లబ్ధ్వా గుర్వాది పాదోదం భావయేన్మనసైవతత్॥ ౭

తా॥ గురువుగాని, మాహేశ్వరుఁడుగాని యిద్దఱును దొరకని నప్పుడు ఇష్టలింగపాదోదకమునే గురుచరుల పాదోదకముగా గూడ భావించి యద్దానినే పానము సేయవలయు.

మూ॥ చరవర్జం గురోర్లాభేలబ్ధ్వాగురుపదోదకం।
గురుజంగమపాదోదం లబ్ధవానితిభావయేత్॥ ౮

తా॥ మాహేశ్వరుఁడు దొరకక గురుఁడుమాత్రమే లభించి నప్పుడు గురుపాదోదకమునే మాహేశ్వరపాదోదకముగా గూడ భావించి గ్రహించి గురుచరుల పాదోదకమును గ్రహించితిననియే భావింపవలయు.

మూ॥ గురోశ్చరస్యలాభేచలబ్ధ్వాచరపదోదకం।
తదేవ గురుపాదోదమితి మత్వాపిబేత్తదా॥ ౯

తా॥ ఇఁక గురుఁడు, మాహేశ్వరుఁడు నిద్దఱును సంభవించి నప్పుడు మాహేశ్వరపాదోదకమునే గ్రహించి యదియే గురుపాదోద కంబునని భావింపవలయు. ఇష్టలింగమెల్లప్పుడును సన్నిహితమేగాన గురుచరులు సంభవించినను, సంభవింపకున్నను ఇష్టలింగపాదోదకము నిత్యము గ్రాహ్యమని భావము.

మూ॥ పాద్యం దత్వావిభోస్తస్యగృహ్ణీయాత్పాదతోజలం।
శతధారేణమంత్రేణపంచాక్షరయుతేనచ॥ ౧౦

ధృత్వాశిరసిపాదాంబుమహత్ఫలమవాప్నుయాత్।
ఋతం సత్యమితిప్రాశ్యచానంతఫలమశ్నుతే॥ ౧౧

తా॥ పరమేశ్వరుని పాదములయందు పాద్యమొసఁగి యా... మును శతధారమను మంత్రమును, పంచాక్షరీమహామంత్రమును ... చుచు శిరమున జల్లుకొనునెడ మహాఫలంబు గలుగును. ఆజలము ... బుతగ్ంసత్యం అనుమంత్రముతో పానముచేయునెడ అనంతఫల... గలుగును.

మూ॥ అకాలమృత్యుమథనం సర్వవ్యాధివినాశనం।
సర్వపాపోపశమనం శంభోః పాదోదకం శుభం॥

మంగళం సర్వమాంగల్యం సర్వపావనపావనం।
దుష్టగ్రహోపశమన మిష్టసిద్ధిప్రదాయకం॥

సర్వదుఃఖప్రశమనం సర్వోపద్రవనాశనం।
సర్వసిద్ధిప్రదం సద్యస్సర్వేషాం ముక్తిదాయకం॥

తా॥ పరమేశ్వరుని పాదోదకమెట్టిదనిన, అకాలమృత్యు... శమింపఁజేయునదియు, సర్వవ్యాధులను దొలగించునదియు సకల... ములనడంచునదియు, సర్వమంగళకరములలో నెల్లమంగళకరమైనది... పావనములలో నెల్ల పావనమైనదియు, దుష్టగ్రహములను బారదో... నదియు, ఇష్టసిద్ధి నొసఁగునదియు, సర్వదుఃఖముల వారించునదియు సర్వోపద్రవములఁ బోకార్చునదియు, సర్వసిద్ధుల గలిగించునదియు ముక్తి నొసఁగునదియు నగునుగాన నిట్టిదింకొక్కటి లేదు.

మూ॥ ఏకమూర్తేస్త్రయోభాగా. గురుర్లింగంచజంగమః।
తదేవం గుణకం గ్రాహ్యం గురుజంగమయోరపి॥

తా॥ గురులింగజంగమములు మూఁడు నీశ్వరరూపము లెగా... గురుచరుల పాదోదకంబు నిట్టిదేయని గ్రహింపవలయు.

మూ॥ శోషణం పాపసంకస్యదీపనంజ్ఞానతేజసః।
గురోఃపాదోదకంచిత్రం సంసారద్రుమనాశనం॥

తా॥ లోకమునందు బురదను పలచనగాఁ జేయుటయు, దీపము నార్పుటయు, చెట్లనుఁ బెంచుటయు, జలముయొక్క స్వభావ గుణమైయున్నది. గురుని పాదజలమైననో పాపమను బురద నెండించుచును, జ్ఞానమనుదీపమును వెలుగఁజేయుచును, సంసారమనువృక్షమును నశింపఁజేయుచునున్నది. ఇది యెంత చిత్రమో? చూడుము.

మూ॥ సర్వతీర్థాభిషేకేయాశుద్ధిర్మనసిజాయతే।
గురోరంఘ్రిస్పర్శజలే శిరసాధారితేహిసా॥ ౧౭

తా॥ సకలతీర్థములయందు స్నానముచేయగా నెట్టి పవిత్రత గలుగునో గురుని పాదజలమును శిరమున ధరింపగా నట్టి పవిత్రత సంభవించును.

మూ॥ సప్తసాగరపర్యన్తం తీర్థస్నాన ఫలంసదా।
గురోరంఘ్రి పయోబిందు సహస్రాంశం సపూరయేత్॥ ౧౮

తా॥ సప్త సముద్రముల వరకుగల సకల తీర్థములయందు స్నానము సేయుటంజేసి గలుగుఫలము గురుని పాదతీర్థముయొక్క యొకబిందువులోని సహస్రాంశమునైన బోలనేరదు.

మూ॥ చరపాదోద మహిమావర్ణితుం కేన శక్యతే।
తద్విమోచయితుం సద్యశ్శక్నుతే యచ్చరాచరం॥ ౧౯

తా॥ మాహేశ్వరపాదోదకముయొక్క మహిమను వర్ణింప నెవ్వరితరమగును? ఏలన, మాహేశ్వర పాదోదకము చరాచరాత్మకమగు జగమునంతను ముక్తినొందింపఁ జాలినదిగదా?

మూ॥ అథవక్ష్యే ప్రసాదస్య రూపంతద్వైభవంశృణు।
గురులింగ జంగమానాం భుక్తశేషః ప్రసాదకః॥ ౨౦

తా॥ ఇఁకమీఁద ప్రసాదముయొక్క స్వరూపమును, మహిమమును చెప్పుచున్నాను. వినుము. గురులింగ జంగమముల భుక్తశేషము ప్రసాదమని చెప్పఁబడును.

మూ॥ శుద్ధశిద్ధ ప్రసిద్ధాఖ్యస్సుహి ముక్త్యైకసాధనః।
ద్వయోస్త్రయాణాం వాలాభే గ్రాహ్యోయం పాదతీర్థవత్॥

తా॥ ఇందు, శివప్రసాదము శుద్ధమనియు, గురుప్రసాదము సిద్ధమనియు, చరప్రసాదము ప్రసిద్ధమనియు, జెప్పఁ బడుచుండును. ప్రసాదమే ఇట్టి ముక్తికిఁబరమ సాధనమైనది. గురుచరు లిద్దఱుగా వారిలో నొక్కరుమాత్రముగాని సంభవించినప్పుడు లోగడచెప్పి పాదతీర్థముంబలె ప్రసాదముగూడ గ్రహింపవలయు. అనగా, గురు చరులిద్దఱు సంభవింపనప్పుడు శివప్రసాదమునె త్రివిధప్రసాదముగా భావించి గ్రహింపవలయును. గురుచరులిద్దఱు సంభవించినప్పుడు చర ప్రసాదమునె గురుప్రసాదముగాగూడ భావించి గ్రహింప వ యును. చరుడులేక గురుఁడుమాత్రము సంభవించినప్పుడు గురుప్రసా మునె చరప్రసాదముగాగూడ భావించి గ్రహింప వలయునని యెఱు వలయును.

మూ॥ శివేనభుక్తంభుంజీయాత్తత్పీతంహిజలంపిబేత్।
శివాఘ్రాతం సదాజిఘ్రేదేవధర్మస్సనాతనః॥

తా॥ శివుఁడు భుజించిన ప్రసాదమునే భుజింపవలయు శివుఁడు పానముసేసిన జలమునే పానముసేయవలయును. శివుఁడా ఘ్రాణించిన పుష్పాదికమునె వాసనచూడవలయును. అనఁగా శివున నర్పింపక యేదైన ననుభవింపరాదనుట. ఈధర్మము సనాతనమైన శ్రు॥ రుద్రేణాత్తమశ్నన్తిరుద్రపీతంపిబన్తి రుద్రాఘ్రాతం జిఘ్ర అనుజా బాలశ్రుతియు నీయర్థమును దెలుపుచున్నది.

మూ॥ భుంజతేయేతు సమ్మూఢా స్త్ర్యంబకాయాసమర్పితం।
తేభుంజతేక్రిమీనేనాంస్యధోగచ్ఛంతి శాశ్వతం॥

తా॥ ఇఁక నేమూఢులు పరమేశ్వరునకు నర్పింపని పదార్థ భుజింతురో వారలు క్రిములను, పాపములను భుజించువారై శాశ్వ మగు నధోగతిని పొందుదురు.

శ్రు॥ త్రిగుస్పీత మశ్నీయాద్యదిపాప్మం శివానర్పితం భుంక్త్వా అఘం భుంక్త్వాఽధోగచ్ఛతి అని కారకశ్రుతియు నీయర్థమును నిర్ధారణ చేయుచున్నది.

మూ॥ పత్రంపుష్పంఫలంతోయమన్నపానాద్యమౌషధం।
అసమర్ప్యనభుంజీతభగవన్తం సదాశివం॥ ౨౪

తా॥ పత్రము, పుష్పము, ఫలము, జలము, అన్నపానములు, ఔషధము మొదలైనవానిలో నేదైనను పరమేశ్వరునకు నర్పింపక గ్రహింపఁగూడదు.

మూ॥ శబ్దస్పర్శౌరూపరసౌగంధోమన్తవ్యమేవచ
అసమర్ప్యనభుంజీత భగవన్తముమాపతిం॥ ౨౫

తా॥ శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము మన్తవ్యమునను సర్వేంద్రియవిషయములనుగూడ పరమేశ్వరునకు నర్పించియే యనుభవింపవలయుఁగాని యర్పింపక యనుభవింపఁగూడదు.

మూ॥ యదింద్రియాగతం కించిద్యత్సుఖం తచ్ఛివార్పితం।
తత్ప్రసాదంచ భోక్తవ్యం తదింద్రియముఖేనచ॥ ౨౬

తా॥ ఏయింద్రియమునకు విషయోపభోగముచే నేసుఖము గలుగునో, అదియంతయు శివార్పితము నేసి యది శివప్రసాదమను భావముతోన యాయాయింద్రియములచే ననుభవింపవలయు.

మూ॥ సంయోగేషువియోగేషుచాణుమాత్రసుఖానిచ।
ఇష్టలింగే సమర్ప్యైవతాని భుఞ్జ్యాన్నిరంతరం॥ ౨౭

తా॥ విషయములయొక్క సంయోగవియోగములయందు సంభవించు నేమాత్రమైన యల్పసుఖములైనను నిష్టలింగమునకు నర్పించియే యనుభవింపవలయు.

మూ॥ సమర్పణం ద్వివిధాప్రోక్తం స్థూలసూక్ష్మవిభేదతః।
యచ్ఛబ్దాద్యవిభాగేనైవేష్టలింగే సమర్ప్యతే॥
ద్రవ్యంతత్స్థూలమిత్యుక్తమర్చాంగంతత్రకీర్తితం॥

తా॥ స్థూలమనియు, సూక్ష్మమనియు సమర్పణము రెండు వి
ములు. ఇందు శబ్దాదులగు విషయములను వేర్వేరుగానర్పింపక స
దితమగు ద్రవ్యముమాత్రము నర్పించుట స్థూలమని చెప్పఁబడును.

మూ॥ శబ్దాదివిషయాయత్ర భావేనైవనచాన్యథా॥
సమర్ప్యతే రూపమేవతద్ధిస్థూలంప్రకీర్తితం॥

తా॥ ఎప్పుడు శబ్దాదివిషయములు విభాగముచే నర్పింపఁబ
నను నవి యన్నియు భావముచేతనే యర్పింపఁబడుచు రూప
మాత్రమే క్రియచే నర్పింపఁబడునో అదియే స్థూలమని యెఱు
వలయు.

మూ॥ అర్చాంగం స్థూలమిత్యుక్తం సూక్ష్మంస్యాదాపభోగికం॥
పదార్థభోగావసరే శబ్దాదీనాంవిభాగతః।
సమర్పణం హితత్సూక్ష్మమిదంస్యాత్సార్వకాలికం॥

తా॥ ఈచెప్పిన స్థూలార్పణము పూజాంగమగును. ఇక
భోగికమైనది సూక్ష్మమని చెప్పఁబడును. ఔపభోగికమనగా పదా
మునను భవించునపునప్పుడెల్ల శబ్దాదుల నాయాయింద్రియగతము
యాచారాది లింగములకు నర్పించుట సూక్ష్మార్పణమని చెప్పఁబ
ఇది శబ్దాదివిషయముల ననుభవించునప్పుడెల్ల చేయవలసినది
సార్వకాలికమగుచున్నది.

మూ॥ యదాయేనేంద్రియేణవిషయోహ్యుపభుజ్యతే।
తదింద్రియగతేలింగేహ్యర్పణం సూక్ష్మమీరితం॥

తా॥ ఏసమయమునందు నేయింద్రియముచే నేవిషయము
భవింపవలసివచ్చినను ఆవిషయము నెల్ల నాయాయింద్రియగతము
నాచారాదిలింగములకు నర్పించుటయే సూక్ష్మార్పణమగును.

మూ॥ సమర్పణ విశేషంయే భక్తా స్సమ్యగ్విజానతే।
శంభోః ప్రసాదమతుల మశ్రమంవిన్ద తేహితే। 33

తా॥ ఇట్టి సమర్పణ విశేషమును ఏభక్తులు బాగుగా నెఱుంగుదురో వారు నిరుపమానమైన పరమేశ్వరుని ప్రసాదము ననాయాసముగా నొందఁగలరు.

మూ॥ సమర్పితః ప్రసాదైక కారణ త్వాన్మహేశితుః।
ప్రసాద త్వేన విఖ్యాతః పరమానంద దాయకః॥ 34

తా॥ పరమేశ్వరునకు సమర్పించిన పదార్థము పరమేశ్వరుని ప్రసాదమునకు సాధనమైనదిగాన ప్రసాదమని వ్యవహరింపఁ బడుచున్నది. ఇదియే పరమానంద ప్రదమగును.

మూ॥ ఋతంసత్యం పరం బ్రహ్మామృతమిత్యపి గీయతే।
ప్రసాద స్తస్యమహిమా కేనవావర్ణ్యతే కథం॥ 35

తా॥ ఋతమనియు, సత్యమనియు, బ్రహ్మమనియు, అమృతమనియు నీప్రసాదము కీర్తింపఁ బడుచున్నది. ఎట్లన, శ్రు॥ ఋతంత్వా సత్యేన, సత్యంత ర్త్వేన ఈ మొదలగు శ్రుతులు ఋతమనియు, సత్యమనియు దెల్పుచున్నవి. శ్రు॥ అన్నంబ్రహ్మ, అనుశ్రుతి అన్నము బ్రహ్మమని చెప్పుచున్నది. శ్రు॥ ప్రాణేనివిష్టోఽమృతం జుహోమి ఈ మొదలగు శ్రుతులు ప్రసాదము నమృతమని ప్రశంసించుచున్నవి ఇట్టిప్రసాదము యొక్కమహిమము నెవ్వఁడైననెట్లు వర్ణింపఁగలఁడు?

మూ॥ గురూచ్ఛిష్టం పురోడాశం చరస్యాపి విశేషతః।
చరగుర్వోః ప్రసాద స్తద్ధ్రువం పావిత్ర్యదాయకః॥ 36

తా॥ గురూచ్ఛిష్టము పురోడాశమగును. విశేషించి చరుని ప్రసాదంబు నట్టిదియెయగును. కావున గురుచరుల యొక్కప్రసాదము పావిత్ర్య ప్రదమైనది.

మూ॥ ప్రసాదమహిమాచిన్త్యః ప్రోక్తో దేవగురోతవ।
గోపనీయః ప్రయత్నేన కిమన్యచ్ఛ్రోతు మిచ్ఛసి॥ 3

తా॥ ఓబృహస్పతీ, నీకు అచింత్యమగు ప్రసాదము యొక్క మహిమము తెలిపితిని. ఇది నాస్తికులకు నెఱుక పడకుండునట్లు దాఁచదగినది. ఇంక దేనిని వినగోరుచున్నావో అడుగుము.

ఇతిశ్రీచంద్రజ్ఞాన ఉత్తరభాగే
శివశాసనే
క్రియాపాదే
పంచమః పటలః.

---

షష్ఠః పటల ఆరభ్యతే.

బృహస్పతిరువాచ = బృహస్పతి యిట్లనియె.

మూ॥ అప్రిమేయప్రభావాఢ్య జగదీశ నమోస్తుతే।
శ్రుత్వాప్రసాదభూమానం కృతకృత్యోస్మిసాంప్రతం॥

తా॥ అప్రమేయమగు ప్రభావముగలవాఁడవును, జగదీశ్వరుఁడవునగు నో యనంతరుద్రుఁడా, నీకు నమస్కారము. ప్రసాదము యొక్క మహిమమును విని కృతకృత్యుఁడనేనైతిని.

మూ॥ షష్ఠస్యభస్మనశ్చాపియన్మాహాత్మ్యమనుత్తమం।
తదప్యావేద్యకృపయాధన్యం సంపాదయాద్యమాం॥

తా॥ అయినను అష్టావరణములలో నాఱవదియగు భస్మము యొక్క మహిమమునుగూడ దెలిపి యింకను నన్ను ధన్యునిగాఁజేయుము.

అనంతరుద్రఉవాచ = నావిని యనంతరుద్రుఁ డిట్లనియె.

మూ॥ బ్రహ్మన్నావేదయిష్యామి భస్మసంపాదనం తథా।
ధారణం వైభవంచాపి సావధానమనాశృణు॥

తా॥ ఓబృహస్పతీ, నీకు భస్మమును సంపాదించు విధమును, ధరించుమార్గమును, మాహాత్మ్యమునుగూడ దెలుపుచున్నాను. అవహితచిత్తుఁడవై వినుము,

మూ॥ విద్యాశక్తిస్సమస్తానాంశక్తిరిత్యభిధీయతే।
గుణత్రయాశ్రయావిద్యాసావిద్యాచ తదాశ్రయా॥ ౪

తా॥ సకలమైనవానిలో విద్యాశక్తి ముఖ్యమైనదని చెప్పఁబడుచున్నది. అట్టి విద్యాశక్తి త్రిగుణములను, త్రిగుణములు విద్యాశక్తిని పరస్పరము నాశ్రయించియుండును.

మూ॥ గుణత్రయమిదంధేనుర్విద్యాభూద్గోమయం శుభం।
మూత్రంచోపనిషత్ప్రోక్తం కుర్యాద్భస్మతతఃపరం॥ ౫

తా॥ గోవు గుణత్రయరూపమైనది. గోమయము విద్యాశక్తియె యగును. గోమూత్రము ఉపనిషత్తు అని చెప్పఁబడును. కావున నట్టి గోమయ గోమూత్రములచే భస్మమును సంపాదింపవలయు. ఎట్లన,

మూ॥ పంచాక్షరేణమంత్రేణధేనుం తత్రాభిమంత్రయేత్।
అష్టోత్తరశతేనాథప్రాశయేత్తుజలంతృణం॥ ౬
ఉపోష్యచచతుర్దశ్యాంశుక్లేకృష్ణేఽథవావ్రతీ।
పరేద్యుఃప్రాతరుత్థాయశుచిర్భూత్వాసమాహితః॥ ౭
కృతస్నానోధౌతవస్త్రఃపయోర్థంచసృజేచ్చగాం।

తా॥ పంచాక్షరీమంత్రముతో గోవును మంత్రించి తరువాత ఆమంత్రముతోనె నూరుమార్లు మంత్రించి గడ్డినిమేపి, జలముత్రాగింపవలయు. శుక్లపక్షమునగాని, కృష్ణపక్షమునగాని చతుర్దశినాడు ఉపవాసముండి వ్రతము నవలంబించి మరునాడు ప్రాతఃకాలముననె లేచి, పరిశుద్ధుఁడై మనసును నవధానముతోనునిచి, స్నానముచేసి, మడిపంచలు గట్టుకొని, గోవును నీరు త్రాగింపవలయు.

మూ॥ ఉత్థాప్యగాంప్రయత్నేన గాయత్ర్యా మూత్రమాహరేత్॥ ౮
సౌవర్ణేరాజతేతామ్రేధారయేన్మృణ్మయేఘటే॥

పౌష్కరేఽథవలాశేవాపాత్రే గోశృంగఏవవా॥
ఆదధీతహిగోమూత్రం మూలమంత్రేణ గోమయం।
అభూమిపాతంగృహ్ణీయాత్ పాత్రేపూర్వోదితేగ్రహే॥

తా॥ నీరు త్రాగి పండుకొనినతరువాత కొంతసేపటికి గోవును లేపి బంగారు, వెండి, రాగి, మొదలైనవానితోచేసిన పాత్రమునగాని మృణ్మయపాత్రమునగాని, తామరాకు దొన్నెలోగాని, ఆవుకొమ్మునందుగాని గాయత్రీమంత్రముతో గోమూత్రమునుబట్టి, యిట్టిపాత్రమునసె మూలమంత్రము జపించుచు గోమయమును క్రిందఁబడకుండ గ్రహింపవలయు.

మూ॥ గోమయంశోధయే ద్విద్వా న్మూలమంత్రాష్టకేనచ।
దశజప్తేనమంత్రేణ గోమూత్రస్థాన్య వర్జనం॥

తా॥ మూలమంత్రము నెనిమిదిమార్లు జపించుచు గోమూత్రమును శోధించి దానిలోని యితరవస్తువుల తొలగింపవలయు.

మూ॥ భవాయనమ మంత్రేణ గోమూత్రం గోమయేక్షిపేత్।
శర్వాయ నమఇత్యేవం పిండానాంచ చతుర్దశ॥
కుర్యాత్సం శోష్యకిరణై స్సప్తమూలేనచాహరేత్।
విదధ్యాదథ పూర్వోక్తపాత్రే గోమయపిండకాన్॥

తా॥ భవాయనమః అనుమంత్రముతో గోమూత్రము గోమయమునందు నుంచవలయు. శర్వాయనమః అను మంత్రము జపించుచు పదునాలుగు పిడకలుచేసి యెండఁబెట్టి యేడుమార్లు మూలమంత్రము జపించుచు వానిని తీసి మృణ్మయపాత్రలో నుంచవలయు.

మూ॥ శైవోక్తేనైవ విధినాప్రతిష్ఠాప్యాగ్ని మర్చయేత్।
పిండాంశ్చ నిక్షిపేత్తత్ర ఆద్యన్త ప్రణవేనతు॥
షడక్షరస్య మంత్రస్య వ్యావృత్తస్యతథాక్షరైః
స్వాహాన్తైర్జుహుయా త్తత్ర వర్ణైర్గోమయపిండకాన్।

తా॥ శివాగ్ని సంస్కారముతో నగ్నిని బ్రతిష్ఠించి, పూజించి, షడక్షర మంత్రములోని యొక్కొక యక్షరమునకు నాద్యంతముల యందు బ్రణవముచేర్చి స్వాహాంతముగా నాయక్షరములతో నీపిడక లను నగ్నియందు హోమముచేయ వలయు.

మూ॥ మూలేనైవాజ్యభాగౌచ ప్రక్షిపేదేవ సంయతః।
తతో నిధనపతయే త్రయోవింశం జుహోతిచ॥ ౧౬
హోతవ్యాః పంచబ్రహ్మాఖ్యా నమోదేవా యశంభవే॥

తా॥ మూలమంత్రముతో నాజ్యభాగముల నుంచవలయు. తరువాత, నిధనపతయేనమః అని మొదలగు నిరువదిమూడు మంత్రములతో హోమముచేయవలయు, అనంతరము పంచబ్రహ్మ మంత్రములతోను నీశ్వరు నుద్దేశించి హోమము చేయవలయు.

మూ॥ ఇతిసర్వాహుతీర్హుత్వాచతుర్థ్యంతైశ్చమంత్రకైః॥ ౧౭
భవశ్శర్వోమృడోరుద్రోహరశ్శంభుర్మహేశ్వరః॥
ఏతైశ్చజుహుయాద్విద్వాన్మూలమంత్రాష్టకం తథా॥ ౧౮
శివాయత్రియహోమశ్చస్విష్టకృన్మూలమంత్రతః।
ఇత్థం శేషంతునిర్వర్త్యపూర్ణపాత్రోదకం తథా॥ ౧౯
అష్టోత్తరశతేనాథ తర్పయేచ్ఛుద్ధమానసః।

తా॥ అని యాహుతులనెల్ల హోమముచేసి భవాయనమః, శర్వాయనమః, పశుపతయేనమః, మృడాయనమః, రుద్రాయనమః, హరాయనమః, శంభవేనమః, మహేశ్వరాయనమః అను నెనిమిది మంత్రములతోను, శివాయనమః అని ముమ్మారును, స్విష్టకృన్మంత్రముతోను హోమముచేసి, పూర్ణపాత్రములోని యుదకముతో నూటయెనిమిదిమార్లు తర్పణము సేయవలయు.

మూ॥ పంచబ్రహ్మేణ మంత్రేణ తజ్జలం శిరసిక్షిపేత్। ౨౦
దశవారం తుజప్తేనదిక్షుతోయంవినిక్షిపేత్॥

శైవానాం దక్షిణాందత్వా శాంత్యై పులకమాహరేత్।
ఆహరిష్యామి శైవానాం సర్వేషాం కర్మగుప్తయే।
జాతవేదసమేనంత్వాం పుళకైశ్ఛాదయామ్యహం॥
మంత్రేణానేనతంవహ్నిం పుళకైశ్ఛాదయేత్తతః॥

తా॥ పంచబ్రహ్మమంత్రములతో పూర్ణపాత్రలోని ... మును శిరమునఁ జల్లుకొని, పంచబ్రహ్మమంత్రములతో నాజలము ... పదిమార్లు మంత్రించి దిక్కులయందుఁ జల్లవలయు. శైవులకు దక్షిణల నొసంగి, వరిపొట్టు తీసికొనివచ్చి ఓయగ్నీ. సకలమైన శైవకర్మముల సంరక్షణకై నిన్ను వరిపొట్టుతో గప్పుచున్నాను. అను నర్థముగల 'ఆహరిష్యామి అను మంత్రముతో నాయగ్నిని వరిపొట్టుతో గప్పవలయు.

మూ॥ త్రిదినంజ్వాలనస్థిత్యై చ్ఛాదనంపుళకం స్మృతం।
శైవాంశ్చభోజయేద్భక్త్యా స్వయంభుంజీతవాగ్యతః॥
భస్మాధిక్య మభీప్సంస్తు చాధికం గోమయం హరేత్।
దినత్రయేణ యఢవా ఏకస్మిన్దివసేఽథవా॥
తృతీయేవా చతుర్థేవా ప్రాతస్స్నాత్వా సితాంబరః।
శుక్లభాస్వద్వజ్ఞసూత్రశ్శుద్ధ భస్మానులేపనః।
మూలమంత్రం సముచ్చార్య పుళకం భస్మసంత్యజేత్।

తా॥ మూడుదినములదనుక నగ్నియారిపోకుండుటకై వరిపొట్టు గప్పవలయును. తరువాత, శివభక్తులను భుజింపఁజేసి తాను భుజింపవలయు. భస్మమధికముగా గావలయునని యెంచువాఁడు గోమయము నధికముగా గ్రహించి లోగడ చెప్పిన చొప్పున హోమము చేయవలయు. మరునాడుగాని, మూడవనాడుగాని, నాల్గవనాడుగాని ప్రాతఃకాలమున స్నానముచేసి మడిపంచలు గట్టుకొని, శుక్లయజ్ఞోపవీతములను శుద్ధభస్మమును ధరించినవాఁడై మూలమంత్రము జపించి కాలిన వరిపొట్టును దొలఁగింప వలయు.

మూ॥ తతశ్చావాహనముఖా నుపచారాంస్తు షోడశ।
కృత్వాహ్యాత్య తథా చైవం తతో౽గ్నిముపసంహరేత్॥ ౨౮

తా॥ తరువాత నావాహనము మొదలుగా షోడశోపచారములతో శివాగ్నిని పూజించి యథావిధిగా శివాగ్ని నుపసంహారింపఁ జేయవలయు.

మూ॥ సద్యాదికేన మంత్రేణ గృహ్ణీయాద్భస్మ చోత్తమం।
తదనంతర మంత్రేణ ప్రమృజ్యచతతః పరం॥ ౨౯
సంయోజ్య, గంధసలిలైః కపిలామూత్రకేణవా।
చంద్రకుంకుమ కస్తూరీముశీరం చందనంతథా॥ ౨౯
అగరు ద్వితయంచైవ చూర్ణయిత్వాతు సూక్ష్మతః।
ప్రణవేనాహరే ద్విద్వాన్ బృహతోనటకానథ॥ ౩౦
అఘోర మంత్రతశ్చాథ దశజప్తేన మూలతః॥

తా॥ సద్యోజాత మంత్రముతో నాభస్మమును గ్రహించి వామదేవమంత్రముతో మెదిపి, చందినీ అత్తరుతోగాని, గోమూత్రముతోగాని తడిపి, దానియందు పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, కస్తూరి వట్టివేళ్లు, మంచిగంధపుచూర, తెల్లయగురు, నల్లయగురు ననువానిని మెత్తగా చూర్ణము చేసి ప్రణవముతో భస్మమునందుఁ జేర్చి యఘోర మంత్రము మూలమంత్రము పదిమార్లు మంత్రించుచు నుండలుగాఁ జేయవలయు.

మూ॥ విధాన్తరం ప్రవక్ష్యామిభస్మసంపాదనంలఘు॥ ౩౧
సద్యేనగోశకృద్గ్రాహ్యం వామేనత్వభిమంత్రయేత్।
అఘోరేణదహేత్పిండం గ్రాహ్యం తత్పురుషేణతు॥ ౩౨
నిత్యమీశానమంత్రేణస్వాంగేధార్యంప్రయత్నతః॥

తా॥ భస్మసంపాదనము నెడ లఘుపద్ధతిని చెప్పెద వినుము. సద్యోజాతమంత్రముతో గోమయము గ్రహించి, వామదేవమంత్రి

ముతో పిడకలుచేసి యెండించి, అఘోరమంత్రముతో భస్మముచే
తత్పురుషమంత్రముతో భద్రపరిచి, ఈశానమంత్రముతో ధరిం
చుండవలయు.

మూ॥ శాంతికం పౌష్టికం భస్మకామదంచత్రిథాభవేత్।
గోమయం యోనిసంబద్ధంయద్ధస్తేనైవగృహ్యతే।
బ్రహ్మమంత్రైశ్చసందగ్ధం తచ్ఛాంతిక మిహోచ్యతే॥

తా॥ ఈ భస్మము శాంతికమని, పౌష్టికమని, కామదమ
మూడువిధములుగానున్నది. ఎట్లన, గోమయమును గోవుయోని
వెడలునప్పుడే చేతితో గ్రహించి పంచబ్రహ్మమంత్రములతో గా
భస్మముచేసినది శాంతికమని చెప్పఁబడును.

మూ॥ సావధాన స్సుగోయోని నిస్సృతం గోమయంతుయత్
అంతరిక్షేగృహీత్వాతఃషడంగేనదహేత్తతః॥
పౌష్టికంతుసమాఖ్యాతం కామదంతుతతశ్శృణు॥

తా॥ గోమయమును గోవుయోనినుండి వెడలినదానిని క్రిం
బడకుండునట్లు జాగ్రతతో నడుమన గ్రహించి, షడంగమంత్ర
లతో హోమముచేయునెడ నది పౌష్టికమని చెప్పంబడును.
కామదం బెట్టిదనిన వినుము.

మూ॥ సుశుద్ధేభూతలే దైవాత్పతితం గోమయంతుయత్॥
ప్రాసాదేనదహేదేవ మేతత్కామదముచ్యతే॥

తా॥ పరిశుద్ధమగు స్థలముమీదఁ బడియున్న గోమయము
గొనివచ్చి ప్రాసాదమంత్రముతోగాల్చి సిద్ధపరిచినది కామదమ
చెప్పఁబడును.

మూ॥ శివాగ్నిజనితం భస్మశస్తం స్యాచ్ఛివయోగినాం॥
త్రైవర్ణికానాం సర్వేషా మగ్నిహోత్రసముద్భవం।
విరజాన లజంచైవ ధార్యంభస్మమహామునే॥

చేయుదురు? కాఁబట్టి కపటచక్రాంకుని పరమనుటకు బాధ యేమియు గోచరించుటలేదు

పండి—కపటశూలాంకుని పరమని యేల జెప్పఁగూడదు.

ప్రతి—ఆవచనార్థమవ్యక్తముగా నున్నదిగాననట్లును చెప్పనగునేమో?

పండి—ఆవచనము వ్యక్తార్థముగానెయున్నది. అయినను, దానిని మీరేఁయవ్యక్తము గావించుచున్నారు.

ప్రతి—మేమేమి యవ్యక్తార్థముగావించితిమి?

పండి—అలింగీ=లింగధారి కానివాఁడైన, యః=ఎవ్వఁడు, లింగివేషేణ = లింగధారివేషముతో, వృత్తిం=బ్రదుకు దెరువును, ఉపజీవతి=ఆధారముగాఁజేసికొని జీవించుచున్నాఁడో సః = వాఁడు, లింగినః = లింగధారిదగు, ఏనః = పాపమునంతను, వహతి = భరించు చున్నాఁడు, ఇట్లు మోసము చేసిన కారణమున తిర్యగ్యోనౌచ = పశుపక్ష్యాది జన్మమునందును, జాయతే = పుట్టుచున్నాఁడు. అనియర్థము. భక్తులు లింగధారుల నధికముగాఁ బూజింతురనివిని యలింగులైన వారు కపటలింగధారివేషముతో జీవించుటనేటికిని సంభావితముగానెయున్నది. ఈనడుమ దాక్షిణాత్యుఁడగు నొక ధూర్తవిప్రుఁడు లింగకాయధరించి ముదిగొండ వీరభద్రయ్య అనుపేరుతోఁ బెక్కుకాలము పశ్చిమదేశమునఁ బర్యటనము చేసినది. పలువురకు దెలిసియున్నది. గాని, బ్రహ్మచారి కానివాఁడు బ్రహ్మచారివేషముతో జీవించినట్లేకాలముననైన నున్నదేమో తెలుపఁగలరా? ఇచట, లింగీ, అనుటచే స్పష్టముగా లింగధారియని కనఁబడుచున్నను, దానికి నసంగతముగా బ్రహ్మచారియని కొందఱును, విరుద్ధముగా చక్రాంకియని మఱికొందఱును నర్థముచెప్పుట యెట్టులుచితమో ఇందు న్యాయ్యమగు నర్థమేదో మీరనిర్ణయించుడు.

అన్నం—ఇప్పటివిమర్శముంబట్టి మీరు చెప్పినది కొంత సహేతుకము గానె యున్నట్లగపడుచున్నది. కాని, ఇంతకుఁ బైయుక్తిచెప్పు వారు సంభవించినప్పు డీనిర్ణయము మారిపోఁగూడదా?

పండి—ఇంతకుఁ బైయుక్తిచెప్పువారు సన్నద్ధమైనప్పుడు అంతకు బైయుక్తిచెప్పువారలోనఁ గూడుదురేమో? అట్టులోనఁగూడ రని మీరుచెప్పఁగలరా?

ప్రతి—ఎప్పటి సంగతియో మనకు నిప్పుడు దేనికి? ప్రకృత మనుస రింపుడు.

అన్నం—అలింగీ లింగివేషేణ అను మనువచనము కపట బ్రహ్మ చారి పరమనుటకు కొంతబాధయున్నట్లు కనఁబడినను, ధర్మ ధ్వజీలింగవృత్తిః, అని యమరసింహుఁడు చెప్పిన లింగవృత్తి పదమునకు కపట బ్రహ్మచారియని యర్థము సెప్పుటకు బాధ యేమియు లేదు.

ప్రతి—ఈరెంటిలో నేమివిశేషము?

అన్నం—మనువచనమునందు, అలింగీ, అనియొక్కటియున్నది. దానికి మాపక్షమున, బ్రహ్మచారి కానివాఁడు అని చెప్పఁ దీరదు. అట్లు చెప్పనారంభింపగానె, వాఁడు, బ్రహ్మచారియే గాని యితరాశ్రమస్థుఁడు కాఁడంటివే. ఇప్పుడు బ్రహ్మచారి కానివాఁడని యెట్లు చెప్పుచున్నావని యారాధ్యులవారు కుతికె పట్టుకొనుచున్నారు. లింగవృత్తిః అనుచోటనట్టిబాధ లేదు. కాఁబట్టి యాపదము కపట బ్రహ్మచారి పరమని సాధింపననువుగానున్నది.

ప్రతి—ఆరాధ్యులవారూ, భట్టాచార్యులవారు చెప్పినది వింటిరా?

పండి—వింటిని.

ప్రతి—అదియుచితమేనా?

పండి—వారికి నుచితముగానె తోపవచ్చును.

ప్రతి—ఇందు మీయభిప్రాయ మేమి?

పండి—లింగవృత్తిపదమైనను కపటబ్రహ్మచారిని బోధింపదు.

అన్నం—అది యేల?

పండి—ఈపదము మనువచనమునకు సమానార్థక మేగాన

అన్నం—ఆనిర్బంధము దేనిని బట్టి?

పండి—మనుస్మృతియందుధర్మధ్వజస్సదాలుబ్ధఃఛాద్మికోలోకడంభకః అని నింద్యులను పరిగణించిన తరువాత నా ప్రకరణమునందే అలింగీలింగి వేషేణ అను వచన ముండియున్నది.
అట్లే, నామలింగానుశాసనమునందును, ధర్మధ్వజోలింగవృత్తిః అని యొక్కచోటనే చెప్పఁబడియున్నది. ఇట్లు సమానప్రకరణమునందె యున్న లింగవృత్తిపదము మనుస్మృతిలోని అలింగీ యను వచనమునకు సమానార్థక మెట్లుగాకుండును?

అన్నం—దానింబట్టి మనువచనమునకు సమానార్థకముగావచ్చునని తోచెడిని. అంతమాత్రన అట్లే చెప్పవలయునను నిర్బంధ మేమి?

పండి—లింగవృత్తిపదము మనువచనముతో సమానార్థకమనుటకు గారణము కనఁబరిచితిని. అట్లే చెప్పుడని మిమ్ము నిర్బంధించితినా? అదిగాక, మీపక్షమునందు లింగవృత్తిపదమునకు వృత్తికై బ్రహ్మచర్యము నవలంబించినవాఁడు అని చెప్పక తీరదు. ఇతరాశ్రమస్థుఁడట్టు లవలంబించుట యసంభవమని తెలిపియుంటిని. గాన నాపదంబును కపటలింగధారినే బోధించుననుట కడమయర్థములకన్న సమంజసముగాదా?

అన్నం—అట్లే యనుకొనుడు. అట్లే సద్వృత్తమపివిజ్ఞాయలింగినేచేత రాయచ। అను భారతవచనమునందును లింగిపదమునకు లింగధారి యనియే చెప్పుదురా?

పండి—ఎద్దిన్యాయ్యమో? అద్దియె గ్రహింతుము

అన్నం—అచట లింగియనఁగా బ్రహ్మచారియని యేల గ్రహిం రాదు?

పండి—సద్వృత్తమపి అను ను త్తరమునకు ప్రశ్నభూతమైన శ్లో॥ కిమాహుర్భరత శ్రేష్ఠ దానపాత్రం సనాతనం। లింగి బ్రాహ్మణం చైవ బ్రాహ్మణంచాప్యలింగినం॥ అను చోటను లింగిపదమునకు నేమియర్థమగునో అదియే లింగినేచేతరా అనుచోటనున్న లింగిపదమునకును నర్థమని చెప్పవల గదా!

అన్నం—లింగినం బ్రాహ్మణం చైవ అనుచోటనె లింగి యన బ్రహ్మచారియని యేల గ్రహింపరాదు?

పండి—అట్లైని, ప్రశ్నవచనమునకు దానపాత్రుఁడు బ్రహ్మచారి బ్రాహ్మణుఁడా? లేక బ్రహ్మచారికాని బ్రాహ్మణుఁడా? లేక మని యర్థము చెప్పవలయు. ఆయర్థమెట్లు సమంజసమగు

అన్నం—ఏల కాదు?

పండి—బ్రాహ్మణులలో బ్రహ్మచారి, తదితరుఁడు నని రెండు ములే గలవా? గృహస్థుఁడు, యతి మొదలుగా ననేక గలవుగదా? బ్రహ్మచారి దానపాత్రుఁడగునా కాడా సంశయము గలుగునెడ నట్టిసంశయము గృహస్థుఁడు మాత్రమేలకలుగదని లోఁగడ నడిగియుంటినిగానా? ఇదియె కు మరునో తెలుపుము.

అన్నం—బ్రాహ్మణులలో లింగధారి. తదితరుఁడునని మాత్రము రెం భేదము లేగలవా?

పండి—ఈరెండుగాక, మూఁడవదేదో చెప్పుము. కావున. నాశ్లోక లోని లింగిపదము లింగధారి పరమనుటయె యుచితము.

అన్నం—లింగియని యున్నచోనెల్ల లింగధారియని చెప్పఁబూనితివేని, పామండా స్సర్వలింగినః, అనుచోటను లింగిపదమునకు లింగ ధారియేయని గ్రహించుటయుచితమే.

పండి—ఆయర్థమచ్చట కుదురునెడ గ్రహింపక చేయునదియేమి?

అన్నం—అచ్చటమాత్రమాయర్థమేలకుదురదు?

పండి—యెట్లో కుదుర్పుడు.

అన్నం—నేను కుదుర్పునదేమి? దేవుఁడేకుదిర్చెను. సర్వలింగినః = లింగధారులందఱును, పామండాః = పామండులు అను నర్థము కుదిరియుండలేదా ?

పండి—ఆచార్యులవారూ, ఈవచనమునకు వీరుచెప్పునర్థమున బాధ కనఁబడుటలేదా?

ప్రతి—మీకు నగపడినచోదానిని మాకును నగపరుపరాదా?

పండి—ఏకాగ్రతతో చూడుడు.

అన్నం—అట్లే

పండి—అచట సర్వపదమునకేమి ప్రయోజనమో గమనింపుడు.

అన్నం—అందఱు ననుటకు

పండి—బ్రాహ్మణుఁడు శ్రేష్ఠుఁడనగా నందఱు బ్రాహ్మణులు శ్రేష్ఠు లని యర్థమగుచుండునుగాన నందఱునని వేఱఁజెప్పవలయునా?

అన్నం—లేదు.

పండి—అట్లే లింగి=లింగధారియనఁగానె అందఱు లింగధారులునని మాత్రమేల యర్థముగాదు?

అన్నం—బ్రాహ్మణపదము జాతివాచకముగాన నట్టియెడల నాయ ర్థము సిద్ధమైనను, లింగియనుచోట నట్టియర్థము గ్రాహ్యమగు టకు లింగిపదము జాతివాచకమగునా?

పండి—జాతివాచకములె సకలజాతిని బోధించుగాని గుణవాచక
లట్లు సకలగుణమును బోధింపవని నియమ మెందేసింగల
స్మార్తుఁడు పాత్రుఁడనిన నందఱు స్మార్తులని యర్థముగా
కాఁబట్టి మీరు చెప్పు నర్థమున సర్వపదమెల్లు సార్థకము
తెలుపుడు.

ప్రతి—స్మార్తపదమేమి? చక్రాంకితపదమేమి? ఇవి యన్నియు
యాసంఘమును బోధించునవియే. అట్లే లింగిపదంబును
నీయర్థమున సర్వపదము సార్థకమనుటకు సాధకము కన్పట్ట
లేదు.

అన్నం—ఆరాధ్యులవారూ, ఈవచనమునకు మీరేమని యర్థ
చెప్పుదురు?

పండి—సర్వలింగినః = సర్వమతస్థులయొక్క చిహ్నములను ధరిం
వారని చెప్పుదుము.

అన్నం—ఇచట నీయర్థ మసలే కుదురదు.

పండి—ఏల?

అన్నం—ఇచట సర్వమతచిహ్నములు గలవారని యర్థము గ్ర
చునెడ సర్వలింగ అను కర్మధారయసమాసముమీద
ప్రత్యయము నంగీకరింపవలయును. అట్లు లంగీకరింప
నకర్మధారయాన్మత్వర్థీయః, కర్మధారయ సమాసము
మత్వర్థకమైన ప్రత్యయముండఁగూడదని వైయాకరణు
నిర్ణయించిరిగాన నీయర్థము వ్యాకరణశాస్త్రసమ్మత
మాత్రముగాదు.

ప్రతి—ఆరాధ్యులవారూ, శాస్త్రవిరోధము గమనింపవలసినదే

పండి—కాదని యెవ్వరు చెప్పిరి?

అన్నం—ఇందు మీరు చెప్పునట్టి యర్థము శాస్త్రసమ్మతమని
పరుచుడు.

పండి—సర్వలింగినః=సర్వమతచిహ్నధారులనునది శాస్త్రవిరుద్ధము గాదు. ఎట్లనిన,

నకర్మధారయాన్మత్వర్థీయః అను పరిభాషను ప్రాచీనులు పఠించినను, ఇదిలాఘవమూలముగాన దీనిని బఠింప నవసరము లేదని చెప్పి నవీనులంగీకరింపలేదు. దాననే భట్టోజిదీక్షితుఁడు ప్రౌఢమనోరమయందు, నీలరూపవత్ అని ప్రయోగించి, యున్నాఁడు. అసుబ్వాతః, అని భాష్యకారుఁడు నుడివియున్నకారణమున నీపరిభాష యనిత్యమేయని శబ్దరత్నకారుఁడు నిర్ణయించియున్నాఁడు. ఆకారణముననే శైశవ శేషవానయం, అని శ్రీహర్షుఁడు ప్రయోగించెను. ఇట్లెందఱో మహాకవులు ప్రయోగించియున్నారు. ఇట్లు భాష్యకారుఁడు మొదలగు శాస్త్రకర్తల చేతను, భట్టోజి మొదలగు వైయాకరణుల చేతను, శ్రీహర్షుఁడు మొదలగు మహాకవుల చేతను ననిత్యమని యంగీకరింప బడిన సరిభాష యిచట నీయర్థమును బాధించుననుట యెట్లోమీరే నిర్ణయించుడు.

అన్నం—సర్వలింగినః అనుచోట నేనుచెప్పిన యర్థము నందు సర్వపదమంత సార్థకముకాదు. మీరుచెప్పినయర్థమునందు శాస్త్రవిరోధముగలదు గాన, మనయిద్దఱియర్థములు సమానముగానె యున్నవని యేల యంగీకరింపరాదు?

ప్రతి—వారుచెప్పిన యర్థమునందు శాస్త్రవిరోధమేదియు లేదని యారాధ్యులవారు ధ్రువపరుచుకొనిరి. గాని మీరు చెప్పిన యర్థమునందు సర్వపద మెట్లుసార్థకమో తెలుపరైతిరి. ఈ రెండర్థములు నెట్లు సమానములగును?

అన్నం—ఇచట, సర్వపదము సార్థకమని సాధించుటకేమి. అదియెట్లైన సాధింపవచ్చును.

పండి—అట్లేని నాలస్యము దేనికి?

అన్నం—లింగినః = అనగా చిహ్నధారులు. చిహ్నములన లింగధారణము, చక్రాంకనము మొదలైనవి. ఇయ్యవి గలవారందఱు పాషండులనియర్థము. ఇప్పుడు సర్వపదము సార్థకము కాలేదా?

పండి—ఆపదమిప్పుడైన నిరర్థకమే.

అన్నం—ఎట్లు?

పండి—చిహ్నధారులు పాషండులనగానె యందఱు చిహ్నధారులునని యర్థమగుగాని కొందఱుమాత్రమే యని యేర్పడదు. ఇట్లుండ నందఱు నని దేనికి?

ప్రతి—భట్టాచార్యులుగారూ, ఇచ్చట చిహ్నధారులందఱునని చెప్పితిరే. మీరు మాత్రము చిహ్నధారులుగారా?

అన్నం—మాకు లింగధారణమున్నదా? చక్రాంకనమున్నదా? ఏమి చిహ్నమున్నది?

ప్రతి—మీరు విభూతి, రుద్రాక్షములు మొదలైనవానిని ధరింపరు లేదా? అవి మాత్రము చిహ్నములుగావా?

అన్నం—వాని నిష్టమైనచో ధరింతుము. లేకున్న లేదు. వానిని ధరించిననేగాని వీలులేదను నిర్బంధము మాకెక్కడిది?

ప్రతి—అవి లేకున్న బోనిండు. యజ్ఞోపవీతము చిహ్నముకాదా? దానినైన ధరింపవలయునను నిర్బంధము మీకున్నదా లేదా?

అన్నం—యజ్ఞోపవీతము చిహ్నములలో నెట్లు చేరును?

ప్రతి—ఎట్లు చేరదో చెప్పుడు.

అన్నం—యజ్ఞోపవీతము చిహ్నమని యంగీకరింపము.

ప్రతి—మీయిచ్చవచ్చినదే సిద్ధాంతమా? ఆరాధ్యులవారూ, ఏమి తాముచెప్పిన యర్థమునందు సర్వపదమునకు సార్థకతను



| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ కొమరువెల్లి కాళయ్యగారు వరంగల్ | 12-0-0 |
| ,, రామిని మల్లయ్యగారు ... | 12-0-0 |
| ,, తుగ్గపాటి వెంకటేశ్వరరావుగారు, బారిష్టరు, బెజవాడ | 10-0-0 |
| ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్నగార్లు, సికింద్రాబాదు | 10-0-0 |
| ,, కైలాస శరభయ్యగారు, ... | 10-0-0 |
| ,, బెద్దె రామన్న కుమారుడు, జగదీశ్వరయ్య ... | 10-0-0 |

## —◆ పోషకులు ◆—

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యవార్లంగారు, ఈమని | 5-0-0 |
| ,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని | 5-0-0 |
| ,, కామర్సు రాజశేఖరరావుగారు, కరణం, నవాబుపాలెం | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిలుగారు, తొండపి | 5-0-0 |
| ,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల | 5-0-0 |
| ,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చుపేట | 5-0-0 |
| ,, భూపతి రత్నంగారు, వరంగల్ | 5-0-0 |
| ,, మల్లంపల్లి మల్లికార్జునుడుగారు, అయితంపూడిఅగ్రహారం | 5-0-0 |
| ,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ | 5-0-0 |
| ,, శ్రీపతిపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని | 5-0-0 |
| ,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు | 5-0-0 |
| ,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు | 5-0-0 |
| ,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్దిపేట | 5-0-0 |
| ,, ముత్యంపేట మల్లయ్యగారు ,, | 5-0-0 |
| ,, కాళేశ్వరం నాగభూషణంగారు ,, | 5-0-0 |
| ,, కొమరువెల్లి బాలరాజుగారు, వరంగల్ | 5-0-0 |
| ,, గర్రెపల్లి రామన్నగారు. మిడిదొడ్డి | 5-0-0 |

# ప్రకటనము.

ఆర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:- ఈ గ్రంథమునందు బ్రాహ్మణులు మొదలగువారు వేకువజామున నిద్ర లేచినది మొదలుకొని రాత్రి పండుకొనునందాక చేయనగు స్నానసంధ్యాది సకలధర్మములకును వైద్యశాస్త్ర ప్రామాణ్యమును బట్టి ఆరోగ్యరూపమగుప్రత్యక్షఫలము కలదని ఋజువుచేయఁబడియున్నది. వెల రు ౧-౦-౦

కారణోత్తరమను దివ్యాగమము:-ఇయ్యది శైవుల లింగధారణము మొదలగువానియెడలగల సకలసంశయముల వారించు నెనిగుపమానమైనది. వెల రు ౧-౦-౦

ఆహ్నికవిధి:-ఇందు స్నానము సంధ్య మొదలకొని నైవేద్యమువరకుగల సకల నిత్యకర్మములు సస్వరాంధ్ర ప్రయోగముతో గలవు. వెల రు -౮-౦

మకుటోత్తరము అను దివ్యాగమము:- ఇందు శివపూజా విశేషములు, శైవాంత్యేష్టి విధానము మొదలగు ననేక విశేషములు గలవు. వెల రు ౧-౮-౦

బ్రహ్మతర్క స్తవము:- శ్రీమదప్పయ దీక్షిత విరచితము ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, స్మశానవాసిత్వము, బాణాసురయుద్ధమున నోడిపోయెనన్నదానికి సమాధానము మొదలగు ననేక విషయములు గలవు. వెల రు ౧-౧-

మహాశివపూజా విధి:- ఇయ్యది లింగనిరీక్షణమున వినియోగించు దశావధాన విధానముతోను, సస్వరాంధ్రప్రయోగముతోను శాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦-౮-౦

ధర్మసంగ్రహము అంత్యేష్టికాండము:- ఇందు శైవులాచరించు సమాధ్యారాధనవిధులు శాస్త్రసిద్ధములని పలువిధముల నిరూపింపఁబడియుండుటెగాక, అపరకాండ సందర్భమునగల సర్వవిధకృత్యములకుఁదగు ప్రమాణముల గనబరిచి సకల సంశయములు వారింపఁబడియెను. ఆంధ్ర తాత్పర్యసహితము. వెల రు ౨-౦-౦

వలయువారు:- ముదిగొండ నాగలింగశాస్త్రి అని వ్రాయవలెను.

రామలింగేశ్వర పేట, తెనాలి.

Reg. No. M- 2284.



శ్రీ
శివాయ గురవేనమః

# శైవరహస్యబోధిని.

ఇది

శ్రీ దేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జితాసార్
శ్రీ కంనుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని
సాహాయ్యమున వెలుపడుచు
శైవధర్మములను, వాని ప్రామాణ్యమును దెలుపు
మాసపత్రిక.

| సంపుటము 5. | విభవనామ సంవత్సర ఆశ్వయుజమాసము. | సంచిక 7. |
|---|---|---|

సంపాదకుడు:-ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।
విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ।
అశేషశం కానుయపంకశోధినీ।
జయత్వియం శైవరహస్యబోధినీ।



తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

చందా సం॥ రు 2-0-0.

1928.

# శాశ్వత ప్రధాన పోషకులు.

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టెపల్లి) రాజలింగ మయ్యవార్లగారి కుమారుడు
నాగమల్లయ్య అయ్యవార్లగారు. సిద్ధిపేట
కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, రామన్నవగైరా సిద్ధిపేట

## —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారీకులు

| | | |
|---|---|---|
| 1 | భండారు మల్లిఖార్జునరావుగారు | 60—0—0 |
| 2 | భండారు వీరభద్రరావుగారు | |
| 3 | భండారు వీరరాజుగారు | |
| 4 | భండారు వీరబసవరాజుగారు | |
| 5 | భండారు చెన్నబసవయ్యగారు | |
| 6 | భండారు చిన మల్లిఖార్జునుడుగారు | |

## —: ప్రధానపోషకులు :—

మరాశ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రులుగారు సికింద్రాబాదు 13.0.

,, శివలంక తాయన్నగారు, పోణంగి 10.0.

,, ముదిగొండ వీరభద్రయ్య అయ్యవారుగారు, ఈచుని 10.0.

,, శివపురపు రాజయ్యగారు, శికింద్రాబాదు 10.0.

,, కొడిమేల భోగసోమలింగారాధ్యులుగారు, శ్రీగురుత్వ సంస్థానం వరంగల్ 10.0.

,, శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు నిర్మల 10.0.

,, కాశీనాధుని అల్లమయ్య అయ్యవారుగారు యాలమర్రు అగ్రహారం 10.0.

,, శివలెంక శంభులింగం అయ్యవారుగారు బెజవాడ 10.0.

,, ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్ 12.0.

శ్రీశివాయగురవేనమః.

## శైవరహస్యబోధినీ పత్రికాభాగధేయము.

పాఠకమహాశయులారా !

దేశోద్ధారక శ్రీయుత, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారు బెజవాడలోని తమ దుర్గావిలాసభవనమునందు విభవ సం॥ దేవీశరన్నవరాత్ర వ్రతమహోత్సవ సందర్భమున వేదశాస్త్ర వేది విద్వత్పారితోషికాది ప్రదాన సమయమున నీపత్రికకు రు ౧౦౦ లు నూరు రూప్యముల నొసఁగి తమ కిందుగల యభిమానమును క్రియారూపమునఁ గనఁబరిచిరని విన్నవించి మిమ్ము నానందింపఁజేయు భాగ్యము నాకు లభించినదానికి యపరిమితానందము నొందు చున్నాఁడను.

వీరిట్లు శైవధర్మప్రతిపాదక మైనపత్రికకు నిట్టిసాహాయ్యక మొనర్చుట దీనికి సంపాదకుఁడ నగునాకును, నిందుఁ బూర్ణాభి మానము గల మీకును మాత్రమెగాక, మనయందఱ డెందములయం దెల్లపుడు నెలకొనియున్న క్రొన్నెలతాల్పునకును నత్యానందకర మనుట యతిశయోక్తి గాదు. శ్రీపంతులవారి యనవరత మహాదాన శీలత జగద్విదితముగాన దానింగూర్చి ముచ్చటింపఁబనిలేదు. ఐనను, వీరిని దలంచినప్పుడు మహాభారతము యక్షప్రశ్నములలోని,

క॥ దివిముట్టిధరణిఁదఃంతట। నివిరిమెఱయు నెవ్వనియశోరమ య
ట్టివిశిష్టచరిత్రుఁడు య। క్షవరా పురుషుండునాఁ బ్రసిద్ధివహించున్

అనుపద్యము తలంపునకు రాకమానదు. ఇట్లు నాదగుమనస్సాక్ష్య మును డాపుకొనఁజాలక వెల్లడించినదానికి ఆత్మోత్కర్షశ్రవణాసహి ష్ణువులగు శ్రీపంతులవారు మన్నింతురుగాక.

ఇట్టిపురుషరత్నమునకు నాయువును, ఆరోగ్యమును, ఐశ్వర్య మును ఔదార్యమునుగూడ నింకను సహస్రగుణాధికముగా నొసఁగి చిర్కాలము జగదీశ్వరుఁడు దేశమునందును, మతమునందును, విద్వాం సులయందును, దనకుగల సహజవాత్సల్యమును వెలయించుగాక యని ప్రార్థించుచున్నాఁడను. ఇట్లు, ప॥ సంపాదకుఁడు.

ము॥ నా॥ శా॥

శ్రీశివాయగురవేనమః.

# శైవదీక్షా మహాప్రభావము.

శైవమహాజనులారా !

ఆర్యమహాజనులకు నునికిపట్టైన యీ భరత ఖండమునందు ప్రసిద్ధివహించినషణ్మతములలో నగ్రస్థానము నలంకరించిన శైవమహా మతమునకు మూలకారణమైనదేది? శైవమహాదీక్షయే.

కడమమతములనుండి శైవసంఘమును వేర్పాటుసేయజాలిన యసాధారణ కారణమేది? శైవమహాదీక్షయే.

కావున, శైవుఁడైనవాఁడు ముందుగా, నీదీక్షయొక్క మహిమమును దెలిసికొనుట యావశ్యకము.

అదిగాక, శైవసంఘము నానాట సన్నగిలుటకు ముఖ్యకారణమేమి? ఇద్దానిమహిమము దెలియకుండుటయే. కానను నిద్దాని మహిమము నేకొలదియైన నెఱిగియుండుట యత్యావశ్యకము. ఏలంటరేని, భస్మధారణమహిమము దెలిసియున్నచో జనులు భస్మము దాల్పకుందురా? రుద్రాక్షమహిమము నెఱిఁగియున్నచో రుద్రాక్షధారణము నుజ్జగింతురా? లింగధారణవైభవము వినియున్నచో శివలింగమును కటియందు దాల్పసాహసింతురా? ఈయనర్థమంతయు శైవదీక్షాప్రభావ మణుమాత్రమైన దెలియమినే యాసన్న మయ్యె ననుట నిజము.

ఇదిగాక, శైవమహాదీక్ష దగుస్వరూపముగాని, మహాఫలముగాని యణుమాత్రమైన దెలిసియున్నను, ఇందేమాత్రమైన విశ్వాసమున్నను, ప్రాకృతజనాధికారికముగా విహితమైన ప్రేతకర్మము లేకుండుట శైవులకు నొకలోప మని యెవ్వండేని యథరస్పందము సేయ సాహసించునా? కాఁబట్టి శైవదీక్షాప్రభావము తెలిసికొనుట యతి ముఖ్య మనుట నిరాక్షేపము.

## శైవదీక్షాస్వరూపము.

మొదట నిద్దానిస్వరూపము తెలిసికొనుట యవసరము. ఇయ్యది భస్మరుద్రాక్షశివలింగధారణాత్మక మైనది. దీనికి షడధ్వశుద్ధి పూర్వాంగము. ఇందు, వేధ, మను క్రియలను మూడు మహాదీక్షలు గూడియున్నవి. ఈమూడిటిలో నొక్కొకటి యేడేసి యవాంతరదీక్షలు గలదియగుటచే ఏకవింశతి (ఇరువదియొకటి) మహాదీక్ష లిందుగలవు. ఈమూడుదీక్షలును స్థూల సూక్ష్మకారణములను మూడుశరీరములను పవిత్రము సేయఁజాలినవి. కావున నిట్టి మహాదీక్ష దేనితోఁ బోల్పనగును? ఇఁక దీని ప్రమాణసంపత్తి యెట్టిదో గ్రహించుడు.

## శైవదీక్షా ప్రామాణ్యము.

ఈ మహాదీక్ష కేవలము శివపురాణములయందును, శివాగమములయందును, విహితమై యున్నంతన నెల్లరకు నెట్లు గ్రాహ్యమగునని సంశయింపఁ బనిలేదు. అట్లు శివాగమములయందు మాత్రము గాక వేదములయందును నిది విధింపఁబడియున్నదిగదా? శివాగమములయందు మాత్రము విహితమైనదైనను చులుకనసేయం దగదు. సాక్షాత్తు పరమేశ్వరునిచే ననుగ్రహింపఁబడినవి శివాగమములు. అట్టి దివ్యాగమములయందుఁ జెప్పఁబడియుండినప్పుడు ప్రమాణాంతరములయందు గలదా? లేదా? అను చర్చతో నేమిపని?

ఇట గొందఱు శివాగమములయందు విశ్వాసము లేనివారలున్నారుగదా! అట్టివారి నమ్మకమునకై ప్రమాణాంతరములయందును గనఁబరుప నావశ్యకమని యెంతురేని వేదములయందును, విశ్వాసము లేనివా రెందరు లేరు? వారికై యేమి చేయఁగలము? పరమేశ్వరుఁడు స్వర్గమును, నరకమునుగూడ సృజించి యాయా లోకములఁ జేర్పఁజాలు ధర్మాధర్మములను వేదశాస్త్రమూలమున దెలిపియున్నాఁడు. అట్లే బంధమోక్షములను గల్పించి తత్సాధనములగు విద్యా

విద్యలనుగూడ వెలయించి యున్నాఁడు. అయినను ప్రజలకు పురాకృత కర్మవాసనావశమున నాయామార్గములు రుచించుచుండును. అంతియగాని, ధర్మాధర్మములు, విద్యావిద్యలు నిట్టివని వేదశాస్త్రముఖమున నెంత బోధించినను నందు విశ్వాసము లేనివారికి నయ్యవియాసక్తి గొలుపుచున్నవా? లేదు.

అట్లేని, శాస్త్రవిశ్వాసము లేనివారికి శాస్త్రప్రామాణ్యము నెంత గనఁబరిచినను ప్రయోజనము లేనప్పు డీవ్యాసముతో నేమికార్యమని యడుగుదు రేని, యిది శాస్త్రవిశ్వాసరహితుల నుద్దేశించి యొంతమాత్ర ముపయోగింపదు. అట్లైన నీవ్యాసము శాస్త్రవిశ్వాస సహితులయ్యు శాస్త్రపరిజ్ఞాన రహితులుగా నున్నవారికి నొరులవలన గలిగిన సంశయముల వారింప నుపయోగించెడిని. ఎట్లన, ఈ శైవదీక్ష వేదములయందు లేదనియు, శివాగమములయం దున్నను నిది తాంత్రికముగాన వైదికులకు ననుష్ఠేయము గాదనియు మొదలుగా మతాంతరులబోధల వలన సంశయగ్రస్తచిత్తులైయున్న శాస్త్రవిశ్వాసశాలుర నుద్దేశించి, ఈదీక్ష వేదములయందుగలదుగాన వైదికమేయనియు, శివాగమములు, శివపురాణములును, వేదములకు సమానార్థకములెగాన వానియందును వేదసిద్ధ మగు శైవదీక్ష సవిస్తరముగా వివరింపఁబడి యున్నదనియు, దీనింబట్టి యిది వైదికులకుఁ బరమానుష్ఠేయమనియు, విశదీకరించుట యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశమగును.

ఈ దీక్షకుఁ బూర్వాంగ మైనది షడధ్వశుద్ధి యని తొలుత పేర్కొనఁబడియెను. ఈ షడధ్వశోధనము శివాగమములయందు సమర్మకముగా వివరింపఁబడియున్నది. అంతమాత్రన నిది తాంత్రికమనఁజెల్లదు. ఏలందు రేని, వేదంబునందును, శ్రు॥ అధ్వానామధ్వపతే శ్రేష్ఠస్యాధ్వనః పారమశీయ॥ అను మంత్రము షడధ్వశోధనమును దెలుపుచున్నదిగదా?

అధ్వపతే=షడధ్వలకు నధిపతివగు నో పరమేశ్వరుఁడా! అధ్వనాం=షడధ్వలలో, శ్రేష్ఠస్య = ఉత్తమమైన, అధ్వనః = ప్రణవమునకు, పారం = వాచ్యుఁడవైన నిన్ను, అశీయ= పొందుదునుగాక, అనఁగా సాధకుఁడు పరమేశ్వరు నుద్దేశించి, నన్ను, షడధ్వలలో శ్రేష్ఠమనగా వర్ణ సారమైన ప్రణవమునకు వాచ్యుఁడవైన నీతోఁజేర్చుకొమ్మని వేఁడికొనవలయు ననునాశయము స్పష్టమగుచున్నది. ఇట్లు వేదములయందుఁ బ్రతిపాదింపఁబడిన షడధ్వశోధనము అవైదికమనిగాని, వైదికులకు గ్రాహ్యముగాదనిగాని నుడువఁజెల్లునా? అట్లు నుడువఁగూడదు.

ఇఁక నీషడధ్వశుద్ధి వేదములయందుఁ బ్రతిపాదింపఁబడియుండుగాక. అంతమాత్రమున నేమి లాభము? వేదములం దెన్నెన్నియో విధులు గలవు అవి యన్నియు ననుష్ఠానార్హములగునా? కావు. ఇఁక నెయ్యవి నిత్యములో అవిమాత్రమే యనుష్ఠేయములగునని యెన్నదురేని ఈ షడధ్వశుద్ధి నిత్యవిధియే యనుట నిక్కము.

అట్లేని, ఇది శైవులకుదక్క కడమవారికి నడవడిలో లేదు. నిత్యవిధియె యైయున్నచో విడిలోపించెనేని ద్విజత్వమునకులోపము రాదా? అట్టియెడ తక్కుమతముల వారు దీని నెట్లు విడుతురు? అని ప్రశ్నింతురేని షడధ్వశోధనము లేనిచో ద్విజత్వమునకు లోపముమాత్రముని కాదు. ద్విజత్వమే లేదని నొక్కి చెప్పవలయు. దాననేకదా? శ్రు॥ అధ్వనా మధ్వపతే, అనుమంత్రముతో నుపనయనకాలమునందె షడధ్వశుద్ధి లఘురూపముగా తండ్రిచే కుమారునకు నొసంగఁబడుచున్నది. ఇట్టు లాచరింపవలయునని సూత్రకర్తలు విధించియున్నారు. దానింబట్టి యెల్లమతములవారును గత్యంతరము లేక షడధ్వశుద్ధి నాచరించుకొనుచునె యున్నారు. దీనింబట్టి యిది లేనిచో జనుడు గాయత్ర్యుపదేశమునకుఁను నర్హుఁడు కాఁడయ్యు, నట్టివానికి ద్విజత్వమే లభింపదనియు తొల్లి మహర్షులెకనిపెట్టియున్నారని విశదమగుచున్నది.

ఇట్టులియ్యది ద్విజత్వమునకే మూలమని స్పష్టమగుచుండ నిద్ది తాంత్రికమనిగాని, వైదికులకుఁ గూడదనిగాని యెవ్వండేని

వచింప సాహసింపఁగలఁడా? అట్లు సాహసించినచో తనప్రతిన చెల్లించుకొనఁగలఁడా? ఇందేదియు నసంభవము. కావున, షడధ్వశుద్ధి నుద్దేశించి విద్వేషపూరితులగు మతాంతరులు మూలమూలల నేమేని గొణిగినను పండితులయెదుట నధరస్పందముసేసి మానము నిల్పుకొనఁ జాలరనుట యథార్థము. ఈషడధ్వలలో వర్ణాధ్వ, పదాధ్వ, మంత్రాధ్వ యనుమూడును శబ్దరూపములును, తత్త్వాధ్వ, భువనాధ్వ, కలాధ్వయను మూడును నర్థరూపములునై యున్నవి, వీనియందె శబ్దార్థరూపమగు సకల ప్రపంచంబు సిమిడియున్నది. ఇందుఁ జేరని దేదేనొక యక్షరముగాని, రేణువుగాని లేదు.

అట్లే యగుగాక, షడధ్వశుద్ధి ద్విజులకు నుపనయనకాలమునందె జరిగెనుగదా? అట్టియెడ దానిని తిరుగ గ్రహింప నవసరమేమని యడుగుదు రేని యవధానమొందుఁడు.

అధ్వశుద్ధి యుపనయనకాలమునందు జరిగియున్నను, దానిని తిరుగ గ్రహింప నవసరము గలిగియున్నది. ఏలన, కర్మము, ఉపాసనమునని బ్రహ్మప్రాప్తికి రెండు సాధనములు గలవు. మొదట నధ్వశోధనము కర్మాధికారప్రదమగు నుపనయనాంగముగా లఘురూపమున గ్రహింపఁబడినను, నుపాసనాధికారప్రదమగు శైవదీక్షయందు దీనిని సమగ్రముగా గ్రహింప నవసరము గలదు. వీనిలో నొకమార్గము చాలదా! రెండును దేని కందురేని వినుడు.

కర్మజ్ఞాన సముచ్చయ వాదము.

శ్రు॥ విద్యాం చావిద్యాం చ యస్తద్వే దోభయగ్ంసహ అను శ్రుతి "కర్మము, ఉపాసనము నను రెండును చేరి బ్రహ్మప్రాప్తికి సాధనము లగునని నిర్ధారణ చేసెను దీనినే కర్మజ్ఞాన సముచ్చయవాద మందురు. విద్యాం చావిద్యాంచ అనుచోట, అవిద్యయనఁగా కర్మము; విద్య యనఁగా జ్ఞానమునని యర్థము.

ఇయ్యెడ, శ్రీశంకరాచార్యులవారు వేరువిధముగా నిర్ణయించి యున్నారు. ఎట్లన, ఈ శ్రుతిలోని విద్య అనుపదమునకు నర్థము ఉపాసనముగాని జ్ఞానము గాదు. ఉపాసనకు కర్మముతో నపేక్ష యావశ్యకమేగాని, జ్ఞానమునకు కర్మముతో నపేక్ష లేదు. ఉపాసన వేరు. జ్ఞానము వేరు. జ్ఞానమనగా ననుభవరూపమైనది. కేవలమిట్టి జ్ఞానమే బ్రహ్మప్రాప్తి సాధనముగాని, కర్మ యొంతమాత్రము గాదనియు, గృహస్థాదులకు కర్మమునందెగాని మోక్షప్రదమగు జ్ఞానసంపాదనమునందు నధికారము లేదనియు. సన్న్యస్య శ్రవణం కుర్యాత్ ఈ మొదలగు వచనములంబట్టి సన్యాసము గ్రహించినవెగాని వేదాన్తశ్రవణమునకును నధికారి గాడనియు, నిర్ణయించి కర్మజ్ఞానములకు పరస్పరాపేక్ష లేదనిరి.

శ్రీనీలకంఠ భగవత్పాదులవారైననో విద్యయనగా నుపాసనమే యది జ్ఞానని శేషమేగాన జ్ఞానమనియె చెప్పఁబడును. కర్మసహితమగు నీయుపాసనమే యీశ్వర సాక్షాత్కారమునకు సాధనము. ఈశ్వర సాక్షాత్కారమే అపరోక్షానుభవము. ఇంతియెగాని యనుభవజ్ఞానమనునది వేరొకటి లేదు. కర్మసహితమైనయుపాసనము పరమేశ్వర సాక్షాత్కార సాధనముగాన రెండును చేరియుండవలయుననియు, ఇందు బ్రహ్మచారి మొదలుగా నందఱకు నధికారము గలదుగాన నెల్లరు మోక్షమున నధికారులె యనియు నిర్ణయించి కర్మ జ్ఞాన మార్గములకు ననుబంధమును దృఢపరిచియుండిరి.

శ్రీబసవేశ్వరుండైననో శంకరాచార్యులవారి మార్గము నెకొంత వఱకు గ్రహించి, జ్ఞానమునకు గర్మాపేక్ష లేదనియే యొంచి, యుపాసనాసాధనమైన శైవదీక్షను మాత్రము గ్రహించి, వర్ణాశ్రమ ధర్మముల నిరసించి జంగమమతమును నెలకొల్పెను.

కర్మాచరణము జ్ఞానసాధనమునకు భంగకరమని శంకరాచార్యులవారు దలంచినట్లే యది యీశ్వరసేవకు భంగకరమనియో, కలికాలమునందు వర్ణాశ్రమవ్యవస్థయెట్లును సుప్రతిష్ఠితముగాదు. అట్టియెడ తన్మూలమగు కర్మాచరణమూలమున నీశ్వరసేవకు నభ్యంతరమేల గల్పింపవలయు ననియో, యోజించి యుమ్మహానీయుఁ డట్టిమతమును బ్రతిష్ఠించెను.

ఇయ్యెడ శ్రీ నీలకంఠభగవత్పాదులవారియాశయ మేమియనిన కర్మాచరణంబును నీశ్వరసేవయే. ఈశ్వరోపదిష్టమగు వర్ణాశ్రమధర్మానుష్ఠానము ఈశ్వరసేవ యెట్లు గాకుండును. రాజు నానతింబట్టి భృత్యుఁడు మంత్రి మొదలగువారికి సేవ జేసినను నది రాజసేవలోనె చేరునుగదా? ఈశ్వరసేవ రెండువిధములు. ఎట్లన, ఈశ్వరు నానతి శిరమునఁబూని యగ్ని యింద్రుఁడు మొదలగు వారికిఁ జేయు పరిచర్య యొక్కటి, కేవల మీశ్వరునుద్దేశించి చేయునారాధనము ధ్యానము ననునది, వేరొక్కటి. ఇందు నీశ్వరాజ్ఞారూప మగు వేదవిధినిబట్టి నిత్యనైమిత్తికములయందు నావశ్యకమైన దేవతాంతరపరిచర్య కర్మమార్గమనియు, కేవల మీశ్వరు నుద్దేశించి సేయునారాధనము మొదలైనది. యుపాసనామార్గ మనియు వ్యవహరింపఁబడుచున్నది.

అట్లైని, రాజసేవకునకైనను ప్రభుసేవకన్న తన్మంత్రిసేవ కనిష్ఠమేగాన దేవతాంతర భజనమునకు నేమంగీకరింపఁజాలమంచు రేని, అట్టులంగీకరింపనుగాని అంగీకరింపకుండనుగాని మనవశమున లేదు. ఎలన, జీవులు ఈశ్వరపరతంత్రులుగదా?

నిత్యనైమిత్తికములయందు నగ్న్యాదుల సేవింపుమని పరమేశ్వరుండానతియిచ్చియుండ దాని నాచరింపకుండుట యీశ్వరాజ్ఞను భంగముగావించుట యెట్లు గాకుండును? [సశేషము.

సాధింపనే లేదు. కావున సర్వాలింగినః అను పదమునకు మీరు చెప్పినదె సదర్థము.

అన్నం—మీలో మీరు కుదుర్చుకొనినంతన సదర్థమగునా?

ప్రతి—ఇందు దోష మున్నచో మిమ్ముల నెవరైన నాక్షేపింప వల దనిరా?

అన్నం—వెదకినచో దోషమే దొరకదా?

ప్రతి—బాగుగా వెదకుఁడు.

అన్నం—సర్వాలింగినః, అనగా, సర్వమతచిహ్నధారులనిగదా యారాధ్యులవా రర్థము చెప్పిరి. ఇప్పుడు సర్వమతచిహ్నధారు లెవ్వర లున్నారు? ఎవ్వరలు లేరు. దానింబట్టి యావాక్యమంతయు నిరర్థకమైనది. ఇది దోషముకాదా?

ప్రతి—అట్టివార లేకాలముననైన నుండియుండఁగూడదా? దానం జేసి యావాక్యము సార్థకము గాదా?

అన్నం—సర్వమతచిహ్నధారు లేకాలముననైన నుండుట యసంభవము. దానంజేసి యట్టియర్థము నంగీకరించినప్పు డావాక్యము వ్యర్థముగాకమానదు.

ప్రతి—ఆరాధ్యులవారూ, ఇయ్యెడ మీయభిప్రాయము సెలవిండు.

పండి—ఆవాక్యమునందున్న సర్వపదమునకు బహుత్వమర్థము. దానింబట్టియనేకమతములయొక్క చిహ్నములు గలవా రని యర్థమగును, అట్టివార లిప్పుడును పెక్కురున్నారు గాన నావాక్యము సార్థకమే.

అన్నం—ఇప్పుడు బాగుగాఁ జిక్కితిరి. సర్వపదమునకు బహుత్వమర్థ మంటిరి. ఈయర్థము లాక్షణికము గాదా? లక్షణమె దోషము.

పండి—శ్లో॥ వరంహి వాక్యవైయర్థ్యా త్పదమాత్రస్యలక్షణా॥ అనగా వాక్యమేవ్యర్థమగుటకంటె నొక్కపదమునకు లక్షణ నంగీకరించుట మంచిదని పూర్వమీమాంసకు లంగీకరించియున్నారు. కావున, మీరు చెప్పినచొప్పున వాక్యము వ్యర్థమగుటకంటె సర్వపదమునకు లక్షణ నంగీకరించుట యుచితము, శాస్త్రసమ్మతంబును కాదా?

ప్రతి—భట్టాచార్యులవారు చెప్పినయర్థమునందు సర్వపదము నిరర్థకమైనది. ఆరాధ్యులవారి పక్షమునందు నాపదము లాక్షణికమైనది. కొంచెమెచ్చుతగ్గుగా రెండుపక్షములు సమానములుగానెయున్నట్లు తోచెడిని.

అన్నం—మాధ్యస్థ్య మనగా నిట్టు లుండవలయు. ఆచార్యులవారూ, న్యాయ్యమును బాగుగా గమనించితిరిగదా?

పండి—రెండును సమానము లనుట యెట్లు న్యాయ్యము?

ప్రతి—ఎట్లు న్యాయ్యము గాదు?

పండి — నేను చెప్పినయర్థమునందు, వాక్యము వ్యర్థము కావలసివచ్చినప్పుడు ఒక్కపదమునకు లక్షణ నంగీకరింపవచ్చునని పూర్వమీమాంసకులసమ్మతిని కనఁబరిచియుంటిని, భట్టాచార్యులవారు చెప్పినయర్థమునందు సర్వపదము వ్యర్థమగుటకు నేశాస్త్రకర్తల సమ్మతినైనా కనఁబరిచియుండిరా? ఇట్లుండమే మిద్దఱము చెప్పినయర్థములు సమానము లెట్లగును?

ప్రతి—భట్టాచార్యులవారూ, ఊర కున్నా రేమి?

అన్నం—రెండును సమానము లని తీర్మానము చేసినవారు మీరేగాన దానికి సమాధానము చెప్పవలసినభారము మీదే;

ప్రతి—ఆరాధ్యులవారూ, మీరును సర్వపదమునకు లక్షణ నంగీకరింపక తీరదయ్యెనుగాన నట్లంటిని, కాని, యీరెండు సమానములనుట ముఖ్యాభిప్రాయము గాదు.

పండి—అభ్యుపేత్యవాదమునుబట్టి లక్షణ నంగీకరించితినికాని దాని నంగీకరించిననేగాని కుదరదనుట మాపక్షమున లేదు. సర్వ మతములనఁగా ప్రమాణసిద్ధములుగా నున్నమతము లాఱు. ఆయాఱుమతములయొక్క చిహ్నములు గలవారలని యర్థము, సర్వనామ్నాం ప్రకృతపరామర్శకత్వం, అను న్యాయ్యమును బట్టి ప్రామాణికములైన యార్యమతము లాఱె గ్రహింపఁబడు నుగాని క్రైస్తవాదిమతములు గ్రహింపఁబడవు, ఇప్పుడు లక్షణ దేనికి?

అన్నం—ఆఱుమతములవిగాని, యనేకమతములవిగాని యగుచిహ్న ములెవ్వి? అయ్యవి గలవార లెవరు?

ప్రతి—ఇది యడుగనేల? శైవులు పూజించులింగము వైష్ణవు లర్చించు సాలగ్రామము, శాక్తు లారాధించు శ్రీచక్రము మొదలగునవి యన్నిమతములవారి చిహ్నములుగావా? అవి గలవారు మీరే కాదా?

అన్నం—దాననె, శ్లో॥ లింగినం చక్రిణం దృష్ట్వా సచేలస్నానమాచ రేత్ ॥ లింగధారిని, చక్రాంకనపరుని చూడగూడదని యున్నది.

ప్రతి—ఈశ్లోకమెందున్నది. ఇది యెవరో ధూర్తస్మార్తుఁడు చెప్పినది గాదా?

పండి—ఎవరైనఁ జెప్పనిండు. దాని కర్థమేమో చెప్పుమనుడు.

అన్నం—లింగధారిని, చక్రాంకనముగలవానిని చూడగానె స్నానము చేయవలయునని యర్థము. కనఁబడుటలేదా?

పండి—ఇద్దఱును ననియర్థము చెప్పునెడ నందు సముచ్చయమును దెలుపు శబ్ద ముండఁబనిలేదా? అదిలేక యాయర్థమెట్లువచ్చును?

అన్నం—ఇందు మీరేమి యర్థము చెప్పుదురు.

పండి—లింగినం=మొదట లింగధారియై. చక్రిణం=తరువాత చక్రాంకనము నొందినవాఁడని యర్థము. అట్టివానిని చూడగానే స్నానము చేయవలయునని శ్లోకాభిప్రాయము.

అన్నం—అట్టివాఁ డెందునుండడుగాన నాయర్థము వ్యర్థమే.

పండి—అట్టివాఁ డేల లేడు. తెనాలిరామలింగకవి మొదట లింగధారియై, తరువాత రాయలవారి యనుగ్రహముగోరి లింగము దీసివైచి చక్రాంకనము నొంది రామకృష్ణుఁడని తనకు మారుపేరునుగూడ పెట్టుకొన్నది ప్రసిద్ధమేగాదా? అట్టివారలింకను నున్నారు. గాన నట్టివారివిషయమున నాశ్లోకము సార్థకమే యగు,

ఇప్పుడట్టివాడు లేకున్నను, లింగమును, చక్రమునుగూడ గ్రహించిన బహుదేవపూజాపరులే దానికి విషయ మగుదురు. శ్లోక మెట్లు వ్యర్థమగును.

ప్రతి—చశబ్దము లేనందున భట్టాచార్యులవారు చెప్పిన యర్థము సరిగా లేదు.

అన్నం—ఆరాధ్యులవారూ, లింగధారణము శాస్త్రసమ్మతమని సాధించుకొనఁగలరా?

పండి—ఇది శాస్త్రసమ్మత మెట్లుగాదో మీరు తెలుపుడు.

ప్రతి—లింగధారణముసంగతి యుండనిండు. లింగము పూజనీయ మనుట యెట్లో ముందు తేల్పుడు.

అన్నం—లింగము పూజనీయ మగునా? కాదా యనుచర్చ యనవసరము. ఏ మనగా, కాశి మొదలుకొని రామేశ్వరము దనుక సకలదేశములయందును నందఱచే లింగము పూజింపఁబడుచున్నది. మే మందఱము లింగమును పూజించినను పూజింప

కున్నను దాని నంగీకరించియున్నాము. కావున లింగము పూజనీయ మనుట నిరాక్షేపణము.

ప్రతి—లింగపూజను మీ రంగీకరింతురుగాక, మే మంగీకరింప లేదు. మీ రంగీకరించినమాత్రన నేదైన నిరాక్షేపణమును. శాస్త్ర సమ్మతమును, సర్వజనాంగీకృతమును నగునా? అటులేని, వా రంగీకరించిన లింగధారణముమాత్రము నట్టిదని యేల గ్రహింపరాదు.

అన్నం—ఇచట నున్న మనమూడు మతములవారిలో నిద్ద అంగీకరించినదానివిచారణ మనవసరము. ఇద్ద అంగీకరింపక యొక రుమాత్రమె యంగీకరించినదాని విచారణ మవసరము. లింగపూజ మేమిద్దఱము నంగీకరించినది, లింగధారణము మన మిద్దఱము నంగీకరించినది గాదు, కావున, లింగధారణచర్చ యావశ్యకము.

ప్రతి—అట్లేని, మే మిద్దఱము నంగీకరింపని మీపంచాయతనంబును చర్చార్హ మేకదా?

అన్నం—మీ రిద్దఱు నంగీకరింపని మాపంచాయతన మేమి? మేమిద్దఱము నంగీకరింపని మీచక్రాంకన మేమి? యన్నియు చర్చార్హములె కానిండు. ఆరాధ్యులవారూ, లింగధారణము శాస్త్ర సమ్మత మనుటను దెలుపుడు.

పండి—లింగధారణము శాస్త్రసమ్మత మెట్లుగాదో ఇదియే శాస్త్రమునకు విరుద్ధముగా నున్నదో నిర్ధారణము సేయుడు.

అన్నం—ఈప్రశ్నము సరిగా లేదు. ఏలన, శాస్త్రసమ్మతమని మీరు నిర్ధారణము సేయలేనప్పుడు దానంతన నదియే శాస్త్రవిరుద్ధమని స్థిరపడును. ఇట్లుండ, లింగధారణము శాస్త్రవిరుద్ధమని సిద్ధాంతము సేయవలసిన యవసరము నాకేమి?

పండి—అది శాస్త్రసమ్మత మని నేను సిద్ధాంతము సేయ లేనిచో పెద్దలింకెవ రేనిఁ జేయఁజాలుదురు. నేను సిద్ధాంతము సేయఁ మాత్రమే నది శాస్త్రవిరుద్ధమని యెట్లు దేలును ?

ఇదిగాక, గ్రంథాదియందు మంగళాచరణము శాస్త్రసిద్ధము గాకున్నను శాస్త్రవిరుద్ధముగామిచే ననుష్ఠింపఁబడుచున్నట్లు ఇట్లేలింగధారణము శాస్త్రసిద్ధమని యంగీకరింపఁబడకున్నను శాస్త్రవిరుద్ధమని దేలినచో ననుష్ఠింపఁగూడదు.

మంగళాచరణము శాస్త్ర విహితము గానంత మాత్రమున శాస్త్రవిరుద్ధమైనదని యంగీకరింపనగునా ? కాదు. శాస్త్ర శాస్త్రవిహితము కానంతన శాస్త్రవిరుద్ధమే యని మీరుచెప్పి నది యుచితముగాదు.

ప్రతి—ఈయెడ నారాధ్యులవారు చెప్పినదే యుచితము.

అన్నం—ఆరాధ్యులవారూ, అట్లేని, లింగధారణము మంగళాచ రణాదులవలె శిష్టాచార సిద్ధమేగాని శాస్త్రప్రతిపాదితముగాదని యేగదా మీయభిప్రాయము ?

పండి—ఇట్లని నేను చెప్పియుంటినా? శాస్త్రమునఁ జెప్పఁబడనంతన నేదైన శాస్త్రవిరుద్ధమే యగునని మీరు చెప్పినందున అంత మాత్రమున నే శాస్త్రవిరుద్ధము గానేరదనిగదా చెప్పితిని అవసరమేని శాస్త్రమున గనఁబరుపఁగలను.

అన్నం—ఏశాస్త్రమునందు కనఁబరుపగలరు ?

పండి—ఏశాస్త్రమునఁ గనఁబరుపమనిన నాశాస్త్రముననే కనఁబరు తును.

అన్నం—శ్రుతులయందుఁ గనఁబరుతురా?

పండి—సర్వలింగగ్గ్ స్థాపయతి. అను శ్రుతి లింగధారణమును విధించు చున్నది.

అన్నం—ఈశ్రుతికి నర్థమేమి?

పండి—సర్వలింగం=సర్వరూపమగు శివలింగమును స్థాపయతి= ధరింప వలయును. అని యర్థము.

అన్నం—స్థాపయతి, అనగానే లట్టురూపముగా కనఁబడుచున్నది. దీనికి ధరింపవలయును, అనువిధ్యర్థకత్వమెట్లు?

పండి—స్థాపయతి అనునది లట్టు గాదు. లేటోడాటౌ, అనుసూత్రముచే అడాగమము వచ్చిన లేట్టుయొక్క రూపము, లేట్టుకు విధ్యర్థము గలిగియేయున్నదిగదా?

అన్నం—అట్లైనను, స్థాపయతి అనగా, స్థాపింపవలయును, అని యర్థమగునుగాని ధరింపవలయునని యర్థ మెట్లగును?

పండి—ఎట్లన్నను నొక్కటేగదా?

అన్నం—అది యెట్లు?

పండి—ధరించుట యన, శరీరమునందు స్థాపించుటేగదా?

అన్నం—ఇప్పుడు బాగుగాఁ జిక్కితిరి, శరీరమునందు స్థాపింపవలయునని యాశ్రుతియందు గలదా?

ప్రతి—ఇదియే గట్టిగా విమర్శింపవలసినయంశము.

పండి—ఇందు మీకు సంకోచమేమి? మీకాయిచ్చవచ్చినట్లు విమర్శింపుఁడు. ఆయర్థ మాశ్రుతియందున్నచే యంగీకరించుడు.

అన్నం—ఆయర్థ మాశ్రుతియం దెచ్చట నున్నది.

పండి—స్థాపయతి=స్థాపింపవలయుననఁగా నెచ్చటనని యాకాంక్ష పొడమును, అప్పుడు భూమియందా? శరీరమందాయని శంక గలుగగా కర్తృశరీరము సన్నిహితమైన దగుటంబట్టి శరీరమునందే స్థాపింపవలయునని యేర్పడుచున్నది.

అన్నం—స్థాపింపవలయు ననఁగానె ఎచ్చటనని యధికరణాకాంక్ష గలుగుటయుక్తమే, అట్టియాకాంక్ష గలుగగా, భూమియం

దనియో, పీఠమందనియో ఏర్పడుట న్యాయ్యముగాని, ఉప
స్థితియే లేనిది శరీరమునందు అని యెట్లు లర్థ మగును?

పండి—కర్త శరీరధారియగునా కాఁడా? అట్టియెడ శరీరమునకు నుప
స్థితి యెట్లు లేకుండును?

అన్నం—శరీరమునకు నుపస్థితి యుండుఁగాక, భూమిమాత్ర మనుపస్థిత
ముగాదా? అట్టియెడ శరీరమునందేయని నిర్ణయ మెట్లగును?

పండి—భూమి, శరీరము ననువానిలో కర్తకు సన్నిహితమైన దేది?
శరీరమెగదా? ఇఁక నిచ్చట శరీరమునందేయనుట యెట్లు నిర్ణ
యము గాదు?

అన్నం—శరీర ముపస్థితముగాని, సన్నిహితముగాని యగుగాక, అయి
నను శరీరము అపవిత్రమైనదిగాన శివలింగమును ధరింప
నర్హముగాదు.

పండి—భూమిమాత్రము పవిత్రమైనదేయగునా ? ఇది మధుకైటభు
లను రాక్షసులయొక్క వసామాంసాదులచే నేర్పడినదిగాన
నపవిత్రమని సర్వప్రమాణములయందుఁ జెప్పఁబడి యుండ
లేదా? దీనింబట్టి, భూమిమాత్రము ఎట్లు శివలింగప్రతిష్ఠార్హ
మగును?

అన్నం—భూమి అపవిత్రమైనదేఅయినను, భూశుద్ధి మొదలగు సం
స్కారములచేతను, కర్షణాది సంస్కారములచేతను దానిని
పవిత్రము గావించి యందు శివలింగమును ప్రతిష్ఠింపవచ్చును.
గాని శరీరమెట్లు పవిత్రమగును ?

అన్నం—భూమికి కర్షణాది సంస్కారములు చేయ నగును. అట్లు శరీర
మునకు నెట్లుచేయవలయును ?

పండి—భూమికి కర్షణాదులవలె శరీరమునకును గొన్ని సంస్కార
ములు గలవు.

మూ॥ ఔపాసనసముత్పన్నం గృహస్థానాం విశిష్యతే॥
సమిదగ్ని సముత్పన్నం ధార్యం వైబ్రహ్మచారిణాం॥  ౩౯
శూద్రాణాం శ్రోత్రియాగార పచనాగ్నిసముద్భవం।
అన్యేషామపి సర్వేషాం ధార్యం దావానలోద్భవం॥  ౪౦

తా॥ శివాగ్నియందు సిద్ధపరిచిన భస్మము శివయోగులకు ముఖ్యమైనది. బ్రహ్మక్షత్రియ వైశ్యులకు నగ్నిహోత్ర సముద్భవంబును, విరజాగ్నిజాతంబును నగుభస్మము గ్రాహ్యమగును. గృహస్థులకు నిత్యోపాసనాగ్నిలోనిది గ్రాహ్యమగును. బ్రహ్మచారులకు సమిద్హోమంబున జన్మించినది యుచితమగును. శూద్రులకు శ్రోత్రియుల యింటియందుఁబచనాగ్నియందు గలిగినది యర్హమగును. తక్కవారికివననహ్నిజనితము ధార్యమగును.

మూ॥ భస్మస్నానవిధింవక్ష్యే వ్యశేషాఘౌఘనాశనం।
భస్మముష్టిం సమాదాయ సంహితామంత్రమంత్రితం॥  ౪౧
మస్తకాత్పాదపర్యంతం భస్మస్నానం సమాచరేత్॥

తా॥ ఇఁకను, సకలపాపములను నశింపఁజేయునట్టిభస్మస్నానవిధిని చెప్పుచున్నాను వినుము. పిడికెఁడు భస్మమును తీసికొని, సంహితామంత్రములతో మంత్రించి శిరము మొదలుకొని పాదముల వరకు భస్మస్నానము సేయవలయు. ఎట్లన,

మూ॥ ఈశేన పంచధాభస్మకిరే న్మూర్ధ్ని యత్నతః॥  ౪౨
ముఖేచతు స్తత్పురుషే ణాఘోరే ణాష్టధాహృది।
వామేన గుహ్యదేశేతు త్రిదశస్థానభేదతః॥  ౪౩
అష్టధా సద్యమంత్రేణ పాదముద్ధూళ్య యత్నతః।
సర్వాంగోద్ధూళనంకుర్యా త్పంచభిర్బ్రహ్మభిః పునః॥  ౪౪

తా॥ ఈశానమంత్రముతో శిరమునందు నైదుమార్లుభస్మము చల్లుకొనవలయును. తత్పురుషమంత్రముతో ముఖమునందు నాలుగు

మార్లు భస్మము దాల్పవలయును. తరువాత, అఘోరమంత్రముతో హృదయమునందు నెనిమిదిమార్లు భస్మము ధరింపవలయు. అనంతరము, వామదేవమంత్రముతో గుహ్యమునందు పదమూడుమార్లు భస్మము ధరింపవలయు. అటుతరువాత, సద్యోజాత మంత్రముతో పాదములమీద నెనిమిదిమార్లు ధరింపవలయు. అనంతరము తిరిగి పంచబ్రహ్మమంత్రములతోనె భస్మమును సర్వాంగోద్ధూళనము చేకొనవలయు.

మూ॥ ఉద్ధూళనం తతః కార్య మవకుంఠనమేవచ
త్రిపుండ్రంచేతి విఖ్యాతం త్రివిధం భస్మధారణం॥ ४१

తా॥ ఉద్ధూళనము, అవకుంఠనము, త్రిపుండ్రము నని భస్మధారణము మూడువిధములు.

మూ॥ పంచభి ర్బ్రహ్మభిర్వాపి మూలమంత్రేణవా పునః
సమ్మంత్య్ర నిర్జలం భస్మ తేన లింపే త్సుసంయుతః॥ ४६
సర్వాంగ మాపాదశిఖ ముద్ధూళన మిదంస్మృతం

తా॥ పంచబ్రహ్మ మంత్రములతోగాని, పంచాక్షరీమహామంత్రముతోగాని మంత్రించినపొడిభస్మమును పాదములు మొదలుకొని సిగవరకు నలదుకొనుట యుద్ధూళన మని చెప్పఁ బడుచున్నది.

మూ॥ భస్మనా మంత్రితేనైవ సజలే నానులేపనం॥
అవకుంఠన మాఖ్యాతం త్రిపుండ్ర మథ కీర్త్యతే॥ ४२

తా॥ అట్లె సజలభస్మమును మంత్రించి దానితో శరీరమును దంతట నలదుకొనుట అవకుంఠన మని చెప్పఁబడును. ఇఁక మీదట, త్రిపుండ్రమును చెప్పుచున్నాను వినుము.

మూ॥ ద్వాత్రింశత్స్థాన కేవాథ షోడశస్థాన కేఽథవా॥ ४८
అష్టస్థానే తథాచైవం పంచస్థానేచ యోజయేత్॥

తా॥ ముప్పదిరెండుస్థానములయందుగాని, పదునారుస్థానములయందుగాని, ఎనిమిదిస్థానములయందుగాని, అయిదుస్థానములయందుగాని భస్మత్రిపుండ్రకమును ధరింపవలయు.

మూ॥ ఉత్తమాంగేలలాటేచ కర్ణయోర్నేత్రయోర్ద్వయోః॥ ౪౯
నాసావక్త్రగళేష్వేవ మంసద్వయమనన్తరం
కూర్పరేమణిబంధేచ హృదయేపార్శ్వయోర్ద్వయోః॥ ౫౦
నాభౌగుహ్యద్వయేచైవ ఊర్వోస్స్ఫిగ్బిమ్బజానుషు।
జంఘాద్వయేచపాదౌచ ద్వాత్రింశత్స్థానముత్తమం॥

తా॥ ముప్పదిరెండు స్థానము లెవ్వియనిన, శిరము, ముఖము రెండుచెవులు, రెండుకన్నులు, ముక్కు, నోరు,మెడ, రెండు భుజములు, రెండు మోచేతిమడతలు, రెండుచేతుల మణికట్టులు, రొమ్ము రెండుపార్శ్వములు, బొడ్డు, పురుషచిహ్నము, గుదము, రెండు తొడలు, రెండుపిరుదులు,రెండు మోకాళ్లు, రెండు పిక్కలు, రెండు పాదములు, చేరి ముప్పదిరెండు స్థానములగును. ఇన్నిటియందు ధరించుట ముఖ్యపక్షము.

మూ॥ అష్టమూర్త్యష్టవిద్యేశ దిక్పాలవసుభిస్సహ॥ ౫౧

తా॥ అష్టమూర్తులు, అష్టవిద్యేశ్వరులు, అష్ట దిక్పాలకులు, అష్టవసువులును చేరి ముప్పది యిద్దరు నీముప్పదిరెండు స్థానములకు నధిదేవతలగుదురు.

మూ॥ ధరో ధ్రువశ్చ సోమశ్చ ఆపశ్చైవానలోనిలః॥ ౫౨
ప్రత్యూషశ్చ ప్రభాతశ్చ వసవోఽష్టా వుదీరితాః॥

తా॥ ధరుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, జలము, అగ్ని, వాయువు ప్రత్యూషము, ప్రభాతము, నను నీయెనమండ్రు నష్టవసువు లగుదురు. భూమ్యాది పంచమహాభూతము లైదు, సూర్యుఁడు, చంద్రుఁడు,

యజమానుఁడు ననునీయెనమండ్రు నష్టమూర్తు లగుదురు. అనంతే శుఁడు, సూక్ష్మేశుఁడు, శివేశుఁడు, ఏకనేత్రేశుఁడు, ఏకరుద్రేశుఁడు, త్రిమూర్తీశుఁడు, శ్రీకంఠేశుఁడు, శిఖండకేశుఁడు, ననునీయెనమండ్రు నష్టవిద్యేశు లగుదురు.

మూ॥ ఏతేషాం నామమంత్రేణ త్రిపుండ్రం ధారయేద్బుధః॥ ౯౩

తా॥ భూమ్యైనమః అనునీ మొదలుగా వీరినామమంత్రములలో నాయాయీ ముప్పదిరెండు స్థానములయందును త్రిపుండ్రములను ధరింపవలయు.

మూ॥ విదధ్యా త్షోడశస్థానే త్రిపుండ్రంచ సమాహితః
శీర్షకేచ లలాటేచ కర్ణే చాంసద్వయేపిచ॥ ౯౪
కూర్పరే మణిబంధేచ హృదయే నాభిపార్శ్వయోః
పృష్ఠే చైవం ప్రతిష్ఠాయాం జపేత్తత్రాధిదైవతం॥ ౯౫

తా॥ ఇఁక పదునాఱు స్థానము లెవ్వియనిన, శిరము,ముఖము రెండుచెవులు, రెండుభుజములు రెండుమోచేతిమడతలు, రెండుమణి కట్టులు, హృదయము, నాభి, రెండుపార్శ్వములు, వీపు, ఆధారము నను చోట్లను త్రిపుండ్రము ధరింప నగును,ఇందు నధిదేవత లెవ్వరనిన,

మూ॥ శివం శక్తించ సాదాఖ్య మీశం రుద్రాఖ్యమేవచ
నాసత్యం దస్రకశ్చైవ మశ్వినౌ ద్వౌ సమీరితౌ।
వామాదినవశక్తీశ్చ ఏతా షోడశ దేవతాః॥ ౯౬

తా॥ శివుఁడు, శక్తి, సాదాఖ్యుఁడు, ఈశుఁడు, రుద్రుఁడు నాసత్యుఁడు, దస్రుఁడు ననునశ్వినీదేవత లిద్దఱు, వామ, జ్యేష్ఠ, రౌద్రి, కాళి, కలవికరణి, బలవికరణి, బలప్రమథిని సర్వభూతదమని మనోన్మని, అను తొమ్మిదిమంది శక్తులతోఁగూడ నీపదునాఱుగురు పదునాఱుస్థానములకు నధిదేవత లగుదురు.

మూ॥ అథవామూర్ధ్నివక్త్రేచ కర్ణయో ర్ఘ్రాణకేతథా॥ ౫౭
బాహుద్వయేచ హృదయే నాభ్యామూర్వోర్ద్వయేతథా।
జానుద్వయేచపదయోః పృష్ఠభాగేచషోడశ ॥ ౫౮

తా॥ షోడశస్థానములకు పక్షాంతరముగలదు. ఎట్లన, శిరము, ముఖము, చెవులు, ముక్కు, రెండుచేతులు, హృదయము, నాభి, రెండుతొడలు, రెండు మోకాళ్లు, రెండుపాదములు, వీపునను పదునాఱుస్థానములయందును ధరింపవలయు.

మూ॥ శివస్స్కందశ్చ చంద్రార్కౌ విఘ్నేశో విష్ణురేవచ।
శ్రీశ్చైవహృదయేతద్వత్ తథానాభౌ ప్రజాపతిః॥ ౫౯
నాగాశ్చ నాగకన్యాశ్చ ఋషయో ఋషికన్యకాః॥
పాదయోశ్చ సముద్రాశ్చ తీర్థం పృష్ఠేపిచస్మృతాః॥

తా॥ ఈస్థానములకు నధిదేవతలెవ్వరనిన, శిరమునందు శివుఁడు ముఖమునందు స్కందుఁడు, కర్ణములయందు సూర్యచంద్రులు, నాసికయందు విఘ్నేశుఁడు, బాహుద్వయమునందు విష్ణువును, హృదయమునందు లక్ష్మి, నాభియందుప్రజాపతి, రెండుతొడలయందు నాగములు నాగకన్యలును, రెండుమోకాళ్ళయందు ఋషులు ఋషికన్యలును, పాదములయందు సముద్రములును, వీపునందు తీర్థములును నధిదేవతలగుదురు.

మూ॥ ఏవంవా షోడశస్థాన మష్టస్థాన మథోచ్యతే।
శిరస్థానంలలాటంచ కర్ణద్వయ మనసంతరం ॥ ౬౧
అంసయుగ్మంచ హృదయం నాభి రిత్యష్టమం భవేత్

తా॥ ఇది యొకపదునాఱు స్థానములపక్షము. ఇఁక నెనిమిది స్థానము లెవ్వి యనిన వినుము. శిరము, లలాటము, రెండుచెవులు, రెండుబుజములు, హృదయము, నాభి యని యెనిమిదిస్థానము లగును.

మూ॥ బ్రహ్మాచ ఋషయ స్సప్త దేవతాశ్చ ప్రకీర్తితాః॥౬౨

తా॥ ఈయెనిమిది స్థానములకు బ్రహ్మ, సప్తమహర్షులును చేరి యెనమండుగురు నధిదేవత లగుదురు.

మూ॥ అథవా మస్తకం బాహూ హృదయం నాభిరేవచ
భస్మస్థానాని కీర్త్యన్తే పంచబ్రహ్మాణి దేవతాః॥౬3

తా॥ ఇంకనైదుస్థానము లెవ్వియనిన, ముఖము, రెండుచేతులు, హృదయము, నాభి, యనునవి యైదుస్థానములు. వీనికి పంచబ్రహ్మములు నధిదేవతలగుచుగు.

మూ॥ యథాసంభవ మాకుర్యా ద్దేశకాలాద్య పేక్షయా
ఉద్ధూళనే ప్యశక్తశ్చే త్త్రిపుండ్రాదీని కారయేత్॥౬౪

తా॥ ఈచెప్పినపక్షములలో దేశకాలములనుబట్టి యేదేని విధముగా త్రిపుండ్రములను ధరింపవలయును. భస్మోద్ధూళనమున శక్తి లేనివాఁడు త్రిపుండ్రములను మాత్రమైన ధరింపవలయు.

మూ॥ ఊర్ధ్వపుండ్రం భవే త్సామ మధ్యపుండ్రం యజూంషిచ
అథః పుండ్ర మృచ స్సాక్షా త్తస్మాత్పుండ్రం త్రియాయుషం

తా॥ త్రిపుండ్రమునందు పైరేఖ సామవేదంబును, నడిమిరేఖ యజుర్వేదంబును, క్రిందిరేఖ ఋగ్వేదంబును నగుగాన త్రిపుండ్రము త్రియాయుష మనిచెప్పఁబడును.

మూ॥ అగ్నిరిత్యాదిభి ర్మంత్రై ర్జాబాలోపనిషద్గతైః
సర్వైరుద్ధూళనం కార్యం భస్మనా సజలేనచ॥౬౬

తా॥ జాబాలోపనిషత్తునందుగల అగ్నిరితిభస్మ, ఈమొద లగుమంత్రములతో భస్మోద్ధూళనమును, సజలభస్మావకుంఠనమును చేయవలయు.

మూ॥ త్రియాయుషేణ మంత్రేణ బుద్ధైస్త్రిర్యక్త్రిపుండ్రకం
ధార్యం సదా ద్విజశ్రేష్ఠై ర్ధార్మికై ర్వేదపారగైః॥ ౬౭

తా॥ త్రియాయుష మనుమంత్రముతో ధార్మికులు, వేదవిదులు నగుబ్రాహ్మణశ్రేష్ఠు లెల్లపుడు త్రిపుండ్రమును ధరింపవలయు.

మూ॥ మేధావీ త్యాదినావాపి బ్రహ్మచారీ దినేదినే
భస్మనా సజలేనైవ ధారయేచ్చ త్రిపుండ్రకం॥౬౮

తా॥ త్రియాయుష మనుమంత్రముతోగాని, మేధావీభూయా సం, అనుమంత్రముతోగాని సజలభస్మముతో బ్రహ్మచారి త్రిపుండ్రమును ధరింపవలయును.

మూ॥ త్రియంబకేణ మంత్రేణ ప్రణవేన శివేనచ ।
గృహస్థశ్చ వనస్థశ్చ ధారయేచ్చ త్రిపుండ్రకం ॥ ౬౯

తా॥ త్రియంబకం యజామహే అనుమంత్రముతోగాని, ప్రణవ పంచాక్షరితోగాని, గృహస్థుఁడును వానప్రస్థుఁడును భస్మముతో త్రిపుండ్రమును ధరింపవలయును.

మూ॥ ఓంకారేణ త్రిరుక్తేన సహంసేన త్రిపుండ్రకం
ధారయే ద్భిక్షుకో నిత్య మిత్యేత చ్ఛివశాసనం॥ ౭౦

తా॥ హంసమంత్రముతో గూడినప్రణవముతో యతి భస్మమును ధరింపవలయు. ఈచెప్పిన దంతయు శివశాసనమే యగును.

మూ॥ భస్మ జ్యోతి స్సమామ్నాత మవశ్యం తస్య ధారణాత్ ।
సంసారసాగరం తీర్త్వా కైవల్య ఫల మశ్నుతే॥ ౭౧

తా॥ భస్మము జ్యోతిస్సు అని చెప్పఁబడుచున్నది. దీనిని ధరించినవాఁడు సంసార సముద్రమును దాటి కైవల్యము నొందును.

మూ॥ భస్మసంధారణాదేవ సర్వతీర్థఫలం భజేత్
భస్మసంధారణా త్సర్వం భస్మీభవతి కిల్బిషం॥ ౭౨

తా॥ భస్మమును ధరింపగా సర్వతీర్థములయందు స్నానము చేయగా గలుగునట్టి ఫలము లభించును. భస్మము ధరింపగా సర్వ పాపంబులును భస్మమై పోవును.

మూ॥ భస్మేదం శాంభవం జ్యోతి స్త్వద్ధానా ద్ధ్యాత ఈశ్వరః
భస్మసందర్శనాదేవ శివదర్శన మశ్నుతే॥ ౭౩

తా॥ శివునిజ్యోతిస్సే భస్మముగాన భస్మమును ధ్యానము చేయఁగా శివుని ధ్యానముచేసిన ఫలంబును, భస్మమును దర్శింపఁగా శివునిదర్శించినఫలంబును గలుగును.

మూ॥ భూతప్రేతపిశాచాశ్చ మహారోగాశ్చ దుస్సహాః
భస్మదర్శనమాత్రేణ పలాయన్తే నసంశయః॥ ౭౪

తా॥ భూతప్రేతపిశాచములు, సహింపరానిరోగములు, భస్మమును జూచినంతనే పరుగిడును.

మూ॥ భూతవిద్రావణే పాపసంహృతౌ ముక్తిసాధనే
న భస్మనోఽన్య త్సదృశ మిత్యేత చ్ఛివశాసనం ౭౫

తా॥ భూతప్రేతాదులను బారదోలునెడను, పాపములను సంహరించునెడను, ముక్తిని సాధించునెడను భస్మముతో సమానమైనది వేరొకటి లేదని శివశాసనము గలదు.

మూ॥ భస్మనోమహిమా గణ్యా స్సవక్తుం కేన శక్యతే
తథాపికశ్చి ద్గదితః కి మన్య చ్ఛ్రోతు మిచ్ఛసి॥ ౭౬

తా॥ ఓబృహస్పతీ, భస్మముయొక్క మహిమ మనంతము, దానిని దెలుప నెవ్వరితరము, అయినను కొంచెము దెలిపితిని. ఇంక దేనిని వినదలతువో దెలుపుము.

ఇతి శ్రీచంద్రజ్ఞాన ఉత్తరభాగే శివశాసనే
క్రియాపాదే షష్ఠః పటలః

సప్తమః పటల ఆరభ్యతే.

బృహస్పతిరువాచ — బృహస్పతి యిట్లని యడిగెను.

మూ॥ అపారమహిమాధార కరుణాభరణోజ్జ్వల
ధన్యోస్మి భస్మనోఽచిన్త్యమహిమ్నః పరివేదనాత్ ॥ ౧

తా॥ అనంతమగు మహిమమునకు నాధారభూతుఁడవును, కరుణ యనునాభరణముతో వెలుంగుచున్న వాఁడవును నగు నోయనంతరుద్రుఁడా, భస్మమునదగు మహిమమును వినినందున నేను ధన్యుఁడనైతిని.

మూ॥ రుద్రాక్షమహిమానంచ విబోధ్య కృపయా విభో
శిష్యం మా మనుగృహ్ణీష్వ సురాసురనమస్కృత॥ ౨

తా॥ దేవాసురులచే నమస్కరింపబడిన యోయనంతరుద్రుడా, రుద్రాక్షమహిమమునుగూడ దెలిపి యనుగ్రహింపుము.

అనంతరుద్రఉవాచ — నావిని యనంతరుద్రుఁ డిట్లని యానతిచ్చెను.

మూ॥ గీష్పతే తే ప్రవక్ష్యామి రుద్రాక్షాణాం యథోదయం
ధారణం మహిమానంచ శ్రుణు హ్యైకాగ్రచేతనః॥ 3

తా॥ ఓబృహస్పతీ, నీకు రుద్రాక్షములయుత్పత్తిని ధారణవిధిని, మహిమమును దెలుపుచున్నాను అవహితచిత్తుఁడవై వినుము.

మూ॥ త్రిపురాణాం వధార్థాయ విభునా శంభునా పురా
ఉన్మీలితాని చక్షూంషి దివ్యం వర్షసహస్రకం॥ ౪

తా॥ పూర్వకాలమున పరమేశ్వరుఁడు త్రిపురముల సంహరింపనెంచి పెక్కుకాలము కన్నులదెరచికొని యుండెను.

మూ॥ ఉభాభ్యాం చారుపక్ష్మభ్యాం పతితా జలబిందవః
తత్రాశ్రుబిందవో జాతా మహారుద్రాక్షవృక్షకాః॥ ౫
స్థావరత్వ మనుప్రాపు ర్భక్తానుగ్రహకారణాత్

తా॥ అప్పుడు పరమేశ్వరుని కంటిరెప్పలనుండి జలబిందువులు నేలపై బడియెను. ఆజలబిందువులు భక్తులయనుగ్రహార్థమై స్థావరరూపము నొంది మహారుద్రాక్షవృక్షములుగా ప్రభవించెను.

మూ॥ దృష్ట్వా రాత్రౌ దివా పాపం దివారాత్రికృతం హరేత్ । ౬
శ్రోత్రియాయ సవత్సాయా ధేనో ర్దానేన యత్ఫలం
తత్ఫలం లక్షగుణితం దర్శనా ల్లభతే నరః॥ ౭
పునస్తు కోటిగుణితం ఫలం తత్స్పర్శనా ద్భజేత్
తస్య కోటిశతం పుణ్యం లభతే ధారణా న్నరః॥ ౮

తా॥ ఆవృక్షములవలన గల్గినబీజములు రుద్రాక్షము లగును. ఇట్టిరుద్రాక్షమును రాత్రి చూచు నెడ పగలు చేసిన పాపము నశించును. పగటికాలమునఁ జూచునెడ రాత్రికాలమునఁ జేసినపాపము హరించును. శ్రోత్రియునకు దూడతోఁగూడినగోవును దానముచేయగా గలుగుపుణ్యముకంటె లక్షగుణిత మగుపుణ్యము రుద్రాక్షమును దర్శించినంతమాత్రమున గలుగును. కోటిగుణిత మగుపుణ్యము రుద్రాక్షమును స్పృశించినంతన గలుగును. నూరుకోట్ల గోదానముల ఫలము రుద్రాక్షమును ధరించినంతన గలుగును.

మూ॥ లక్షకోటిసహస్రాణి లక్షకోటిశతానిచ ౯
తజ్జపా ల్లభతే పుణ్యం రుద్రాక్షై ర్భక్తిమా న్నరః॥

తా॥ రుద్రాక్షములతో జపము సేయునెడ లక్షకోటి సహస్ర గోదానముల పుణ్యము లభించును

మూ॥ రుద్రాక్షాణాంతు భద్రాక్ష ధారణేస్యాన్మహాఫలం । ౧౦
ధాత్రీఫలప్రమాణంతు శ్రేష్ఠమేత దుదాహృతం ।
బదరీఫలమాత్రంతు మధ్యమం ప్రోచ్యతేబుధైః । ౧౧
అధమంచణమాత్రంస్యా దితివిద్ధిబృహస్పతే ॥

తా॥ భద్రాక్షమును ధరించినను మహాఫలము గలుగును. ఉసిరికకాయ పరిమాణముగల రుద్రాక్షము శ్రేష్ఠమైనది. రేగుబండంతదిమధ్యమము, శనగగింజంతది కనిష్ఠము. అని యెఱుంగునది.

మూ॥ బ్రాహ్మణా క్షత్రియా వైశ్యా శ్శూద్రాశ్చేతి శివాజ్ఞయా ।
వృక్షాజాతాః పృథివ్యాంతు తజ్జాతీయాశ్శుభాక్షకాః॥ ౧౨

తా॥ రుద్రాక్షవృక్షముల లో శివాజ్ఞచే బ్రాహ్మణక్షత్రియాది వర్ణ విభాగములుగలవు. దానింబట్టి యాపిభాగము, ఆచెట్లవలన గలిగిన రుద్రాక్షబీజములకును గలదు.

మూ॥ శ్వేతాస్తు బ్రాహ్మణాజ్ఞేయా క్షత్రియా రక్తవర్ణకాః ॥
పీతా వైశ్యాస్తు విజ్ఞేయాః కృష్ణాశ్శూద్రాఉదాహృతాః ॥ ౧౩

తా॥ వీనిలో తెల్లనివి బ్రాహ్మణజాతియనియు, ఎఱ్ఱనివి క్షత్రియజాతియనియు, పచ్చనివి వైశ్యజాతియనియు, నల్లనివి శూద్రజాతియనియు నెఱుంగవలయు. ఈ తెలుపు మొదలగువర్ణములు రుద్రాక్షవృక్షములకు మాత్రమె యుండునని కొందఱును, రుద్రాక్షములకును గలవని మఱికొందఱును నభిప్రాయపడుచున్నారు

మూ॥ బ్రాహ్మణో బిభృయా చ్ఛ్వేతాన్ రక్తాన్ రాజాతు ధారయేత్
పీతాన్ వైశ్యస్తు బిభృయాత్ కృష్ణాన్ శూద్రస్తు ధారయేత్ ॥

తా॥ బ్రాహ్మణుఁడు తెల్లనివానిని, క్షత్రియుఁడు ఎఱ్ఱనివానిని, వైశ్యుఁడు పచ్చనివానిని, శూద్రుఁడు నల్లనివానిని ధరింపవలయు. ఇచట నభిప్రాయభేదమునుబట్టి, తెల్లని రుద్రాక్షవృక్షములవల్లగలిగిన రుద్రాక్షములను బ్రాహ్మణుఁడు ధరింపవలయునని మొదలుగా కొందఱును, తెల్లనిరుద్రాక్షములనే బ్రాహ్మణుఁడు ధరింపవలయునని మొదలుగా మఱికొందఱును నర్థము చెప్పుచున్నారు. బృహజ్జాబాలమునందు॥ రుద్రాక్షాన్ శ్వేతానేవ బిభృయా స్తత్ర సమ్మర్శః,

అనియుండుటంబట్టి, తెల్లనివి దొరకనప్పుడు నెఱ్ఱనివిగాని, నల్లనివి గాని ధరింప నగును.

మూ॥ తామ్రా స్స్నిగ్ధా దృఢా స్థూలాః కంటకై స్సంయుతాః శుభాః
క్రిమిదష్టం ఛిన్నభిన్నం కంటకై ర్హీనమేవచ ౧౫

వ్రణయుక్త మవృత్తంచ షడ్రుద్రాక్షాన్వివర్జయేత్॥

తా॥ ఎఱ్ఱనివి, నునుపైనవి, గట్టివి, లావైనవి, ముండ్లుగలవియు నగు రుద్రాక్షములు శ్రేష్ఠములు. పురువుగొరికినది, పగిలినది, ముండ్లులేనిది, పుచ్చినది, వఱ్ఱువలేనిది యగు రుద్రాక్షములు కూడవు.

మూ॥ స్వయమేవ కృతద్వారం రుద్రాక్షం స్యాదిహోత్తమం ౧౬
యత్తు పౌరుషయత్నేన కృతం త న్మధ్యమం భవేత్॥

తా॥ దానియంతన బెజ్జముగల రుద్రాక్షము శ్రేష్ఠమైనది. పురుషప్రయత్నముచే రంధ్రము సేయఁబడినది మధ్యమ మగును.

మూ॥ సమాః స్నిగ్ధాః దృఢాః వృత్తాః క్షౌమసూత్రేణ ధారయేత్।
సర్వగాత్రేణ సౌమ్యేన సామాన్యాని విచక్షణః॥

తా॥ సమానమైన పరిమాణముగలవి, నునుపైనవి, గుండ్రనివి సమానములైన ముఖములుగలవి యగు రుద్రాక్షములను పట్టుదారములో గూర్చి ధరింపవలయు॥

మూ॥ నికషే హేమరేఖేవ యస్య రేఖా ప్రదృశ్యతే। ౧౮
తదక్ష ముత్తమం విద్యా త్తద్ధార్యం శివపూజకైః॥

తా॥ వరిపిడిరాతియందు వరవగా, నేరుద్రాక్షముయొక్క రేఖ సువర్ణరేఖవలె కనఁబడునో ఆరుద్రాక్షము శ్రేష్ఠమైనది. అట్టిదానిని శివపూజాపరులు ధరింపవలయు.

మూ॥ శిఖాయా మేకరుద్రాక్షం త్రింశత్తు శిరసా వహేత్॥ ౧౯
ద్వాత్రింశత్తు గళే దద్యాత్ బాహ్వోష్షోడశషోడశ॥
ద్వాదశం మణిబంధేపి స్కంధే పంచశతం వహేత్॥ ౨౦
అష్టోత్తర శతైర్మాలాం జపయజ్ఞే ప్రకల్పయేత్॥

తా॥ శిఖయందు నొక్కరుద్రాక్షమును, శిరమున ముప్పది రుద్రాక్షములను, కంఠమునందు ముప్పదిరెండిటిని, బాహువులయందు పదునాఱు పదునాఱును, మనికట్టులయందు పండ్రెండు పండ్రెండును, కంఠమునందు నేనూటిని ధరింపవలయు. నూటయెనిమిది రుద్రాక్షములుగల మాలికను జపయజ్ఞమునకై యేర్పరుచుకొనవలయును.

మూ॥ ద్విసరం త్రిసరంవాపి సరాణాం పంచకంతువా॥ ౨౧
సరాణాం సప్తకంవాపి బిభృయాత్కంఠదేశతః॥

తా॥ రెండుగాని మూడుగాని అయిదుగాని ఏడుగాని సరములు గల రుద్రాక్షములను కంఠమునందు ధరింపవలయు.

మూ॥ మకుటే కుండలేచైవ కర్ణికాహారకేషుచ॥ ౨౨
కేయూరకటకేచైవ కుక్షిబంధే విశేషతః॥

తా॥ కిరీటము, కుండలములు, హారములు, కేయూరములు కడియములు, కుక్షిబంధము మొదలగు నాభరణములయందు ముఖ్యముగా రుద్రాక్షములను ధరింపవలయు.

మూ॥ సుప్తే పీతే సదాకాలం రుద్రాక్షాన్ధారయేన్నరః॥ ౨౩
త్రిశతం త్వధమం పంచశతం మధ్యమ ముచ్యతే।
సహస్ర ముత్తమం ప్రోక్త మేవం భేదేన ధారయేత్॥ ౨౪

తా॥ నిద్రించునప్పుడు, నీరు త్రావునప్పుడు మొదలుగా సర్వకాలములయందును రుద్రాక్షములను ధరింపవలయును. మున్నూరు

రుద్రాక్షములను ధరించుట అధమము. ఏనూరుధరించుట మధ్యమము. సహస్రము ధరించుట యుత్తమ మగును. కావున నిందు నేదేని యొక విధమున ధరింపవలయు,

మూ॥ శిర సీశానమంత్రేణ కంఠే తత్పురుషేణచ।
అఘోరాఖ్యేన మంత్రేణ కరయో ర్ధార యేత్సుధీః॥ ౨౭
పంచాశదక్షసహితాం వ్యోమవ్యాపీతి చోదరే॥

తా॥ శిరమున నీశానమంత్రముతోను, కంఠమునందు తత్పురుష మంత్రముతోను, చేతులయందు నఘోరమంత్రముతోను, ఉదరమునందు వ్యోమవ్యాపిమంత్రముతోను రుద్రాక్షములను ధరింపవలయును.

మూ॥ పంచబ్రహ్మభి రంగైశ్చ త్రిమాలా పంచ సప్తచ॥ ౨౮
అథవా మూలమంత్రేణ సర్వా ణ్యక్షాణి ధారయేత్॥

తా॥ పంచబ్రహ్మ మంత్రములతోను, షడంగ మంత్రములతోను మూడుపేరులు, అయిదుపేరులు, ఏడుపేరులుగల మాలికలను ధరింపవలయు. అట్లుగాక, మూలమంత్రముతోను నన్నిచోట్లను రుద్రాక్షములను ధరింపవలయును.

మూ॥ ఏకవక్త్రింతురుద్రాక్షం పరతత్త్వస్వరూపకం ॥ ౨౯
తద్ధారణాత్పరేతత్త్వే లీయతేవిజితేంద్రియః ।

తా॥ ఏకముఖముగల రుద్రాక్షము పరతత్త్వస్వరూపమైనది. దానిని ధరించినవాఁడు ఇంద్రియనిగ్రహముగలవాఁడై పరతత్త్వమునందు లయించును.

మూ॥ ద్వివక్త్రంచైవ రుద్రాక్ష మర్ధనారీశ్వరాత్మకం॥ ౩౦
ధారణా దర్ధనారీశః ప్రీయతే తస్యనిత్యశః॥

తా॥ రెండుముఖములుగల రుద్రాక్షము అర్ధనారీశ్వరస్వరూప మైనది. దీనిని ధరించునెడ నర్ధనారీశ్వరుఁ డెల్లపుడు సుప్రసన్నుండై యుండును.

మూ॥ త్రివక్త్రి మనల స్సాక్షాత్ స్త్రీహత్యాం దహతి క్షణాత్
త్రిముఖం చైవరుద్రాక్ష మగ్నిత్రయ ముదాహృతం ।
తద్ధారణేన హుతభు క్తుష్యతి స్ఫుటకామదః॥ 30

తా॥ మూడుముఖములుగల రుద్రాక్షము సాక్షాత్తుగా అగ్నిస్వరూప మైనది. దీనిని ధరించునెడ క్షణమాత్రమున స్త్రీహత్యాదోషమును దహించును. మఱియు, మూడుముఖములు గలరుద్రాక్షము త్రేతాగ్నిస్వరూప మైనది. దానిని ధరించునెడ నగ్నిహోత్రుఁడు సంతుష్టుండై సర్వకామంబుల నొసంగుచుండును,

మూ॥ చతుర్ముఖంతు రుద్రాక్షం బ్రహ్మరూప ముదాహృతం ।
పంచవక్త్రంతు రుద్రాక్షం పంచబ్రహ్మస్వరూపకం॥ 31
పంచవక్త్రి స్స్వయంబ్రహ్మ బ్రహ్మహత్యాం వ్యపోహతి॥
తస్య ధారణమాత్రేణ సంతుష్యతి సదాశివః॥ 32

తా॥ నాల్గుముఖములుగల రుద్రాక్షము చతుర్ముఖబ్రహ్మస్వరూప మైనది. అయిదుముఖములుగల రుద్రాక్షము పంచబ్రహ్మస్వరూప మైనది, అయిదుముఖములుగల రుద్రాక్షము ధరించునెడ బ్రహ్మహత్యాదోషము తొలంగును. దానిని ధరించినమాత్రిన శివుండు సంతోషించును.

మూ॥ షడ్వక్త్రకంతు రుద్రాక్షం కార్తికేయాధిదైవతం ।
వినాయకాధిదైవంచ దత్తేఽవిఘ్నం శ్రియం పరాం॥ 33

తా॥ ఆఱుముఖములుగల రుద్రాక్షమునకు వినాయకుండును, కుమారస్వామియు నధిదేవత లగుదురు. ఇద్దానిం ధరించునెడ నవిఘ్నంబును, సిరియు గలుగును.

మూ॥ సప్తవక్త్రంతు రుద్రాక్షం సప్తమాత్రధిదైవతం ।
తద్ధారణేన సుప్రీతా జయం దదతి మాతరః ॥ 34

తా॥ ఏడుముఖములు గలరుద్రాక్షమునకు సప్తమాతృక లధిదేవత లగుదురు. ఈరుద్రాక్షము ధరించినవానియెడ మాతృకలు సుప్రసన్నలై జయము నొసంగుదురు,

మూ॥ అష్టవక్త్రంతు రుద్రాక్షం దిగధీశాధిదైవతం ।
వస్వష్టకప్రియంచైవ గంగాప్రీతికరం శుభం॥ 35
తద్ధారణా దిమే ప్రీతా దదతే తస్య వాంఛితం॥

తా॥ ఎనిమిదిముఖములుగల రుద్రాక్షమునకు నష్టదిక్పాలకులును, అష్టవసువులును, గంగాదేవియు నధిదేవత లగుదురు. గాన దీనిని ధరించినవానియెడ వీరు సుప్రీతులై కోరిక లొసంగుచుందురు.

మూ॥ నవవక్త్రంతు రుద్రాక్షం నవశక్త్యధిదైవతం॥ 36
తస్య ధారణమాత్రేణ ప్రీయన్తే నవశక్తయః॥

తా॥ తొమ్మిదిముఖములుగల రుద్రాక్షమునకు నవశక్తులు నధిదేవత లగుదురు, దానిని ధరించునెడ నవశక్తులు సంతసింతురు.

మూ॥ దశవక్త్రన్తు రుద్రాక్షం యమదైవ ముదాహృతం॥ 37
తథా స్యప్రీతిజనకం ధారణే నాత్ర సంశయః॥

తా॥ పదిముఖములుగల రుద్రాక్షమునకు యముం డధిదేవత యగును. దానిని ధరించునెడ నద్దేవుండు సంతసించును.

మూ॥ ఏకాదశముఖం చాక్షం రుద్రైకాదశదైవతం॥ 38
త దింద్రదైవతం ప్రోక్తం సదా సౌభాగ్యవర్ధనం॥

తా॥ పదునొకండు ముఖములు గలరుద్రాక్షమునకు నేకాదశరుద్రులును, దేవేంద్రుఁడును నధిదేవత లగుదురు. దీనిని ధరించునెడ నెల్లప్పుడు సౌభాగ్యము పెంపొందుచుండును.

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ కొమరువెల్లి కాశయ్యగారు వరంగల్ | 12-0-0 |
| ,, రామిని మల్లయ్యగారు ... | 12-0-0 |
| ,, తుగ్లపాటి వెంకటేశ్వరరావుగారు, బారిష్టరు, బెజవాడ | 10-0-0 |
| ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్నగార్లు, శికింద్రాబాదు | 10-0-0 |
| ,, కైలాస శరభయ్యగారు, ... | 10-0-0 |
| ,, బెల్దె రామన్న కుమారుడు, జగదీశ్వరయ్య ... | 10-0-0 |

—♦ పోషకులు ♦—

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యవార్లంగారు, ఈమని | 5-0-0 |
| ,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని | 5-0-0 |
| ,, కామరుస్వ రాజశేఖరరావుగారు, కరణం, నవాబుపాలెం | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రులుగారు, తోండపి | 5-0-0 |
| ,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల | 5-0-0 |
| ,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చుపేట | 5-0-0 |
| ,, భూపతి రత్నంగారు, వగంగల్ | 5-0-0 |
| ,, మల్లంపల్లి మల్లికార్జునుడుగారు, అయితంపూడిఅగ్రహారం | 5-0-0 |
| ,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ | 5-0-0 |
| ,, శ్రీపతిపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని | 5-0-0 |
| ,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు | 5-0-0 |
| ,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు | 5-0-0 |
| ,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్దిపేట | 5-0-0 |
| ,, ముత్యంపేట మల్లయ్యగారు ,, | 5-0-0 |
| ,, కాళేశ్వరం నాగభూషణంగారు ,, | 5-0-0 |
| ,, కొమరువెల్లి బాలరాజుగారు, వరంగల్ | 5-0-0 |
| ,, గర్రెపల్లి రామన్నగారు. విడిదొడ్డి | 5-0-0 |

# ప్రకటనము.

ఆర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:- ఈ గ్రంథమునందు బ్రాహ్మణులు మొదలగువారు వేకువజామున నిద్రలేచినది మొదలుకొని రాత్రి పండుకొనునందాక చేయనగు స్నానసంధ్యాది సకలధర్మములకును వైద్యశాస్త్రి ప్రామాణ్యమును బట్టి ఆరోగ్యరూపమగుప్రత్యక్షఫలము కలదని ఋజువుచేయఁబడియున్నది. వెల రు ౧-౦-౦

కారణోత్తరమను దివ్యాగమము:-ఇయ్యది శైవుల లింగధారణము మొదలగువానియెడలగల సకలసంశయముల వారించు నెనిగుపమానమైనది. వెల రు ౧-౦-౦

ఆహ్నికవిధి:-ఇందు స్నానము సంధ్య మొదలుకొని శైవ్యదేవమువరకుగల సకల నిత్యకర్మములు సప్వరాంధ్ర ప్రయోగముతో గలవు. వెల రు -౮-౦

మకుటోత్తరము అను దివ్యాగమము:- ఇందు శివపూజా విశేషములు, శైవాంత్యేష్టి విధానము మొదలగు ననేక విశేషములు గలవు. వెల రు ౧-౮-౦

బ్రహ్మతర్క స్తవము:- శ్రీమదప్పయ దీక్షిత విరచితము. ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, స్మశానవాసిత్వము, బాణాసురయుద్ధమున నోడిపోయెనన్న దానికి సమాధానము మొదలగు ననేక విషయములు గలవు. వెల రు ౧-౧-౦

మహాశివపూజా విధి:- ఇయ్యది లింగనిరీక్షణమును వినియోగించు దశావధాన విధానముతోను, సస్వరాంధ్రప్రయోగముతో మశాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦-౮-౦

ధర్మసంగ్రహము అంత్యేష్టికాండము:- ఇందు శైవులాచరించు సమాధ్యౌర్ధ్వదైహికవిధులు శాస్త్రసిద్ధములని పలువిధముల నిరూపింపఁబడియుండుటెగాక, అపరకాండ సందర్భమునగల సర్వవిధకృత్యములకుఁదగు ప్రమాణముల గనబరిచి సకల సంశయములు వారింపఁబడినెను ఆంధ్ర తాత్పర్యసహితము వెల రు ౨-౦-౦

వలయువారు:- ముదిగొండ నాగలింగశాస్త్రి అని ప్రాయవలెను.

రామలింగేశ్వర పేట, తెనాలి.

Reg. No. M- 2284.

శ్రీ
శివాయ గురవేనమః

# శైవరహస్యబోధిని.

ఇది
శ్రీ దేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జితాసార్
శ్రీ కంసుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని
సాహాయ్యమున వెలుపడుచు
శైవధర్మములను, వాని ప్రామాణ్యమును దెలుపు
మాసపత్రిక.



| సంపుటము 5. | విభవనామ సంవత్సర కార్తిక మాసము. | సంచిక 8 |
|---|---|---|



సంపాదకుడు:_ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।
విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ।
అశేషశం కామయపంకశోధినీ।
జయత్వియం శైవరహస్యబోధినీ।



తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

చందా సం॥ రు 2-0-0.

1928.

## శాశ్వత ప్రధాన పోషకులు.

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగ మయ్యవార్లగారి కుమారుడు నాగమల్లయ్య అయ్యవార్లగారు. సిద్దిపేట

కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, రామన్నవగైరా సిద్దిపేట

### —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారీకులు

| | | |
|---|---|---|
| 1 | భండారు మల్లిఖార్జునరావుగారు | |
| 2 | భండారు వీరభద్రరావుగారు | |
| 3 | భండారు వీరరాజుగారు | 60—0—0 |
| 4 | భండారు వీరబసవరాజుగారు | |
| 5 | భండారు చెన్నబసవయ్యగారు | |
| 6 | భండారు చిన మల్లిఖార్జునుడుగారు | |

### —: ప్రధానపోషకులు :—

| | |
|---|---|
| మరాశ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రిలుగారు సికింద్రాబాదు | 12.0.0 |
| ,, శివలంక తాయన్నగారు, పోణంగి | 10.0.0 |
| ,, ముదిగొండ వీరభద్రయ్య అయ్యవారుగారు, ఈపుని | 10.0.0 |
| ,, శివపురవు రాజయ్యగారు, శికింద్రాబాదు | 10.0.0 |
| ,, కొడిమేల భోగసోమలింగారాధ్యులుగారు, శ్రీగురుత్వ సంస్థానం వరంగల్ | 10.0.0 |
| ,, శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు నిర్మల | 10.0.0 |
| ,, కాశీనాధుని అల్లమయ్య అయ్యవారుగారు యలకుర్రు అగ్రహారం | 10.0.0 |
| ,, శివలెంక శంభులింగం అయ్యవారుగారు బెజవాడ | 10.0.0 |
| ,, ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్ | 12.0.0 |

మూ॥ రుద్రాక్షం ద్వాదశముఖం మహావిష్ణుస్వరూపకం । ౩౯
ద్వాదశాదిత్యదైవంచ దేవతా ప్రీతివర్ధనం॥

తా॥ పండ్రెండుముఖములుగల రుద్రాక్షమునకు మహావిష్ణు మూర్తియు, ద్వాదశాదిత్యులును నధిదేవత లగుదురు. దానిని ధరించునెడ నాయాదేవతలు సుప్రసన్ను లగుదురు.

మూ॥ త్రయోదశముఖం చాక్షం కామదం శుద్ధిదం శుభం ౪౦
తస్య ధారణమాత్రేణ కామదేవః ప్రసీదతి॥

తా॥ పదమూడుముఖములుగల రుద్రాక్షము సర్వకామంబుల నొసఁగుటయగాక పావిత్ర్యంబు గలిగించును. దానిని ధరించునెడ మన్మథుండు సుప్రసన్నుం డగును.

మూ॥ చతుర్దశముఖం చాక్షం రుద్రనేత్రసముద్భవం। ౪౧
సర్వవ్యాధిహరంచైవ సదారోగ్య మవాప్నుయాత్ ॥

తా॥ పదునాలుగు ముఖములుగలరుద్రాక్షము సర్వవ్యాధులను దొలగించి యెల్లపుడు నారోగ్యము నొసఁగుచుండును.

మూ॥ తన్ముఖం రుద్ర మిత్యాహు స్తద్బిందు స్సర్వదేవతాః। ౪౨
రుద్రాక్షధారణా త్సద్య స్సర్వపాపైః ప్రముచ్యతే॥

తా॥ రుద్రాక్షముయొక్కముఖము రుద్రుఁడే యగును. అందున్నబిందువు సర్వదేవతలు నగుదురు. కావున రుద్రాక్షమును ధరింపగానె సర్వపాపములు తొలంగును.

మూ॥ రుద్రాక్షధారణం పుణ్యం కేనవా సదృశం భవేత్। ౪౩
సహస్రం ధారయే ద్యస్తు రుద్రాక్షాణాం ధృతవ్రతః।
సురాసురా నమ స్త్యేనం యథా రుద్ర స్తథైవ సః॥ ౪౪

తా॥ రుద్రాక్షధారణము మహాపుణ్యప్రద మైనది. దీనితో సమానమైనది వేరొక్కటి లేదు. వేయి రుద్రాక్షముల ధరించువానిని జూచి దేవాసురులు నమస్కరించుచుందురు. ఆపురుషుండు రుద్రతుల్యుం డగును.

మూ॥ అభావేతు సహస్రస్య బాహ్వో ష్షోడశ షోడశ।
ఏకం శిఖాయాం కరయో ర్ద్వాదశ ద్వాదశ ద్వయోః। ౪౫
ద్వాత్రింశ త్కంఠదేశేతు ప్రత్యేకం కర్ణయోశ్చ షట్। ౪౬
ఉర స్యష్టోత్తరశతం చత్వారింశచ్చ మస్తకే।
ధారయే ద్యస్తు రుద్రాక్షం రుద్రవ త్పూజ్యతే సదా॥ ౪౭

తా॥ వేయిరుద్రాక్షములను ధరింపఁజాలనియెడ చేతులయందు పదునాఱుపదునాఱు, సిగయందొక్కటియు, మనికట్టులయందు పన్రెండుపన్రెండును, మెడయందు ముప్పదిరెంటిని, చెవులయందు నాలేసిటిని, వక్షమునందు నూటయెనిమిదింటిని ధరించినవాఁడును రుద్రునివలె పూజింపఁబడుచుండును.

మూ॥ ముక్తాప్రవాళ స్ఫటిక రౌప్య వైడూర్య కాంచనైః
ధారయే ద్యస్తు రుద్రాక్షా న్రుద్రో నాత్ర సంశయః ౪౮

తా॥ ముత్యములు, పవడములు, స్ఫటికములు, వైడూర్యములు, వెండిపూసలు, బంగరుపూసలు, మొదలగువానిలో రుద్రాక్షములను గూడ జేర్చి ధరించినవాఁడును రుద్రసమూఁడే యగును.

మూ॥ కేవలంవాపి రుద్రాక్షా న్రుద్రముద్రా స్బిభర్తి యః
తం నస్పృశన్తి పాపాని తమాంసీవ విభావసుం॥ ౪౯

తా॥ రుద్రచిహ్నములుగల రుద్రాక్షములనుమాత్రమైన నెవ్వఁడు ధరించునో వానిని, సూర్యుని చీకటులు స్పృశింపనియట్లు పాపము లంటనేరవు.

మూ॥ రుద్రాక్షమాలయా జప్తో మంత్రోఽనంతఫలప్రదః
అరుద్రాక్షజపః పుంసాం తావన్మాత్రఫలప్రదః॥ ౫౦

తా॥ రుద్రాక్షమాలికతో జపించినమంత్రము అనంతఫలంబు నొసంగును. కడమవానితో జపించినమంత్రము ఎన్నిమార్లు జపము సేయబడునో అంతమాత్రపుఫలమునే యొసఁగును.

మూ॥ యస్యాంగే నాపిరుద్రాక్ష ఏకోపి బహుపుణ్యదః ౫౧
తస్య జన్మ నిరర్థం స్యా త్త్రిపుండ్రరహితం యథా

తా॥ ఎవ్వనిశరీరమునందు బహుపుణ్యప్రద మైనరుద్రాక్ష మొక్కటియేని లేకుండునో వానిజన్మము భస్మత్రిపుండ్రము ధరింపని వాని జన్మమువోలె నిష్ప్రయోజన మైన దగును.

మూ॥ మూర్ధ్ని విన్యస్య రుద్రాక్షం యస్స్నాతి మతిమా న్నరః
గంగాస్నానఫలం తస్య జాయతే నాత్ర సంశయః ॥౨౨

తా॥ ఏబుద్ధిమంతుఁడు శిరమున రుద్రాక్షము నుంచికొని స్నానము సేయునో వానికి గంగాస్నానఫలము గలుగును, ఇందు సందియము లేదు.

మూ॥ పూజయే ద్యస్తు రుద్రాక్షం కృత్వా తోయాభిషేచనం।
యత్ఫలం లింగపూజాయాం త దేవాప్నోతి నిశ్చితం॥ ౨౩

తా॥ మఱియెవ్వండు రుద్రాక్షమును జలముతో నభిషేకము చేసి పూజించునో వానికి శివలింగపూజాఫలము నిశ్చయముగా గలుగును.

మూ॥ రుద్రాక్షమహిమాపారః కశ్చి దుక్తో మయాఽనఘ।
గోపనీయః ప్రయత్నేన కిమత శ్శ్రోతు మిచ్ఛసి॥ ౨౪

తా॥ ఓబృహస్పతీ, రుద్రాక్షమహిమము అనంతమైనది. ఇందు గొంత నీకు దెలిపితిని. దీనిని రహస్యముగా నుంచికొని గాపాడుము. ఇంక దేని వినగోరెదవో తెలుపుము.

ఇతిశ్రీచంద్రజ్ఞాన ఉత్తరభాగే
శివశాసనే
క్రియాపాదే
సప్తమః పటలః

---

## అష్టమఃపటల ఆరభ్యతే

బృహస్పతి రువాచ = బృహస్పతి తిరుగానిట్లని యడిగెను.

మూ॥ అనుత్తరజ్ఞాననిధే పరానందసుధాంబుధే।
శ్రీమదీయముఖాంభోజా న్మకరందమివ స్రుతం। ౧

మహిమాన మిహాకర్ణ్య రుద్రాక్షాణా మనుత్తమం।
సంతృప్తో వివశశ్చాస్మి ధన్యోస్మి సురసన్నుత॥ ౨
శ్రీమత్పంచాక్షరస్యాపి విధానం మహిమోన్నతిం।
ఉపదిశ్య కృపాదృష్ట్యా విలోక్యాఽనుగృహాణ మాం॥ 3

తా॥ సర్వోత్తమ మగుజ్ఞానమునకు నిధివిని, పరానందామృతమునకు సముద్రముంబోలిన వాఁడవును నగు నోయనంతరుద్రుఁడా, నీముఖకమలమునుండి వెల్వడినమరందముంబోలు రుద్రాక్షమహిమమును విని సంతృప్తినొంది పరవశుండనై కృతార్థుండ నైతిని. ఇఁక శ్రీపంచాక్షరమహామంత్రముయొక్క విధానమును, మహిమమును దెలిపి యనుగ్రహింపుము.

అనంతరుద్ర ఉవాచ = అనంతరుద్రుం డిట్లని యానతిచ్చెను.

మూ॥ అధునా తే ప్రవక్ష్యామి పంచాక్షరమనోః పరం
స్వరూపం మహిమానంచ పురశ్చర్యావిధిం క్రమాత్॥ ४

తా॥ ఓబృహస్పతీ, నీ కిపుడు శ్రీపంచాక్షరమహామంత్రముయొక్క స్వరూపమును, ప్రభావమును, పురశ్చర్యావిధినిగూడ క్రమముగా చెప్పుచున్నాను వినుము.

మూ॥ ఆదౌ నమః ప్రయోక్తవ్యం శివాయేతి తతఃకృతం
సైషా పంచాక్షరీ విద్యా సర్వశ్రుతి శిరోగతా॥ ౫
శబ్దజాతస్య సర్వస్య బీజభూతా సమాసతః
ఆదౌ శివముఖోద్గీర్ణా సా తస్యైవాఽత్మవాచికా॥ ౬
తప్తచామీకరప్రఖ్యా పీనోన్నతపయోధరా
చతుర్భుజా త్రినయనా బాలేందుకృతశేఖరా॥ ౭
పద్మోత్పలధరా సౌమ్యా వరదాభయపాణికా
సర్వలక్షణసంపన్నా సర్వాభరణభూషితా॥ ౮
సిద్ధపద్మాసనాసీనా నీలకుంచితమూర్ధజా

తా॥ మొదట, నమః అనియు, తరువాత, శివాయ అనియు చేర్చునెడ పంచాక్షరీవిద్య అగును. ఈవిద్య సకలవేదాన్తములయందు

జెప్పఁబడుచున్నది. ఈవిద్య సమస్తమైన శబ్దజాతమునకు మూలమై నది, ఈవిద్య మొదట శ్రీపరమేశ్వరుని ముఖకమలమునుండి వెల్వ డినది. ఇయ్యది శ్రీపరమేశ్వరతత్త్వము నేబోధించును. ఈవిద్య, పుటము వేసిన బంగరువంటి కాంతిగలదియు, పీనోన్నతస్తనయు, చతుర్బాహు పరిమండితయు, త్రిణేత్రయు, బాలశశాంక మౌళియు, కమలమును, కలువపూవును ధరించినదియు, శాంతరూపయు, వరాభయముద్రలను దాల్చినదియు, సర్వలక్షణములతోఁగూడినదియు, సర్వాభరణములచే నలంకృతయు, సిద్ధపద్మాసనమున గూర్చుండినదియు, ముడువఁబడిన నల్లని వెండ్రుకలు గలదియుగా భావింపవలయును.

మూ॥ ఇయం ప్రణవపూర్వా షడక్షరీత్యపి గీయతే॥
ద్విజైరియంతు జప్తవ్యా నిత్యం ప్రణవపూర్వికా
స్త్రీ, భి శ్శూద్రై శ్చ జప్తవ్యా నమోంతా ప్రణవంవినా॥ ౧౦

తా॥ ఈమంత్రమునకు ముందు ప్రణవమును గూర్చినప్పుడు ఇది షడక్షరియనియుఁ జెప్పబడుచుండును. ఇటనుటంబట్టి, ప్రణవము సర్వమంత్ర సాధారణమగుటచే లెక్కయందుఁ జేరదుగాన ప్రణవ ముతోఁగూడినదానికిని పంచాక్షరియను సంజ్ఞయే ముఖ్యమనియు, ప్రణవమునుగూడ లెక్కయందుఁ జేర్చుకొను రెండవపక్షమునందు దీనికి గౌణముగా షడక్షరియని సంజ్ఞకూడ చెల్లుచుండుననియు గ్రహిం పవలయును.) బ్రహ్మక్షత్రియవైశ్యులీమంత్రమును ప్రణవముతోఁ గూడనె జపింపవలయును. స్త్రీలును, శూద్రులును ప్రణవమును వదలి పెట్టి, శివాయనమః, అని జపింపవలయును.

మూ॥ వామదేవ ఋషిశ్చాస్య పంక్తి శ్ఛంద ఉదాహృతః
దేవతా సశివస్సాక్షా త్ప్రథమం బీజ ఉచ్యతే॥ ౧౧
శక్తి ర్ద్వితీయవర్ణశ్చ న్యాస శ్చైవం షడక్షరైః
ధ్యాత్వా సంపూజ్య మనసి బాహ్యేవా పరమేశ్వరం॥ ౧౨
జపం కుర్యా త్ప్రయత్నేన ధ్యాయకో సాంబం త్రియంబకం।

సహస్రంవా తదర్ధంవా శతంవాథజపీ న్మనుం॥ ౧౩
ఏవం యః కురుతే నిత్యం సశివోహి నసంశయః

తా॥ ఈమహామంత్రమునకు వామదేవుఁడు ఋషి, పంక్తి ఛందస్సు, శివుఁడు దేవత, ప్రణవము బీజము, నకారము శక్తి మకారము కీలకము, మంత్రములోని యీఅయిదువర్ణములతో కరన్యాసము, హృదయాదిన్యాసము చేయవలయును. హృదయమునందుగాని, జ్వాహ్యమునగాని పరమేశ్వరుని పూజించి, పార్వతీసహితుఁడగు పరమేశ్వరుని ధ్యానము సేయుచు వేయిమార్లుగాని, ఏనూరుమార్లుగాని, నూరుమార్లుగాని యీమంత్రమును జపము సేయవలయు. ఇట్లు ప్రతిదినము నెవ్వఁడు జపము సేయుచుండునో వాఁడు కేవలము శివుఁడనియె నిస్సంశయముగా దలంపవలయు.

మూ॥ అస్యాః పంచవిధా వర్ణాః ప్రస్ఫురద్రశ్మిమండలాః। ౧౪
పీతః కృష్ణ స్తథా ధూమ్రః శ్వేతాభో రక్తఏవచ।

పృథ క్ప్రయోజ్యా యద్యేతే బిందునాద విభూషితాః॥ ౧౫
అర్ధచంద్రాకృతి ర్బిందు ర్నాదో దీపశిఖాకృతిః।

తా॥ ఈమంత్రములోని యైదువర్ణములును ప్రకాశించుచున్న కిరణపుంజముగలవై యైదువిధములుఁగా నుండును. వానిలో నకారము పచ్చనిది, మకారము నల్లనిది, శికారము ధూమ్రవర్ణమైనది. వాకారము తెల్లనిది, యకారము ఎఱ్ఱనిదియు నగును. ఈవర్ణములకు బిందువును నాదమును గూర్చునెడ వీనిని వేర్వేరుగనె ప్రయోగింపవలయును. బిందువు అర్ధచంద్రాకారంబునను, నాదము దీపశిఖారూపంబునను నుండును.

మూ॥ గౌతమో ఽత్రి స్సురాశాద్య విశ్వామిత్ర స్తథాంగిరాః॥ ౧౬
భారద్వాజశ్చ వర్ణానాం క్రమశో ఋషయ స్స్మృతాః॥

తా॥ గౌతముఁడు, అత్రి, విశ్వామిత్రుఁడు, అంగిరుఁడు, భారద్వాజుఁడు ననువారు మంత్రములోని నైదువర్ణములకు క్రమముగా ఋషు లగుదురు.

మూ॥ గాయ త్ర్యనుష్టు త్త్రిష్టుప్చ ఛందాసి బృహతీ విరాట్। ౧౭
ఇంద్రో రుద్రో హరి ర్బ్రహ్మా స్కంద స్తేషాంచ దేవతాః॥

తా॥ గాయత్రి, అనుష్టుప్పు, త్రిష్టుప్పు, బృహతి, విరాట్టు ననునవి నైదువర్ణములకు ఛందస్సులు. ఇంద్రుఁడు, రుద్రుఁడు, హరి బ్రహ్మ, స్కందుఁడు ననువారు దేవతలు నగుదురు.

మూ॥ పంచబ్రహ్మముఖా న్యాహుః స్థానం తేషాం సురో త్తమ। ౧౮
పూర్వాది చోర్ధ్వపర్యన్తం నకారాది యథాక్రమం।
ఉదాత్తః ప్రథమో వర్ణ శ్చతుర్థశ్చ ద్వితీయకః ౧౯
పంచమ స్స్వరిత శ్చైవ మధ్యమో విహత స్స్మృతః॥

తా॥ సద్యోజాతాదిపంచబ్రహ్మముఖములు నైదక్షరములకు క్రమముగా స్థానము లగును. తూర్పు మొదలగునాలుగుదిక్కులు నూర్ధ్వదిశయు నైదువర్ణములకు క్రమముగా దిక్కులగును. నకారాదులలో మొదటిది, రెండవది, నాలవదియు నగువర్ణములు ఉదాత్తస్వరంబును, అయిదవది స్వరిత మనుస్వరంబుగలదియు, నడిమివర్ణము అనుదాత్తస్వరముగలదియు నగును.

మూ॥ మూలవిద్యా శివం చైవ సూత్రం పంచాక్షర స్తథా। ౨౦
నామా న్యస్య విజానీయా చ్ఛైవం తద్ధృదయం మతం।

తా॥ మూలవిద్య, శివము, సూత్రము, పంచాక్షరము నని యీమహామంత్రమునకు నామములు. ఈమంత్రము శివునకు హృదయమగును. ముఖ్యమైనద నుట.

మూ॥ నకార శ్శిర ఉచ్యేత మకారస్తు శిఖోచ్యతే॥ ౨౧
శికారః కవచం తద్వ ద్వాకారో నేత్రముచ్యతే।

యకారోఽస్త్రం నమ స్స్వాహా వషట్ హుం వౌషడిత్యపి।
షడిత్యపిచ వర్ణానాం మన్త్రాంగత్వం యథాతథా।

తా॥ నకారము శిరోమంత్రంబును, మకారము శిఖామంత్రంబును, శికారము కవచమంత్రంబును, వాకారము నేత్ర మంత్రంబును, యకారము అస్త్రమంత్రంబును, నగును. ఈయైదువర్ణంబులును క్రమముగా నమఃస్వాహా, వషట్, హుం, వౌషట్, ఫట్, అను మంత్రాంగంబులును నగు.

మూ॥ వర్ణం దైవం తథా శక్తి రాధారం ఛందఏవచ। ౨౩
ఋషి స్థానం బ్రహ్మాచాథ ఆయుధాని తథైవచ।
కలాగుణంచ చక్రంచ ప్రకాశం కరణంతథా। ౨౪
వాయు ర్జ్ఞానేంద్రియా ణ్యేవం షోడ శైతే క్రమోదితాః॥

తా॥ వర్ణము, దైవము, శక్తి, ఆధారము, ఛందస్సు, ఋషి, స్థానము, బ్రహ్మము, ఆయుధము, కల,గుణము, చక్రము, ప్రకాశము, కరణము, వాయువు, జ్ఞానేంద్రియమునని ప్రతివర్ణమునకు పదునాఱు చొప్పున గలవు.

మూ॥ నకారం పీతవర్ణంస్యా ద్బ్రహ్మాస్త్రిం చాధిదైవతం ౨౫
సావిత్రీశక్తి రిత్యుక్తా చాధారం పృథివీ తథా
అనుష్టుప్ఛం దసాయుక్తం వాసిష్ఠార్షం తథైవహి॥ ౨౬
స్థానం పశ్చిమతోవక్త్రం సద్యోజాతంతు బ్రహ్మకం
ఆయుధం వజ్రమేవోక్తం కలా నివృత్తిరేవచ। ౨౭
గుణం కఠినమేవోక్తం చతురశ్రక మేణతు
జ్వలదగ్నిప్రకాశంతు కరణం మనఏవచ। ౨౮
ప్రాణవాయు సమాయుక్త మింద్రియాణాంచ గంధకం
ఇత్యేవం షోడశానాంతు నకారక్షర ముచ్యతే॥ ౨౯

తా॥ నకారమునకు వన్నె పసిమి, అధిదైవము, బ్రహ్మాస్త్రము శక్తిసావిత్రి, ఆధారము భూమి, ఛందస్సు అనుష్టుప్పు, ఋషి వసి

ష్ఠుఁడు, స్థానము పశ్చిమముఖము, బ్రహ్మము సద్యోజాతము, ఆయుధము వజ్రము, కల నివృత్తి, గుణము కాఠిన్యము, చక్రము చతురశ్రము, ప్రకాశము అగ్ని, కరణము మనస్సు, వాయువు ప్రాణము, జ్ఞానేంద్రియము ఘ్రాణము, అనియెఱుంగునది.

మూ॥ మకారం జలరూపంచ దైవం విష్ణు స్తథైవచ
లక్ష్మీ శ్శక్తిరితిప్రోక్తా ఆధారం జలమేవచ॥　　3౦
త్రిష్టుప్ఛం దస్సమాయుక్తం విశ్వామిత్రోఋషి స్తథా
స్థాన ముత్తరతోవక్త్రం బ్రహ్మవై వామదేవకం॥　　3౧
ఆయుధం పద్మమేవోక్తం ప్రతిష్ఠాఖ్యకలాయుతం
గుణానాం ద్రవసంయుక్తం చక్ర మర్ధసుధాకరః　　3౨
సోమస్యైవ ప్రకాశేన కరణం బుద్ధిసంయుతం
అపానవాయుసంయుక్తం రసం జ్ఞానేంద్రియం భవేత్॥　　33
ఇత్యేవం షోడశానాంతు మకారాక్షర ముచ్యతే

తా॥ మకారమునకు వర్ణము జలరూపము, దైవము విష్ణువు, శక్తి లక్ష్మి, ఆధారము జలము, ఛందస్సు త్రిష్టుప్, ఋషి విశ్వామిత్రుఁడు, స్థానము ఉత్తరముఖము, బ్రహ్మము వామదేవుఁడు, ఆయుధము పద్మము, కల ప్రతిష్ఠ, గుణము ద్రవము, చక్రము అర్ధచంద్రాకారము, ప్రకాశము చంద్రదీప్తి, కరణము బుద్ధి, వాయువు అపానము, జ్ఞానేంద్రియము నాలుక, యని గ్రహింపవలయు.

మూ॥ శికారం వహ్నిరూపంతు రుద్ర స్తత్రాధిదైవతం॥　　3౪
గౌరీ శక్తిసమాయుక్త మాధారం చాగ్ని రేవచ
ఉష్ణి క్ఛందస్సమాయుక్తం జమదగ్నిఋషి స్తథా॥　　3౫
స్థానం దక్షిణతో వక్త్రే మఘోరం బ్రహ్మచైవహి
స్వస్తికాయుధ మేవోక్తం విద్యానామ కలాపిచ॥　　3౬
గుణం దీప్త్యనుసంయుక్తం చక్రం త్రివిధమేవచ
తటతాంతు ప్రకాశేన కరణం త్వహమాకృతిః॥　　3౭

వ్యానవాయు సమాయుక్తం నేత్రేంద్రియ సమన్వితం
ఇత్యేవం షోడశానాంతు శికారాక్షర ముచ్యతే॥ 38

తా॥ శికారమునకు వర్ణము అగ్నిరూపము, అధిదైవతము రుద్రుఁడు, శక్తి గౌరి, ఆధారము అగ్ని, ఛందస్సు ఉష్ణిక్కు, ఋషి జమదగ్ని, స్థానము దక్షిణముఖము, బ్రహ్మము అఘోరుఁడు, ఆయుధము స్వస్తికము, కల విద్య, గుణము దీప్తి, చక్రము త్రికోణము, ప్రకాశము మెఱుపు, కరణము అహంకారము, వాయువు వ్యానము, జ్ఞానేంద్రియము నేత్రము, నని గ్రహింపవలయు.

మూ॥ వాకారం వాయురూపంస్యా దధిదైవత మీశ్వరం
అంబికాస్యా న్మహాశక్తి ర్వాయు శ్చాధారమేవచ॥ 39
బృహతీ ఛందసాయుక్తం ఋషిః కాశ్యపఏవచ
స్థానం పూర్వాననం ప్రోక్తం బ్రహ్మ తత్పూరుషం భవేత్॥
ఆయుధం బిందురూపంతు కలా శాంతి స్తథైవచ
గుణ స్పర్శఇతిప్రోక్తం షడశ్రం చక్రమేవచ॥ 40
ప్రకాశ మింద్రనీలస్య చిత్తంతు కరణం భవేత్
ఉదానవాయుసంయుక్తం చర్మ జ్ఞానేంద్రియం భవేత్॥ 41
ఇత్యేవం షోడశానాంతు వాకారాక్షర ముచ్యతే

తా॥ వాకారమునకు వర్ణము వాయురూపము, అధిదైవత మీశ్వరుఁడు, శక్తి అంబిక, ఆధారము వాయువు, ఛందస్సు బృహతి, ఋషి కాశ్యపుడు, స్థానము పూర్వముఖము, బ్రహ్మము తత్పూరుషము, ఆయుధము బిందువు, కల శాంతి, గుణము స్పర్శము, చక్రము షట్కోణము, ప్రకాశము ఇంద్రనీలకాంతి, కరణము చిత్తము, వాయువు ఉదానము, జ్ఞానేంద్రియము త్వక్కు, నని యెఱుంగవలయు.

మూ॥ యకారం వ్యోమరూపంతు దైవంచైవ సదాశివః। 43
ఉన్మనీ శక్తిరేవోక్తా ఆధారం వ్యోమచోచ్యతే॥

జగతీ ఛందసాయుక్తం భరద్వాజో ఋషి స్తథా। ౪౪
స్థాన మూర్ధ్వముఖం విద్యా ద్బ్రహ్మ చేశానమేవచ॥
ఆయుధానాంతు శూలంస్యా చ్ఛాంత్యతీతా కలాపిచ॥ ౪౫
గుణానాంచైవ శూన్యం స్యాత్ప్రకాశం చంద్రికామణేః
కరణం ప్రకృతేరూపం సమానో వాయురేవచ॥ ౪౬
శబ్దో జ్ఞానేంద్రియాణాంచ ఇత్యేతే షోడశక్రమాత్
యకారాక్షర మిత్యుక్తం నభూతో నభవిష్యతి॥ ౪౭

తా॥ యకారమునకు వర్ణము వ్యోమరూపము, అధిదైవము సదాశివుఁడు, శక్తి ఉన్మని, ఆధారము ఆకాశము, ఛందస్సు జగతి, ఋషి భరద్వాజుఁడు, స్థానము ఊర్ధ్వముఖము, బ్రహ్మము ఈశానాఖ్యము, ఆయుధము శూలము, కల శాంత్యతీత, గుణము శూన్యము, ప్రకాశము చంద్రకాంతమణికాంతి, కరణము ప్రకృతిరూపము, వాయువు సమానము, జ్ఞానేంద్రియము శ్రోత్రము నని యెఱుంగునది. ఈమంత్రముతో సమానమైన దింకొక్కటి లేదు.

మూ॥ ఏకమేవ ప్రధానంతు పంచాక్షర మితి స్మృతం
కామ్య సిద్ధిప్రయోగేన ప్రత్యక్షం పంచధా భవేత్। ౪౮
తతః ప్రస్తారకం ప్రోక్తం వింశత్యేకశతం భవేత్
ఏవం పంచాక్షరోత్పత్తి ర్గురోర్వక్త్రేణ లభ్యతే॥ ౪౯

తా॥ ఈపంచాక్షర మహామంత్ర మొక్కటియే ప్రధానమైనది. కామ్యప్రయోగముల విషయమై యిందు నొక్కొకయక్షరము నైదేసివిధము లగును. ఈయక్షరములను ప్రస్తారముసేయగా నూటయిరువదియొక్కవిధము లగును. ఈపంచాక్షరమంత్రముల యుత్పత్తిని గురుముఖముననె యెఱుంగవలయు.

మూ॥ మంత్రం పంచవిధం ప్రోక్తం కర్మ చాష్టవిధం భవేత్
పరే పంచాక్షరోత్పత్తిః పున స్తత్రైవ లీయతే॥ ౫౦

తా॥ ఈమంత్రము ప్రధానభేదము లైదు గలిగియుండును. దీనికి నేనిమిదివిధము లైన కర్మములయందు వినియోగము గలదు. శాంతికము, పౌష్టికము, వశ్యము, ఆకర్షణము, ద్వేషణము, ఉచ్చాటనము, స్తంభనము, మారణమునని ప్రయోగము లెనిమిదిగా గ్రహింపవలయు.

మూ॥ సప్తకోటి మహామంత్రా రూపవక్త్రై రనేకథా
పంచాక్షరే ప్రలీయన్తే పున స్తస్మా ద్వినిర్గతాః॥ ౫౧

తా॥ ఒక్కొక్కటియు ననేకవిధములుగా నున్న సప్తకోటి మహామంత్రములును నీపంచాక్షర మంత్రమునుండియె బుట్టుచు తిరుగ దీనియందె లయ మొందుచున్నవి.

మూ॥ ఆజ్ఞాహీనం క్రియాహీనం శ్రద్ధాహీనం బృహస్పతే
అజప్తం దక్షిణాహీనం సదాజప్తంచ నిష్ఫలం॥ ౫౨

తా॥ గురునాజ్ఞలేక చేసినది, హోమాదిక్రియారహితమైనది. శ్రద్ధారహితమైనది, జపము చేయనిది, దక్షిణ లేనిది, ఎల్లపుడు జపముచేసినది యగుమంత్రము నిష్ఫల మగును. హోమాదిక్రియలు లేక, చేసినది ఎల్లపుడు జపము చేసినదియు నిష్ఫలము లనగా కామ్యఫలమునుమాత్ర మొసగ వనియు, మోక్షఫలము నొసంగు నిడ నిస్సంశయ మనియు గ్రహింపవలయు.

మూ॥ ఆజ్ఞాసిద్ధం క్రియాసిద్ధం శ్రద్ధాసిద్ధ మిదంతథా
దక్షిణాసిద్ధమపిచ మంత్ర మేత న్మహాఫలం॥ ౫౩

తా॥ గురునాజ్ఞనొంది చేసినది, హోమాదిక్రియలతోఁ జేసినది, శ్రద్ధతోఁ జేసినది, గురుదక్షిణ నొసంగి చేసినది యగుమంత్రము గొప్పఫలము నొసంగును,

మూ॥ దీక్షాపూర్వం గురో ర్లబ్ధ్వా మంత్ర మాజ్ఞాం సమాహితః
సంకల్ప్యచ జపే న్నిత్యం పురశ్చరణపూర్వకం॥ ౫౪

తా॥ ఈమంత్రమును గురునివద్ద దీక్షాపూర్వముగా గ్రహించి, గురునాజ్ఞనొంది, పురశ్చరణము చేసి ప్రతిదినము జపముచేయవలయు.

మూ॥ యావజ్జీవం జపే న్నిత్యం మష్టోత్తరసహస్రకం
అనశ్నం స్తత్పరో భూత్వా సయాతి పరమాంగతిం॥ ౧౧

తా॥ ప్రతిదినము నేయినెనిమిదిచొప్పున భోజనమునకు ముందు శివధ్యానపరుండై యావజ్జీవము జపము సేయునెడ ముక్తిని పొందును.

మూ॥ జపే దక్షరలక్షం వైచతుర్గుణిత మాదరాత్
యుక్తాశీ సంయమీ యస్స పౌరశ్చరణిక స్మృతః॥ ౧౬

తా॥ నక్తభోజనాదులు చేయుచు నియమముతో యుగసంఖ్యనుబట్టి నాలుగుఅక్షరలక్షలు మంత్రమును జపముచేసి, దానికి దశాంశము హోమము, హోమమునకు దశాంశము తర్పణము, తర్పణమునకు దశాంశము మాహేశ్వరభోజనము చొప్పున చేసినవాఁడు పురశ్చరణ చేసినవాఁ డగును.

మూ॥ యః పురశ్చరణం కృత్వా నిత్యజాపీ భవేత్పునః
తస్య నాస్తి సమోలోకె ససిద్ధ స్సిద్ధిదో భవేత్॥ ౧౭

తా॥ ఏజనుఁడు పురశ్చరణముసేసి ప్రతిదినము నీమంత్రమును జపము సేయుచుండునో వానితో సమానమైనవాఁడు లేఁడు, అట్టివాఁడు సిద్ధినిపొంది యితరులకును నిష్టసిద్ధి నొసగుచుండును.

మూ॥ స్నానం కృత్వా శుచౌ దేశే బధ్వా రుచిర మాసనం
శంకరం హృది సంచింత్య స్వగురుం తద్గురూం స్తథా॥ ౧౮
ప్రాఙ్ముఖోదఙ్ముఖోవాపి మౌనీ చైకాగ్రమానసః
విశోధ్య పంచతత్త్వాని దహనప్లావనాదిభిః॥ ౧౯
మంత్రన్యాసాదికం కృత్వా సకలీకృతవిగ్రహః
దేవం దేవీయుతం ధ్యాయే త్ప్రాణాపానౌ నియమ్యచ॥ ౨౦

తా॥ స్నానము చేసి, ధౌతవస్త్రముల ధరించి, పవిత్రమైన చోట చిత్రాసనము మొదలగు వానియందు తూర్పుముఖముగాగాని ఉత్తరముఖముగాగాని కూర్చుండి, శివుని దలంచి తనగురువును గురుని

గురులను స్మరించి, మౌనము నవలంబించి, యేకాగ్రచిత్తుండై తన శరీరగతములగు పంచభూతములను దహనము, శోషణము, ప్లావనము, అమృతీకరణము అను సంస్కారములచే శోధించి, మంత్రన్యాసాదులచే సకలీకరణము చేసికొని, ప్రాణాపానములను నిరోధించి, యంబికాసహితుఁడగు దేవదేవుని ధ్యానము చేయవలయు.

మూ॥ విద్యాం స్థానం స్వరం రూపం ఋషిం ఛందోఽధిదైవతం
బీజం శక్తిం తథావాచ్యం స్మృత్వా పంచాక్షరం జపేత్॥

తా॥ విద్యను, స్థానమును, స్వరమును, రూపమును, ఋషిని, ఛందమును, దైవతమును, బీజమును, శక్తిని, అర్థమును స్మరించి పంచాక్షరీమహామంత్రమును జపము సేయవలయును,

మూ॥ ఉత్తమం మానసం జప్య ముపాంశుం మధ్యమం విదుః
అధమం వాచికం ప్రాహు రాగమార్థవిశారదాః॥ ౬౨

తా॥ మానసికజపము ఉత్తమంబును, ఉపాంశుజపము మధ్యమంబును, వాచిక జపము అధమంబును నగును.

మూ॥ ఉత్తమం రుద్రదైవత్యం మధ్యమం విష్ణుదైవతం
అధమం బ్రహ్మదైవత్య మిత్యాహు రనుపూర్వశః॥ ౬౩

తా॥ మానసజపము రుద్రదైవత్యమైనది ముఖ్యము, ఉపాంశుజపము విష్ణుదైవత్యము రెండవపక్షము, వాచికజపము బ్రహ్మదైవత్యము మూడవపక్షము, నని యెఱుంగవలయు.

మూ॥ యదుచ్చనీచస్వరితైః శ్శబ్దైః స్స్పష్టపదాక్షరైః
మంత్ర ముచ్చారయే ద్వాచా వాచికోఽయం జపః స్మృతః॥

తా॥ ఉదాత్తానుదాత్తాది స్వరములతో పదములలోని యక్షరములు స్పష్టముగా నితరునకు వినంబడునట్లు మంత్రమును జదువుచుండుట వాచికజపము అని చెప్పంబడుచున్నది.

మూ॥ జిహ్వామాత్రపరిస్పందా దీషదుచ్చారితోఽపివా
అపరై రశ్రుతస్స్వన శ్రుతోవోపాంశు రుచ్యతే॥ ౬౫

తా॥ నాలుకమాత్రము కదలించుచు నితరునకు చప్పిడి వినపడకుండునట్లు మెల్లగా మంత్రమును జపము సేయుటయే ఉపాంశు జపము అని చెప్పఁబడుచున్నది,

మూ॥ ధియా యదక్షరశ్రేణ్యా వర్ణా ద్వర్ణం పదా త్పదం
శబ్దార్థచింతనం భూయః కథ్యతే మానసోజపః॥ ౬౬

తా॥ మంత్రములోని వర్ణములను, పదములను, మనసుననే దలంచుచు శబ్దార్థములనుగూడ మనసునను భావించుచు నాలుక గదలింపకయే సేయు జపము మానసికమని చెప్పఁబడుచున్నది.

మూ॥ వాచిక స్త్వేకఏవస్యా దుపాంశు శ్శత ముచ్యతే
సహస్రం మానసంప్రోక్తం సగర్భ స్తచ్ఛతాధికః॥ ౬౭

తా॥ వాచికముగాఁ జేసినజపము చేసినంతనేఫలము నొసఁగును. ఉపాంశువుగాఁ జేసినది చేసినదానికన్న నూరురెట్లఫలము నొసఁగును, మానసికముగాఁ జేసినదైనను చేసినదానికన్న వేయి రెట్లుఫలము నొసఁగును. సగర్భమైనజపము దానికంటె నూరురెట్ల ఫలము నొసఁగును.

మూ॥ ప్రాణాయామ సమాయుక్త స్సగర్భో జప ఉచ్యతే
ప్రాణయామేన రహితో హ్యగర్భో జపఉచ్యతే॥ ౬౮,

తా॥ ప్రాణాయామముతోఁగూడ, జేసినజపము సగర్భమనియు ప్రాణాయామము లేనిది యగర్భమనియుఁ జెప్పఁబడుచున్నది,

మూ॥ చత్వారింశ త్సమావృత్తిం ప్రాణాయామంతు సంస్మరేత్
మంత్రం మంత్రార్థవిధిమా నశక్తి శ్శక్తితో జపేత్॥ ౬౯

తా॥ నలుబదియొనిమిది మాత్రలకాలము ప్రాణము నిలుపుట ప్రాణాయామ మగును. మంత్రమును, మంత్రార్థమును మంత్రిము జపము చేయవలసినవిథానమును దెలిసికొని శక్తిలేనివాఁడైనను తన శక్తికొలది జపముసేయవలయును.

మూ॥ పంచకం త్రిక మేకంవా ప్రాణాయామం సమాచరేత్
అగర్భంవా సగర్భంవా సగర్భస్తు ప్రశస్యతే॥ ౭౦

సగర్భాదపి సాహస్రం సధ్యానో జపఉచ్యతే
ఏషు పంచవిధేష్వేవ కర్తవ్య శ్శక్తితో జపః ౨౧

తా॥ ఐదుమార్లుగాని, ముమ్మార్లుగాని, ఒక్కమారుగాని ప్రాణాయామము సేయవలయు. అగర్భముగా గాని, సగర్భముగా గాని జపము సేయవలయు. వీనిలో సగర్భము శ్రేష్ఠమైనది, సగర్భ మనగా ప్రాణాయామముతోఁగూడఁ జేసినది, దీనికంటె ధ్యానముతోఁ గూడఁ జేసినది యుత్తమము. చెప్పినవిధమున, వాచికము, ఉపాంశువు, మానసికము, సగర్భము, ధ్యానసహితమునని జపవిధి యైదు విధములు. వీనిలో తనశక్తినిబట్టి యేదేనొకవిధమున జపము సేయవలయు.

మూ॥ అంగుళ్యా జపసంఖ్యానా దేకమేక ముదాహృతం
రేఖయాష్టగుణం వింద్యా త్పుత్రజీవై ర్దశాధికం॥ ౨౨
శతం స్యా చ్ఛంఖమణిభిః ప్రవాళైస్తు సహస్రికం
స్ఫటికై ర్దశసాహస్రం మౌక్తికై ర్లక్షముచ్యతే॥ ౨౩
పద్మాక్షై ర్దశలక్షంతు సౌవర్ణైః కోటిరుచ్యతే
కుశగ్రంథ్యాచ రుద్రాక్షై రనంతంఫల ముచ్యతే॥ ౨౪

తా॥ జపము సేయునప్పుడు వ్రేళ్లతో లెక్కబెట్టునెడ చేసినంతయే ఫలము గలుగును; వ్రేలికణుపులలోని రేఖలతో జపము సేయునెడ నెనిమిదిరెట్ల ఫలంబును, పుత్రజీవి విత్తనములతోఁ జేయునెడ పదిరెట్లఫలంబును, శంఖములతోను, మణులతోను జేయునెడ నూరురెట్ల ఫలంబును, పవడములచేతఁ జేయునెడ వేయిరెట్లఫలంబును, స్ఫటికములతోఁ జేసినయెడ పదివేలరెట్లఫలంబును, ముత్యములతో నైనయెడ లక్షరెట్లఫలంబును, తామరపూసలతో నైనచో పదిలక్షలరెట్లఫలంబును, బంగరుపూసలతోఁ జేయునెడ కోటిగుణితంబగు ఫలంబును, దర్భముళ్లతోను రుద్రాక్షములతోను సేయునెడ నపరిమితమగుఫలంబును గలుగును.

అన్నం—ఆసంస్కారము లెవ్వి?

పండి—శరీరమునకు పవిత్రతను గలిగించుసంస్కారములు క్రియాదీక్ష యం దున్నవి. షడధ్వశుద్ధి మొదలగుసంస్కారములు శరీరమును పరమపవిత్రము గావించును. దానింబట్టి శరీరము శివలింగ ధారణమునకు నర్హమే యగునుగదా?

అన్నం—సర్వలింగగ్ స్థాపయతి, అన్నశ్రుతి మాపంచాయతనమును విధించును.

ప్రతి—అది యెట్లు?

అన్నం—సర్వ=సకలదేవతలయొక్క, లింగం=చిహ్నములను, అనగా, శివలింగ శ్రీచక్ర సాలగ్రామాదులను, స్థాపయతి = పీఠముమీద స్థాపింపవలయును. అని యర్థము. కుదురుట లేదా?

ప్రతి—సకలదేవతలయొక్క చిహ్నము లనగా, పంచాయతన మెట్లగును? ఏలన, పంచాయతనము సకలదేవతలచిహ్నమా? అయిదుగురు దేవత లనియెకదా యర్థము. పంచాయతనమునందు నైదుగురు దేవతలు చేరుదురుగాని దేవతలచిహ్న మేమికలదు? ఇట్లుండ,నది సకలదేవతలచిహ్న మనుట యెట్లు?

అన్నం—సకలదేవత లనఁగా, సకలదేవతలలో ప్రధానమైనవారు అయిదుగు రేగాన నైదుగురు దేవతలచిహ్నములు గ్రహింపఁబడియెను. ప్రధానమైనవారిని గ్రహింపగా నందఱను గ్రహించినట్లే యగుగాన సకలదేవతా చిహ్నములునని యర్థము విరుద్ధముగాదు.

ప్రతి—ఇచట మీరుచెప్పినయర్థము గ్రహించినను, స్థాపయతి = పీఠముమీదనో, నేలమీదనో స్థాపింపవలయుననికదా యర్థమగును. అంతమాత్రమున నేమి తేలినది? పంచాయతనమును పూజింపవలయుననికదా యుండవలయును. ఇచట నాయర్థము లేనేలేదు. ఇఁకమీయిష్టార్థ మెట్లు సిద్ధించును?

అన్నం—మాయిష్టార్థము బాగుగానె సిద్ధించును. ఎట్లన, పంచాయతనమును పీఠముమీద నుంచవలయునని తేలగానె పూజింపవలయునని తేలును. పీఠముమీద నునుచుట పూజింపనెగాక ఇంక దేనికి?

ప్రతి—స్థాపింపవలయు ననియున్నది. పీఠముమీదనే స్థాపింపవలయు ననునర్థ మెట్లు లేర్పడును?

అన్నం—దేవతలను పూజింపనలసివచ్చినప్పుడు పీఠముమీదగాక నింకెందు నుంతురు? పీఠముమీదనే యనునర్థ మిప్పుడు తేలలేదా?

ప్రతి—భట్టాచార్యులవారూ, మీరు సెలవిచ్చినయర్థము ఎంతసంబంధయుక్తముగా నున్నదండి?

అన్నం— ఇందు గలదోషమేదో సెలవిండు.

ప్రతి—పంచాయతనమును పూజింపవలయునని యెందున్నదని యడుగగా, పీఠముమీద నునుచుట పూజింపనేగాన పూజింపవలయునని యేర్పడియె నంటిరి. పీఠముమీద నుంచవలయునని యెట్లు లేర్పడియెనని యడుగగా పూజింపవలసినప్పుడు పీఠముమీదగాక నింకెందు నుంతురు? దీనింబట్టి పీఠముమీదనె యుంచవలయునని సిద్ధించె నంటిరి. ఆశ్రుతియందు, పీఠముమీదననియు లేదు. పూజింపవలయుననియు లేదు. ఇట్లుండ, పూజించుట పీఠమునందుంచియెగాన పీఠమున నుంచియనియు, పీఠమునందుంచుట పూజింపనెగాన దానింబట్టి పూజింపవలయుననియు సాధించుచున్నారుగాన ఇది అన్యోన్యాశ్రయము గాదా? దాననే మీరుచెప్పినయర్థమున నన్యోన్యాశ్రయ సంబంధము బాగుగాగలదని మనవి చేసితిని.

అన్నం—అట్లేని, ఈశ్రుతివాక్యమునకు నారాధ్యులవారు చెప్పిన యర్థమును మీరంగీకరింతురా?

ప్రతి—ఈశ్రుతివాక్యమునకు నారాధ్యులవారు చెప్పినయర్థమును గాని, మీరు చెప్పినయర్థమునుగాని దేనిని గ్రహింపము,

అన్నం—మీ రాశ్రుతిని ప్రమాణముగా గ్రహింతురా లేదా?

ప్రతి—ప్రమాణముగానె గ్రహింతుము,

అన్నం—అట్లైని దానికి నర్థమేమి చెప్పెదురు?

ప్రతి—ఆవాక్యమును చక్రాంకనపరముగానె సమన్వయింతుము.

అన్నం—ఇది చాల చమత్కారకరమైన విషయము. ఆరాధ్యవారు ఏశ్రుతియందు లింగధారణము సాధింతురో ఆశ్రుతియందే చక్రాంకనముకూడ నేర్పడుటకన్న కావలసిన దేమున్నది?

ప్రతి—ఆశ్రుతి పంచాయతనపరముగాదని ధ్రువపడిమెను. ఇక, దానియందు లింగధారణము, చక్రాంకనము నను రెండును ప్రతిపాదింపఁబడినను మీ కేమిలాభము? ఈరెండును మీకు నసిష్టములె గదా?

అన్నం—ఇచ్చట మాకుగలుగులాభము అనంతము. దానిని చివరకు గాని తెలుపను.

ప్రతి—దానిని కొంచె మిప్పుడు తెలుపుడు. ఏమును సంతసింతుము.

అన్నం—ఈశ్రుతికి లింగధారణము, చక్రాంకనము నను రెండర్థము లేర్పడునేని మాపంట పండినట్లే, పరస్పరవ్యాఘాతమువలన రెండర్థములును నిలువనేరవుగదా? దీనింబట్టి లింగధారణము చక్రాంకనము ననురెండును నెగిరిపోవుటకన్న మాకు కావలసిన దేమి?

ప్రతి—ఇచట నెదిరివారి లింగధారణచక్రాంకనములు నిలువకపోమె నేని మీపంచాయతనము నిలిచినట్లే సంతసింతురా? దీనికి, సంబివానిగేదె చనిపోయెనేని తంబళవానికి పాడిద్రానవింత సంతోష మనుసామెతయెగదా మూలము.

పండి—ఈశ్రుతికి రెండర్థములును కుదిరినప్పుడుగదా? అటులైన వీరు సంతసించుట అట్లు నిలిచినప్పటికి చూతము.

అన్నం—ఆచార్యులవారూ, సర్వలింగశ్రుతికి చక్రాంకనపర మగునర్థ మెట్లో సెలవిండు.

ప్రతి—ఆలకించుడు, విశ్వం నారాయణః హరః అని మంత్రపుష్పము నందు విశ్వము నారాయణుడని యున్నది. విశ్వమన్నను సర్వమన్నను నొక్కటియే. దీనింబట్టి, సర్వ = విశ్వరూపుండైన నారాయణమూర్తియొక్క, లింగం = చిహ్నములను, అనగా, శంఖచక్రములను, స్థాపయతి = ధరింపవలయును, ఎచ్చట నసగా, శరీరమునందనుట యారాధ్యులవారికి మాకును సమానమే, దీనింబట్టి శంఖచక్రాంకనపర మగున ర్థము సిద్ధింప లేదా?

అన్నం—సర్వపదమునకు నారాయణమూర్తి యనియర్థము చెప్పుటయె యొకవిధముగా నున్నది. దాని నంగీకరించినను, ఆయ నయొక్క చిహ్నము లనగా శంఖచక్రములని యెట్లు లేర్పడును. నారాయణమూర్తికి శంఖచక్రములెగాక గద, ఖడ్గము, శార్ఙ్గము ననునవియు గలవు. ఇట్లుండ శంఖచక్రములని యెట్లు సిద్ధించును.

ప్రతి—నారాయణమూర్తియొక్క చిహ్నములలో గదాఖడ్గాదు లున్నను శంఖచక్రములు ప్రధానములుగాన నవియే యిచ్చట గ్రాహ్యము లగును.

అన్నం—అట్లే గ్రహింపబడుగాక, ఈశ్రుతి యిట్లు లింగధారణ చక్రాంకనములను బోధించుచున్నదిగాన పరస్పర వ్యాఘాతమువలన నీరెండర్థములును బాధితములైనవి దీనింబట్టి లింగధారణచక్రాంకనములు రెండును నిష్ప్రమాణములు,

పండి—రెండర్థములును నిలిచినప్పుడుగదా? మీయిష్టము చేకూరును.

అన్నం—రెండవది యేయర్థము నిలువదు?

పండి—సర్వలింగశ్రుతికి శివలింగధారణరూపమగు నర్థ మొక్కటియే నిలుచునుకాని యిదికాక, మీరు చెప్పినపంచాయతనపర మగునర్థముగాని, ఆచార్యులవారు చెప్పినశంఖచక్రాంకనపర మగునర్థముగాని యేదియు నిలువదు.

ప్రతి—ఈశ్రుతికి శంఖచక్రాంకన పరమగునర్థ మెట్లునిలువదో తెలుపుము.

పండి—భట్టాచార్యులవారూ, అవధాన మొందుడు. సర్వపదము నకు నారాయణుఁ డనియర్థము నాచారుల్యవారు సెలవిచ్చి యుండిరి. దీనికి 'విశ్వంనారాయణపరః' అనుశ్రుతిని ప్రమాణ ముగా సెలవిచ్చిరి. సర్వోవై రుద్రః అనియు, ఆపోవా ఇదగ్ంసర్వం అనియు ప్రశంసావాక్యములలో నెవ్వరిప్రశంస వచ్చినను, వారు సర్వమని శ్రుతి చెప్పుచుండుట సహజము, ఇట్లుండ, సర్వపదమునకు శ్రుతినిబట్టియె రుద్రుఁడనియు, జల మనియుగూడ చెప్పనగునుగదా, ఇఁక, సర్వపదమునకు నారాయణుఁడనునర్థ మెట్లు నిర్ధారణమగునో, అది నిర్ధారణ ముకానిది నారాయణునియొక్క చిహ్నము లైనశంఖచక్రము లను ధరింపవలయునని యెట్లు సిద్ధించునో విమర్శించుడు.

అన్నం—ఈశ్రుతి చక్రాంకనపర మనుటకు బాధకము లెవ్వియో సెలవిండు.

పండి—సర్వపదమునకు నారాయణుఁడని యర్థము కుదరకపోవుట మొదటిది, నారాయణుని చిహ్నము లనగా, నవి యింకెన్నో గలవుగాన శంఖచక్రములని యేర్పడకుండుట రెండవది, వాని నేయని యంగీకరించినను నిందు వానిని ధరింపవలయుననియె యున్నదిగాని వానితో గాల్చుకొమ్మని లేకుండుట మూడవది, ఇట్లింకెన్నియో గలవు.

అన్నం—మఱికొన్నిటి సెలవిండు,

పండి—సర్వలింగశ్రుతి యుపక్రమమునందు, నిధనపతయే నమః, నిధనపతాంతికాయనమః, ఊర్ధ్వాయనమః, ఊర్ధ్వలింగాయనమః, హిరణ్యాయనమః, హిరణ్యలింగాయనమః,

అన్నం—ఆపుము, ఆపుము.

పండి—ఏమి?

అన్నం—మీరు, లింగశబ్దోచ్చారణ జనితపరమానంద పారవశ్యమున మనవాక్యములను నెదిరివారు వినుచున్నారా = లేదా? లేక లేచిపోవుచున్నారా, అనిగూడ గమనించుట లేదు. ఈవాక్యములను వినగానె ఆచార్యులవారు ప్రయాణోన్ముఖులగుచున్నారు. సందులేకుండ లింగశబ్దములను ప్రయోగించి యాచార్యులవారిని సాగనంపునెడ దిగ్విజయము నొందనగునని యూహించితిరి గాబోలు.

పండి—ఈశ్రుతికి పూర్వవాక్యములనుబట్టి శివలింగధారణ మనునర్థమే న్యాయ్యముగాని, నారాయణుని చిహ్నములనుట న్యాయ్యము గాదనుటకు, బూర్వవాక్యముల నుదాహరించితిగాని యాచార్యులవారినిగాని, మిమ్ములనుగాని సాగనంపుటకు గాదు,

అన్నం—సర్వలింగవాక్యమునకు పూర్వవాక్యములయందు శివలింగప్రశంసయుండుగాక, దానింబట్టి సర్వలింగవాక్యము లింగస్థాపనపరమే యగుగాక, అయినను నీవాక్యము శివలింగప్రతిష్టను విధించునని యేర్పడును. అంతియగాని లింగధారణమును విధించుననుట యెట్లు?

పండి—ఈశ్రుతి లింగప్రతిష్ఠాపరమైనను, శరీరమునందుఁజేయు లింగస్థాపనము లింగధారణమే యగుగాన లింగధారణపరమే యగును.

అన్నం—శరీరమునందు లింగమును స్థాపనము చేయవలయుననునర్థ మెట్లు వచ్చెను?

పండి—సర్వలింగం = శివలింగమును, స్థాపయతి = లుపవలయును అనగానే, ఎక్కడ ననునాకాంక్ష కలుగగా, కర్త శరీరధారియే గాన శరీరమునందు ననునర్థ మేర్పడుటలేదా? అని లోగడ తెలిపియుంటినిగాదా?

అన్నం—భూమియందని యేల గ్రహింపరాదు?

పండి—భూమియం దనునర్థముకంటె శరీరమందనుట న్యాయసిద్ధము

అన్నం—అది యెట్లు?

పండి—కర్తకు భూమికంటె శరీరము సన్నిహితమైనదిగాన శరీరము నందు నుంచుటయె న్యాయ్యమని యేర్పడుచున్నది.

అన్నం—శరీరమునందు ధరింపవలయునని యర్థము గ్రహింప సాధనాంతర మేదేనిం గలదా?

పండి—వలయుచో వేరొకసాధనంబును గలదు.

అన్నం—అది యేది?

పండి—శివలింగమును నిలుపవలయు ననగానె, ఎచ్చటనని యాకాంక్ష కలుగును, దానింబట్టి భూమియందనియో, లేకశరీరమందనియో గ్రహింపవలయును. ఇచట తిరిగి. భూమియందా? లేక శరీరమందా? అని సంశయము గలిగినప్పుడు, సూ॥ సందిగ్ధేతు వాక్యశ్శేషాత్॥ అనున్యాయమునుబట్టి వాక్యశేషము వలన నిర్ణయము మగును,

అన్నం—ఆవాక్యశేష మెద్ది?

పండి—పాణిమంత్రం పవిత్రం, అనువాక్యము వాక్యశేష మగును.

అన్నం—ఈవాక్యమునకు నర్థమేమి?

పండి—పాణిమంత్రం—పాణౌ మననా త్పూజనా త్త్రాయత ఇతి

పాణిమంత్రం—చేతియందుంచుకొని పూజించుటవలన రక్షించునది యనియర్థము.

అన్నం—దీనివలన నేమి లభించినది?

పండి—సందేహనివృత్తి లభించినది.

అన్నం—ఎట్లు?

పండి—లోకమునందు శరీరమునందు ధరించిన లింగమే చేతియందుంచుకొని పూజింపఁబడు చున్నదిగాని వేరొకటి గాదు. ఇట్లుండ గ్రు॥ సర్వలింగగ్ స్థాపయతి—శివలింగమును నిలుప వలయును అని చెప్పగానె భూమియందా? శరీరమునందా? అని శంకగలుగునని యెంచి 'పాణిమంత్రం' అని చెప్పెను అనగాఁ జేతియందుంచుకొని పూజించుటవలన రక్షించునది యనుటచే శరీరమునందు ధరింపని లింగము చేతియందుంచుకొని పూజింపబడదుగాన శరీరమునందే ధరింపవలయునని యేర్పడుచున్నది. ఈయర్థము గ్రహింపనిచో, పాణిమంత్రం, అనువిశేషణము వ్యర్థముగాక మానదు,

అన్నం—ఆరాధ్యులవారూ, హి, హి, హి, మీ రెంతచమత్కారమైన యర్థము చెప్పితిరండీ?

పండి—చమత్కార మేమి?

అన్నం—పాణిమంత్రం అనుదానికి నింకొకయర్థము కుదరదా?

ప్రతి—ఇచట నారాధ్యులవారు చెప్పినయర్థము సర్వవిరుద్ధము,

పండి—ఇచట మీ రేదైన నింకొకయర్థము సెలవిండు.

అన్నం—పాణిమంత్రం, అనుచోట చేతియందు, అని సప్తమ్యర్థము దేనికి?

ప్రతి—పాణిచేతనని తృతీయార్థమే చెప్పి తీరవలయు.

పండి—ఆచార్యులవారూ, దీనియర్థము పూర్తిగా సెలవిండు

ప్రతి—చేతితో పూజించుటవలన రక్షించునదియని చెపవలెకతప్పదు.

కావున తమవర్ణాశ్రమములకు దగిన కర్మాచరణంబును నీశ్వరోపాసనంబును రెండును నవశ్యపరిగ్రాహ్యములే యనియు, నెల్లరు మోక్షమునకు నర్హులేయనియు వేదశాస్త్రసమ్మతంబును పూర్వాచార్య నిర్ణీతంబునైయున్నది. ఇదియే నీలకంఠాచార్యుని సిద్ధాంతము.

కడమమతములకన్న నిందు గలవిశేష మిది. ఏదన, శంకరాచార్యులవారి మతమునందు మోక్షము కేవలజ్ఞానలభ్య మనియు, జ్ఞానమునెడ సన్న్యాసులకుమాత్రమే యధికారముగలదనియు, గృహస్థాదులకు కేవలకర్మాచరణమునందే యధికారమనియు నిర్ణయింపఁబడుటంజేసి, గృహస్థాదులకు జ్ఞానమున నధికారము మతాచార్యులచే తొలగింపఁబడియెను. కర్మాధికారమైననో ఈయుగాధిపతియగు కవిచే వారింపంబడియెను దీనింబట్టి వారికి నుభయభ్రంశము ప్రత్యక్షసిద్ధ మయ్యెను. బసవేశ్వరునిమతమునందైననో వర్ణాశ్రమధర్మము మతాచార్యునిచే తొలగింపఁబడియెను. ఈశ్వరోపాసనము యుగాధిపతిచే కలుషీకరింపఁబడియెను. దానింబట్టియుద్గియుశోచనీయముగానె యున్నది.

నీలకంఠాచార్యునిచేతనైననో కర్మజ్ఞానములు రెండును పరిగ్రహింపఁబడియెను వీనిలో జ్ఞానము లోపించెనా? కర్మము గాదును. కర్మము లోపించెనా? జ్ఞానమార్గము గాదును చెట్టు నెక్కువానికి పట్టుగొమ్మవంటిది యూర్ధ్వగతిసాధన మైనజ్ఞానము. కాలిక్రిందకొమ్మవంటిది కర్మము. పట్టుగొమ్మ యందనిచో పైనికి బోజాలడు, అట్లె జ్ఞానము లేనిచో నూర్ధ్వగతి యలభ్యము. కాలిక్రిందకొమ్మ విరిగినచో నధఃపతనము తప్పదు. అట్లె కర్మము లోపించెనా పతితత్వము దుర్వారమ నిశాస్త్రకర్తలయాశయము.

నీలకంఠునిమతమునుపందైనను నేకారణముననైననొ కానొకనికి రెండును లోపించెనేని వానిగతియేమని మీరడుగుదురేని వానిగతి యధోగతియే. అయిన నందు మతాచార్యునిలోపము కనఁబట్టదు.

దానను, శ్లో॥ అవశ్య న్నంధకో దగ్ధః పశ్య న్నపాతి పంగులః
అంధపంగువ దన్యోన్యసాపేక్షే జ్ఞానకర్మణీ॥

ఇల్లు గాలుచుండ నది కనఁబడమిచే గ్రుడ్డివాఁడును, కనఁబడి నను కాళ్లులేమిచే నటనుండి తొలఁగిపోఁజాలక కుంటివాఁడును తుదకు నిద్దఱు గాలిపోయిరి. వీరిద్దఱు చేరియుండు రేని యిల్లుగాలు చున్నవార్తను కుంటివాఁడు గ్రుడ్డివానికి దెలుపును. గ్రుడ్డివానికి కాళ్లుగలవుగాన నతడు కుంటివానినిగూడ మోసికొని కుంటివాఁడుతనకు దారిదెలుపుచుండ నిట్లిద్దఱు నటనుండి తొలఁగిపోఁజాలుదురు. ఇట్టు లన్యోన్యసాహాయ్యమువలన నాపద గడవంగలరు. ఇందు జ్ఞానము కుంటివానిం బోలినది కర్మము గ్రుడ్డివానిం బోలినది. ఈరెండును చేరినంగాని కార్యసాధకములు గాఁజాలవనుట శాస్త్రప్రసిద్ధము, పూర్వా చార్యసిద్ధాంతమునై యున్నది. దీనిం బట్టి, కర్మమార్గము, ఉపాసనా మార్గము చేరి యీ రెండును నవశ్యపరిగ్రాహ్యము లనుట యథార్థము.

అధ్వశోధనావశ్యకత

ఈవిధమున, కర్మము, ఉపాసనము ననురెండును నావశ్యకము లగుటంజేసి, మొదట, కర్మాధికారప్రదమగు నుపనయనము నకు నంగముగా నధ్వశుద్ధి సంక్షేపరూపమున గ్రహింపంబడినను, ఉపాసనాధికారప్రదమగు శైవదీక్షకుఁ బూర్వాంగముగా నయ్యది తిరుగ సమగ్రముగా గ్రహింప నావశ్యకము గలిగియున్నది.

ఉపనయన కాలమునందు నధ్వశుద్ధిలో నవసరమే మందు రేని, వినుడు.

మొదట ద్విజత్వము సిద్ధించినంగాని వేదము జదువను, వేదోక్తకర్మము నాచరింపను నధికారము గలుగదు. ఉపనయనదీక్ష గ్రహించినంగాని ద్విజత్వము చేకూరదు. సావిత్రీ[illegible]మంత్రము గ్రహించినంగాని యుక్తమైన సంస్కారము నెరవేరదు. అధ్వశోధ

నము సంక్షేపరూపమున నైన జరుగనిది. సావిత్రిని గ్రహింప నవును పడదు. ఏలన, సావిత్రీమహామంత్రమునకు వాచ్యుఁడు పరమేశ్వరుఁడు దానంజేసి సావిత్రీజపంబును నీశ్వరోపాసనమునను వినియోగించును. 'నారుద్రో రుద్ర మర్చయేత్, అనుపరిమాణమునుబట్టి సాధకుఁడు తనకు రుద్రత్వము గలిగినంగాని రుద్రునినారాధింప నర్హుఁడు కానే రఁడు.

ఆ కారణమునను, సావిత్రీగ్రహణమునకు ముందుగా పంచ శిఖలు నుంచఁబడుచున్నవి. పంచశీర్షములైననో శివునకేగాక హరిబ్రహ్మలలో నొక్కనికిని లేవు. సావిత్రికి గలిగియున్నను సావిత్రిరూపము పరమేశ్వరరూపమేగాని యితరముగాదు. ఏలన, శివునకుంబలె సావిత్రికిని శిరమున చంద్రాభరణంబును, మూఁడునేత్రములును, పది చేతులును ఐదుముఖములును నుండుటేగాక పరశివునిముఖములలో నేదిశయందుండుముఖము ఏవర్ణము గలిగియుండునో సావిత్రిముఖములలో నను నాయాదిశయందుండుముఖ మాయావర్ణము గలిగియే యుండునని చెప్పఁబడియున్నది. దానను, గాయత్రీజపమునకు వినియోగ మొందసిన, పంచశీర్షోపనయనే వినియోగః, పంచశీర్ష = పరమేశ్వరునియొక్క, ఉపనయనే = సాన్నిధ్యప్రాప్తివిషయమై, వినియోగః = గాయత్రీజపము వినియోగించునని ద్విజు లందఱు దిన దినము మూమ్మాఱు పఠించుచునే యున్నారు.

అధ్వనా మధ్వపతే, అనుమంత్రము ఈశ్వరప్రాప్తినే బోధించుచున్నది, దానింబట్టి, అధ్వశోధనము ఈశ్వరప్రాప్తిసాధనమని నిర్ధారణ మగుచున్నది. ఈవిధమున షడధ్వశుద్ధి ఈశ్వరప్రాప్తిసాధన మగుటను, ఈశ్వరత్వసిద్ధి ప్రద మగుటను సావిత్రీగ్రహణాంగముగా మొదట నావశ్యక మయ్యెను. సావిత్రీమహామంత్రము పరమేశ్వర వాచక మనుట యెట్లందురేని, అస్మత్కృతియగు ధర్మసంగ్రహము నాహ్నికకాండమునఁ జూడవలయును.

ఇట్లు అధ్వశుద్ధి యుపనయనమునందె జరిగియుండ దాని తిరుగా గ్రహింప నావశ్యక మేమని యడుగుదు రేని యీశ్వరోపాస నాంగ మగు శైవమహాదీక్షకు నంగముగా నది తిరుగా గ్రహింప నవ సర మై యున్నది.

### షడధ్వశుద్ధికి పునరావశ్యకత.

ఉపనయనసంస్కారమే చాలదా? ఇదిగాక, శైవదీక్ష దేని కందు రేని, శైవమహాదీక్ష యుపనయనమును బోలినదిగాదు. ఉపనయ నదీక్ష కర్మాధికారప్రదమేగాని శైవదీక్షయైననో బ్రహ్మసార్థక్యప్రద మైనది. ఎట్లన, ఉపనయనదీక్ష వేదము జదువను, వేదోక్తకర్మము నాచరింపను మాత్రమె సాధనము, శైవమహాదీక్షయైననో నీశ్వరు నుపాసింపసాధన మగుటంజేసి యీశ్వరప్రాప్తికి కారణ మగు చున్నది.

అట్లైన, ఈశ్వరోపాసనము వేదోక్తధర్మము గాదా? ఇది వేదోక్త ధర్మమే యైన నచో ఇంతకు నుపనయనసంస్కారము చేతనే యధికార సంపత్తి కలుగదగియున్నప్పుడు, ఉన్నకర్మము గాక, ఉపాకర్మ మువోలే శైవదీక్ష తిరుగ చేసికని యడుగుదు రేని జూతుము,

ఈశ్వరోపాసనము వేదోక్తధర్మమే యైనను, కర్మకాండ మనియు బ్రహ్మకాండ మనియు, వేదమే రెండుభాగములు గలిగియుండుటంజేసి యుపనయనము అధానము మున్నగునవి కర్మకాండములోని కర్మా చరణయందుమాత్రమె యధికారము నొసఁగుననియు, శైవమహాదీక్ష యైననో బ్రహ్మకాండములోని యీశ్వరోపాసనయందు నధికారము నొసఁగుననియు విధింపఁబడియున్న కారణమున రెండును నావశ్యకము లయ్యెను.

అట్లెందువిధింపఁబడియున్న దంటి రేని, ఉపనయనము మొదలైనవి వేదోక్తకర్మాచరణమునందు నధికారమునొసఁగునవియనుట సుప్రసిద్ధమే గాన నావిషయమున నిట దెల్పుట ననావశ్యకము. శైవదీక్ష

గ్రహించినంగాని యీశ్వరోపాసనయందు నధికారము లేదనుటకు ప్రమాణ మెద్దియన,

శ్రు॥ తేషా మేవైతాం బ్రహ్మవిద్యాం వదేత. శిరోవ్రతం విధివ ద్యైస్తుచీర్ణం॥శిరోవ్రతమును విధ్యుక్త ప్రకారము గ్రహించినవారలకే బ్రహ్మవిద్య నుపదేశింపవలయుగాని కడమవారికి కూడదని శ్వేతాశ్వతరము మొదలగునుపనిషత్తులయందుఁ జెప్పఁబడియున్నది.

శిరోవ్రత మనగా నెద్దియనిన, శ్రు॥ వ్రత మేత చ్ఛాంభవం తత్స మాచరే న్ముముక్షుః, వ్రతమేత త్పాశుపతం తత్సమాచరే న్ముముక్షుః అనియు నుపనిషత్తులుమోక్షము గోరువాఁడు శాంభవ దీక్షను గ్రహింపవలయు నని విధించియుండుటంబట్టి యీశాంభదీక్షయే శిరోవ్రతమని గ్రహింపకతీరదు.

ఈశిరోవ్రతము అథర్వణవేద శాఖగలవారికిమాత్రమే యవసర మని పూర్వమీమాంసయందు జెప్పఁబడియున్నను,సూతసంహితయందు

శ్లో॥ వ్రతంపాశుపతం చీర్ణం యై ర్ద్విజై రాదరేణతు
తేషామే వోపదేష్టవ్య మితి వేదానుశాసనం॥

పాశుపతవ్రతము నాచరించినవారలకే తత్త్వోపదేశము చేయవలయు గాని కడమవారలకు గూడదని చెప్పఁబడియున్నది.

ఈగ్రంథము వ్యాఖ్యానమున శ్రీవిద్యారణ్యులవారును, అథ పాశుపతవ్రతపూర్వకా దేవోపదేశా దనుభవపర్యన్తో బోధో భవతీతి వక్తుం ద్వితీయాధ్యాయ ఆరభ్యతే॥ పాశుపతవ్రతపూర్వకముగా నుప దేశము జేసిననేగాని యనుభవపర్యంత మగుజ్ఞానము కలుగనేరదని నిరూపించుటకై ద్వితీయాధ్యాయ మారంభింపఁబడుచున్నది, అని నుడివియున్నారు, శిరోవ్రత మనునది పాశుపతవ్రత మనుటయు, దీనిం గ్రహింపకున్నచో బ్రహ్మవిద్యను గ్రహింప నధికారము లేద నియు సూతసంహితనుబట్టి నిర్ణయ మగుచున్నది.

బ్రహ్మవిద్యయందు నధికారము సాధనచతుష్టయ సంపత్తి గలవారలకే యనియు, దానికి సన్న్యాసమే యంగమనియు, శంకరాచార్యులవారు నిర్ణయించియుండగా ఇతరాశ్రమస్థులకు బ్రహ్మవిద్యయందు నధికార మెట్లుగలదు? అని యడుగుదు రేని వినుడు.

బ్రహ్మవిద్యయందు సర్వాశ్రమస్థులకు నధికారముఁగలదు. బ్రహ్మవిద్యయందు సన్న్యాసులకుమాత్రమె యధికార మున్నదనుట ప్రామాణికము గాదు. ఏలన, బ్రహ్మజిజ్ఞాసకు విషయవాక్యమైనది, శ్రు॥ తద్విజ్ఞానార్థం సగురుమే వాభిగచ్ఛే త్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం॥ అను శ్రుతి యగును॥ శిష్యుఁడు బ్రహ్మజ్ఞానమునకై శ్రోత్రియుఁడును, బ్రహ్మనిష్ఠుఁడును నగుగురునొద్దకు సమిధలను తీసికొని పోవలయునని శ్రుతి చెప్పుచున్నది. శ్రోత్రియుఁడనగా, వేదోక్తమైనయగ్నిహోత్రాద్యనుష్ఠానము కలవాఁడని యర్థము దానింబట్టి గురుఁడు గృహస్థుఁడే యనినిర్ధారణ మగుచున్నది, ఇట్లుగాక, గురుఁడుగృహస్థుఁడు గానిచో నట్టిగురునొద్దకు శిష్యుఁడు సమిధలు గొనిపోవుట నిరర్థక మగును, గురువు సన్న్యాసియేయైనచో నతఁడు శిష్యుఁడు తెచ్చినసమిధల నేమి చేయ వలయును? సన్న్యాసి వండుకొన నైనగూడదుగాన వానిపాకక్రియకు నైన నుపయోగింపవు, గురుఁడు గృహస్థుఁడై యగ్నిహోత్రానుష్ఠానపరుఁడై యుండునుగాన నట్టిక్రియలనెరవేర్చుకొనను సమిధలనుపయోగించునని శ్రుత్యభిప్రాయము, అట్లుగాక, గురుఁడు సన్న్యాసియె అని యభిప్రాయపడుదు రేని శిష్యుఁడు కొనిపోయిన సమిధలు చలిమంట గాఁపుకొననే యుపయోగించునని యంగీకరింపక తీరదుగదా? దీనింబట్టి గురుడు యతి గాఁడనుట విశదము, గురుఁడే యతి గానప్పుడు శిష్యుఁ డెట్లు యతియఁ జెల్లును? గురుఁడు తాను సన్న్యాసమును గ్రహింపకయే బ్రహ్మవిద్య నెట్లుసాధించెనో శిష్యుఁడును నట్లె బ్రహ్మవిద్యను సాధింప నగును. అట్లుగాక, గురుఁడు గృహస్థుఁడై యుండియు తనవద్దికి శిష్యుఁడు

వచ్చి నాకు బ్రహ్మవిద్య నుపదేశింపుమని యడిగినప్పుడు, గురుఁడు, 'సన్న్యస్య శ్రవణం కుర్యాత్, సన్న్యాసము తీసికొనిననేగాని నీవు వేదాన్తశ్రవణము సేయఁగూడదు. అని చెప్పియుండునేని గురుని మర్యాద దక్కియుండునా? ఏలన, బ్రహ్మవిద్యను గ్రహింప నీకు నవసరములేని సన్న్యాసము నాకు నెట్టు లవసరమయ్యెనని శిష్యుఁ డడుగకుండడుగదా? గురుఁడైనను శిష్యులను మాత్రము సన్న్యాసులనుజేసి తాను శ్రీమంతుఁడుగా నెంచినవాఁడు దక్క యితరుఁడిట్టి బోధనుసేయబూనఁడు. కావున సన్న్యాసము బ్రహ్మవిద్యాంగమనుట న్యాయ్యముగాదు,

ఆక్షే, శంకరాచార్యులవారు బ్రహ్మవిద్యాంగము సన్యాసమే యని యేల నిర్ణయింపవలసివచ్చెనని యడుగుదురేని దానికి కారణము లేక పోలేదు. అది యేదనిన,

శంకరాచార్యులవారు సిద్ధాంతముచేయునాటికి శైవవైష్ణవాది మతకలహములు ప్రబలముగా నుండియుండుటంజేసి వానిని శాంతింపజేయుటకై శుద్ధాద్వైతపద్ధతి నవలంబించి బ్రహ్మతత్త్వ మొక్కటియే యనియు. అది నిర్గుణమనియు, దానికి నామరూపములు కల్పితములనియు, తత్త్వమొక్కటియేయైయుండి శివవిష్ణ్వాదినామరూపములు కల్పితములై, మిథ్యాభూతములైనప్పుడు వానికై కొట్లాటలునిరర్థకములనియు, జగము మిథ్యయనియు,బ్రహ్మతత్త్వము తానెయనియు,తనకన్న వేరుపదార్థము లేదనియు,ఆత్మానాత్మవివేకముచేత తానె బ్రహ్మనని దెలిసికొనుట మోక్షముగాని శివవిష్ణ్వాదుల నారాధించినను,జపతపోధ్యానాదులచేత నుపాసించినను ముక్తి కలుగదనియు, సిద్ధాంతము సేయువలసినవారైరి. వారిదగుశక్తివిశేషముంబట్టి జనులకునీసిద్ధాంతము రుచించుటంజేసి శైవవైష్ణవాదిమతస్థు లద్వైతసిద్ధాంతము నవలంబించుటచే చాలవరకు తగవులు చల్లారెను.ఆనందగిరికృత శంకరవిజయమునందు ,నాటికి శైవవైష్ణవాదిమతములు ప్రచారములో

నుండగా సద్వైతబోధచే నాయామతస్థులను స్వమతమున జేర్చినట్టు లుండుటచే నీయర్థ మేర్పడుచున్నది. మఱియు శుద్ధాద్వైతమునందు వర్ణాశ్రమధర్మములును నిలిచిపోవునని యోజించి, వర్ణాశ్రమధర్మములు నిలుపనెంచి తిరిగి గౌణముగా శైవవైష్ణవాదిమతములను నిలిపినట్లును నాగ్రంథమునను యున్నది. శంకరవిజయము విద్యారణ్యకృతముగా వేరొకటియున్నను నిది సవీనమగుటచు. విద్యారణ్యకృతను గాదనియు, కృత్రిమమేయనియు, తన్మతస్థులలో పెక్కురచే నంగీకరింపబడియుండుటను, శంకరాచార్యశిష్యుం డగునానందగిరి చేసినదై, ప్రాచీనమై యున్నశంకరవిజయమే ప్రబలప్రమాణమని యంగీకరింపక తీరదు,

దానింబట్టి శంకరాచార్యులవా రిట్లు యోజింపవలసివచ్చెను, ఏమనిన, ఈయద్వైతభావనను సర్వాశ్రమసాధారణముగా విధించినచో నెల్లజనులు నేనె బ్రహ్మనని పలుకుచు, కర్మమార్గమును, ఉపాసనామార్గమును వదలిపెట్టి చెడిపోవుదురు. గావున గృహస్థాదులకు కర్మోపాసనలు కర్తవ్యములనియు, జ్ఞానము సన్న్యాసులకుమాత్రమే యభ్యసనీయమనియు వ్యవస్థ నేర్పరచుట యావశ్యకమని యెంచి యట్లు చేసిరి. కర్మజ్ఞానములకు సముచ్చయము నంగీకరించినచో నట్లు సేయవలనుపడదు, దానం జేసి సముచ్చయవాదము ఖండించి జ్ఞానముమాత్రమే పరమపురుషార్థసాధనమని నిర్ణయించి యందు సన్న్యాసులకుమాత్రమే యధికారమని సిద్ధాంతీకరించిరి.

అట్లేని, శుద్ధాద్వైతసిద్ధాంతము ప్రమాణ సిద్ధముగాదా? అని మీకు శంక గలుగవచ్చును. ఇందు నిజమేమనిన, శుద్ధాద్వైతమునందు గొంత సత్యంబును, కొంత కల్పితంబును నిట్లు రెండును చేరి యున్నవి. దాననే, కల్పసూత్రాది శాస్త్రకర్త లగుమహర్షులు శుద్ధాద్వైతమును ఖండించియుండిరి.

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ కొమరువెల్లి కాశయ్యగారు వరంగల్ | 12-0-0 |
| ,, రామిని మల్లయ్యగారు ... | 12-0-0 |
| ,, తుగ్గపాటి వెంకటేశ్వరరావుగారు, బారిష్టరు, బెజవాడ | 10-0-0 |
| ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్నగార్లు, శికింద్రాబాదు | 10-0-0 |
| ,, కైలాస శరభయ్యగారు, ... | 10-0-0 |
| ,, బెద్దె రామన్న కుమారుడు, జగదీశ్వరయ్య ... | 10-0-0 |

## —◆ పోషకులు ◆—

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యావార్లంగారు, ఈమని | 5-0-0 |
| ,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని | 5-0-0 |
| ,, కామర్సు రాజశేఖరరావుగారు, కరణం, నవాబుపాలెం | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రులుగారు, తొండపి | 5-0-0 |
| ,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల | 5-0-0 |
| ,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చుపేట | 5-0-0 |
| ,, భూపతి రత్నంగారు, వరంగల్ | 5-0-0 |
| ,, మల్లంపల్లి మల్లికార్జునుడుగారు, అయితంపూడిఅగ్రహారం | 5-0-0 |
| ,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ. | 5-0-0 |
| ,, శ్రీపతిపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని | 5-0-0 |
| ,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు | 5-0-0 |
| ,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు | 5-0-0 |
| ,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్దిపేట | 5-0-0 |
| ,, ముత్యంపేట మల్లయ్యగారు ,, | 5-0-0 |
| ,, కాళేశ్వరం నాగభూషణంగారు ,, | 5-0-0 |
| ,, కొమరువెల్లి బాలరాజుగారు, వరంగల్ | 5-0-0 |
| ,, గర్రెపల్లి రామన్నగారు, మిడిదొడ్డి | 5-0-0 |

# ప్రకటనము.

ఆర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:- ఈ గ్రంథమునందు బ్రాహ్మణులు మొదలగువారు వేకువజామున నిద్రలేచినది మొదలుకొని రాత్రి పండుకొనునందాక చేయనగు స్నానసంధ్యాది సకలధర్మములకును వైద్యశాస్త్ర ప్రామాణ్యమును బట్టి ఆరోగ్యరూపమగు ప్రత్యక్షఫలము కలదని ఋజువుచేయఁబడియున్నది. వెల రు ౧-౦-౦

కారణోత్తరమను దివ్యాగమము:- ఇత్యాది శైవుల లింగధారణము మొదలగువానియెడలగల సకలసంశయములు వారించు నెడ నిరుపమానమైనది. వెల రు ౧-౦-౦

ఆహ్నికవిధి:- ఇందు స్నానము సంధ్య మొదలుకొని వైశ్వదేవమువరకుగల సకల నిత్యకర్మములు సస్వరాంధ్ర ప్రయోగముతో గలవు. వెల రు -౮-౦.

మకుటోత్తరము అను దివ్యాగమము:- ఇందు శివపూజా విశేషములు, శైవాంత్యేష్టి విధానము మొదలగు ననేక విశేషములు గలవు. వెల రు ౧-౮-౦.

బ్రహ్మతర్క స్తవము:- శ్రీమదప్పయ దీక్షిత విరచితము. ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, స్మశానవాసిత్వము, బాణాసురయుద్ధమున నోడిపోయెనన్న దానికి సమాధానము మొదలగు ననేక విషయములు గలవు. వెల రు ౧-౧-౧

మహాశివపూజా విధి:- ఇత్యాది లింగనిరీక్షణమున వినియోగించు దశావధాన విధానముతోను, సస్వరాంధ్రప్రయోగముతోను శాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦-౮-౦.

ధర్మసంగ్రహము అంత్యేష్టికాండము:- ఇందు శైవులాచరించు సమాధ్యారాధనవిధులు శాస్త్రసిద్ధములని పలువిధముల నిరూపింపఁబడియుండుటెగాక, అపరకాండ సందర్భమునగల సర్వవిధకృత్యములకుఁదగు ప్రమాణముల గనబరిచి సకల సంశయములు వారింపఁబడియెను. ఆంధ్ర తాత్పర్యసహితము. వెల రు ౨-౦-౦,

వలయువారు:— మూదిగొండ నాగలింగశాస్త్రి.
రామలింగేశ్వర పేట, తెనాలి. అని వ్రాయవలెను.

Reg. No. M-2284.

శ్రీ

శివాయ గురవేనమః

# శైవరహస్యబోధిని.

ఇది

శ్రీ దేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జితాసార్

శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని

సాహాయ్యమున వెలువడుచు

శైవధర్మములను, వాని ప్రామాణ్యమును దెలుపు

మాసపత్రిక.



| సంపుటము 5. | విభవనామ సంవత్సర మార్గశిరమాసము. | సంచిక 9 |
|---|---|---|



సంపాదకుడు:-ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।
విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ।
అశేషశంకామయపంకశోధినీ।
జయత్వియం శైవరహస్యబోధినీ।



తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

చందా సం॥ రు 2-0-0.

1929.

## శాశ్వత ప్రధాన పోషకులు:

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగ మయ్యవార్లగారి కుమారుడు
నాగమల్లయ్య అయ్యవార్లగారు. సిద్ది పేట
కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, రామన్నవగైరా సిద్దిపేట

## —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారీకులు

| | | |
|---|---|---|
| 1 | భండారు మల్లిఖార్జునరావుగారు | |
| 2 | భండారు వీరభద్రరావుగారు | |
| 3 | భండారు వీరరాజుగారు | 60—0—0 |
| 4 | భండారు వీరబసవరాజుగారు | |
| 5 | భండారు చెన్నబసవయ్యాగారు | |
| 6 | భండారు చిన మల్లిఖార్జునుడుగారు | |

## —: ప్రధానపోషకులు :—

| | |
|---|---|
| మ|రా|శ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రిలుగారు సికింద్రాబాదు | 12-0-0 |
| ,, శివలంక తాయన్నగారు, పోణంగి | 10-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రయ్య అయ్యవారుగారు, ఈమని | 10-0-0 |
| ,, శివపురపు రాజయ్యగారు, శికింద్రాబాదు | 10-0-0 |
| ,, కొడిమేల భోగసోమలింగారాధ్యులుగారు, శ్రీగురుత్వ సంస్థానం వరంగల్ | 10-0-0 |
| ,, శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు నిర్మల | 10-0-0 |
| ,, కాశీనాధుని అల్లమయ్య అయ్యవారుగారు యలమర్రు అగ్రహారం | 10-0-0 |
| ,, శివలెంక శంభులింగం అయ్యవారుగారు బెజవాడ | 10-0-0 |
| ,, ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్ | 12-0-0 |

మూ॥ త్రింశదక్షైః కృతామాలా ధనదా జపకర్మణి
సప్తవింశతిసంఖ్యాకై రక్షైః పుష్టిప్రదా భవేత్॥ ౭౫
పంచవింశతిసంఖ్యాకైః కృతా ముక్తిం ప్రయచ్ఛతి
అక్షైస్తు పంచదశభి రభిచారఫలప్రదా॥ ౭౬

తా॥ జపముసేయునెడ ముప్పదిపూసలతోఁ జేసినమాలిక ధనము నొసఁగును. ఇరువదియేడుపూసలతోఁ జేసినది పుష్టి నొసఁగును. ఇరువదియైదిటితోఁ జేసినది ముక్తి నిచ్చును. పదునైదుపూసలతో జేసినది యభిచారఫలము నొసఁగును.

మూ॥ అంగుష్ఠం మోక్షదం విద్యా త్తర్జనీ శత్రునాశినీ
మధ్యమా ధనదా శాంతిం కరో త్యేవ హ్యనామికా॥ ౭౭
కనిష్ఠా కర్షణే ప్రోక్తా జపకర్మణి గీష్పతే
అంగుష్ఠేన జపే జ్జప్యమన్యై రంగుళిజస్సహ॥ ౭౮
అంగుష్ఠేనవినా జప్యం కృతం తదఫలం యతః

తా॥ అంగుష్ఠముతో జపముసేయునెడ మోక్షము గలుగును చూపుడువ్రేలితో జపముసేయునెడ శత్రువులు నశింతురు. నడిమివ్రేలితో జపముసేయునెడ ధనము లభించును. అనామికతో జపము సేయునెడ శాంతి కలుగును. ఆకర్షణకృత్యమునందు చిటికెనవ్రేలితో జపము సేయవలయును. ఏవిషయమై జపముసేసినను నాయావానికిఁ జెప్పఁబడినవ్రేలితోను బొటనవ్రేలితోనుగూడ జపముసేయవలయు. బొటనవ్రేలు లేక చేసినజపము నిష్ఫల మగును.

మూ॥ గృహే జపం సమం విద్యాత్ గోష్ఠే శతగుణం భవేత్॥ ౭౯
పుణ్యారణ్యే తథారామే సహస్రగుణ ముచ్యతే
అయుతం పర్వతే రమ్యే నద్యాం లక్ష ముదాహృతం॥ ౮౦
కోటిం దేవాలయే ప్రాహు రనంతం శివసన్నిధౌ

తా॥ గృహమునందు చేసినజపము చేసినదానితో సమమైన ఫలము నొసగును. గోవులుండుచోట చేసినజపము చేసినదానికంటె నూరురెట్లఫలము నొసఁగును. పుణ్యమగునరణ్యమునగాని, తోటలోన గాని చేసినజపము వేయిరెట్లఫలము నొసఁగును. పర్వతమునందుఁ చేసిన జపము పదివేలరెట్లఫలము నిచ్చును. నదియందుఁజేసినది లక్షగుణిత మగుఫలము నిచ్చును. దేవాలమునందుఁజేసినజపము కోటిగుణిత మగు ఫలము నిచ్చును. శివునిసన్నిధియందుఁ జేసినది యనంతఫలము నిచ్చును.

మూ॥ యదిష్టలింగం సంపశ్య న్వామహ స్తస్థితం పరం। ౮౧
జపతే తత్ఫలం వక్తుం నమయా శక్యతే ద్విజ॥

తా॥ ఎడమచేతియందు నిష్టలింగము నిడికొని యద్దానిని జూచుచు చేసినజపమునకు నెట్టిఫలము లభించునో అది చెప్ప నాకు శక్యముగాదు.

మూ॥ సూర్య స్యాగ్నే ర్గురో రిందో ర్దీపస్యచ జలస్యచ।
విప్రాణాంచ గవాంచైవ సన్నిధౌ శస్యతే జపః॥ ౮౨

తా॥ సూర్యుఁడు, అగ్ని, గురువు, చంద్రుఁడు, దీపము, జలము విప్రులు, గోవులు ననువారికి నెదురుగా జపము చేయునెడ శ్రేష్ఠ మగును.

మూ॥ తత్పూర్వాభిముఖం వశ్యం దక్షిణం చాభిచారికం।
పశ్చిమం ధనదం విద్యా దుత్తరం శాంతిదం భవేత్॥ ౮౩

తా॥ తూర్పుముఖముగా గూర్చుండి జపము సేయునెడ వశ్యము గలుగును. దక్షిణముఖముగా గూర్చుండి జపము సేయునెడ మారణ ము మొదలగు నాభిచారిక క్రియలు సిద్ధించును. పడమరముఖముగా గూర్చుండి జపముసేయునెడ ధనము వచ్చును. ఉత్తరముఖముగా గూర్చుండి జపముసేయునెడ శాంతి గలుగును.

మూ॥ ఉష్ణీషీ కంచుకీ నగ్నో ముక్తకేశో గళావృతః
అపవిత్రకరోఽశుద్ధో విలప న్నజపే త్క్వచిత్॥ ౮౪

తా॥ తలపాగ బెట్టికొనిగాని, చొక్కా తొడిగికొనిగాని, దిగంబరుడుగాగాని, వెండ్రుకలు విరియఁబోసికొనిగాని చేతుల నపవిత్రములగా నిడికొనిగాని, అపవిత్రుఁడుగా నుండిగాని, విలపించుచునుగాని జపము సేయగూడదు.

మూ॥ క్రోధం మదం క్షుధాం తంద్రాం నిష్ఠీవనవిజృంభణే।
దర్శనంచ శ్వనీచానాం వర్జయే జ్జపకర్మణి। ౮౫
ఆచామే త్సంభవే తేషాం స్మరే త్సాంబం త్రియంబకం।
జ్యోతీంషిచ ప్రపశ్యేద్వా కుర్యాద్వా ప్రాణసంయమం॥ ౮౬

తా॥ జపము సేయునప్పుడు కోపమును, మదమును, ఆకలిని, ఆలస్యమును, ఉమియుటను, ఒడలువిరుచుటను, నీచులనుజూచుటను విడువవలయు, ఇవి యుండగూడ దనుట, ఆకస్మికముగా నట్టివి సంభవించునెడ ఆచమనము చేసి పార్వతీపరమేశ్వరులను స్మరింపవలయు. సూర్యాదిజ్యోతిస్సుల నైనజూచి ప్రాణాయామమైన జేయవలయును.

మూ॥ అశానశ్చ శయానశ్చ గచ్ఛ న్నుత్థితఏవవా॥ ౮౭
రథ్యాయా మశివేస్థానే నజపే త్తిమిరాంతరే
ప్రసార్య నజపే త్పాదౌ కుక్కుటాసనఏవవా॥ ౮౮
యానశయ్యాధిరూఢోవా చింతావ్యాకులితోపివా
సదాచారో జప న్సమ్యక్ భ్యాయ స్సదిం సమశ్ను తే॥ ౮౯

తా॥ భుజించుచును, పండుకొనియు, నడుచుచును, నిలుచుండియు, వీధియందును, అపవిత్రమగు చోటను, చీకటియందును, జపము సేయఁగూడదు, కాళ్లు జాపుకొని గాని, గొంతు కూర్చుండి గాని, వాహనముమీదను శయ్యమీదను నుండిగాని, చింతా

తా॥ గృహమునందు చేసినజపము చేసినదానితో సమమైన ఫలము నొసగును. గోవులుండుచోట చేసినజపము చేసినదానికంటె నూరురెట్లఫలము నొసఁగును. పుణ్యమగునరణ్యమునగాని, తోటలోనగాని చేసినజపము వేయిరెట్లఫలము నొసఁగును. పర్వతమునందుఁ చేసిన జపము పదివేలరెట్లఫలము నిచ్చును. నదియందుఁ జేసినది లక్షగుణితమగుఫలము నిచ్చును. దేవాలమునందుఁ జేసినజపము కోటిగుణితమగు ఫలము నిచ్చును. శివునిసన్నిధియందుఁ జేసినది యనంతఫలము నిచ్చును.

మూ॥ యదిష్టలింగం సంపశ్య న్వామహ స్తస్థితం పరం। ౮౧
జపతే తత్ఫలం వక్తుం నమయా శక్యతే ద్విజ॥

తా॥ ఎడమచేతియందు ఇష్టలింగము నిడికొని యద్దానిని జూచుచు చేసినజపమునకు నెట్టిఫలము లభించునో అది చెప్ప నాకు శక్యముగాదు.

మూ॥ సూర్య స్యాగ్నే ర్గురో రిందో ర్దీపస్యచ జలస్యచ।
విప్రాణాంచ గవాంచైవ సన్నిధౌ శస్యతే జపః॥ ౮౨

తా॥ సూర్యుఁడు, అగ్ని, గురువు, చంద్రుడు, దీపము, జలము విప్రులు, గోవులు ననువారికి నెదురుగా జపము చేయునెడ శ్రేష్ఠమగును.

మూ॥ తత్పూర్వాభిముఖం వశ్యం దక్షిణం చాభిచారికం।
పశ్చిమం ధనదం విద్యా దుత్తరం శాంతిదం భవేత్॥ ౮3

తా॥ తూర్పుముఖముగా గూర్చుండి జపముసేయునెడ వశ్యము గలుగును. దక్షిణముఖముగా గూర్చుండి జపము సేయునెడ మారణము మొదలగు నాభిచారిక క్రియలు సిద్ధించును. పడమరముఖముగా గూర్చుండి జపముసేయునెడ ధనము వచ్చును. ఉత్తరముఖముగా గూర్చుండి జపముసేయునెడ శాంతి గలుగును.

మూ॥ ఉష్ణీషీ కంచుకీ నగ్నో ముక్తకేశో గళావృతః
అపవిత్రకరోఽశుద్ధో విలప న్నజపే త్క్వచిత్॥ ౮౪

తా॥ తలపాగ బెట్టికొనిగాని, చొక్కా తొడిగికొనిగాని, దిగంబరుడుగాగాని, వెండ్రుకలు విరియఁబోసికొనిగాని చేతుల నపవిత్రములగా నిడికొనిగాని, అపవిత్రుఁడుగా నుండిగాని, విలపించుచునుగాని జపము సేయగూడదు.

మూ॥ క్రోధం మదం క్షుధాం తంద్రాం నిష్ఠీవనవిజృంభణే।
దర్శనంచ శ్వనీచానాం వర్జయే జ్జపకర్మణి॥ ౮౫
ఆచామే త్సంభవే తేషాం స్మరే త్సాంబం త్రియంబకం।
జ్యోతీంషిచ ప్రపశ్యేద్వా కుర్యాద్వా ప్రాణసంయమం॥ ౮౬

తా॥ జపముసేయునప్పుడు కోపమును, మదమును, ఆకలిని, ఆలస్యమును, ఉమియుటను, ఒడలువిరుచుటను, నీచులనుజూచుటను విడువవలయు, ఇవి యుండగూడ దనుట, ఆకస్మికముగా నట్టివి సంభవించునెడ ఆచమనముచేసి పార్వతీపరమేశ్వరులను స్మరింపవలయు. సూర్యాదిజ్యోతిస్సుల నైనజూచి ప్రాణాయామమైన జేయవలయును.

మూ॥ అశ్నానశ్చ శయానశ్చ గచ్ఛ న్నుత్థితఏవవా॥ ౮౭
రథ్యాయా మశివేస్థానే నజపే త్తిమిరాంతరే
ప్రసార్య నజపే త్పాదౌ కుక్కుటాసనఏవవా॥ ౮౮
యానశయ్యాధిరూఢోవా చింతావ్యాకులితోపివా
సదాచారో జప న్మర్త్య భ్యాయ స్ఫదం సమశ్నుతే॥ ౮౯

తా॥ భుజించుచును, పండుకొనియు, నడుచుచును, నిలుచుండియు, వీథియందును, అపవిత్రమగు చోటను, చీకటియందును, జపము సేయఁగూడదు, కాళ్లు జాపుకొని గాని, గొంతు కూర్చుండి గాని, వాహనముమీదను శయ్యమీదను నుండిగాని, చింతా

గ్రస్తుఁడైగాని, జపము సేయఁగూడదు. సదాచారముతోఁగూడి జపము సేసినను, హోమము సేసినను, ధ్యానము సేసినను శుభము నొందును,

మూ॥ రహస్య మన్య ద్వక్ష్యామి గోపనీయ మిదం శృణు
నవాచ్యం యస్యకస్యాపి నాస్తిక స్యాథవా పశోః॥ ౯౦
సదాచారవిహీనస్య పతిత స్యాంత్యజస్యవా
పంచాక్షరా త్పరం నాస్తి పరిత్రాణం కలౌయుగే॥ ౯౧

తా॥ నీకు నింకొకరహస్యము చెప్పుచున్నాను, దీనినినాస్తికుఁడైన పశుప్రాయుని కెవ్వనికిని జెప్పకుము, ఈకలియుగమునందు సదాచారము లేనివాఁడుగాని, పతితుఁడుగాని, అంత్యజుఁడుగాని యేలాటివానికైనను రక్షకమైనది పంచాక్షరముకన్న వేరొక్కటిలేదు,

మూ॥ గచ్ఛత స్తిష్ఠతోవాపి స్వేచ్ఛయా కర్మ కుర్వతః
అశుచేర్వా శుచేర్వాపి మంత్రోఽయం నచనిష్ఫలః॥ ౯౨

తా॥ నడుచుచుగాని నిలుచుండిగాని, యథేచ్ఛములగు పనులు సేయుచుగాని, శుచియైగాని, యశుచియైగాని, యెట్లుజపము సేసినను నీపంచాక్షరమహామంత్రము నిష్ఫలము గానేరదు,

మూ॥ అనాచారవతాం పుంసా మవిశుద్ధషడధ్వనాం।
అనాదిష్టోఽపి గురుణా మంత్రోఽయం నచనిష్ఫలః॥ ౯3

తా॥ సదాచారము లేనివారికైనను, షడధ్వశోధనము నొందని వారికైనను, గురునిచే నుపదేశము నొందకయె జపము సేయువారికైనను నీమంత్రము నిష్ఫలము గానేరదు.

మూ॥ అంత్యజస్యాపి మూఢస్య మూర్ఖస్య పతితస్యచ।
నిర్మర్యాదస్య నీచస్య మంత్రోఽయం నచనిష్ఫలః॥ ౯౪

తా॥ అంత్యజుడుగాని, మూర్ఖుఁడుగాని, పతితుఁడుగాని, హద్దులేనివాఁడుగాని, నీచుడుగాని యేలాటివానికైనను నీమంత్రము నిష్ఫలము గానేరదు.

మూ॥ సర్వావస్థాగతస్యాపి మయి భక్తిమత స్సదా।
సిధ్య త్యేవ నసందేహో నాపరస్యతు కస్యచిత్॥ ౯౧

తా॥ ఏవిధమగుదుస్థితియం దున్నవాఁడైన నాయందు భక్తిగలవానికి నీమంత్రము నిస్సంశయముగా సిద్ధించును. అంతియెగాని ఎంతసదాచారము గలవాఁడైనను భక్తిరహితునకు నెంతమాత్రము సిద్ధింపనేరదు.

మూ॥ నలగ్నతిథి నక్షత్రవారయోగాదయో ద్విజ।
అస్యాత్యంత మపేక్ష్యా స్స్యు ర్నైవ సుప్తో నపాశితః॥ ౯౨
నకదాచన కస్యాపి రిపురేష మహామనుః।
సిద్ధోవాఽథసుసిద్ధోవా సాధ్యోవాథ భవిష్యతి॥ ౯౩

తా॥ ఈమంత్రమునకు లగ్నము, తిథి, నక్షత్రము, వారము, యోగము ననునవి మంచివిగా నుండితీరవలయు నను నియమంబును లేదు. ఈమంత్రము సుప్తము, పాశితము మొదలుగా మంత్రశాస్త్రోక్తదోషములుగలది గాదు. ఈమంత్రము మొక్కప్పుడును నెవ్వనికిని వైరియగునది గాదు, సిద్ధముగాని, సుసిద్ధముగాని, సాధ్యముగాని యగును.

మూ॥ సిద్ధేన గురుణాదిష్ట స్సుసిద్ధఇతి కథ్యతే।
అసిద్ధేనాపి వాదత్త స్సిద్ధ స్సాధ్యస్తు కేవలం॥ ౯౪

అసాధిత స్సాధితోవా సిధ్యత్యేవ నసంశయః।
శ్రద్ధాతిశయయుక్తస్య శివే మంత్రేతథాగురౌ॥ ౯౫

తా॥ మంత్ర సిద్ధి నొందిననరునిచే నుపదేశింపఁబడునెడ నీమంత్రము సుసిద్ధ మగును. మంత్రసిద్ధి నొందనిగురునిచే నుపదేశింపఁబడునెడ నిది సిద్ధ మగును, ఇది ఉపదేశము లేనివానికి తానంతన సాధ్య మగును. శివునందును, మంత్రమునందును, గురునందును శ్రద్ధగలవానికి సాధించినను, సాధింపకున్నను సిద్ధించునది యగుచు,

మూ॥ తస్మా న్మంత్రాంతరాం స్త్యక్త్వా సాపాయా నధికారతః
ఆశ్రయే త్పరమాం విద్యాం హృద్యాం పంచాక్షరీం బుధః॥

తా॥ కాఁబట్టి, అపాయకరములైన యితరమంత్రములను వదలిపెట్టి యీపంచాక్షరమహామంత్రమునె యాశ్రయింపవలయు.

మూ॥ మంత్రాంతరేషు సిద్ధేషు మంత్రఏష నసిధ్యతి
అస్మి న్సిద్ధే మహామంత్రే తేపి సిద్ధా భవంతిహి॥ ౧౦౧

తా॥ ఇతరమంత్రములు సిద్ధించునెడ నీమంత్రము సిద్ధింపదు ఈమహామంత్రము సిద్ధించునెడ నామంత్రము లన్నియు సిద్ధించును.

మూ॥ అపారో మహిమా శైవపంచాక్షరమహామనోః
నవక్తుం విధినాశక్య స్సంక్షిప్యోక్తో మయాఽనఘ॥ ౧౦౨

తా॥ శైవపంచాక్షరమహామంత్రముయొక్క మహిమ మనంతము, దీనిని చతుర్ముఖుఁడైనను చెప్పఁజాలఁడు. అయినను దీనిని నీకు నేను సంగ్రహరూపమున దెలిపితిని.

మూ॥ ఇదంహి శైవదీక్షాయా మహదావరణాష్టకం
ప్రథితం సర్వవిద్యాసు ప్రత్యేకమపి ముక్తిదం॥ ౧౦౩
గదితం త్వయి సంప్రీత్యా భువనానుజిఘృక్షయా
బృందారకకులాచార్య కమన్యచ్ఛ్రోతు మిచ్ఛసి॥ ౧౦౪

తా॥ ఈయెనిమిదియు శైవమహాదీక్షకు గొప్పయావరణము లని చెప్పఁబడుచున్నవి, వీనిలో నొక్కటొక్కటియు ముక్తి నొసఁగఁ జాలునని సకలవిద్యలయందునుఁ జెప్పఁబడియున్నది. దేవతాగురుండ వగు నోబృహస్పతీ, నీయందగు ప్రేమముచేతను, లోకానుగ్రహము గోరియు నీకు వీనిమహిమనుం దెలిపితిని, ఇంక దేని వినగోరుచు న్నావో తెలుపుము.

ఇతి శ్రీ చంద్రిజ్ఞాన ఉత్తరభాగే శివశాసనే
క్రియాపాదే అష్టమః పటలః

---

## నవమః పటల ఆరభ్యతే.

గీష్పతి రువాచ—బృహస్పతి తిరుగా నిట్లని యడిగెను.

మూ॥ సర్వాగమార్థసారజ్ఞ సర్వభూతదయాపర।
జగదుద్ధరణోన్నిద్రా నంతరుద్ర నమోస్తు తే॥ ౧

తా॥ సర్వశాస్త్రార్థముల నెఱింగినవాఁడవును, సర్వప్రాణుల యందును దయగలవాఁడవును, జగము నుద్ధరించునెడ జాగరూకుఁ డవై యున్నవాఁడవునునగు నోయనంతరుద్రుఁడా, నీకు నమస్కారము చేయుచున్నాను.

మూ॥ అష్టావరణ మాహాత్మ్య మనంతశ్రుతిచోదితం।
శ్రీమన్ముఖాదిహాకర్ణ్య పరాంతృప్తిముపాప్నవం॥ ౨

తా॥ అనంతములగు వేదములయందుఁ జెప్పఁబడుచున్నయష్టా వరణముల యొక్క మహిమమును మీముఖకమలమునుండి విని పరమానందము నొందితిని.

మూ॥ ఆచారాణాంచ పంచానాం స్వరూపం వినిబోధ్యమాం ।
అనుగృహ్ణీష్వ కృపయా సురాసురనమస్కృత ॥ 3

తా॥ దేవాసురులచే నమస్కరింపఁబడుచున్నయో యనంత రుద్రేశా, దయతో పంచాచారములయొక్క స్వరూపమును గూడ దెలిపి నన్ను ననుగ్రహింపుము.

అనంతరుద్ర ఉవాచ—నావిని యనంతరుద్రుఁ డిట్లని యానతిచ్చెను.

మూ॥ లింగాచార స్సదాచార శ్శివాచార స్తథైవచ ।
గణభృత్యాచారకౌచ పంచాచారాః ప్రకీర్తితాః ॥ ౪

తా॥ లింగాచారము, సదాచారము, శివాచారము, గణాచారము, భృత్యాచారము నని పంచాచారములు చెప్పఁబడుచున్నవి.

లింగాచారము.

మూ॥ గురుణా దత్తలింగాద్వై నాస్తి దైవం మహీతలే ।
ఇతిభావానుసంధానం లింగాచార స్స ఉచ్యతే॥

తా॥ తనకు గురుం డొసఁగిన లింగముకంటె నింకొకదైవము లేదను నిశ్చయము గలిగి యుండుట లింగాచార మని చెప్పఁబడు చున్నది.

మూ॥ ధర్మార్జితేన ద్రవ్యేణ యత్సంతర్పణ మన్వహం
గురులింగజంగమానాం సదాచారఇతి స్మృతః॥ ౬

తా॥ ధర్మము దప్పకుండ నార్జించినద్రవ్యముతో ననుదినము గురులింగజంగమముల నారాధించుట సదాచారమని చెప్పఁబడు చున్నది.

మూ॥ శివఏవ పరంబ్రహ్మ పంచకృత్యపరాయణం
నతతో౽న్యాగతిరితి శివాచారోహి కీర్తితః॥ ౭

తా॥ సృష్టి స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము నను పంచకృత్యముల నాచరించుచున్నశివుఁడే పరంబ్రహ్మము. ఆదేవునికంటె వేరొకగతి లేదనునిశ్చయము శివాచారమని చెప్పఁబడుచున్నది.

మూ॥ శివస్య శివభక్తస్య శివధర్మాదికస్యచ
నశృణోతిచ యన్నిందాం సగణాచార ఉచ్యతే॥ ౮

తా॥ శివుఁడు, శివభక్తుఁడు. శివధర్మము, శివశాస్త్రము మొదలగువానియొక్క నిందను వినకుండుట గణాచార మని చెప్పఁబడును.

మూ॥ శివభక్తజనా స్సర్వే వరిష్ఠాః పృథివీతలే
తేషాం భృత్యో౽హ మితి య ద్భృత్యాచార ఇతిస్మృతః॥ ౯

తా॥ శివభక్తు లందఱు సర్వోత్తములు, వారికి నేను భృత్యుడను నను నిశ్చయము గలిగియుండుట భృత్యాచార మని చెప్పఁబడును

మూ॥ ఇహోక్తానాంచ పంచానా మాచారాణాం సురోత్తమ
ప్రకారాంతర మస్త్యత్ర వక్ష్యే తదపిచ శృణు॥ ౧౦

తా॥ ఓబృహస్పతీ, ఇచ్చటఁ జెప్పిన పంచాచారములకును ప్రకారాంతరము గలదు, దానినిగూడ చెప్పుచున్నాను వినుము,

మూ॥ లింగాచారం ప్రవక్ష్యామి ప్రథమం మంగళాలయం।
క్రియా వేధా మన్వభిఖ్య దీక్షాంతర్గత మూర్తయః॥ ౧౧
ఏకవింశతిదీక్షాశ్చ లింగాచారఇతి స్మృతాః॥

తా॥ ఇందు లింగాచారమును చెప్పుచున్నాను వినుము. క్రియాదీక్ష, వేధాదీక్ష, మనుదీక్ష అను నీమూఁడు దీక్షలలో నొక్కొ

కటియు నేడేసి యవాంతరదీక్షలు గలిగి యుండునుగాన నీయిరువది యొక్క దీక్షలును చేరి లింగాచార మని చెప్పఁబడును.

మూ॥ ఆజ్ఞోపమాచ కలశై రభిషేకా తతఃపరం ॥ ౧౨

స్వస్తికారోహణం భూతేః పట్టమాయుత్తమేవచ ।
స్వాయుత్తమితి సప్తైతాః క్రియాదీక్షాంతరా మతాః॥ ౧౩

తా॥ ఆజ్ఞాదీక్ష, ఉపమాదీక్ష, అభిషేకదీక్ష, స్వస్తికారోహణ దీక్ష, భూతిపట్టాఖ్యదీక్ష, ఆయుత్తదీక్ష, స్వాయుత్తదీక్ష, అను నీయే డును క్రియాదీక్షలో చేరును.

మూ॥ సమయ శ్చాప్యసంసార స్తత్త్వజ్ఞాన మనుగ్రహః ।
అధ్యాత్మశుద్ధవిద్యేచ సప్త వేధాంతరా స్మృతాః॥ ౧౪

తా॥ సమయదీక్ష, అసంసారదీక్ష, తత్త్వజ్ఞానదీక్ష, అను గ్రహదీక్ష, అధ్యాత్మదీక్ష, శుద్ధవిద్యదీక్ష అను నీయేడును వేధా దీక్షలో చేరినవి యగును.

మూ॥ దృఢవ్రత మహింసాచ తస్మై పంచేంద్రియార్పణం ।
ఏకాగ్రచిత్తసంపత్తిః పరతత్త్వే సదారతిః ॥ ౧౫
లింగే నిజమనోలీనం సద్యోముక్తిశ్చ శాశ్వతీ ॥
ఏవం సప్తవిధాదీక్షా మనుదీక్షాగతాస్స్మృతాః ॥ ౧౬

తా॥ దృఢవ్రతదీక్ష, అహింసదీక్ష, పంచేంద్రియార్పణదీక్ష, ఏకాగ్రచిత్తదీక్ష, పరతత్త్వనిష్ఠదీక్ష లింగమనోలయదీక్ష, సద్యో ముక్తిదీక్ష అనునీయేడును మనుదీక్షలో నంతర్భూతము లైనవి.

ప్ర॥ కారణోత్తరమునఁ జెప్పినదీక్షలకు నిచట జెప్పఁబడిన వానికిని భేదము కనఁబడుచున్నది. ఇది యెట్లు?

ఉ॥ కారణోత్తరమునఁ జెప్పఁబడియున్న వానికి, నిందుగలవాని కిని కొన్ని నామభేదములును, కొంత క్రమభేదంబును గలిగియున్న

మాట నిజమే. అయినను, వేథామనుక్రియలు మహాదీక్ష లనుటయు వీనిలో నొక్కటొక్కటి యేదేసివిధము లనుటయు భేదించి యుండ లేదు. అవాంతరదీక్షలలో కొంచెము భేదము గనఁబడినను నాగమ భేదమునుబట్టి యట్టిభేద ముండుట సహజముగాని విపరీతముగాదు.

ప్ర॥ అవాంతర దీక్షలలోననె భేదమువచ్చినప్పుడు ఏది ప్రమాణమని గ్రహింప వలయు?

ఉ॥ వీనిలో రెండువిధములును ప్రమాణసిద్ధములెగాన నిందే దియు నప్రమాణ మనఁగూడదు.

ప్ర॥ ఇందు రెండును ప్రామాణికములేయగునెడ వీనిలోనెద్దాని ననుష్ఠింపవలయు?

ఉ॥ ఈరెండు విధములును ప్రామాణికములె యగుటంజేసి వీనిలో నేవిధమునైన గ్రహించియాచరింపవచ్చును. అదిగాక, సంప్ర దాయసిద్ధముగా నేవిధము నడవడిలో నున్నదో ఆవిధమునైన నాచ రింపవచ్చును. కావున, నీస్వల్పభేదము ఆచరణకు బాధకము గానే రదని గ్రహింపవలయు.

## సదాచారము.

మూ॥ సదాచారం ప్రవక్ష్యామి సావధానమనా శ్శృణు
ఆచారఏవ సర్వేషా మలంకారాయ కల్పతే॥ ౧౭

ఆచారహీనః పురుషో లోకే భవతి నిందితః।
జ్ఞానేనాఽచారయుక్తేన ప్రసీదతి మహేశ్వరః॥ ౧౮

తా॥ ఓబృహస్పతీ, ఇంకమీఁదసదాచారమునుచెప్పుచున్నాను. అవధానముతోవినుము. ఆచారమే యెల్లజనులకు నలంకార మగును. ఆచారము లేనిమనుజుడు లోకమున నిందింపఁబడుచుండును. ఆచార ముతో గూడినజ్ఞాన ముండిననె పరమేశ్వరుం డనుగ్రహించును.

మూ॥ శివస్య భక్తి రాధార ఆచార స్సర్వదేహినాం।
ఆచారః పరమోధర్మ ఆచారః పరమంధనం॥ ౧౯

జ్ఞాన మాచారహీనం చే న్నత ద్భవతి సిద్ధయే।
శృణు తస్మిన్సదాచారే శీల మష్టవిధం భవేత్॥ ౨౦

తా॥ శివునకు భక్తి యాధారంబగు (భక్తిలేనిచోట శివుఁడుండఁడనుట) జనుల కందఱకును నాచారమె ఆధారం బగును. ఆచారమె పరమధర్మ మగు, ఆచారమె పరమధనంబు నగును. ఆచారము లేకుండునెడ జ్ఞానంబును ముక్తిసాధనము గా నేరదు. అట్టిసదాచారమునందు శీల మెనిమిదివిధములుగా నుండును. అది యెట్లన.

మూ॥ అంకురం ప్రథమం జ్ఞేయ ముత్పన్నంచ ద్వితీయకం।
ద్విదళంచ తృతీయంస్యా త్ప్రవృద్ధంచ చతుర్థకం॥ ౨౧

సప్రకాండం పంచమం స్యా త్సశాఖం షష్ఠముచ్యతే।
సపుష్పం సప్తమం జ్ఞేయం సఫలం చాష్టమం మతం॥ ౨౨

తా॥ అంకురము మొదటిది, ఉత్పన్నము రెండవది, ద్విదళము మూడవది, ప్రవృద్ధము నాల్గవది, సప్రకాండము అయిదవది, సశాఖము ఆఱవది, సపుష్పము ఏడవది, సఫలము ఎనిమిదవదియు నగును.

మూ॥ సదాచారోఽష్టశీలాఢ్య స్సేవితః కల్పపాదపః।
సద్భక్తానాం సుమనసాం దదాతీష్టం ఫలం మహత్॥ ౨౩

తా॥ ఈచెప్పఁబడినయెనిమిదిశీలములతో గూడిన సదాచారమనుకల్పవృక్షము సేవింపఁబడినదై సద్భక్తు లనుదివిజులకు గొప్పదియగునభీష్టఫలము నొసఁగు చుండును.

మూ॥ అంకురాఖ్యం ప్రవక్ష్యామి బీజభూతం సమాసతః।
గురుకారణ్యకలితమడధ్వన్యాస శోభతా॥ ౨౪

తను స్స్వీయాఽప్రాకృ తేతి భావోఽంకురఇ తీర్యతే।

తా॥ అంకురమను మొదటిశీలమును చెప్పుచున్నాను వినుము గురునికరుణచే షడధ్వశుద్ధితో గూడిన శైవదీక్ష గలతనశరీరము అప్రాకృత మైనదని భావించుట అంకురశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ దీక్షితై రేవ దారాద్యై స్సహవాసో యదాత్మనః॥ ౨౭
శీల ముత్పన్న మిత్యుక్తం గ్రాహ్యా మేత ద్విచక్షణైః

తా॥ శైవదీక్షనొందిన భార్య, భృత్యులు మొదలగువారితో గూడియుండుట ఉత్పన్న మను రెండవశీల మగును.

మూ॥ లాంఛనానాంహి శైవానాం భస్మాదీనా మనారతం॥ ౨౮
ధారణం త్వప్రమాదేన ద్విదళం శీల ముచ్యతే॥

తా॥ భస్మత్రిపుండ్రము, రుద్రాక్షములు మొదలగు శైవచిహ్నములు ప్రమాదము లేకుండ నెల్లపుడు ధరించుచుండుట ద్విదళమను మూడవశీల మగును.

మూ॥ యన్నిత్యం శివధర్మాణాం మాహాత్మ్యస్య విభావనం॥ ౨౯
ప్రవృద్ధం శీలమిత్యుక్తం భక్తే ర్వృద్ధికరం శ్రుతం॥

తా॥ ఎల్లపుడు శివధర్మములయొక్క మహిమమును భావించుచుండుట ప్రవృద్ధ మను నాల్గవశీల మగును. ఇద్యది భక్తిని వృద్ధి నొందించునది యగును.

మూ॥ ఇష్టలింగ మనభ్యర్చ్య స్వీయతే యదభోజనం॥ ౩౦
స్కంధకాండ మిదం శీలం విజ్ఞేయం భక్తిసాధనం॥

తా॥ ఇష్టలింగమును పూజింపనిది భుజింపకుండుట యేదికలదో అదియే స్కంధకాండమను నైదవశీల మగును.

మూ॥ ఇష్టలింగానర్పితస్య ద్రవ్యాస్యాగ్రహణంహి యత్॥ ౩౧
శీలం సశాఖమి త్యుక్త మవర్జ్యం భక్తితత్పరైః॥

తా॥ ఇష్టలింగమునకు నర్పింపని పదార్థమును గ్రహింపకుం డుటయే సశాఖ మను నాఱవశీల మగును. భక్తినిష్ఠులు దీనిని విడువం జనదు.

మూ॥ శివార్పితప్రసాదస్య యత్పరిత్యాగవర్జనం॥ ౩౦
సపుష్పం శీలమిత్యుక్తం విజ్ఞేయం చైతదుత్తమం॥

తా॥ శివునకు నర్పించిన ప్రసాదమును పరిత్యజింపకుండుట సపుష్పమను నేడవశీల మగును.

మూ॥ గురులింగజంగమానాం యదేకత్వేన భావనం॥ ౩౧
సఫలం శీల మిత్యుక్తం సద్యస్సిద్ధికరం పరం॥

తా॥ గురువు, లింగము, మాహేశ్వరుఁడు నను మూఁడిటికి భేదము లేదని భావించుట సఫలమను నెనిమిదవశీల మగును. ఇది యప్పుడె సిద్ధి నొసఁగును.

మూ॥ య స్సదాచార మష్టాంగం భక్తినిష్ఠో నిషేవతే॥ ౩౨
స సద్యస్సిద్ధి మాప్నోతి పరాం శంభో రనుగ్రహాత్॥

తా॥ భక్తిశాలి యగు నేజనుఁడు ఇట్లు అష్టాంగములుగల సదాచారము నాచరించునో వాఁడు శివుని యనుగ్రహమువలన కైవల్యముక్తి నొందును.

## శి వా చా ర ము.

మూ॥ శివాచార మతో వక్ష్యే శృణుష్వాఽవహితో మునే॥ ౩౩
ద్రవ్యక్షేత్రగృహాదీనాం షోడశానాం విశోధనం
శివశాస్త్రోక్తమార్గేణ శివాచారఇతి స్మృతః॥ ౩౪

తా॥ ఇఁకమీఁద శివాచారమును జెప్పుచున్నాను. వినుము. ద్రవ్యము, క్షేత్రము, గృహము మొదలగుపదునాఱు వస్తువులను

శివాగమములయందుఁ జెప్పినవిధమున శుద్ధిగావించుట శివాచారమని చెప్పఁబడుచున్నది.

మూ॥ భక్తహస్తగతంవాపి భస్మనావా విశోధితం
ఫలమూలాదికం గ్రాహ్యం ద్రవ్యశుద్ధి రియం మతా॥ 3౫

తా॥ పండ్లు, గడ్డలు మొదలగువస్తువులను భక్తులచేతినుండి గాని, భస్మముచే శోధించిగాని గ్రహింపవలయు. ఇవియె ద్రవ్యశుద్ధి యని చెప్పఁబడును.

మూ॥ నందిముద్రావధిశిలా దార్వాదిపరిశోధితం
క్షేత్రం భక్తిపరై గ్రాహ్యం క్షేత్రశుద్ధిః ప్రకీర్తితా॥ 3౬

తా॥ నందిముద్రగల శిలలుగాని, దారువులుగాని హద్దులు గలిగియున్న క్షేత్రమునె భక్తియుక్తులు గ్రహింపవలయును. ఇదియె క్షేత్రశుద్ధి యని గ్రహింపవలయు.

మూ॥ భక్తైస్తు నిర్మితంవాపి శివలీలాంకితంతువా
వేశ్మ భక్తైః పరిగ్రాహ్యం గృహశుద్ధి స్సమీరితా॥ 3౭

తా॥ భక్తులు నిర్మించినదిగాని, చిత్రరూపములైన శివలీలలతో నొప్పునదిగాని యగుగృహమున నివసింపవలయు, ఇదియె గృహశుద్ధియని చెప్పఁబడును.

మూ॥ భక్తేన నిర్మితంవాపి శివలీలాంకితంతువా
భాండజాతం పరిగ్రాహ్యం భాపశుద్ధిః ప్రకీర్తితా॥ 3౮

తా॥ భక్తులు నిర్మించినవిగాని, శివలీలలు చెక్కినవిగాని యగు పాత్రములను గ్రహింపవలయును, ఇది భాండశుద్ధి యగుచున్నది,

మూ॥ భక్తలోకసమానీతం భస్మనా సంస్కృతంతువా
తృణాదికం పరిగ్రాహ్యం తృణశుద్ధి రితీరితా॥ 3౯

తా॥ భక్తజనము గొని వచ్చినదిగాని, భస్మచల్లినదిగాని యగు తృణము మొదలగుదానిని గ్రహింపవలయు. ఇది తృణశుద్ధి యగును.

మూ॥ భక్తియుక్తసమానీతం విభూత్యా సంస్కృతంతువా
కాష్ఠం వ్రతస్థై స్సంగ్రాహ్యం కాష్ఠశుద్ధి స్సమీరితా॥ ౪౦

తా॥ భక్తులు తెచ్చినవిగాని, విభూతిచల్లి శుద్ధిచేసినవిగాని యగుకాష్ఠములను గ్రహింపవలయు' ఇది కాష్ఠశుద్ధి యగును.

మూ॥ భక్తారామే సముత్పన్నై ర్భస్మనా సంస్కృతైస్తువా
భక్తైస్తు సాధితేనాపి విభూత్యా సంస్కృతేనవా॥ ౪౧
నాగవల్లీదళైః పూగై శ్చూర్ణేనచ సమన్వితం
గ్రాహ్యం భక్తై ర్హితాంబూలం వీటికాశుద్ధి రీరితా॥ ౪౨

తా॥ భక్తులతోటలలోనివికాని, భస్మముజల్లి శుద్ధిచేసినవిగాని యగుతమలపాకులు, పోకలును, భక్తజనులు గాల్చినదిగాని, భస్మముతో శుద్ధిచేసినదిగాని యగు సున్నమును గ్రహింపవలయు. ఇయ్యది వీటికాశుద్ధి యగును.

మూ॥ శివదీక్షాన్వితైః పక్వ మభక్తానవలోకితం
భోజ్యం భక్తైః పరిగ్రాహ్యం పాకశుద్ధి రియం మతా॥ ౪౩

తా॥ శివదీక్షగలవారు సిద్ధపరిచినదియు, దీక్షలేనివారు చూడనిదియు నగు భోజనపదార్థమునె గ్రహింపవలయు. ఇయ్యది పాకశుద్ధి యగును

మూ॥ ఘృతందధి పయస్తక్రం మాహిషం చావికం త్యజేత్
గవ్యంతు, సర్వదా గ్రాహ్యం రసశుద్ధి రియంమతా॥ ౪౪

తా॥ నేయి పెరుగు, పాలు, మజ్జిగ యనువానిని గేదెవిగాని' గొఱ్ఱెలవిగాని, గొర్లవిగాని గ్రహింపక ఆవునేయి, ఆవుపెరుగు మొదలగువానిని గ్రహింపవలయు, ఇది రసశుద్ధి యని చెప్పఁబడును,

మూ॥ పునర్భవనిదానోక్త కామ్యైకర్మ విసర్జనాత్
జన్మరాహిత్యసంపత్తి ర్భవశుద్ధి ర్నిగద్యతే॥ ౪౫

పండి—ఈయర్థమును మీ రంగీకరింతురా?

అన్నం—(నవ్వుచు) ఆచార్యులవారూ, ఎంతలో పొరపడితిరండీ?

ప్రతి—నాపొరబాటు ఏమిటి?

అన్నం—లింగమును చేతితో పూజింపనగునని మీరంగీకరింపగానే మీసిద్ధాంతము మునిగి పోలేదా? అదియే ఆరాధ్యులవా రడుగుచున్నారు.

ప్రతి—ఇదియేనా? నేను మీసిద్ధాంతమునుబట్టి యట్లు చెప్పితిని· ఇంతమాత్రాన మాసిద్ధాంతమున కేమిలోపము?

అన్నం—అట్లేని, ఇచట మీసిద్ధాంతమునుబట్టి యెట్లుచెప్పుదురు?

ప్రతి—సర్వలింగశ్రుతియే ప్రమాణము గాదని చెప్పుదుము.

అన్నం—మీసిద్ధాంతమునందు శ్రుతులుగూడ ప్రమాణముకావనుట కలదా?

ప్రతి—ప్రాత్యక్షిక శ్రుతులను నప్రమాణమని నుడువము. మారు మూలలోనివి కల్పిత శ్రుతులెన్ని లేవు? వానినన్నిటి నెట్లు ప్రమాణముగా గ్రహింప నగును.

అన్నం—ఈవాక్యము నారాయణములోనిదే కదా? ఇదియు కల్పితమే యగునా?

పండి—నారాయణములోనిదానినేకాదు, ప్రత్యక్ష వేదమైన సంహితలోని శ్రీరుద్రాధ్యాయమునుగూడ రామానుజమతస్థులు కల్పితమనియే నుడువుదురు. నడుమ వారిసంగతి మనకేల? అది యప్రస్తుతముకదా?

అన్నం—అగును.

పండి—పాణిమంత్రం, అనుచోట మీరేమి యర్థము చెప్పుదురు?

అన్నం—ఆచార్యులవారు చెప్పినట్లే చేతితో పూజించుటవలన రక్షించునదియని చెప్పుదుము. ఇట్లేల చెప్పఁగూడదు.

పండి—చెప్పుటకేమి? బాగుగనె చెప్పవచ్చును. కాని మీరుచెప్పిన యర్థమునందు పాణి పదమునకు నేమి ప్రయోజనమో సెలవిందు.

అన్నం—ఇచట, పాణిపదము లేనిచో చేతితోఁ బూజింపవలయునను నర్థ మెట్లు వచ్చును?

పండి—పాణిపదము లేదనుకొనుడు, అప్పు డేమియర్థ మగును?

అన్నం—పూజించుటవలన రక్షించునదియని యర్థ మగును.

పండి—ఇప్పుడు వచ్చినలోప మేమి?

అన్నం—చేతితో అనుమాట లోపింపలేదా?

పండి—ఆలోచించు నెడ నదిలోపించినట్లు కనఁబడదు.

అన్నం—అది యెట్లు?

పండి—పూజించుటవలన రక్షించునది యనియున్న దిగదా? పూజించుట చేతితోనెగాక ఇంక, దేనితోనైన సంభవించునా?

అన్నం—అట్ల యనఁకొనుడు.

పండి—నే నెట్లనుకొనిన నేమి? మీ రెట్లనుకుందురో సెలవిందు,

అన్నం—చేతితోనె కావలయు,

పండి—పూజించుట చేతితోనె యనుట ప్రసిద్ధమేగాన పూజించుటవలన ననగానె చేతితో పూజించుటవలన ననియర్థము లభించుచుండగా నిచట తిరిగి చేతితోనని యేల చెప్పవలయు? దీనింబట్టి పాణిపదము మీరుచెప్పినయర్థమునందు నెట్లు సార్థక మగును?

అన్నం—ఇది కుదరనిచో నింకొకయర్థము చెప్పుదును.

పండి—చెప్పుడు,

అన్నం—పాణిమంత్రిం = పాణి=చేతితో, మంత్రం=అభిమంత్రింపఁబడునది అని యేల చెప్పఁగూడదు?

పండి—కుదిరినచో బాగుగానె చెప్పనగును.

అన్నం—ఏల కుదరదు?

పండి—అభిమంత్రించుట చేతితో నెట్లో సెలవిండు,

అన్నం—ఇంక దేనితోనో మీాద సెలవియ్యరాదా?

పండి—లోకమున నెందుఁజూచినను మంత్రించుట నోరితోనెయని నాదృష్టికి తోచుచున్నది,

ప్రతి—ఇది నిజమే, మంత్రించుట యెందైన నోరితోనగుగాని చేతితో నెట్లగును?

అన్నం—ఆరాధ్యులవారూ, అట్లేని, చేతియం దిడుకొని పూజించుట వలన రక్షించునది యనికదా మీాయభిప్రాయము,

పండి—నాయభిప్రాయమును మీారుగ్రహింపవద్దు, ఇంకొకవిధమున నిచట పాణిపదము సార్థక మెట్లగునో యోజించుడు.

అన్నం—మీారు చెప్పినయర్థమునందు సంశయము లేదా?

పండి—ఉన్నచో సెలవియ్యరాదా?

అన్నం—మీారు చేతిలో నిడుకొని పూజించుటవలన రక్షించునది యని యర్థము చెప్పితిరి. దీనింబట్టి, ఒక చేతియందుంచుకొని వేరొకచేతితో పూజింప వలయునని యేర్పడుచున్నది. రెండు చేతులలో నేచేతియందుంచుకొని యేచేతితోపూజింపవల యునో ఆసంశయము తీరినదా?

పండి—ఒకచేతియం దుంచుకొని యింకొకచేతితో పూజింప నంగీక రించిన తరువాత ఏచేతియం దుంచుకొని యేచేతితో పూజింపవలయునను సంశయము తీరుట శ్రమకర మగునా?

అన్నం—ఆసంశయ మెట్లుతీరును?

పండి—ప్రమాణాంతరములనుబట్టియు, శిష్టాచారమునుబట్టియు నివ ర్తింప నగును గదా?

అన్నం.—ఆసంశయము ప్రమాణాంతరమునుబట్టి తీరవలసినదే గాని యీ శ్రుతినిబట్టి తీరదుగదా?

పండి—అన్ని సంశయములు ఒక్క శ్రుతినిబట్టియె తీరవలయుననుట యెందును లేదు. ఇదిగాక, ఒకచేతియందుంచుకొని వేరొక చేతితో పూజింపవలయు ననఁగానే యెడమచేతియం దుంచుకొని కుడిచేతితోనే పూజింపవలయు ననునర్థము ఔచిత్యము వలననె లభించుచున్నది.

అన్నం—అట్టియర్థము లభించి యీసంశయము నివర్తించినను ఇచట నింకొక పెద్దసంశయము బాధింపక మానదు.

పండి—అది యేది?

అన్నం—ఎడమచేయి యపవిత్రమైనది కదా? ఇందు లింగము నెట్లుంచుకొనవలయునో ఈసంశయము నివర్తించు మార్గ మేది?

పండి—శ్రుతిచెప్పిన యర్థమునందును మీకు సంశయము నివర్తింపకున్నచో దాని తొలగింప మా కెట్లు శక్య మగును?

అన్నం—శ్రుతి యేమని చెప్పెను? ఎడమచేయి పవిత్ర మైనదని చెప్పెనా?

పండి—అట్లే చెప్పెను. ఇం కేమిచెప్పవలయు?

అన్నం—ఆరాధ్యులవారూ, మీరు చెప్పునదంతయు విపరీతమే. శ్రుతియందు ఎడమచేయి పవిత్ర మైనదనునర్థ మెక్కడ నున్నదో కనఁబరచుడు.

పండి—బాగుగా చూడుడు, యెడమచేతియం దుంచుకొను మని చెప్పెనా? లేదా?

అన్నం—ఏదో నొకచేతియందుంచుకొమ్మని చెప్పెను. అది యెడమచేయియే యనుట యెట్లు?

పండి—అట్లైనని, కుడిచేతియం దుంచుకొని యెడమచేతితో పూజింపవలయునని మీ రంగీకరింతురా?

అన్నం—ఎడమచేతియం దుంచుకొనవలయుననుటే యుచితముగా నున్నది. ఏలన, ఎడమచేతితో పూజించుట మరియు ననుచితముగదా?

పండి—దీనింబట్టి, ఎడమచేతియం దుంచుకొనవలయుననుట శ్రుత్యర్థ మని యంగీకరింపక తక్కుదుగదా?

అన్నం—అట్లే యనుకొనుడు,

పండి—ఇట్లు శ్రుతి శివలింగమును ఎడమచేతియం దుంచుకొని పూజింపుమని చెప్పినప్పుడు ఎడమచేయి యపవిత్రమైనదిగదా? దీని యందు నెట్లుంచుకొనవలయునని మనము సంశయించినచో శ్రుతిని ప్రమాణముగా నంగీకరించినవారల మగుదుమా?

అన్నం—సందిగ్ధమైనవిషయము చెప్పినప్పు డేమిచేయవలయు?

పండి—శ్రుతి, 'అగ్నిషోమీయం పశుమాలభేత' యజ్ఞమునందు పశువును జంపవలయునని శ్రుతి చెప్పెను. ఇది హింసగాదా? ఇది యెట్లు చేయవలయునని సంశయము పెట్టుకున్నవారు శ్రుతిని ప్రమాణముగా నంగీకరించినవా రగుదురా?

అన్నం—అది యజ్ఞవిషయము. ఆవిషయమున సంశయింపఁగూడదు,

పండి—యజ్ఞవిషయము శివలింగపూజా విషయముకన్నను శ్రేష్ఠమా? అదిగాక, వేదమునఁ జెప్పఁబడుటనెగదా యజ్ఞమునకు శ్రేష్ఠత వచ్చెను, అట్లే దీనికిమాత్ర మెట్లు శ్రేష్ఠత కలుగదు.

అన్నం—ఆవిచారముతో పనిలేదు, లింగమును ఎడమచేతియం దుంచుకొమ్మని చెప్పెను, సరే, ఎడమచేయి యపవిత్రముగాదా అని సంశయము బాధించుచునె యున్నది, ఇటులుండ తప్పక యెడమచేతియం దుంచుకొమ్మన్నంతన నెటులుంచుకొన నగును?

పండి—కొందఱ కిట్టిసంశయము గలుగునను నూహనె భగవతి యగు శ్రుతి, పాణిమంత్ర పవిత్రం, అని చెప్పెను, సర్వసంశయము లను శ్రుతియె దీర్చకున్నచో వానిందీర్ప నెవ్వరితరము?

అన్నం—ఈసంశయమును శ్రుతి యెట్లు దీర్చెనో తెలుపుము.

పండి—సర్వలింగగ్స్థాపయతి, శివలింగమును నిలుపవలయుననగానె భూమియందా? శరీరమునందా? అని సంశయము కలిగెను. ఆసంశయము దీర్పనె, పాణిమంత్రం అనిచెప్పెను. చేతియం దుంచుకొని పూజించుటవలన రక్షించునది యనుటచేత, శరీరమునందు ధరించిన లింగమేగాని తదితరము చేతియందుంచు కొని పూజింపఁబడమిచే నిచట శరీరమునందె ధరింపవలయు నను నర్థమును స్పష్టపరిచెను. చేతియం దుంచుకొని పూజింప వలయు ననఁగా నెడమచేతియందని యేర్పడుచుండుటం బట్టి యెడమచేయి యపవిత్రముగదా? దానియం దెట్లుంచుకొన వలయునని తిరిగి శంక కలిగెను, ఈశంకను దీర్పనె, పవిత్రం అని చెప్పెను,

అన్నం—పవిత్రం, అనగా, ఎడమచేయి పవిత్రమని యర్థమా?

పండి—నే నట్లు చెప్పియుంటినా? శివలింగమె పవిత్రమని యర్థము.

అన్నం—శివలింగము పవిత్ర మగునా? కాదా? అని సంశయము కలిగినప్పుడుగదా? ఇది పవిత్రమని చెప్పవలయు, అనవస రముగా లింగము పవిత్రమని యేలచెప్పవలసివచ్చెను?

ప్రతి—శివలింగము పవిత్రమనుట నిరాక్షేపణమా?

అన్నం—శివలింగము పవిత్రము గాదని యాక్షేపించువారెవరు?

ప్రతి—మేము.

అన్నం—శ్రుతియే ప్రమాణముగాదని చెప్పినమీరు చేయునాక్షేప ణములు మమ్ముల నెట్లు బాధించును?

పండి — వాఁ౽జోలి యుండవిఁడు. శివలింగము పవిత్రమని తిరిగి యేల చెప్పవలసివచ్చె నని యడుగుచు లేని, మీరు గలిగినశంకను దీర్చెనె, యని యెంచుడు,

అన్నం — ఎడమచేయి యపవిత్రముగాదా? అని మీకు శంక గలిగెను, నిజమే, దీనికి శివలింగము పవిత్రమనుట సమాధాన మగునా? ఈసమాధానము, చింతపండున్నదా? అని యడిగగా, ఉలవ లున్నవని సమాధానము చెప్పిన ట్లుండలేదా? లేక ఎడమచేయియే శివలింగమని మీయభిప్రాయమా? అట్లు గానిచో శివలింగము పవిత్రమని చెప్పగానే, ఎడమచేయియప విత్రముగాదని యెట్లు తేలును?

పండి — భట్టాచార్యులవారూ, వేగిరపడకుడు. అపవిత్ర మగు నెడమ చేతియందు శివలింగము నెట్లుంచుకొనవలయు ననిగదా మీకు శంకగలిగెను. ఈశంకను దీర్ప నెంచి, యెడమచేయి యపవిత్ర మైనను శివలింగము పవిత్రమైనదిగాన చేతిదగు నపవిత్రత లింగము నెంతమాత్రము నంటదు, లింగముయొక్క సంబంధముచేత చేయియు పవిత్రమే యగునని గ్రహించుకొందురు గాక యని యిచట నిట్లు గలిగినశంకను దీర్పనె 'పవిత్రం, అనిశ్రుతి చెప్పెను. ఇట్లు శివలింగము నునుచుటకు యోగ్య మగుటనె వామహస్తమును, అయమ్మేహస్తో భగవాన్, అను శ్రుతి స్తోత్రము చేయుచున్నది ఇచట పాణిమంత్రం అను చోట చేతియందుంచుకొని అని పాణిపదమునకు సప్తమ్యర్థము నంగీకరింపనిచో వెనుక చెప్పినచొప్పున పాణిపదము వ్యర్థ మగుటయెగాక, పవిత్ర మనుపదంబును నిరర్థకమే కావలసివచ్చును, కావున, సర్వలింగశ్రుతి, లింగధారణమును విధించుచున్నదనుట సిద్ధము, ఇట్టివి యింకను నెన్నియో గలవు, కావున, శివలింగధారణము వేదవిహితము,

అన్నం— వేదమునం దెన్నియో విధింపఁబడియున్నవి అవి యన్నియు నందఱకు నావశ్యకము లగునా? కొందఱ అధికారులను గూర్చి యట్లు విధింపబడియుండ నగును.

పండి— వేదమునందుఁ జెప్పినవిధులు వైదికులకు నావశ్యకములు, గాని యవైదికులకు నావశ్యకములు గావు. కావున వైదికుల నుద్దేశించియె యట్లు విధింపఁబడియెనని గ్రహింపక తీరదు,

అన్నం— వేదమునందుఁ జెప్పఁబడియున్న వానిని నన్నిటిని వైదికులు చేయగలరా? మేము వేదమునందుఁ జెప్పిన పంచాయతన మును పూజించుచున్నాము, దీనిని మీరు పూజించుచు న్నారా? లేదు, లేనందున మీకు నవైదికత్వము వచ్చెనా? అట్లే, వేదోక్తమగు లింగధారణమును మేము గ్రహింపనం దున మీకును నవైకత్వము రాదని గ్రహించుడు.

ప్రతి— భట్టాచార్యులవారూ, కొంచె మిటుజూడుడు, మీపంచాయ తనము వేదమునఁ జెప్పఁబడియెనా?

అన్నం— సందేహ మేమి?

ప్రతి— ఏవేదమునందు గలదో కొంచెము సెలవిండు,

అన్నం— ఇదియు నొకప్రశ్న మే యగునా?

ప్రతి— తమదృష్టికి గాదనియె యెంచుడు, అయినను మాదృష్టినిబట్టి ప్రశ్నముగానే గ్రహించి, పంచాయతన మేవేదమునందు గలదో వినిపింతురేని సంతసింతును?

అన్నం— ఆచార్యులవారూ, మీరు విష్ణువు నారాధింతురా? లేదా?

ప్రతి— తప్పక యారాధింతుము,

అన్నం— అట్లేని, విష్ణువు నారాధింపుమని వేదమునఁ గలదా? లేనిదే మీర లారాధించుచున్నారా?

ప్రతి— వేదమున నుండుటనే యట్టు లారాధించుచున్నారము.

అన్నం— విష్ణువును పూజింపుమని వేదమున నున్నమాట నిస్సంశయ మేగదా?

అద్వైతసిద్ధాంతము ఉపనిషత్తులయందు దెలుపఁబడియుండగా దానిని మహర్షులు ఖండించినంతమాత్రిన నది యప్రామాణిక మెట్లగునని యోజింపఁ బనిలేదా? అని మీ రడుగుదు రేని ఉపనిషత్తులయందు మనకు గోచర మగుచున్న యద్వైతసిద్ధాంతము మహర్షులకేల గోచరింపక పోవలసివచ్చెనో ఈయంశము మొదట యోజింపం బనిలేదా? అని నేనడుగఁగూడదా?

అందు యోజించునెడ వేదాన్తములలోని యద్వైతప్రతిపాదక వచనములకు భిన్నాభిప్రాయమున మహర్షులు గ్రహించియుండి వానికి శుద్ధాద్వైతపర మగునభిప్రాయమును గొందఱు సిద్ధాంతీకరించియున్న కారణమున నీమతమును ఖండింపవలసివచ్చెనని వ్యక్త మగుచున్నది.

ఉపనిషత్తులు చూడఁగానె మనబోంట్లకు వానియందు నద్వైతము ప్రతిపాదితమైనట్లు గోచరించినను వేదాన్తవాక్యములకు మహర్షులు నిర్ణయించిన తాత్పర్యమె న్యాయ్యమగుగాని మనకు దోచిన భావము న్యాయ్యమనుట యుచితము గానేరదు. ఈసందర్భమున కల్పసూత్రకారు లగు మహర్షులు కర్మమార్గాసక్తిచే జ్ఞానమార్గమున నభిరుచి లేమిం జేసి కల్పసూత్రములయందు నద్వైతమును నిరాకరించియున్నను నంతమాత్రమున శుద్ధాద్వైతము సూత్రకారులకు నసమ్మతమనిగాని, వేదాన్త ప్రతిపాదితము గాదని కాని యెన్నగూడదని కొందఱు నుడువుచున్నారు. కాని, యిందు యోజింపఁగా, సర్వజ్ఞు లగు మహర్షులకు జ్ఞానమార్గమున నభిరుచి లేమికి కారణము నిరూపింప నేరికిని శక్యముగాదు. వారికి శంకరాచార్య నిర్ణీతమగు తత్త్వజ్ఞానము ప్రామాణికమని తోచియున్నచో గృహస్థులకు కర్మమార్గముననె యధికారము గలదనియు జ్ఞానమార్గమున సన్న్యాసులకె యధికారమనియుఁ జెప్పియుందురు గాని శుద్ధాద్వైతము నంతమా

త్రము ఖండించి యుండరు. దానం జేసి శుద్ధాద్వైతమునందు ప్రామాణ్యబుద్ధి కల్పసూత్రకర్తలకు లేదనియె నమ్మ దగియున్నది.

శుద్ధాద్వైతసిద్ధాంతమె ప్రామాణికమై యున్నయెడ నీసిద్ధాంతమును ఖండించిన మహర్షులు కేవల మజ్ఞానులనియె నిర్ణతము కాగలదు. మహర్షు లజ్ఞానులైయున్నచో వా రొనరించిన కల్పసూత్రములు 'కల్పసూత్రే యథా వేదే, వేదములతో సమానములని నమ్మి వానియందు వారుచెప్పిన కర్మపథము నాచరించినవారికెగాక తక్కువాగలకు ద్విజత్వమే లేదని నిశ్చయించి కొందఱాపస్తంబ శాఖవారమనియు, మఱికొంద ఱాశ్వలాయనశాఖవారలమనియు నుడువుకొనుచు ఆపస్తంబాది మహర్షుల వచనములయందు నతిప్రామాణ్యబుద్ధిని మనపూర్వపురుషు లేల యుంచియుందురు? ఇట్లు అజ్ఞానులగు మహర్షులయందు నతిప్రామాణ్యబుద్ధి నుంచికొనిన మన పూర్వపురుషులు వారికన్న నత్యంతాజ్ఞానులని యొప్పక తప్పదుగదా? ఇట్లులంగీకరించుట మనకు గౌరవావహ మగునా? ఎన్నటికిని కానేరదు.

కావున, కల్పసూత్రకర్త లగుమహర్షులవాక్యములయందు ప్రామాణ్యబుద్ధి నిలిపి మనపూర్వపురుషుల గౌరవమును, దానిమూలమున మనగౌరవమును నిలుపుకొనుటయె యుచితమని తోచెడిని.

అట్లేని, శాస్త్రకర్తలు ఖండించియున్న యద్వైతసిద్ధాంతమును లోకమునందు నిలుప శంకరాచార్యులవారికి నేమి యవసరము కలిగెనని యడుగుదురేని, వారట్లు సిద్ధాంతముసేయ బెక్కుకారణములు గలవు. వానిలో నొక్కటి నాలింపుడు.

శ్రీశంకరాచార్యులవారు సిద్ధాంతముసేయునాటికి ననేకములగు శైవవైష్ణవాది మతకలహములచే నీభరతఖండ మల్లకల్లోలముగానున్నదనియున్న తెలిపియుంటిని, ఇట్టిమతకలహదావాగ్నులను జల్లార్పనెంచినకరుణావారిధునకున ద్వైతబోధధారావృష్టి యొకరమాత్రముగా

దోచుటంజేసి యట్లు సిద్ధాంతము సేయవలసినవా రైరి. ఏయెడ జూచినను, దోషఝషమహాగ్రాహ దుర్నిగ్రహములై వివిధవాదప్రవాహ కూలంకషములై యుప్పొంగుచున్న బహువిధమతనదీనదములనువాని నామరూపములు ద్రుంగునట్లు నిశ్శేషముగా ద్రావి జీర్ణించుకొనునట్టి మహాసామర్థ్యము శుద్ధాద్వైతమతమహార్ణవమునకెగాక యొన్యమున కెట్లు గలదు? ఈకారణమున వారట్లు సిద్ధాంతము సేసిరని యేర్పడుచున్నది.

అట్లగునేని, వారుచేసిననిర్ణయ మంతయు శాస్త్రవిరుద్ధమే యగునా? యని శంకించినచో నాసిద్ధాంతమునందు కొంతవాస్తవము లేకపోలేదు, అం దేభాగము నిజము? ఏభాగము కల్పితము? అని యోజించునెడ, బ్రహ్మము నేనని యనుసంధానము సేసికొనవలయు ననుట నిజము. కడమ దంతయు నాసిద్ధాంతమునందు కల్పితము, ఈయర్థమును శంకరాచార్యులవారె సూచించియున్నారు. ఎట్లన, జీవబ్రహ్మైక్యము శాస్త్రమునకు విషయ మనియు, అదియె పారమార్థిక మనియు, కడమ దంతయు మిథ్యయనియు బ్రహ్మమీమాంసా భాష్యమునందు నద్వైతాచార్యులు నుడివియున్నారు. దీనింబట్టి, యిదియె వేదాన్తశాస్త్రమునకు పరమాభిప్రాయమని లోకులు విశ్వసించుచున్నారు.

ఈనిర్ణయము బ్రహ్మమీమాంసా శాస్త్రమున గనంబడమిచే పలువురు పండితు లీవిషయమున శంకించుచున్నారు. దీనింబట్టి శంకరాచార్యులవారి యాశయముంగూర్చి దూర మాలోచింపవలసియున్నది.

అట్టు లాలోచింపగా, వారునుడివిన వచనములకు రహస్యార్థము వేరుగా గోచరించెడిని, ఏమనిన, వారుచేసిన నిర్ణయములు అద్వైతవేదాన్తశాస్త్రమునందే యన్వయించుకొనవలయు ననుటయే వారితాత్పర్యము. అదియెట్లన,

జీవబ్రహ్మైక్యము జ్ఞానముగాన నది వేదాన్తశాస్త్రమునకు విషయ మనుట వాస్తవమే. ఇదియే పారమార్థికమనగా, ఈజీవ బ్రహ్మైక్యము ఉపనిషత్తులయందు దెలుపఁబడియున్నదిగాన నిది స్వప్రమాణమని భావము, ఇడిగాక, తత్త్వము నిర్గుణ మనుటయు, పరమేశ్వరునినామరూపములును కల్పితములే యనుటయు మొదలగు నిర్ణయము లన్నియు నానావిధమతకలహశాంతిమూలమున లోకోపకారార్థమై కల్పితము లనియు వారియభిప్రాయ మని విశద మగుచున్నది. ఇట్టియభిప్రాయము వారిది కానిచో శ్రు॥ సత్యకామ స్సత్యసంకల్పః ఈమొదలగుశ్రుతులు బాధితములు గాకమానవు. పరమేశ్వరుఁడు సత్యకాముఁడు, సత్యసంకల్పుఁడు నని శ్రుతులును, సూ॥ సర్వధర్మోపపత్తేశ్చ అనుటచే పరమేశ్వరునందు సకలధర్మములు గలవని బ్రహ్మమీమాంసయు దెలుపుచుండ పరమేశ్వరుఁడు నిర్గుణుఁడనుట యెట్లు ప్రామాణిక మగును? శ్రు॥ నామరూపే వ్యాకరవాణి॥ జగమునకు నామరూపములను కల్పింతునని పరమేశ్వరుఁడు సంకల్పించెనని శ్రుతి కంఠరవమున జెప్పుచుండగా, పరమేశ్వరుని నామరూపములును కల్పితములే యనుట యెట్లు శ్రుతివిరుద్ధము గాకుండును?

జగముయొక్క నామరూపములవలె నీశ్వరుని నామరూపములును కల్పితము లగునేని వీనిని గల్పించినవా రెవరు?

ఇదిగాక, అద్వైతసిద్ధాంతమునుబట్టి నామరూపములను కల్పింతునని సంకల్పించినవాఁడు పరమేశ్వరుఁడా? లేక, ఇతరుఁడా, అని యోజింప పరమేశ్వరునినామరూపములును కల్పితములని యంగీకరించుటచే పరమేశ్వరుఁడు కాఁడని వ్యక్త మగుచున్నది. అంతకన్న నితరుఁడు లేమిచే నీసంకల్పమునకు కర్తయెవఁడైనది తేలదు. దీనింగూర్చి దూర మాలోచించినను జగమునవిగాని, ఈశ్వరునివిగాని యగునామరూపములను కల్పించినవాఁడు అద్వైతసిద్ధాంతికన్న నితరుఁడు లేమిం

జేసి నామరూపములను కల్పింతునని యద్వైతసిద్ధాంతియే సంకల్పించె
నని యాశ్రుతి నద్వైతిపరముగానె యన్వయించుటకన్న నెందుమా
ర్గము గోచరింపదు. కావున, ఇట్లు శ్రుతిసూత్రప్రతిసిద్ధములగు సిద్ధాం
తములను మతకర్త యంగీకరించె ననుటకన్న నామహనీయుఁడు లోకో
పకారార్థమై యిట్టియంశముల గొన్నిటికల్పించెనని యంగీకరించుటయు
శ్రేయమని తోఁచెడిని.

మతాచార్యుఁడు ప్రమాణవిరుద్ధము లైనయంశముల గల్పించె
నని వచింప సాహసింతురా? అని శంకింతురేని, జగము, పరమేశ్వరుని
నామరూపములు మొదలుగా సకలవేదవేదాన్త ప్రతిపాదితము లైన
పదార్థములును కల్పితములని బోధించుచున్నారని యంగీకరించు
మహాసాహసముకన్న లోకోపకారమునకై కొన్నియంశములను కల్పిం
చిరని యంగీకరించుసాహసము దోషావహము కాదు.

ఇఁక, జీవబ్రహ్మైక్యము శాస్త్రమునకు విషయ మనుట యంగీ
కారార్హ మగునా? అని యడుగుదురేని ఇది శాస్త్రమునఁ జెప్పఁ
బడియున్నప్పుడు దాని నంగీకరింపకుండ నేవారితరము? అట్లేని దీని
నెల్లరు నేలయంగీకరింప రనిన, ఈవాక్యమునకు నభిప్రాయభేదము
గలదు. ఎట్లన, జీవబ్రహ్మైక్యము శాస్త్రమునకు విషయ మనగా,
జీవబ్రహ్మైక్యానుసంధానము చేయుమని శాస్త్రము బోధించుచు
న్నది యనియె యాశయము. ఇది శాస్త్రమున నెందు గల దనిన,

సూ॥ ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతిచ॥ అనునధికర
ణమునందు, శ్రు॥ అహం బ్రహ్మాస్మి॥ ఈ మొదలగు శ్రుతులనుబట్టి నేను
బ్రహ్మానని యనుసంధానము సేయుచున్నారు. శ్రు॥ తత్త్వమసి ఈ
మొదలగు శ్రుతులనుబట్టి నీవు బ్రహ్మముగా భావింపు మనియు
బోధించుచున్నారు. అని శ్రీనీలకంఠాచార్యులవారు వ్యాఖ్యానము
సేసియున్నారు. దీనింబట్టి, జీవబ్రహ్మైక్యానుసంధానము వేదాన్తముల
యందు ప్రతిపాదింపఁబడియున్నదని స్పష్ట మగుచున్నది. అయిన

నిందు కొంచెము విశేషము కలదు. నేను బ్రహ్మనని భావించుట ఉపాసనాధర్మమని నీలకంఠాచార్యులవారి యాశయము. దాననె వేదాన్తములు ఉపాసనావిధిపరములని వారు నిర్ణయించియుండిరి. దీనింబట్టి వేదాన్తములయందుఁ జెప్పఁబడినయద్వైతభావము ఉపాసనాపరమని వారితాత్పర్యము. ఆకారణముననె, శ్రీహరదత్తాచార్యులవారు శ్రుతిసూక్తమాలయందు॥ శ్లో॥ అద్వైత మాగమశిరోభిరుపాసనాయా ముక్తం తదేవ పరమార్థతయా నవాచ్యం॥ వేదాన్తములు పరమేశ్వరు నద్వైతభావముతో నుపాసించుమని బోధించుచున్నవి, కాన నీయద్వైతభావన యుపాసనావిషయ మైనది. కాఁబట్టి యీయద్వైతమే పారమార్థిక మని గ్రహింపఁగూడదు. అని వచించి యున్నారు.

ఇట్లుండ నద్వైతమే పారమార్థికమనియు, ద్వైత మంతయు కల్పిత మనియు శుద్ధాద్వైతసిద్ధాంతమున నంగీకరింపఁబడియుండుటం జేసి, సర్వవేదవేదాన్తప్రతిపాదితమగు ద్వైతభావము నిరసింపఁబడుటచే కర్మమునకు, జ్ఞానమునకును నధికారి దుర్లభమగుటను, శ్రుతిసూత్రవిరోధము దుర్నివార మగుటను నీజీవబ్రహ్మైక్యమే పారమార్థిక మనుటను కల్పసూత్రాదిశాస్త్రకర్తలగు మహర్షులు చాలవరకు ఖండించియుండిరి. అట్టిమహర్షులు శ్రుతులయెడఁ గనఁబరచినయభిప్రాయమును నంగీకరించుటయే న్యాయ్యము, దానింబట్టె, శ్రీశంకరాచార్యులవారు జీవబ్రహ్మైక్యమె పారమార్థిక మని బోధించిన దానికి వారిసిద్ధాంతమున గలయన్నియంశములలో జీవబ్రహ్మైక్యమే శాస్త్రసిద్ధ మనియు, అది యుపాసనాధర్మ మైనను జ్ఞానవిశేషమే గాన జ్ఞానమె యగుననియు, దేశకాలాద్యనవచ్ఛిన్నమైన పరమేశ్వరరూపము నిట్టు లుపాసింపుమని విధించుటయందె యుపాసనావిధిపరములైన వేదాన్తములకు ముఖ్యతాత్పర్య మనుట యథార్థముగాన నదియె పారమార్థిక మనియు,

ఇట్లు పారమార్థికమైన జీవబ్రహ్మైక్యానుసంధానమును శిష్యులకు బోధించునెడ, మొదటనీవు వేరు, బ్రహ్మము వే రనుటయే నిజమని చెప్పి యుపాసన యందుమాత్రము నేను బ్రహ్మమునని యద్వైతభావముతో నుపాసింపుమని చెప్పుటకన్న, నీవ బ్రహ్మమవని బోధించుటె యెక్కుడుసనుపాయముగా నుండుటను, నీయద్వైతభావమె పారమార్థికమని యుపదేశించి యిదియె ప్రాముఖ్యమైన దగుటంజేసి దీనిని నిలుపనెంచి, కడమపదార్థములు కల్పితములనివచించి, భేదభావమును బోధించుశ్రుతులను గౌణార్థకములుగా సమన్వయము చేసిరని యేర్పడుచున్నది. ప్రసంగవశమున నద్వైతభావముదగు యాథార్థ్యము కొంచెమిట దెలుపవలసి వచ్చినకతన ప్రకృతమును విడిచి చాలదూర మేతెంచితిమి.

శ్రీశంకరాచార్యులవారీమొదలగుకారణములచే నద్వైతభావమును పారమార్థికముగా వెల్లడించియిద్ది ప్రాముఖ్యమైనదైనను నిందు నధికారు లరుదుగా నుందురుగాని పెక్కురు సంభవింప రనియోజించి యీభావమును సర్వసాధారణముగా విధించినచొ నిదియే పారమార్థికముగాన కడమ కర్మోపాసనాదులయందు విశ్వాసము లేకయు, నద్వైతభావము కుదరకయు రెంటను జెడుదురని యాలోచించి యీభావన యందు యతులకే యధికారమని శాసించి, కర్మమునకు జ్ఞానమునకు నధికారి వేరుగా నుండునని సాధించి కర్మజ్ఞానసముచ్చయవాదమును నిరాకరింపవలసివచ్చెను. దాననె, సర్వవేదాన్తసిద్ధాంత సంగ్రహము నందు,

శ్లో॥ విద్యాం చావిద్యాం చేతి
సహోక్తి రియ ముపక్రమతాం పద్భిః
సత్కర్మో పాసనయో
ర్న త్వాత్మజ్ఞాన కర్మణోః క్వాపి।

తా॥ జ్ఞానకర్మ సముచ్చయవాదము సేయువారు శు॥ విద్యాంచావిద్యాంచ యస్తద్వే దోభయగ్ంసహ, అనుశ్రుతివి ప్రమాణముగా గ్రహించి, విద్యాంచ= జ్ఞానమును, అవిద్యాంచ= కర్మమును, ఉభయగ్ంసహ= రెంటినిగూడ, యః= ఎవ్వఁడు, వేద= తెలుసుకొనునోవానికి పరమేశ్వరప్రాప్తి లభించునని యర్థము చెప్పుచున్నారు. కాని, యిక్కడ విద్యయనగా ఉపాసన మనియర్థము. దీనింబట్టి కర్మము ఉపాసనము నను రెంటికే సముచ్చయముగాని కర్మజ్ఞానములకు సముచ్చయము గలదని యాశ్రుతివలన నేర్పడుట లేదని శ్రీశంకరాచార్యులవారు చెప్పియున్నారు. శ్రీనీలకంఠాచార్యులవారైనచో ఉపాసనము జ్ఞానవిశేషమెగాన జ్ఞానమే యగును. వేదాన్తములయందుఁ జెప్పఁబడినది యీశ్వరోపాసనమే. కాఁబట్టి, కర్మజ్ఞానసముచ్చయము శాస్త్రసమ్మతమని సిద్ధాంతీకరించి యుండిరి.

శ్రీశంకరాచార్యులవారికైనను జ్ఞానము ఉపాసనారూపమే యని యొక్కచో నంగీకరింపక తక్క దయ్యెను. ఎం దనిన, బ్రహ్మమీమాంసాభాష్యమున సూ॥ ఆవృత్తి రసకృ దుపదేశాత్॥ అనునావృత్త్యధికరణమునందు॥ 'విద్యుపాస్త్యోశ్చ వేదాన్తే ష్వవ్యతిరేకేణ ప్రయోగో దృశ్యతే॥ క్వచి ద్విది నోపక్ర మ్యోపాసినా ఉపసంహరతి॥ యథా, య స్తద్వేద యత్స వేద సమయైత దుక్తః ఛాం, ఇత్యత్ర॥ నుమ ఏతాం భగవో దేవతాం శాధి యాం దేవతా॥ ముపాస్సే॥ ఇతి॥ క్వచి చ్చోపాసి నోపక్రమ్య విది నోపసంహరతి యథా—మనో బ్రహ్మే త్యుపాసీత॥ ఛాం॥ భాతిచ తపతిచ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవంవేద॥ ఇతి॥ అనగా, వేదాన్తములయందు విదధాతువు, ఉపపూర్వకాసిధాతువు నీరెంటను భేదము లేకుండ ప్రయోగింపఁబడుచున్నవి. ఈయర్థ మెట్లుతెలియుచున్నదనిన యస్తద్వేద మొదలగుశ్రుతియందు విదధాతువుతో నుపక్రమించి, ఉపపూర్వకాసధాతువుతో నుపసంహారము గావింపఁబడి

మ॥ రా॥ శ్రీ కొమరువెల్లి కాళయ్యగారు వరంగల్ 12-0-0
,, రామిని మల్లయ్య గారు ... 12-0-0
,, తుగ్గపాటి వెంకటేశ్వరరావుగారు, బారిష్టరు, బెజవాడ 10-0-0
ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్నగార్లు, సికింద్రాబాదు 10-0-0
,, కైలాస శరభయ్యగారు, ... 10-0-0
,, బెద్దె రామన్న కుమారుడు, జగదీశ్వరయ్య ... 10-0-0

## —♦ పో ష కు లు ♦—

మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యవార్లంగారు, ఈమని 5-0-0
,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని 5-0-0
,, కామర్సు రాజశేఖరరావుగారు, కరణం, నవాబుపాలెం 5-0-0
,, ముదిగొండ వీరభద్రశాస్త్రిలుగారు, తొండపి 5-0-0
,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు 5-0-0
,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల 5-0-0
,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చపేట 5-0-0
,, భూపతి రత్నంగారు, వరంగల్ 5-0-0
,, మల్లంపల్లి మల్లికార్జునుడుగారు, అయితంపూడిఅగ్రహారం 5-0-0
,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ 5-0-0
,, శ్రీపతిపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని 5-0-0
,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు 5-0-0
,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు 5-0-0
,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్దిపేట 5-0-0
,, ముత్యంపేట మల్లయ్యగారు ,, 5-0-0
,, కాళేశ్వరం నాగభూషణంగారు ,, 5-0-0
,, కొమరువెల్లి బాలరాజుగారు, వరంగల్ 5-0-0
,, గద్రెపల్లి రామన్నగారు, మిడిదొడ్డి 5-0-0

# ప్రకటనము.

ఆర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:- ఈ గ్రంథమునందు బ్రాహ్మణులు మొదలగువారు వేకువజామున నిద్రలేచినది మొదలుకొని రాత్రి పండుకొనునంతదాక చేయనగు స్నానసంధ్యాది సకలధర్మములకును వైద్యశాస్త్రి ప్రామాణ్యమును బట్టి ఆరోగ్యరూపమగు ప్రత్యక్షఫలము కలదని ఋజువుచేయఁబడియున్నది. వెల రు ౧-౦-౦

కారణోత్తరమను దివ్యాగమము:-ఇయ్యది శైవుల లింగధారణము మొదలగువానియెడలఁగల సకలసంశయములను వారించు నెడ నిరుపమానమైనది. వెల రు ౧-౦-౦

ఆహ్నికవిధి:-ఇందు స్నానము సంధ్య మొదలుకొని వైశ్వదేవమువరకుగల సకల నిత్యకర్మములు సస్వరాంధ్ర ప్రయోగముతో గలవు. వెల రు -౮-౦.

మకుటోత్తరము అను దివ్యాగనుము:- ఇందు శివపూజా విశేషములు, శైవాంత్యేష్టి విధానము మొదలగు ననేక విశేషములు గలవు. వెల రు ౧-౮-౦.

బ్రహ్మతర్క స్తవము:- శ్రీమదప్పయ దీక్షిత విరచితము. ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, స్మశానవాసిత్వము, బాణాసురయుద్ధమున నోడిపోయెనన్న దానికి సమాధానము మొదలగు ననేక విషయములు గలవు. వెల రు ౧-౧-౦

మహాశివపూజా విధి:- ఇయ్యది లింగపరీక్షణమును వినియోగించు దశావధాన విధానములతోను, సస్వరాంధ్రప్రయోగముతోను శాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦-౮-౦

ధర్మసంగ్రహము అంత్యేష్టికాండము:- ఇందు శైవులాచరించు సమాధ్యారాధనవిధులు శాస్త్రసిద్ధములని పలువిధముల నిరూపింపఁబడియుండుటెగాక, అపరకాండ సందర్భమునగల సర్వవిధకృత్యములకుఁదగు ప్రమాణముల గనబరిచి సకల సంశయములు వారింపఁబడియెను. ఆంధ్ర తాత్పర్యసహితము. వెల రు ౨-౦-౦,

వలయువారు:— ముదిగొండ నాగలింగశాస్త్రి.



రామలింగేశ్వర పేట, తెనాలి. అని వ్రాయవలెను.

Reg. No. M- 2284.

శ్రీ
శివాయ పరమేశనమః

# శైవరహస్యబోధిని.

ఇది
శ్రీ దేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జితాసెర్క్సు
శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని
సాహాయ్యమున వెలువడుచు
శైవధర్మములను, వాని ప్రామాణ్యమును తెలుపు
మాసపత్రిక.



| సంపుటము 5. | విభవనామ సంవత్సర పుష్యమాసము. | సంచిక 10. |
|---|---|---|



సంపాదకుడు:- ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।
విరుద్ధవాదౌఘసిద్ధాన్త బాధినీ।
అశేషశం కామయపంకశోధినీ।
జయత్వియం శైవరహస్యబోధినీ।



తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

చందా సం॥ కు 2-0-0.

1929

## శాశ్వత ప్రధాన పోషకులు.

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగ మయ్యవార్లగారి కుమారుడు
నాగమల్లయ్య అయ్యవార్లగారు. సిద్ది పేట
కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, రామన్నవగైరా సిద్దిపేట

### —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారీకులు

| | | |
|---|---|---|
| 1 | భండారు మల్లిఖార్జునరావుగారు | |
| 2 | భండారు వీరభద్రరావుగారు | |
| 3 | భండారు వీరరాజుగారు | 60—0—0 |
| 4 | భండారు వీరబసవరాజుగారు | |
| 5 | భండారు చెన్న బసవయ్యగారు | |
| 6 | భండారు చిన మల్లిఖార్జునుడుగారు | |

### —: ప్రధానపోషకులు :—

| | |
|---|---|
| మరా॥శ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రులుగారు సికింద్రాబాదు | 12-0-0 |
| ,, శివలంక తాయన్నగారు, పోణంగి | 10-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రయ్య అయ్యవారుగారు, ఈచుని | 10-0-0 |
| ,, శివపురపు రాజయ్యగారు, శికింద్రాబాదు | 10-0-0 |
| ,, కొడిమేల భోగసోమలింగారాధ్యులుగారు, శ్రీగురుత్వ సంస్థానం వరంగల్ | 10-0-0 |
| ,, శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు నిర్మల | 10-0-0 |
| ,, కాశీనాధుని అల్లమయ్య అయ్యవారుగారు యలకుర్రు అగ్రహారం | 10-0-0 |
| ,, శివలెంక శంభులింగం అయ్యవారుగారు బెజవాడ | 10-0-0 |
| ,, ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్ | 12-0-0 |

# విజ్ఞాపనము.

శైవమహాజనులారా!

శైవసంఘమునగు గౌరవముం గూర్చియు, ధర్మముల ప్రామాణ్యముంగూర్చియు నీపత్రికామతల్లి మొదటినుండి యెవ్విధమునఁ జాటువడుచున్నదియు మీకు విశదమేగాన నావిషయమై విన్నవింప నవావశ్యకము. ఈసంఘము పూర్వకాలమున నెంత యున్నతస్థితి నలంకరించియుండెనో నేటికి సంఘలోపము మొదలగు కారణములచే నంతవిచారణీయమగు స్థితికివచ్చియుండుట శోచనీయము. దానంజేసి యితరు లీసంఘముంగూర్చి చేయులాఘవము గ్రంథావలోకనము చేయువారి కందఱికిని విశదమే. స్మార్తపండితులు పలుచోట్ల లింగధారణమును నిరసించియున్నారు. అదియంతయు రాబోవుపత్రికలయందు విమర్శింపఁబడగలదు. కొనకు శివార్చక సంఘంబును నారాధ్యులమీదికి విజృంభించుచున్నది. ఆసంఘ మాదిశైవపత్రిక నారంభించినది మొదలుకొని యప్పుడప్పుడు సేయుకటుసంభాషణము దుస్సహముగా నుండుచున్నను స్వసంఘమునకు నిందుకమైన స్వమతాభిమాన ముదయింపని కారణమున నేటివరకు పరభాషణములను వినని యట్లే కాలము గడుపవలసివచ్చెను. ఈసంగతి వారు బాగుగా గ్రహించినట్లే తోచెడిని, ఇప్పుడు నిశ్శంకముగా విజృంభింపఁ జొచ్చిరి గదా! ఎట్లన, తాముదప్ప నితరులు దేవతాప్రతిష్ఠోత్సవములొనరించునెడ వారికి దేవలకత్వదోషము సంభవించుననియు దానంజేసి వారు కర్మభ్రష్టులగుదురనియు, నట్టివారిని స్పృశించునెడ సచేలస్నానము చేయవలయుననియు మొదలుగా వ్రాయుచున్నారు. ఇట్టిసంకటసమయమునగూడ నెట్లు లుపేక్షింపవలయును? దానంజేసి మనసంఘమునకు లాఘవము గలిగించు పరకీయవ్యాసములు విమర్శింపక తీరదయ్యెను.

కావున మీరు స్వసంఘమున నభిమానము వహించి స్వజనమును ప్రోత్సహించి న్యాయ్యమును గ్రహించియుంట యుచితము. నేటివరకు నీపత్రిక ప్రచారములో నున్న కారణమున నే నాసేర్చుకొలది యీసంఘము దగు గౌరవమునకై పరకీయములగు శాస్త్రవిరుద్ధవాదముల నిరసింపను, నడుమనడుమ విజ్ఞాపనామూలమున మిమ్మిట్లు శ్రమపెట్టను జాలియున్నాఁడను. ఈపత్రికాకౌముది విద్వత్ప్రభువులును, శైవమత పరిపూర్ణాభిమానులును శ్రీ శ్రీ శ్రీ దేవిడీసంస్థానాధిపతులునగు ఇజ్జి తాసార్ కందుకూరు బాల సూర్యప్రసాద భూపాల చంద్రుని సాహాయ్యమునఁ బ్రకాశించునదనుననే శైవమతసంబంధము గల సకల పదార్థములను నిస్సందేహముగాఁ దెలిసికొని ఈయుత్తమ ధర్మముల నాచరించి, స్వసంఘమునకు గౌరవము నొడఁగూర్చి నా ప్రాయుశ్రమమును, శ్రీదేవిడీసంస్థానాధీశులు సేయు సాహాయ్యమును సార్థకము సేయఁ బ్రార్థించుచున్నాఁడను.

శ్రీవారు శైవమతపత్రికలకుఁ జేయుసాహాయ్య మమూల్యమైనది. ఏలన, ఈపత్రిక శైవమహాజనసంఘము నారాధింప నేర్పడిన వాక్యపుష్పోపహారముగాని వేరొక్కటి గాదు. కడమపుష్పోపహారములు కొలదిదినములలోననె వాడిపోవునవి గాన నస్థిరములు. ఈపత్రిక యైననో ఆచంద్రార్కస్థాయియై యీశ్వరరూపమైన శైవమహాజనసంఘమునకు సుస్థిరాలంకారముగా నొప్పియుండును ఒక్కొక శివభక్తుఁడే శివస్వరూపుఁడని శాస్త్రము లుద్ఘోషించుచున్నవిగాన శివభక్తసంఘము శివస్వరూప మనుటకు సంశయ ముండనేరదు.

సువర్ణరత్నహారములు రమణీయములే యైనను వానియందు సౌకుమార్యము సంభవింపదు. పుష్పహారము కోమలమే యైనను దానియందు స్థైర్యము మృగ్యము. వాఙ్మయ మగు హారమునందు సర్వసుగుణములును సమృద్ధములు. ఇట్టి సుస్థిరమగు దివ్యాభరణమును

పారమేశ్వరకంఠసీమ నలంకరించు శైవప్రభుని పుణ్య మగణ్యమనుట యతిశయోక్తియని యొకానొకండును వచింప సాహసింపడు.

కావున, నిట్లు పత్రికాసాహ్యారూఫమున శైవసంఘమునకు శాశ్వతమహోపకారము నొనరించు శైవప్రభువర్యునకు నాయురారోగ్యైశ్వర్యప్రజాసంపత్తి నొసఁగుగాకయని పరమేశ్వరుని పారమేశ్వర సంఘమును నర్థించుచున్నాఁడను,

ఇట్లు,

ప॥ నా॥

---

## ఆదిశైవపత్రికాగతప్రశ్నోత్తరవిమర్శనము.

ఆదిశైవపత్రిక యందు కొన్నిప్రశ్నోత్తరములు సంపాదకులచే ప్రచురింపఁబడియెను. అందుగల జవాబులు చాలవరకు నసందర్భము గానె యున్నవి. అందుగొన్ని లింగధారణమునెడ విరుద్ధభావమును దెలుపుచున్న కారణమున నిందు విమర్శింపక తీరదయ్యెను.

ఆదిశైవపత్రిక ౮ సంపుటము ౧౦ సంచిక 20 వ పేజీ,

అనాదిశైవమునకు లింగధారణము 21 దీక్షలు కారణాగమము నందు చెప్పియున్న వనుట అత్యాశ్చర్యకరము. అష్టావింశత్యాగమములలో ఆనాదిశైవమునకుగాని ఆదిశైవమునకుగాని లింగధారణ చెప్పియుండలేదు. వీరికిఁగనృట్టిన కారణాగమము లింగధారణకు కారణమై యుండునేగాని మరొకకారణముగాదు దీనియందుగల దీక్షలుసైతము యేదోకారణముగా దెల్పియుండవచ్చును. అని యున్నది.

అనాదిశైవమునకు లింగధారణము కారణాగమమునందు చెప్పియున్నదనుట వీరికి నత్యాశ్చర్యకరముగానుండుట యెంతమాత్రమా

త్రము లోకమునకు నాశ్చర్యము గలిగింపదు. ఏలనగా, అష్టావింశత్యాగమములలో......లింగధారణ చెప్పియుండలేదనుటచే అష్టావింశత్యాగములును గొరతలేకుండ తమకు దెలిపియున్నట్లు వ్రాయ సాహసించిన సర్వజ్ఞంమన్యశిఖామణిగారికి నిట్టివిలేఖనము సహజమేగదా?

నిజ మాలోచింప వేదములకేని నంతయు దొరికిన దొరకనగు గాని యాగమసంహితలు సాంతముగా దొరుకుననుట కల్ల. దక్షిణదేశమున కొందఱయొద్ద శివాగమసంహితలున్నను విమర్శింపగా దేవాలయములకు సంబంధించిన కొన్నికొన్ని భాగములుమాత్రమే యున్నట్లు దెలియుచున్నదిగాని అష్టావింశత్యాగమములుగాక వీనిలో నొక్కయాగమమైన నామహాగ్రము లభించుట లేదు. దానికిఁ గారణమేమనిన, తంత్రావతార పటలమునందు శ్లో॥ కామికం దశలక్షంతు అనియారంభించి యొక్కొకయాగమము పదిలక్షలు, కోట్లు, అర్బుదములు గ్రంథసంఖ్య గలిగియున్నట్లు చెప్పబడియున్నది అట్టి యాగమసంహిత లన్నియు వారికి హృద్గతమే యగునేని నది మాకుగాక దేశమునకు నంతకును సంతోషదాయకమే.

వీరువ్రాసిన మాటలపోఁబడింబట్టి లింగధారణ ప్రతిపాదకమైన కారణోత్తరమునందు వీరికి నసమ్మతి యున్నట్లు గోచరించెడిని, దానికిఁ గారణము లేకపోలేదు. కారణోత్తరమునెడ వీరికిగల యప్రామాణ్యభావము స్పష్టీకృతమైన నాఁడె దానికారణంబును వ్యక్తముగాఁగలదు. గాన నదియుండుగాక,

మఱియు నీపేజీయందే, శ్రీకంఠశివాచార్యులు భాష్యమందెచ్చటను లింగధారణ చెప్పనే లేదు. చెప్పినారని భ్రమపడుట ఆశ్చర్యకరము, అనియుఁ బ్రకటింపఁబడియున్నది. దీనింబట్టి శ్రీకంఠభాష్యమున లింగధారణము చెప్పఁబడియుండలేదనియు చెప్పినారని తోచుటభ్రమమే యనియు అట్టివారిభ్రాంతి యీసంపాదకులకు నా

శ్వర్యము గలిగించు చున్నదనియు విశదమగుచున్నదిగదా? ఇది చాల ముఖ్యమైన విషయముగాన నవధానముతో నాలింపుడు

శ్రీకంఠ భాష్యములోని వాక్యముల యర్థము దెలియనివారికి నాభాష్యమునందు లింగధారణము చెప్పఁబడియుండలేదని తోచుటయు, చెప్పఁబడియెననుట భ్రాంతిగాను ఆశ్చర్యకరముగాను నుండుటయు విపరీతముగాదు. ఇదిగాక ఇప్పుడు క్రొత్తగా గురుక్కళ్ సంజ్ఞ వహించి తమకు ప్రతిష్ఠోత్స వాధికారములు నేటినుండి కలవని సాధింపఁబూనుట ఆశ్చర్యకరముగాదనియెంచువారికి లోకప్రసిద్ధములన్నియు నాశ్చర్యకరముగా దోచుటయు సహజమేయనితోఁచెడిని. అట్టివారికి దానిలోని లింగధారణ ప్రతిపాదక వాక్యములు వినిపించినను చెవిటివారియెదుర శంఖముపూరించినట్లే నిష్ప్రయోజనమగుగాన నప్పనికే నుత్సాహము గలుగుటలేదు. అవసరమై తప్పనిచోనప్పటికి జాతముగాక, అట్లని శ్రీకంఠభాష్యమున లింగధారణము కలదా? లేదా? అను సంశయము తీరుచెట్లని యడుగుదురేని నిజముగా నిట్టి సంశయ మున్నచో నద్దానిం దీర్పదగునుపాయము లేకపోదు. గాని వారేదే నొక నిశ్చయము చేసికొని కోడికి మూఁడేకాళ్ళు అనియున్నచో నద్దానిం దొలగింప నాకేగాదు శ్లో॥ జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం నరంజయతి॥ అను న్యాయమునుబట్టి నలుమొగముల వేల్పునకైన నలవికాదు, ఆసందేహము దీరునుపాయమేది యని యడుగుదురేని వినుడు.

శ్రీనీలకంఠుఁ డను నొక శైవపూర్వాచార్యుడు నిగమాగమసార సంగ్రహ మనునామాంతరముగల క్రియాసారమను శైవనిబంధన గ్రంథమును రచించియుండెను. ఆగ్రంథము పూర్వకాలమునుండి ప్రచారములోనె యున్నది. ఈమహాగ్రంథమును నౌత్తరాహుఁడై నిర్ణయసింధువను స్మార్తధర్మనిబంధనగ్రంథమును రచించిన కమలాకర భట్టుండును, దాక్షిణాత్యుఁడై స్మృతిముక్తాఫల మనునిబంధనగ్రంథ

మును రచించిన శ్రీవైద్యనాథపండితుఁడును పరమప్రమాణంబుగా గ్రహించుటం జేసి యీ సేతుహిమాలయ మధ్యమండితులగు మతాంతర పండితాగ్రేసరు లందఱునుగూడ గౌరవించుచున్నట్లు దెలియుచున్నది ఆనీలకంఠశివాచార్యుఁడు తన క్రియాసారమునందు శ్రీకంఠభాష్యము నకు కారికారూపమున సంగ్రహవ్యాఖ్యానము రచించి శ్రీకంఠభా ష్యమున పెక్కునధికరణములయందు లింగధారణము ప్రతిపాదితమై యున్నట్లు స్పష్టీకరించియున్నాఁడు.

దానింబట్టి శ్రీకంఠభాష్యమున లింగధారణము ప్రతిపాది తమై యున్నదను నెడ సంశయము పండితుల కెట్లు గలుగును? అట్లై నను నే డొక తంబళాయనుగారు లేదన్నారే అదియెట్లు? అనిమీరు నన్ను బాధింతురేని నేనేమని మనవి చేయగలను?

శ్రీకంఠభాష్యమునందు లింగధారణము కలదా? లేదా? అను నెడ శ్రీనీలకంఠాచార్యునిసాక్ష్యమే మీకుఁ జాలనిచో శ్రీకంఠభా ష్యమున నెచట లింగధారణము ప్రతిపాదితమై యున్నదియు. విన్న వింపఁగలను.

అభ్యుపేత్యవాదమునుబట్టి శ్రీకంఠభాష్యమునందు లింగధార ణము లేదని యంగీకరించినను నారాధ్యులకు శ్రీకంఠభాష్యము అనా శ్రయణీయము గాదు. ఎట్లనిన, ఆదిశైవపత్రికాసంపాదకులు శ్రీకంఠ భాష్యము నాదిశైవు లాశ్రయించుచున్నారు. అని తామాదిశైవుల మను నూహతో వ్రాసియున్నారు. శ్రీకంఠభాష్యమునందు లింగధార ణము లేదన్న పోనిండు. దానియం దెంతవెదకినను పరార్థపూజ అనగా అర్చకత్వము కనుపించుటయే లేదు. అయినను దీనిని హార ద్విజులెట్లు లాశ్రయించిరో అట్లేయని యేల విశ్వసింపరాదు?

ఆదిశైవ పత్రికాసంపాదకులకు నాదినుండి యారాధ్యులు మొదలుకొని బ్రాహ్మణశాఖను నిరసింపవలయునను కుతూహలము

మెంచుగనె కన్పట్టుచున్నది. దాననే, ఆదిశైవపత్రిక ౪ సంపుటము ౯ సంచికలోని ప్రశ్నోత్తరమాలికయందు ప్ర॥ ఆదిశైవులేజాతివారు? ఉ॥ పరమపవిత్రమైన వైదికశాఖలోచేరినవారు. నిగమాగమప్రవర్తకులై వేదస్వరూపుడగు శివుని యారాధించుచుందురు.

ప్ర॥ తక్కిన బ్రాహ్మణులు వైదికులుగారా?

ఉ॥ ప్రచ్ఛన్న వైదికులేగాని సంపూర్ణ వైదికులుగారు. అని వ్రాసికొనిరి. ఆదిశైవులేజాతివారు అను ప్రశ్నమునకు వైదికశాఖలో చేరినవారు అనుసమాధాన మెట్లు సంగతమో దేవునకెఱుక. బ్రాహ్మణజాతివారనుట వారికి నంగీకారము గాకుండునెడ నది లోకమునకు బాధకము గాదు. గాని, కడమ బ్రాహ్మణు లందఱు ప్రచ్ఛన్న వైదికులేగాని సంపూర్ణవైదికులు గారనివ్రాయుట సాహసమని తోపకమానదు.

హరద్విజులు తాము క్రొత్తగా గురుక్కళ్ అను సంజ్ఞ బూనినను, ఆదిశైవులమని క్రొత్తనామకరణము వహించినను, మేము చతుర్ముఖుని సృష్టిలోనివారము గానేరము. కేవలము శివుని నోరినుండియే యూడిపడితిమని వ్రాసికొనుచున్నను, సకలజాతులు నాత్మగౌరవమునకుఁ బాటుపడుచున్న యిక్కాలమున నిదియుంతయుఁ గడమవారు జోక్యము గలుగఁజేసికొనవలసినది గానేరదని యెంచి యింతదనుక నుపేక్షించినను, ఆదిశైవపత్రికాసంపాదకులు ఆత్మస్తుతితో లాభము లేదని యితరసంఘములను నిరసింపఁ బూనినప్పు డాత్మగౌరవము నిల్పుకొనుట శైవరహస్యబోధినికి విహితముగాన నుపాయాంతరము లేక ప్రకృతపత్రికా విషయవిమర్శము కర్తవ్యమయ్యెను

---

## ప్రతిష్ఠోత్సవ స్నపనాధికారవిమర్శము.



ఆదిశైవపత్రిక ౪ సంపుటము ౧౧ సంచికలో ప్రతిష్ఠోత్సవ స్నపనాధికారము, అనువ్యాసము ప్రచురింపఁబడియున్నది, అందు,

దేవాలయములయందు శైవసాంప్రదాయకముతో నీశ్వరప్రతిష్ఠాదికము లొనర్చుటకును, విష్ణుప్రతిష్ఠాదికము లొనర్చుటకును, శైవ, వైష్ణవ విశిష్టాద్వైత మతప్రవర్తకులును......నాదిశైవవైఖానసులే తత్ప్రతిష్ఠోత్సవ స్నపనార్చనాదికము లొనర్చుట కధికారు లనియు, తదితరబ్రాహ్మణులు చేసిన స్నైన కారలకు దేవలకత్వదోష మాపాదించుననియు, నట్టిదేవలకు లగువారు కర్మభ్రష్టు లనియు, వారిని స్పృశించినచో సచేలస్నాన మాచరింపవలయుననియు శ్రుతిస్మృతీతిహాస ధర్మశాస్త్రములు వందలకొలదిగ ఘోషిల్లుచుండ కొందఱుమాత్రము కొన్నిచోట్ల ఆదిశైవులపై నల్లేరుబండిలాగున యనాలోచితముగా నసూయాద్వేషములతోఁ గూడుకొని దబాయింపులతో మాతాతల నుండి దేవతాయాజ్ఞికములు చేయుచున్నామనియు, మాముత్తాతల నుండి ప్రతిష్ఠలు జరుపుచున్నామనియు, మొదలగుసంగతులతోఁ గలహముల కుపక్రమించుచున్నారు. శాస్త్రచర్చప్రసంగములకు నుపక్రమింపగా మాకు శాస్త్రములు పనిలేదు. ధర్మములు పనిలేదు, మా కనుచారమే ముఖ్యమనుచు......కొట్లాటకు సిద్ధపడుచున్నారనియు,

ఒకవేళ ననూచారమే ధర్మమని యాలోచించినయెడలఁ బ్రపంచమునం దెల్లెడలను సత్యాసత్యములు. ధర్మాధర్మము లెవ్విధముగాఁ బ్రకాశించుచున్నవో అవ్విధముగానే దురాచారసదాచారములును బ్రకాశించుచున్నవి. అట్టిదురాచారముల ననూచారమని వితండవాదనలఁ జేయుట ధర్మమునకు విరుద్ధమై యున్నది, అని మొదలుగా వ్రాయబడియుండుటె గాక, ఆదిశైవవైఖానసపాంచరాత్రులకే శివవిష్ణ్వాది

ప్రతిష్ఠాదులయందు నధికారము గలదనుటకు గొన్నివచనములును నుదాహరింపఁబడియున్నవి.

ఈయుపన్యాసము వెల్వడుటకు కారణమేమని యోజింపఁగా పూర్వకాలమునుండియు నారాధ్యులు శివశక్త్యాదిసంబంధము లగు ప్రతిష్ఠలు నెరవేర్చుచున్న కారణమున నిట్టియధికారము తమకేగాని యితరులకు లేదని సాధించుకొనుటకే యని విశదమగుచున్నది.

తమయిష్టము సాధించుకొనుమార్గ మేదియనిన, ఆరాధ్యులు శివప్రతిష్ఠ లొనరించుట యనుచారధర్మమే యైనను ఇది శాస్త్రవిరుద్ధముగాన కూడదని సాధించినచో నాయధికారము తమకే చెందునని యాశయ మైనట్లు స్పష్ట మగుచున్నది, నేటివరకు నారాధ్యులు శివప్రతిష్ఠలు తమతండ్రితాతలనాటినుండి యొనరించుచున్నట్లు తమ వ్యాసముంబట్టియే తెలియుచున్నది,

ఇట్లుండగా హరద్విజులకోరిక సిద్ధించు టెప్పటికని యోజించు నెడ అనుచారధర్మము గ్రాహ్యము గాదనియో, లేక ఈయనుచార ధర్మము శాస్త్రవిరుద్ధమనియో తేలిననాటికిని, తాము వ్రాసికొనిన ప్రమాణవచనములు నిలిచి తమకు ననుకూలించిననాటికిని గదా సిద్ధించును?

అట్లుగాక, సంబంధము లేని కొన్నిమాటలు నేవో కొన్నిశ్లోకములు వ్రాసినంతనె లేనియధికారము తమకుగలదని లోకము విశ్వసించుననుట కల్ల. కావున వారు వ్రాసికొనినయంశము లెంతవరకు నిలుచునో కొంచెమిట విమర్శించిచూతముగాక,

ప్ర॥ అనుచార మెట్లు గ్రాహ్య మగును? ఏలన, కొన్ని దురాచారములును అనుచారముగా వచ్చుచుండుట కలదు. అనుచారమును బట్టియే ధర్మము నిర్ణయింపఁబూనునెడ అనాదిగా వచ్చుదురాచారములును ధర్మములనియె యెన్నవలసివచ్చును? కావున, ఎటనైన

ధర్మమును శాస్త్రప్రమాణమునుబట్టి నిర్ణయింపవలయునుగాని, పూర్వాచారమునుబట్టి యెట్లు నిర్ణయింపవలయు?

ఉ॥ శిష్టపరంపరయొక్క యనుష్ఠానమునుబట్టి యేర్పడినది యుత్తమధర్మమె యగునుగాని యిది యధర్మమన నెంతమాత్రము జెల్లదు. అట్లేని అనాదిగావచ్చు దురాచారములను సదాచారములుగానె పరిణమించుగదాయని శంకింప నవకాశము లేదు. ఏలన, శిష్టులు సదాచారములనే యాచరింతురుగాని దురాచారములను నవలంబింపరుగదా! ఇదిగాక, దురాచారమైనదియు లేక సదాచారమైనదియు లోకమువలనే యేర్పడును. లోకమున నెటనైనను దురాచారము దూష్యముగానే వ్యవహరింపఁబడుచున్నదిగాని భూష్యముగా వ్యవహరింపఁబడుటలేదు. దాననే అట్టిది ప్రకాశముగా నాచరింపఁబడుట యెందును గన్పట్టదు. కావున నారాధ్యులు చేయు శివప్రతిష్ఠాదికములు ప్రకాశముగా నాచరింపఁబడుచుండుటను. భూష్యముగా నెన్నఁబడుచుండుటను నుత్తమధర్మములే యగుగాని యధర్మము లెంతమాత్రము గానేరవు.

ప్ర॥ శాస్త్రవిహితము నాచరించువారు శిష్టులగుదురుగాని అవిహితము నాచరించువారు శిష్టు లగుదురా? ప్రతిష్ఠాదికము నారాధ్యు లాచరింపవలయునని శాస్త్రవిధి కనఁబడదు. ఇట్లుండ నెందును తమకు జెప్పియుండని ప్రతిష్ఠాదికము నాచరించువారు శిష్టులెట్లగుదురు? అట్టివారు చేసినది శిష్టాచార మెట్లగును? అది శిష్టాచారమే కానప్పుడు ధర్మమని యెట్లు పరిగ్రహింపఁబడును?

ఉ॥ ఆరాధ్యులు ప్రతిష్ఠాదికము నాచరింపవగునన్నటకు శాస్త్రవిధి కలదో లేదో ఆనిర్ణయము పదంపడి రాగలదు. అభ్యుపేత్యవాదమునఁబట్టి శాస్త్రవిధి లేదనియె భావించి విమర్శింతము. శాస్త్రవిధి లేకున్నను శిష్టాచరితము ధర్మమయే యెన్నఁబడుచున్నది. ఎట్లన, గ్రంథాదియందు మంగళాచరణమునకు శాస్త్రవిధి లేదనుట ప్రసి

ద్ధము. అయినను, శిష్టాచారమునుబట్టియే ఆది యుత్తమధర్మమని సర్వులచే పరిగ్రహింపఁబడుచున్నది, శాస్త్రవిహితముగానివని నాచరించువారు శిష్టులేగానియెడ మంగళాచరణము శిష్టాచారమునుబట్టి ధర్మమని పండితమండలిచే నెట్లు పరిగ్రహింపఁబడి యుండును? కావున, శాస్త్రవిహితముగానివని నాచరించువారు శిష్టులుగారనుట పండిత జనసమ్మతము గాదు.

ప్ర॥ గ్రంథాదియందు మంగళాచరణమును శిష్టు లాచరించిరి గాన నద్దానికి శాస్త్రవిధి కనఁబడకున్నను శిష్టాచారమునుబట్టియె యది యుత్తమధర్మమని గ్రహింపఁబడియెను. గాని, శివప్రతిష్ఠాదికము లాచరించు నారాధ్యులు శిష్టులని యెట్లు విశ్వసింపవలయు? మంగళాచరణము చేయువారు శిష్టులనుటకు విప్రతిపత్తి లేదుగాన నది యంగీకరింపబడుచున్నది, శివప్రతిష్ఠలు సేయునారాధ్యులు శిష్టులనుట నే మంగీకరింపము. ఇట్లుండ వీర లాచరించినది శిష్టాచార మెట్లగును? కానిది యది ధర్మ మెట్లగును?

ఉ॥ ఆరాధ్యులు నాలుగువర్ణములవారికిని గురుత్వము నాది నుండి వహించియున్నారు. ఇట్టివారు శిష్టులుగానిచో నిఁక శిష్టుల నెట్టివారో నిరూపింప నశక్యము. ఇట్టు లారాధ్యులు శిష్టాగ్రేసరులు గాననే నాలుగువర్ణములవారిలో నెవ్వారలు శివప్రతిష్ఠ సేయింపఁబూనినను గురువులచే నప్పని నెరవేర్పించుచుండిరి. ఈవిధమున లోక మంతయు శిష్టులుగా గ్రహించిన యారాధ్యులు శిష్టులుగారన నెవ్వారు సాహసింతురు? ఒకవేళ నట్లనుటకు నేఁడు శివార్చకులు సాహసింపఁబూనినను వారినుద్దేశించి లోకులు, మీతాతముత్తాత లందఱు వీరలను శిష్టులనుగానె నమ్మి వీరుచేయించు ప్రతిష్ఠోత్సవముల నంగీకరించియుండ నేఁడిట్టి సాహసము నవలంబించుట మీకుఁ దగునా? యని యడుగకుందురా? కావున, నారాధ్యు లాచరించు శివప్రతిష్ఠాది

కదా. శిష్టాచారముగాన నుత్తమధర్మమె యనుట సర్వజనసమ్మత మనుట నిర్వివాదము.

ప్ర॥ ఆదిశైవపత్రికయందు నుదాహరించిన వచనములచే నాదిశైవులుదప్ప కడమవారు శివప్రతిష్ఠాదికము లాచరింప గూడదని నిషేధింపఁబడియున్నది. దీనింబట్టి కడమవారు శివప్రతిష్ఠాదులు చేయఁ గూడదని నిషేధించియున్నప్పుడు ఇట్టిశాస్త్రనిషిద్ధము నాచరించిన వారు శిష్టు లెట్లగుదురు? వారుచేసినది శిష్టాచారమేయని తెలియని వార లామోదించినమాత్రమున నది శిష్టాచారమై నిర్దుష్ట మెట్లగును?

ఉ॥ ఆదిశైవపత్రికయందు నుదాహరించిన శ్లోకములు వారి కెంతసాధకమో యిప్పుడే స్పష్టము గాగలదు. అది యటుండ, అనాదిగా నారాధ్యులు సేయు శివప్రతిష్ఠాదికము శిష్టాచారమని పూర్వకాలమునుండి తక్కులోకమేగాక, తమపెద్దలుగూడ నంగీకరించియుండగా తమపెద్దలతోఁగూడఁ బూర్వికులగు సకలవర్ణములవారు కేవల మజ్ఞానులేయని వక్కాణింపఁ జంకులేనివార లెంతకైన సాహసులేగాన నట్టివారింగూర్చి విమర్శింప ననుచితము.

ప్ర॥ అట్లేని, ఆదిశైవపత్రికయందు నుదాహరింపఁబడిన వచనములగతి యేమి?

ఉ॥ ఇదియు నాలోచింపవలసినదే. కాని, ఈవచనములు నేటి కాలమునకు నేద్వీపాన్తరమునుండి యీదేశమునకు వచ్చెనో? ఇంత దనుక నేమూల డాగియుండెనో? ఇవి సుప్రసిద్ధవచనములే యగునేని వీని నింతదనుక నారాధ్యులు ధనలోభముచే వెలిబుచ్చకున్నను తక్కంగల విమతపండితులుగాని శివార్చకుల పితృపితామహాదులు గాని యేకారణమున వెల్లడింపకుండిరో? అట్లుగాక, నేటికి కలియుగ ధర్మము సమాప్తినొంది యిది మొదలుకొని కృతయుగధర్మమునడువ వలయు ననునీశ్వరసంకల్ప ముండియుంటంజేసి యీవచనములీకాలముననే బైలువడియెనో యని మొదలుగా సంశయములు బాధించు

చునే యున్నవి. అయినను నిరాధారముగా ఆరాధ్యులు ప్రతిష్ఠాదికము
లాచరించుచుండుటచే ధర్మము ఇంతవరకు చెడిపోయిన దేగాక, ఇం
కనుగూడ నెల్లకాలము నిట్లే చెడిపోవలయుననుట బుద్ధిమంతుల పని
కాదు. గావున వారు కనబరిచిన వచనములను విమర్శించి ప్రతిష్ఠా
ద్యధికారము వారిదే యని యేర్పడునెడ కుంచకోల శృంగారపు
కట్టలతోఁబాటు దర్భకూర్చంబును వారికేయప్పగించుట యుచితము
గాన విమర్శింతము

ప్ర॥ ఆదిశైవపత్రిక ౪ సంపుటము ౧౧ సంచిక 13 పేజీ

శ్రీస్కాందే॥ నశివబ్రాహ్మణశ్చైవ నవైఖాననసూత్రకః। నపంచ
రాత్రసంబంధీ పరార్థం విత్తకాంక్షయా॥ శివస్య కేశవస్యాపి ప్రతి
ష్ఠాం కురుతేద్విజః। సవై దేవలకో నామ సర్వకర్మబహిష్కృతః। శివద్వి
జైర్వినా విప్రైః పరార్థే శివపూజనం। తేచ దేవలకాః ప్రోక్తా స్సర్వ
కర్మవిగర్హితాః॥ ఆదిశైవులు, వైఖానసులు, పాంచరాత్రులుగాక
తదితరబ్రాహ్మణులు ఇతరుల మోక్షార్థమై ద్రవ్యాపేక్షను గ్రామ
దేవాలయములయందు శివునికిగాని కేశవునికిగాని ప్రతిష్ఠోత్సవస్నప
నార్చనాదికములు చేయుచున్నారా? అట్టివారు దేవలకు లనఁబడి
సర్వకర్మలకు నంగీకరింపఁబడరు. అని యున్నది. దీనింబట్టి శివద్విజులు
దప్ప కడమవారు ప్రతిష్ఠాదులాచరింపఁగూడదని యేర్పడుచుండలేదా?

ఉ॥ ఈశ్లోకములయందుగల శివబ్రాహ్మణపదమునకు శివదీక్ష
గల బ్రాహ్మణులని యర్థము బహుగ్రంథాంతరములనుబట్టి గ్రహిం
పక తప్పదు. ఈసంగతి కడమశ్లోకములను విమర్శించునప్పుడు తేల
గలదు. అట్లుగాక, శివబ్రాహ్మణపదము తమయందే రూఢమని శివా
ర్చకు లభిప్రాయపడుదురేని అప్పుడు ఈశ్లోకము లేగ్రంథములోనివో
రుజువుచేసికొనవలసియుండును. స్కాందములోనివని వ్రాసియున్నారు
గదా యని మీరలడుగుదురేని, అట్లువ్రాయుటనే వీనిప్రామాణ్యము
సందిగ్ధకోటిలోఁ జేరినది. ఎలన,

స్కాందమనునది శ్రీమహాపురాణ మొక్కటియు, నుపపురాణము వేరొక్కటియు గలదు. ఆరెండింటియందు ననేకసంహితలు పెక్కు ఖండములు నధ్యాయములు నెన్నియోగలవు. ఈవిలేఖరు లీశ్లోకము లేపురాణమున నేసంహితలో నేఖండమున నేయధ్యాయమున నున్నవో అది యేదియువ్రాయమిచే నివి తామే లోగడ చెప్పినట్లు వట్టి డబాయింపు శ్లోకములుగానె కన్పట్టుచున్నవి.

శాస్త్రిలోకప్రసిద్ధము లన్నియు నాశ్చర్యకరములుగా దోచు వారికి స్కాందములో ఖండముగాని యధ్యాయముగాని యేదియు గనఁబడక యీశ్లోకములుమాత్రమే కనఁబడుట యాశ్చర్యకరము గాదుగాఁబోలు? ఈశ్లోకములు గ్రంథదృష్టములుగా గనఁబడిననాడు వానియర్థ మాలోచింతముగాక.

ప్ర॥ సంకర్షణసంహితాయాం॥ నపంచరాత్రవిధిమాన్ నవైఖానససూత్రవాన్ । నశైవదీక్షితో విప్రో విత్తార్థీ వత్సరత్రయం। గ్రామదేవార్చనపర స్సవైదేవలక స్స్మృతః॥ విశ్వామిత్రసంహితాయాం॥ నశైవవైఖానస పాంచరాత్ర దీక్షావిధిజ్ఞో హ్యనవాప్య దీక్షాం। పరార్థయాజీ యది జీవనాయ బహిష్కృతో దేవలకో మునీంద్రాః॥ అనియు నున్నదిగదా? ఈశ్లోకముల గతియేమి?

ఉ॥ ఈశ్లోకములగతి యుత్తమముగానె యున్నదిగాని వీని నుదాహరించినవారిదే శోచనీయముగా నున్నది. ఏలందు రేని,

శైవదీక్షపొందనివాఁడు విత్తార్థియై పరార్థపూజ సేయునెడ వాఁడు దేవలకుఁ డనియు, సర్వకర్మబహిష్కృతుఁ డనియు నీరెండు గ్రంథములలోని శ్లోకములవలన దెలియుచున్నది. దీనింబట్టి శైవదీక్ష పొందినవారలు ప్రతిష్ఠోత్సవాదులెగాక యర్చనముచేసినను దేవలకత్వ దోషము లేదని యేర్పడుచున్నది, ఈకారణముననే దీనికిముందు స్కాందములోనిదని వారుదాహరించిన శ్లోకములలోని శివబ్రాహ్మణ పదము శివదీక్షగలబ్రాహ్మణపరమని యేర్పడియెను. ఇట్లు వారుదా

హరించినశ్లోకములనుబట్టియు అనాదిగా శైవదీక్షను పొందుచున్న యారాధ్యులు శివప్రతిష్ఠాదు లొనరింప నుత్తమాధికారులేయనియు, మొదటినుండి వీరిచే శివప్రతిష్ఠలు చేయించుచుండిన చతుర్వర్గముల వారెగాక తమపెద్దలతో సహజ్ఞానవంతులె యనియు, నేర్పడియెను.

ఇంతియెగాక, ఈవచనములయందు శైవదీక్ష పొందనివారు జీవనమునకై పరార్థపూజసేయునెడ దేవలకులనియు, బహిష్కృతులనియు నుండుటంజేసి పూర్వకాలమునుండి యేతరమునకైన శైవదీక్షయన నేమియో నెఱుంగని యాంధ్రదేశహరద్విజులకే దేవలకత్వము దుర్నివారమనియు నేర్పడియెను. వీరిట్లు విషమాలంకారమునకు నుదాహరణము గావలసినచ్చిరి. ఏలన, ఆదిశైవవైఖానసులే తత్ప్రతిష్ఠోత్సవస్నపనాదికము లొనర్చుట కధికారులనియు తదితరబ్రాహ్మణులు చేసినయెడల వారలకు దేవలకత్వదోష మాపాదించుననియు నట్టి దేవకులగువారు కర్మభ్రష్టులనియు వారిని స్పృశించినచో సచేలస్నానమాచరింపవలయుననియు నిట్లు ఇతరులకు దేవలకత్వదోషమునుం జెందఁజేయనెంచి యుదాహరించిన వచనములచే నాదోషము తమకే దృఢపడియెను. కావున,

పాఠకమహాశయులారా! పూర్వికులు తెలియనివారనుటకంటె నజ్ఞానము వేరొకటియుండదు. పూర్వకాలమువారు జ్ఞాననిధులుగాననే శాస్త్రప్రమాణముల ననురోధించి శైవదీక్షగల యారాధ్యులచేతనే ప్రతిష్ఠోత్సవాదికము లాచరింపించుచున్నారు. తమకు శైవదీక్షలేమిచే హరద్విజులును దాని నంగీకరించుచుండిరి. ఇట్టు లనుచారముగావచ్చు ధర్మము శాస్త్రవిరుద్ధ మనుట విపరీతజ్ఞానము. ఇట్టివారి యభిప్రాయములు విమర్శనమున నెంతమాత్రము నిలువవు. అయినను వారిజోలి మనకేమియని యుపేక్షించుకొలఁది విజృంభణ మధికమయ్యెను.

ప్రతిష్ఠాద్యధికారములు తమవే యని బహుకాలమునుండి వ్రాయుచున్నను తమయందు గురుత్వముగలవారు వారిచేతనే చేయింపనీ

మన కేమని యుపేక్షించితిమి. ఈతమాగుణము నశక్తిగా భావించి ఆరాధ్యులనుద్దేశించి నడుమనడుమ తూలనాడుచుండుటయు లింగధారణము నిరసింప నారంభించుటయుగాక ఆరాధ్యులు ప్రతిష్ఠాదు లాచరించుచుండుటచే వీరికి దేవలకత్వదోషము వచ్చెననియు నట్టివారిని స్పృశించు నెడ సచేలస్నాన మాచరింపవలయుననియుగూడ వ్రాయ నారంభించిరి.

స్వసంఘము చూతమా? స్వీయములుపరకీయములు నగు గ్రంథములుగాని పత్రికలుగాని చూడనే చూడదు. ఇకమమ్ముల నెవ్వరేమి చేయుదురని దృఢనిశ్చయము నవలంబించియున్నది. ఇతర సంఘములైననో పరసంఘముల నిరసించినంగాని తమకు ప్రాశస్త్యము రానేరదని నిశ్చయము చేసికొనియున్నవి. స్వసంఘమునగు సౌదాసీన్యమునుబట్టి యుద్యమింపఁ దనువు లేదు, పరసంఘమునగు విజృంభణమునుంబట్టి యుపేక్షింప వీలు లేదు. ఏమి చేయవలయు? స్వసంఘ మెంత యుదాసీనత నవలంబించినను శైవసంఘమునకు దగు గౌరవము గాపాడుట శైవరహస్యబోధినికి విహితముగాన నుపేక్షింప వలనుగాక పరకీయవ్యాసములు కొంచెమిందు విమర్శింపవలసి వచ్చెను. ఇంతనైన నితరులజోలివిడిచి హరద్విజు లాత్మగౌరవమునకై పాటుపడుటయే శ్రేయము,

అట్లుగాక, నిజముగ్రహింప దలచినచో పరదూషణముమాని దమయిచ్చవచ్చినటుల విషయవిమర్శమునకు గడంగుటయు నుచితమే యగుగాని, పరసంఘములను దూషించినంతనే తమకు గౌరవము వచ్చునని యుద్యమించుటవలని లాభమునుగూర్చి యోజించుకొను దురుగాక,

ఇట్లు,

ప॥ సం॥

తా॥ జన్మాంతరమునకు గారణములైన కామ్యకర్మములనుఁ వదలిపెట్టుటవలన జన్మరాహిత్యము చేసికొనుట భవశుద్ధి యనిచెప్పబడుచున్నది.

మూ॥ సర్వభూతదయాశుత్వం పాంచభౌతిక సంస్కృతిః
భూతదూషణరాహిత్యం భూతశుద్ధి స్సమీరితా॥ ౪౬

తా॥ సర్వభూతములయందును దయగలిగియుండుటయు, నే ప్రాణికిని బాధ కలిగింపకుండుటయు, శరీరగతములగు పంచభూతములను భూతశుద్ధిచే సంస్కరించుటయు భూతశుద్ధియని చెప్పఁబడును.

మూ॥ సర్వకామా న్సముజ్ఝిత్య శివభావానుభావనం
చేతసా యత్సర్వకాలం భావశుద్ధి స్సమీరితా॥ ౪౭

తా॥ సర్వవిధములైన కోరికలను విడిచిపెట్టి చిత్తముచే శివభావమునే భావించుచుండుట భావశుద్ధి యగును.

మూ॥ పద్భ్యాం పిపీలికాదీనాం నయథా హింసనం భవేత్॥
గమనంహి పరిగ్రాహ్యం మార్గశుద్ధి రిహోమతా॥ ౪౮

తా॥ కాలిక్రింద చీమలు మొదలైనవి నలిగిపోకుండునట్లు నడుచుట మార్గశుద్ధి యగును.

మూ॥ శాస్త్రసంచోదితే కాలే నిశ్శబ్దేచ మనోరమే
శివలింగారాధనం యత్కాలశుద్ధి రిహోదితా॥ ౪౯

తా॥ నిశ్శబ్దమై మనోజ్ఞమైనదియు, శాస్త్రవిహిత మైనదియు నగు కాలమునందు శివలింగము నారాధింపవలయు. ఇది కాలశుద్ధి యగును.

మూ॥ అనృతం పరుషం కుత్సం బీభత్సం డాంభికంచ యత్
విసర్జనం తద్వచసో వాక్శుద్ధి రితికథ్యతే॥ ౫౦

తా॥ అసత్యమైనది, కఠినమైనది, నిందార్థకమైనది, ఏవను గలిగించునది, డంబార్థకమైనదియు నగు వాక్యమును విడిచిపెట్టుట వాక్శుద్ధి యని చెప్పఁబడుచున్నది.

మూ॥ ఆసనే శయనే యానే గోష్ఠ్యాం సర్వత్ర సర్వదా
సద్భక్తజనసాంగత్యం జనశుద్ధి స్సమీరితా॥ ౧౧

తా॥ కూర్చుండియున్నపుడుగాని, పండుకొనియున్నప్పుడుగాని, త్రోవనడుచునపుడుగాని, గోష్ఠియందుగాని అంతట నెల్లప్పుడును భక్తజనులతోఁ గూడియుండుట జనశుద్ధియని చెప్పఁబడును.

మూ॥ బ్రహ్మన్నయం శివాచార స్సర్వశాస్త్రేషు గోపితః
ఏత దాచరణా న్మర్త్య శ్శివసాయుజ్య మశ్నుతే॥ ౧౨

తా॥ ఓబృహస్పతీ, ఈశివాచారము సర్వశాస్త్రములయందును రహస్యముగాఁ జేప్ప బడియున్నది. దీని నాచరించినవాఁడు శివసాయుజ్యము నొందును.

## గణాచారము.

మూ॥ గణాచార మతో వక్ష్యే భోగమోక్షైకసాధనం
అనుష్ఠితో భక్తగణై ర్గణాచార ఇతీరితః॥ ౧౩

తా॥ ఇఁకను గణాచారమును చెప్పుచున్నాను వినుము. ఇది భుక్తిముక్తుల నొసఁగును, భక్తగణము లాచరించినదిగాన నిది గణాచారమని చెప్పఁబడుచున్నది.

మూ॥ సర్వోత్తమే గణాచారే సద్యస్సిద్ధికరే పరే
శీలానితు చతుష్షష్టి ర్వర్తన్తే తాని సంశృణు॥ ౧౪

తా॥ శీఘ్రముముగా ముక్తినొసఁగునదిగాన సర్వోత్తమమైన గణాచారమునందు అరువదినాలుగు శీలములు గలవు. వానిని చెప్పుచున్నాను. వినుము.

మూ॥ భక్తినిష్ఠేన యద్వాచా యథార్థస్యైవ భాషణం
తత్సత్యం సర్వశాస్త్రేషు ప్రథమం శీల ముచ్యతే॥ ౫౫

తా॥ భక్తినిష్ఠుఁడగువాఁడు నిజమునె చెప్పవలయు, ఈసత్య భాషణమె సర్వశాస్త్రములయందు మొదటి శీలమని చెప్పఁబడు చున్నది.

మూ॥ నవాచ్య మప్రియం సత్యం నాసత్యంచ ప్రియం వదేత్
బ్రూయా త్ప్రియంచ యత్సత్యం ద్వితీయం శీలముచ్యతే॥

తా॥ నిజమైన దైనను అప్రియమైనవాక్యమును పలుకగూడదు, ప్రియమైనదైనను నిజముగానిమాటను చెప్పఁగూడదు. కావున ఎదిరికి ప్రియమైనదియు, సత్యమైనదియు నగువాక్యమునె పలుకవలయు, ఈప్రియసత్యవచనము రెండవశీల మగును.

మూ॥ వేదాగమపురాణానాం ధర్మజ్ఞానైక బోధినాం
పఠనం ప్రత్యహం యత్తు తృతీయం శీల మీరితం॥ ౫౭

తా॥ ధర్మమును జ్ఞానమును బోధించునట్టి వేదములను, ఆగమములను, పురాణములను ప్రతిదినము పఠించుట మూఁడవశీలమని చెప్పఁబడును.

మూ॥ శివస్య శివభక్తానాం గురోరపి విశేషతః।
ప్రశంసనం యదశ్రాంతం చతుర్థం శీల ముచ్యతే॥ ౫౮

తా॥ శివుని శివభక్తులను, గురుని, నెల్లప్పుడు ప్రశంసించుచుండుట నాల్గవశీల మగును.

మూ॥ అన్యేషాంచైవ దేవానాం మానుషాణాంచ జాతుచిత్।
ప్రశంసావర్జనం యత్తు త్పంచమం శీల ముచ్యతే॥ ౫౯

తా॥ ఇతరు లైనదేవతలనుగాని, మనుష్యులనుగాని, యెుకప్పుడైన ప్రశంసింపకుండుట యైదవశీల మగును.

మూ॥ కదాచి త్కుత్ర చిద్వా య దాత్మస్తుతి విసర్జనం।
త త్షష్ఠం శీలమిత్యుక్తం సర్వశాస్త్రైకసమ్మతం॥ ౬౦

తా॥ ఒకప్పుడైన నెక్కడనైన ఆత్మస్తుతి చేసికొనకుండుట ఆఱవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ దేవతానాం మనుష్యాణాం నిర్గుణాంచ జాతుచిత్।
గర్హావిసర్జనం యత్తు త్సప్తమం శీల ముచ్యతే॥ ౬౧

తా॥ దేవతలనుగాని, మనుష్యులనుగాని ఎటువంటివారినైన నిందింపకుండుట యేదిగలదో అది యేడవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ త దేతద్వాచికం శీల ముక్తం సప్తవిధం మయా।
అథ పాణిగతం యత్తు శీలం వక్ష్యామి తచ్ఛృణు॥ ౬౨

తా॥ ఇట్లు, వాక్కునకు సంబంధించిన యేడువిధములగు శీలములను జెప్పితిని. ఇంకమీద పాణికి సంబంధించినశీలమును చెప్పెద వినుము.

మూ॥ గురుస ర్వేశభక్తానాం క్రియతే యా నమస్కృతిః।
శీల మష్టమ మిత్యుక్త మఖిలాగమబోధితం॥ ౬౩

తా॥ గురునకు, శివునకు, శివభక్తులకును నమస్కరించుట యెనిమిదవశీల మగును.

మూ॥ పూజాపరికరాణాం యత్సంపాదన మహర్నిశం।
శీలం నవమ మిత్యుక్తం శివాగమవిశారదైః॥ ౬౪

తా॥ పూజకు నుపయోగించుపుష్పములు, బిల్వపత్రము మొదలగువానిని సంపాదించుకొనుట తొమ్మిదవశీల మగుచున్నది.

మూ॥ రుద్రాక్షమాలయా నిత్యం మూలమంత్రజపోఽన్వహం।
దశమం శీల మిత్యుక్త మఖిలాఘవిశోధనం॥ ౬౫

తా॥ రుద్రాక్షమాలికతో మూలమంత్రమును జపించుచుండుట పదియవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ గురో ర్మాహేశ్వరాణాంచ భవానీవల్లభస్యచ।
ఆరాధనం ప్రత్యహం తచ్ఛీల మేకాదశం స్మృతం॥ ౬౬

తా॥ ప్రతిదినము గురుని, శివుని, మాహేశ్వరులను పూజించుచుండుట పదునొకండవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ గురవే శివభక్తేభ్య శ్శివధర్మాయ భక్తితః।
యథాశక్తి కృతందానం ద్వాదశం శీల ముచ్యతే। ౬౭

తా॥ గురునకు, శివభక్తులకు, శివధర్మమునకును శక్తికొలది దానముసేయుట పండ్రెండవశీల మగును.

మూ॥ ఏవం పంచవిధం శీలం పాణిసంబద్ధ మీరితం।
అథ పాదగతం వక్ష్యే శీల మాగమచోదితం। ౬౮

తా॥ ఇట్లు చేతికి సంబంధించిన యైదువిధము లగుశీలములు చెప్పితిని. ఇఁక, పాదములకు సంబంధించినశీలములను చెప్పుచున్నాను వినుము.

మూ॥ గురో ర్మాహేశ్వరస్యా భిగమనం క్రియతేహి యత్।
తత్త్రయోదశ మిత్యుక్తం శంభునా సర్వవేదినా॥ ౬౯

తా॥ గురుని, మాహేశ్వరుని నెదుర్కొనుట యేదికలదో అదియే పదమూఁడవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ గురో ర్మాహేశ్వరస్యాపి క్రియతే యత్ప్రదక్షిణం।
భక్తిభావయుతేనైవ గదితం తచ్చతుర్దశం॥ ౭౦

తా॥ భక్తియుక్తుఁడై గురునకు మాహేశ్వరునకు ప్రదక్షిణముసేయుట పదునాల్గవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ పూజాపరికరాణాంహి సంపాదనచికీర్షయా।
భక్తేన గమ్యతేనిత్యం తత్పంచదశకం మతం॥ 2౧

తా॥ భక్తిగలవాఁడైపూజాపరికరములను సంపాదించుకొనుటకై చరించుట పదునైదవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ గురో రపీష్టలింగస్య పూజార్థం స్థిరమాసనం।
తత్ షోడశకమిత్యుక్తం దేవదేవేన శూలినా॥ 2౨

తా॥ గురుని, ఇష్టలింగమును, మహేశ్వరులనుపూజించుటకై కూర్చుండుట పదునాఱవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ ఏవం పాదగతం శీలం చతుర్విధ మితీరితం
త్వక్సంబద్ధ మతోవక్ష్యే తచ్ఛృణు ష్వావధానతః॥ 23

తా॥ ఇట్లు పాదములకు సంబంధించిన నాలుగువిధములగు శీలములను జెప్పితిని. ఇఁకను, త్వక్కునకుసంబంధించిన శీలమును చెప్పుచున్నాను వినుము,

మూ॥ నిత్యం యదిష్టలింగస్య స్పర్శనం త్వవియోగతః
తత్సప్తదశకం ప్రోక్తం వపుస్సార్థకతాస్పదం॥ 2౪

తా॥ ఇష్టలింగము నవినాభావముగా నెల్లపుడు స్పృశించుచుండుట పదునేడవశీల మగును, ఇది శరీరమునకు సార్థక్యమును గలిగించును.

మూ॥ ఇష్టలింగ స్పర్శజన్య రోమాంచసమలంకృతిః
అష్టాదశం శీలమితి కథ్యతే శీలవేదిభిః॥ 2౫

తా॥ ఇష్టలింగముదగు స్పర్శమువలన రోమాంచము గలిగియుండుట పదునెనిమిదవ శీల మగును,

మూ॥ త్వక్సంబద్ధ మిదం శీలం ద్వివిధం పరికీర్తితం
చక్షుర్గతం ప్రవక్ష్యామి శృణు వత్సావధానతః॥ 2౬

తా॥ ఇట్లు చర్మమునకు సంబంధించిన రెండువిధములగు శీలములను జెప్పితిని. ఇకను చక్షువునకు సంబంధించినశీలము చెప్పుచున్నాను వినుము.

మూ॥ అశ్రాంతం సానురాగం యదిష్టలింగ నిరీక్షణం
ఏకోనవింశకం శీల ముక్త మాగమవేదిభిః॥ ౭౭

తా॥ ఎల్లపుడు ననురాగముతో నిష్టలింగమును నిరీక్షించుట పందొమ్మిదవ శీల మగును.

మూ॥ ఇష్టలిం గేక్షణోద్భూ తానంద బాష్పసముద్గమః
వింశం శీలం వ్యిర్దిష్టం స్పష్టం చంద్రార్ధమౌళినా॥ ౭౮

తా॥ ఇష్టలింగమును నిరీక్షించుచుండుటచే ఆనందబాష్పము గలిగియుండుట యిరువదవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ ఏవం తే ద్వివిధంశీలం చక్షుస్సంబద్ధ మీరితం
అథ జిహ్వాగతం వక్ష్యే శృణు శ్రద్ధాసమన్వితః॥ ౭౯

తా॥ ఓబృహస్పతీ, ఇట్లు నీకు చక్షురింద్రియమునకు సంబంధించిన రెండువిధము లగుశీలములను జెప్పితిని. ఇఁకను, జిహ్వేంద్రియమునకు సంబంధించిన శీలములను చెప్పుచున్నాను వినుము.

మూ॥ నివేదిత ప్రసాదీయ రసాస్వాదో యదన్వహం।
ఏకవింశక మిత్యుక్త మథ ఘ్రాణగతం శృణు॥ ౮౦

తా॥ నివేదించినప్రసాదముయొక్క రుచి నాస్వాదించుట యిరువదియొక్కటవ శీల మగును. ఇక, నాసికాగత మగుశీలమును చెప్పుచున్నాను వినుము.

మూ॥ నిర్మాల్యగంధపుష్పాది సౌరభాఘ్రాణనం పరం।
ద్వావింశకం సమాఖ్యాత మత శ్రోత్రగతం శృణు॥ ౮౧

తా॥ శివునకు నర్పించినగంధపుష్పాదులయొక్క పరిమళమును వాసనజూచుట యిరువదిరెండవశీల మగును. ఇంక, శ్రోత్రగత మగు శీలము చెప్పుచున్నాను వినుము.

మూ॥ గురో శ్శివస్య భక్తానాం స్తోత్రాకర్ణన మన్వహం।
త త్త్రియోవింశకం ప్రోక్త మాగమేషు కపాలినా॥ ౮౨

తా॥ గురునియొక్కయు, శివునియొక్కయు, భక్తులయొక్కయు మహిమమునుదెలుపు స్తోత్రములను వినుచుండుట యిరువదిమూడవ శీల మగును.

మూ॥ గురో శ్శివస్య భక్తానాం నిందావాకర్ణనంహి యత్।
తచ్చతుర్వింశకం ప్రోక్తం కాయికంతు తతశ్శృణు। ౮౩

తా॥ గురుచరేశ్వరులనిందను వినకుండుట యేదికలదో అది యిరువదినాల్గవశీల మగును. ఈరెండును శ్రోత్రేంద్రియమునకు సంబంధించినవి. ఇకను కాయమునకు సంబాధించినశీలములను చెప్పుచున్నాను. వినుము.

మూ॥ గురోర పీష్టలింగస్య చరస్యైవ ప్రసాదతః।
కాయశోధన మేతద్ధి తప స్స్యా త్పంచవింశకం॥ ౮౪

తా॥ గురుచరులయొక్కయు, ఇష్టలింగముయొక్కయు ప్రసాదముచే శరీరమునకు శుద్ధి గలిగించుటయె తపమని చెప్పఁబడుచు. ఇదియె యిరువదియైదవశీల మగుచున్నది.

మూ॥ నిషిద్ధవిషయేభ్యశ్చ యదింద్రియవినిగ్రహః।
షడ్వింశం శీలమిత్యుక్త మాగమాన్తేషు శంభునా। ౮౫

తా॥ నిషిద్ధములగు శబ్దాదివిషయములమీదికిఁ బోకుండునట్లు లింద్రియములను నిగ్రహించుట యిరువదియారవశీల మని చెప్పఁబడుచున్నది.

ప్రతి—నిస్సంశయమే

అన్నం—విష్ణుపూజ వేదమున నున్నదనుట మీకు నిస్సంశయము. శివపూజ వేదమున నున్నదనుట ఆరాధ్యులవారికి నిస్సంశయము. ఇట్లే దేవీపూజ వేదమున నున్నదనుట శాక్తులకును నిస్సంశయము గదా? ఇట్లుండ, మీరందఱు పూజించు విష్ణ్వాదులనే మేము పూజించుచుండఁగా. మీరు పూజించునప్పుడు మీకుగలుగని యీసందేహము వారినే మేము పూజించునెడ నెట్లు గలిగెనో మొదట తెలుపుఁడు.

ప్రతి—విష్ణ్వాదులను పూజింపనగునా? కాదా? అనియేనా? నేను మిమ్ము నడిగినది. ఈయైదుగురను జేర్చి యొక్కచో పెట్టి పూజింపుమని యేవేదమున నున్నదో ఆవిధిని గనఁబరుపుడని గదా? అడిగి యుంటిని. నే నడిగిన దానికి మీరుచెప్పినది సమాధాన మెట్లగును?

అన్నం—ఇది సమాధాన మెట్లుగాదు? ఏమన, ఈ యైదుగురిలో నొక్కొరొకరిని పూజింపుమనుట వేదవిహితమేయని యన్ని మతములవారు నంగీకరించియున్నారు గదా? ఈ యైదుగురను పూజించుట వేదవిహితమైనప్పుడు పంచాయతనము పూజనీయమనుట వేదవిహితమని యేర్పడుటలేదా? అయిదుగురను పూజించుట యన్నను, పంచాయతనమును పూజించుట యన్నను, నొక్కటిగాదా?

ప్రతి—అయిదుగురను పూజింపుమని వేదమున నున్నదనుటయె విచారణీయము. ఏలన, ఆయామతములవా రవలంబించిరిగాన శివలింగారాధనాదులు వేదవిహితములని యనుమాన ప్రమాణముచే మీరు సాధించుచున్నారు. ఇంతియగాని యీ యైదుగురను పూజింపుమని యే వేదమున నెచట నున్నదో కనఁబరిచితిరా? లేదు. అది యటుండ ఐదుగురను నొక్కచోఁ బెట్టి

పూజింపుమనియైన నెందున్నదో యిదియైన కనఁబరుపఁజాల రైతిరి. అయినను, పంచాయతనము వేదవిహితమేయని పలుకుచున్నారు. మీవాద మెట్లు సహేతుకమో దెలుపుడు.

అన్నం— ఆచార్యులవారూ, మీ విష్ణుపూజ వేదవిహితము నెడ సంశయము లేదనియు, శివలింగాదులు పూజనీయము లనుట విచారణీయమనియుఁ బలుకుచున్నారు. శివలింగము పూజనీయమనుట వేదవిహితమగునో, కాదో, ఆరాధ్యులవారి నడుగుదమా?

ప్రతి—ఇప్పుడు మీసామర్థ్యము వెల్లడియైనది. ఎట్లన, ఆరాధ్యుల వారికి నాకును వివాదము గల్పించి మీరు తప్పుకొనఁ జూచు చున్నారు. అట్లుగానిచో, వారి నడుగుట దేనికి? మీకు దెలిసియున్నచో మీర చూపరాదా?

అన్నం— పంచాయతనము వేదశాస్త్రవిహితమని శ్రీవిద్యారణ్య స్వాములవారు సిద్ధాంతము సేసియున్నారు,

ప్రతి— ఏ గ్రంథమునందు?

అన్నం—పరాశరమాధవీయమునందు.

ప్రతి—అచట, పంచాయతనమునకు ప్రమాణవచన మేమిగనబరిచిరి?

అన్నం—శ్లో॥ ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం॥ అను వచనము నుదాహరించిరి.

ప్రతి—ఆరాధ్యులవారూ! వీరు చదివిన శ్లోకము దేనిలోనిదో అడుగుడు.

పండి—మీరలె యడుగరాదా?

అన్నం— ఈ మాత్రమునకు మీలోమీరు కొట్లాడుకొనుట దేనికి? నేనె చెప్పుచున్నాను. వినుడు. ఈ వచనము పరాశరమాధ

వీయములోనిది? దీనింబట్టి పంచాయతనపూజ శ్రుతిస్మృతి పురాణవిహితమని స్పష్టము కాలేదా?

పండి—పంచాయతనము శ్రుతిస్మృతి పురాణవిహితమనుట పరాశర మాధవీయములో నుండుటం బట్టియే విశ్వసింపవలెనా? లేక పరాశరమాధవీయమునందు పంచాయతనపూజకు శ్రుతిస్మృతి పురాణములలోని ప్రమాణవచనముల నుదహరించియుండుటం బట్టి నిశ్చయింపవలెనా?

అన్నం—పరాశరమాధవీయమున నుండుటంబట్టియేయని యేల విశ్వసింపరాదు?

పండి—అట్లైని, పరాశరమాధవీయము శ్రుతియా? స్మృతియా? లేక, పురాణ మగునా?

ప్రతి—వీనిలో నిదియేదియుగాదుగదా?

అన్నం—పరాశరమాధవీయము వీనిలో నేదియుగాదా? ఆహా! ఏమి చిత్రము? స్మృతియనుట ప్రసిద్ధము గదా? స్మృతులలోనను కలౌ పారాశరస్మృతిః అనుటచే పరాశరమాధవీయము సర్వస్మృతులలోనను గరిష్ఠమని స్పష్ట మగుటలేదా? ఇట్లు పంచాయతనపూజ ప్రసిద్ధ స్మృతియందు విధింపఁబడుటంబట్టి స్మృతి విహిత మయ్యెను. శ్లో॥ శ్రుతే రివార్థం స్మృతి రన్వగచ్ఛత్॥ అనుటచే శ్రుత్యర్థమే స్మృతులయందు దెలుపం బడు చుండుగాన శ్రుతివిహిత మనియు, శ్రుతిస్మృతివిహితమే పురాణములయందును, విధింపబడుచుండుగాన పురాణవిహితమనియు, విశదమగుట లేదా?

ప్రతి—భట్టాచార్యులవారూ, ఎంత కల్పనాకథ పన్నితి రండీ?

అన్నం—ఇందు గల్పనాకథయేమి యున్నది?

పండి—భట్టాచార్యులవారూ. పంచాయతనవిధి పరాశరస్మృతిలో నున్నదా? లేక దానివ్యాఖ్యాన మైన మాధవీయములో నున్నదా?

అన్నం—ఆరెండును చేరి యొక్కటె గ్రంథము. మూలములో నుండినదేమి? దానివ్యాఖ్యానములో నుండినదేమి? ఎచటనున్న నొక్కటె మూలములోనున్నచో వ్యాఖ్యానకర్త యంగీకరించినట్లుగాదా? వ్యాఖ్యానములో నున్నది మూలకర్త యభిప్రాయమే కాదా? నేను తగినంత ప్రమాణము కనంబరిచినప్పుడుగూడ నిరర్థకపు వికల్పములు చేయవలసినదేనా ?

పండి—భట్టాచార్యులవారూ! వేగిరపడకుడు. మన మిప్పుడు నిజమును విమర్శింప నుద్యమించితిమి. ఇట్టిచో వేగిరపడుట యేల ?

అన్నం—తొందరయేమి? మీ యిచ్ఛవచ్చినట్లే విమర్శింపుడు.

పండి—పరాశరుండు స్మృతిని చెప్పిన తరువాత మాధవాచార్యుల వారు దానికి వ్యాఖ్యానము చేసినది యెతకాలమునకు ?

అన్నం—అది మీకు దెలియవలసినదెగాని మాకుం దెలియదు. మూలము వ్రాసినతరువాత యింతకాలమునకు వ్యాఖ్యానము వ్రాయంబడియెనని మావా రెవరును వ్రాసిపెట్టలేదు.

పండి—ఆరెంటికి కొన్నివేల సంవత్సరములకాలము నడుమ వ్యవధి యుండునని మీ రంగీకరింతురా లేదా ?

అన్నం—దానికేమి? అంగీకరింప నగును.

పండి—మూల మున్ననాటికి వ్యాఖ్యానము లేదుగదా,

అన్నం—లేదు.

పండి—అట్టిచో మూలము, వ్యాఖ్యానము రెండు నొక్కగ్రంథమే యెట్లగును?

ప్రతి—మూలము వ్యాఖ్యానము రెండును చేర్చియొక్కగ్రంథముగానే యున్నవిగదా యనిగూడ యీమహానుభావుండు చెప్పునేమో?

అన్నం—అట్లు చెప్పుటకు నేనంత వెఱ్ఱివాండనా? మూలమునకు, వ్యాఖ్యానమునకును నభిప్రాయ మొక్కటేగాన వానిలో

నెందున్న నొక్కటేయని పల్కిరిగాని మూలగ్రంథము వేరు, వ్యాఖ్యానగ్రంథము వేరు ననుట స్పష్టమైన విషయమే కదా?

పండి—మూలమునకు, వ్యాఖ్యానమునకును నభిప్రాయము ఒక్కటగునా? కాదా? అనుట ప్రకృతము గాదు. ఇఁక పంచాయతన పూజావిధి మూలమైన పరాశరస్మృతిలో నున్నదా? లేక దానివ్యాఖ్యానమైన మాధవీయములో నున్నదా? అని తెలిసికొనుటే ప్రకృతము.

అన్నం—పరాసరస్మృతికి వ్యాఖ్యానమైన మాధవీయమునందే కలదు.

పండి—అందేమనియున్నది?

అన్నం—శ్లో॥ ఆదిత్యమంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం ॥ అని యీవైదుగురను పూజింపవలయునని యున్నది.

పండి—ఈశ్లోకము దేనిలోనిదని యందుఁ జెప్పఁబడియెను?

అన్నం—స్మృత్యంతరములో నున్నదని పేర్కొనఁబడియున్నది.

పండి—ఈస్మృత్యంతరము మూలగ్రంథమా? లేక, నిబంధనగ్రంథమా?

అన్నం—నిబంధనగ్రంథమే

పండి—ఆగ్రంథము చేసినవా రెవ్వరు?

అన్నం—ఎవ్వరు చేసిననేమి?

పండి—కర్తనుబట్టిగదా యాగ్రంథమునకుఁ బ్రామాణ్యము నిలుపవలయును.

అన్నం—ఆగ్రంథమునందు గ్రంథకర్తయొక్క స్వకపోలకల్పితమేదియు నుండదు.

పండి—అందేమైననుండుఁగాక. ఆగ్రంథమును రచించినవాఁ డేమతస్థుఁడు?

అన్నం—మాస్మార్తమతస్థుఁడే,

పండి—గ్రంథకర్త స్మృత్యంతరమునందు పంచాయతనపూజకు విధిని కనంబరచునప్పుడు తానువ్రాయుశ్లోకము లేస్మృతిలోనివో ఆ స్మృతిపేరు చెప్పియుండెనా?

అన్నం—ఆశ్లోకము లేస్మృతిలోని దైనది వ్రాయనంతమాత్రమున నవి యప్రమాణము లగునా?

పండి—ప్రామాణ్యముసంగతి వేరు. అట్లుచెప్పెనా? లేదా?

అన్నం—చెప్పియుండలేదు.

పండి—స్మృత్యంతరకారుడుపంచాయతనవిధాయకమైన మూలస్మృతి పేరు చెప్పకపోయె! పంచాయతనపూజకు విధి నుదాహరించిన మాధవాచార్యులవారైన నేదేని మూలగ్రంథముపేరెత్తియుండిరా?

అన్నం—అవసర మేమి,

పండి—మాధవాచార్యులవారు పరాశరవ్యాఖ్యానమునందు శ్రుతి స్మృత్యాదివచనములచే బెక్కువిషయములను నిర్ణయించి యున్నారు. అట్టియవసరము వారికిఁ బంచాయతనము నుద్ధరించు నెడ నేలలేకపోయెను? పంచాయతనము శ్రుతిస్మృతి సమ్మతమని దెలుప నవసరము వారికి లేదా?

అన్నం—ప్రసిద్ధవిషయములనుగూర్చి శ్రుత్యాదివచనోదాహరణము దేనికి?

పండి—పంచాయతనము ప్రసిద్ధవిషయంబును, శ్రుతిస్మృత్యాదివచ నోదాహరణములచే నందుబ్రతిపాదించిన సంధ్యావందనాది విషయము లప్రసిద్ధవిషయములని యిది మీయభిప్రాయమా? లేక, మాధవాచార్యులవారి యభిప్రాయమా?

ప్రతి—ఇది వీరియభిప్రాయమే కావలయునుగాని మాధవాచార్యులవారి దనుట యుచితముగాదు. మాధవాచార్యులవారు తాము

చూచిన శ్రుతిస్మృత్యాదులయందు నెటనైన పంచాయతన విధికి ప్రమాణవచనము కనఁబడియున్నచో నేలయుదాహ రింపరు? స్మృత్యంతరము వేదశాఖలకన్నను నష్టాదశస్మృత్యుప స్మృతి పురాణములకన్నను నెక్కుడని యుదాహరించి యుండిరా? వానియం దెటను కనఁబడమి నే స్మృత్యంతరమును దాహరింపవలసివచ్చెను. ఇట్లుపంచాయతనిపూజావిధిస్మృత్యం తరమునుబట్టి సిద్ధాంతము సేయవలసినప్పుడు జేసి శ్రుతిస్మృతి పురాణములలో నెందును లేదనుము, దానింబట్టి యిది నిర్మూల మనియున్నష్టమైనది.

అన్నం— మాధవాచార్యులవారు పంచాయతనమునకు మూలవచన ములను నుదాహరించనిమాత్రమున నిది నిర్మూలమే యగునా? పంచాయతనవిధియేగాక పంచాయతనమునందు శివుని నడుము నుంచు నెడ కడమ దేవతల నేయేదిశలయందుంచవలసినదియు, ఇట్లె విష్ణ్వాదులలో నెవ్వరిని నడుమనుంచినపుడు కడమవారి నేయేదిశయందు నిలుపవలసినదియు సర్వము స్మృతులయం దున్నది ఇట్లు ప్రత్యక్షముగా స్మృతులయందు నగపడుచుం డఁగా నిది నిర్మూలమనుట మీకే తగును.

పండి— మాధవాచార్యులవారనేకశ్రుతులకు వ్యాఖ్యానము గావించి యున్నారు. వారు చూడనివిద్యాస్థానము ప్రాయికముగా నెందును లేదు. దాననెకదా? విద్యారణ్యులని వారికిసన్వర్థ నామముగలిగెను, అట్టివారికిపంచాయతనమునకు మూలవచ నమే యేస్మృతియందును గోచరము గాదయ్యెను. దాననె కదా స్మృత్యంతరములోని యర్ధశ్లోకముతో పంచాయతన మును సిద్ధాంతము సేయవలసివచ్చెను. అట్లుండ నీనడుమ నవతరించిన మహాపండితుల దివ్యదృష్టికి పంచాయతనమునం దమయిష్టమైనవారిని నడుమనుంచినప్పుడు కడమవారి నే

యేదిశయం దుంచుటకుగూడ ప్రమాణవచనములు పెక్కులు గోచరించెనుగదా? దీనింబట్టి ప్రమాణవచనములకు లోప మేమి?

ప్రతి—వీరిసిద్ధాంతమునందు సర్వము కల్పితమేగాన ప్రమాణవచనములును కల్పితములగుటవింతయగునా?భట్టాచార్యులవారూ! మీసిద్ధాంతము నందు తత్త్వమొక్కటియేగదా ? అట్లుండ పూజావిధియందు నైదుగురుదేవతల నెట్లుగ్రహించితిరి.

అన్నం—మాకు నద్వైతము భావమున్నందే. క్రియయందైననో ద్వైతమే దీనింబట్టి యైదుగురు దేవతల బూజించినం దప్పేమి?

ప్రతి—అయిదుగురను పూజించినను దప్పులేదు. ఏబదిమందిని పూజించినను దప్పులేదు. కాని యీయైదుగురను గ్రహింపనేమి కారణము.

అన్నం—ఈయైదుగురననగా నీయభిప్రాయమేమి?

ప్రతి—వీరినిగాక మరిమెవరలనైన నైదుగురిని గ్రహించియుండగూడదా, ఐదుగురనేగాక నింకిద్దరునుగూడ పరిగ్రహించియుండగూడదా, వీరి నైదుగురనె గ్రహింపనేల?

అన్నం—ప్రమాణబలమునుబట్టి.

ప్రతి—పంచాయతనమునకు గలప్రమాణబల మిప్పుడు తేలినదెగదా

పండి—నిజమైనసంగతి వారు చెప్పరు.

అన్నం—నిజమైన దేది?

పండి—శంకరాచార్యులవారు శైవవైష్ణవాదిమతములను జయించి యాయామతస్థులను గొందఱగొందఱచేర్చి యాసంఘమునకు స్మార్తమతమని పేరునెట్టినతరువాత యామతమునకు పూజనీయ మగుదేవతను నిర్ణయించుట కష్టతర మయ్యెను. ఏలన శివుని పూజింపుడనిన వైష్ణవమతమునుండి వచ్చికలిసినవా

మ॥ రా॥ శ్రీ కొమరువెల్లి కాళయ్యగారు వరంగల్ 12-0-0
,, రామిని మల్లయ్యగారు ... 12-0-0
,, తుగ్గపాటి వెంకటేశ్వరరావుగారు, బారిష్టరు, బెజవాడ 10-0-0
ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్నగార్లు, సికింద్రాబాదు 10-0-0
,, కైలాస శరభయ్యగారు, ... 10-0-0
,, బెద్దె రామన్న కుమారుడు, జగదీశ్వరయ్య ... 10-0-0

## —◆ పో ష కు లు ◆—

మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యవార్లంగారు, ఈమని 5-0-0
,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని 5-0-0
,, కామర్సు రాజశేఖరరావుగారు, కరణం, నవాబుపాలెం 5-0-0
,, ముదిగొండ వీరభద్రశాస్త్రిలుగారు, తొండపి 5-0-0
,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు 5-0-0
,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల 5-0-0
,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చుపేట 5-0-0
,, భూపతి రత్నంగారు, వరంగల్ 5-0-0
,, మల్లంపల్లి మల్లికార్జునుడుగారు, అయితంపూడిఅగ్రహారం 5-0-0
,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ 5-0-0
,, శ్రీపతిపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని 5-0-0
,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు 5-0-0
,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు 5-0-0
,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్దిపేట 5-0-0
,, ముత్యంపేట మల్లయ్యగారు ,, 5-0-0
,, కాళేశ్వరం నాగభూషణంగారు ,, 5-0-0
,, కొమరువెల్లి బాలరాజుగారు, వరంగల్ 5-0-0
,, గర్రెపల్లి రామన్నగారు. మిడిదొడ్డి 5-0-0

# ప్రకటనము.

ఆర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:- ఈ గ్రంథమునందు బ్రాహ్మణులు మొదలగువారు వేకువజామున నిద్రలేచినది మొదలుకొని రాత్రి పండుకొనునందాక చేయనగు స్నానసంధ్యాది సకలధర్మములకును వైద్యశాస్త్ర ప్రామాణ్యమును బట్టి ఆరోగ్యరూపమగు ప్రత్యక్షఫలము కలదని ఋజువు చేయఁబడియున్నది.

వెల రు ౧-౦-౦

కారణోత్తరమను దివ్యాగమము:- ఇయ్యది శైవుల లింగధారణము మొదలగువాని యెడలగల సకలసంశయములు వారించు నెడ నిరుపమానమైనది.

వెల రు ౧-౦-౦

ఆహ్నికవిధి:- ఇందు స్నానము సంధ్య మొదలుకొని వైశ్వదేవము వరకుగల సకల నిత్యకర్మములు సస్వరాంధ్ర ప్రయోగముతో గలవు.

వెల రు -౮-౦.

మకుటోత్తరము అను దివ్యాగమము:- ఇందు శివపూజా విశేషములు, శైవాంత్యేష్టి విధానము మొదలగు ననేక విశేషములు గలవు.

వెల రు ౧-౮-౦.

బ్రహ్మతర్క స్తవము:- శ్రీమదప్పయ దీక్షిత విరచితము. ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, స్మశానవాసిత్వము, బాణాసురయుద్ధమున నోడిపోయెనన్న దానికి సమాధానము మొదలగు ననేక విషయములు గలవు. వెల రు ౧-౦-౦

మహాశివపూజా విధి:- ఇయ్యది లింగనిరీక్షణమున వినియోగించు దశావధాన విధానముతోను, సస్వరాంధ్రప్రయోగముతోను శాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦-౮-౦

ధర్మసంగ్రహము అంత్యేష్టికాండము:- ఇందు శైవులాచరించు సమాధ్యారాధనవిధులు శాస్త్రసిద్ధములని పలువిధముల నిరూపింపఁబడియుండుటయెగాక, అపరకాండ సందర్భమునగల సర్వవిధకృత్యములకుఁదగు ప్రమాణముల గనబరిచి సకల సంశయములు వారింపఁబడియెను. ఆంధ్ర తాత్పర్యసహితము.

వెల రు ౨-౦-౦,

వలయువారు:— ముదిగొండ నాగలింగశాస్త్రి.

రామలింగేశ్వర పేట, తెనాలి. అని వ్రాయవలెను.

Reg. No. M- 2284.

శ్రీ
శివాయ గురవేనమః

# శైవరహస్యబోధిని.

ఇది
శ్రీ దేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జితాసార్
శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని
సాహాయ్యమున వెలువడుచు
శైవధర్మములను, వాని ప్రామాణ్యమును దెలుపు
మాసపత్రిక.



| సంపుటము 5. | విభవనామ సంవత్సర మాఘమాసము. | సంచిక 11. |
|---|---|---|



సంపాదకుడు:_ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।
విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ।
అశేషశం కామయపంక శోధినీ।
జయత్వియం శైవరహస్యబోధినీ।



తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

చందా సం॥ రు 2-0-0.

1929.

## శాశ్వత ప్రధాన పోషకులు.

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగ మయ్యావార్లగారి కుమారుడు
నాగమల్లయ్య అయ్యావార్లగారు. సిద్ది పేట
కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, రామన్నవగైరా సిద్దిపేట

### —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారీకులు

| | | |
|---|---|---|
| 1 | భండారు మల్లిఖార్జునరావుగారు | 60—0—0 |
| 2 | భండారు వీరభద్రరావుగారు | |
| 3 | భండారు వీరరాజుగారు | |
| 4 | భండారు వీరబసవరాజుగారు | |
| 5 | భండారు చెన్న బసవయ్యగారు | |
| 6 | భండారు చిన మల్లిఖార్జునుడుగారు | |

### —: ప్రధానపోషకులు :—

| | |
|---|---|
| మరాశ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రిలుగారు సికింద్రాబాదు | 12-0-0 |
| ,, శివలంక తాయన్నగారు, పోణంగి | 10-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రయ్య అయ్యావారుగారు, ఈమని | 10-0-0 |
| ,, శివపురపు రాజయ్యగారు, శికింద్రాబాదు | 10-0-0 |
| ,, కొడిమేల భోగసోమలింగారాధ్యులుగారు, శ్రీగురుత్వ సంస్థానం వరంగల్ | 10-0-0 |
| ,, శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు నిర్మల | 10-0-0 |
| ,, కాశీనాధుని అల్లమయ్య అయ్యావారుగారు యలమర్రు అగ్రహారం | 10-0-0 |
| ,, శివలెంక శంభులింగం అయ్యావారుగారు బెజవాడ | 10-0-0 |
| ,, ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్ | 12-0-0 |

మూ॥ అస్పృశ్యవ స్త్వసంస్పర్శ స్స్నానం నీరేణభస్మనా।
శౌచంహి సప్తవింశం స్యాచ్ఛీల మాగమచోదితం॥ ౨౭

తా॥ తాకగూడని వస్తువులను తాకకుండుటయు, జలస్నానము భస్మస్నానము ననునవియు శౌచ మనిచెప్పఁబడును. ఇదియె యిరు వది యేడవశీల మగును.

మూ॥ ఆసనే శయనే గోష్ఠ్యాం భవిసంబంధవర్జనం।
అష్టావింశ మిదం శీలం నిర్దిష్టం శౌచసాధనం॥ ౨౮

తా॥ కూర్చుండినప్పుడు, పండుకొనినప్పుడు, గోష్ఠియందును భవిసంబంధము లేకుండుట యిరువది యెనిమిదవ శీల మని చెప్ప బడుచున్నది. ఇది పరిశుద్ధికి సాధనమైనది యగును.

మూ॥ కాయికం పంచధా ప్రోక్తం ముక్తిప్రాప్త్యైకసాధనం।
అథ మానసికం వక్ష్యే శీల మేకమనా శ్శృణు॥ ౨౯

తా॥ శరీరమునకు సంబంధించినవియు, మోక్షసాధనములు నగు నైదుశీలములను జెప్పితిని. ఇఁకను, మనసునకు సంబంధించిన వానిని చెప్పుచున్నాను, వినుము.

మూ॥ నిషిద్ధభోగవిషయే యత్సంకల్పవివర్జనం।
బ్రహ్మచర్యంహి తచ్ఛీలం త్రింశ మాగమచోదితం॥ ౨౯

తా॥ నిషిద్ధములగు భోగములవిషయమైన సంకల్పమును వదలుట బ్రహ్మచర్య మగును. ఇయ్యది ముప్పదియవ శీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ కామం భక్తిరతో కుర్యాద్విషయేషు నజాతుచిత్।
ఏకత్రింశ మిదం శీలం నిష్కామత్వం ప్రకీర్తితం॥ ౩౦

తా॥ భక్తియెడనె కోరికను వహింపవలయుగాని విషయభోగములెడ కోరికను వహింపఁగూడదు. ఇదియె నిష్కామత్వ మగును. ఇయ్యది ముప్పదియొక్కటవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ వహేత్ క్రోధ మధర్మేతు న వైరిషు కదాచన।
ద్వాత్రింశక మిదంశీల మక్రోధం ముక్తిసాధనం॥

తా॥ క్రోధమును నధర్మముమీదనే యుపయోగింపవలయుగాని దానిని శత్రువులమీద నుపయోగింపగూడదు. ఇది యక్రోధమని చెప్పఁబడును. ఇయ్యది ముప్పదిరెండవశీల మగును.

మూ॥ నధనాదౌ వహేల్లోభం శివస్యారాధనే వహేత్।
అలోభాఖ్యమిదం శీలం త్రయస్త్రింశంసమీరితం॥ ౯౨

తా॥ అట్లే లోభమును శివారాధనమునెడనే వహింపవలయుగాని ధనాదులయెడ వహింపగూడదు. ఇది యలోభమని చెప్పఁబడును. ఇది ముప్పదిమూడవ శీలమని యెఱుఁగవలయు.

మూ॥ మోహం భక్తజనే కుర్యాన్న కాంతాయాం సుతేషువా।
అమోహాఖ్య మిదంశీలం చతుస్త్రింశం ప్రకీర్తితం॥ ౯3

తా॥ మోహమును భక్తులవిషయమునను ధరింపవలయు. అంతియకాని దానిని భార్యా పుత్రాదులయెడ ధరింపఁగూడదు. అమోహము అని యెన్నఁబడు నీశీలము ముప్పదినాల్గవది యగును.

మూ॥ మాత్సర్యం కరణేష్వేవ నజనేషు వహేత్క్వచిత్।
అమాత్సర్య మిదంశీలం పంచత్రింశం సమీరితం॥ ౯౪

తా॥ మాత్సర్యమును ఇంద్రియములమీద వహింపవలయునె గాని జనులయెడ వహింపఁగూడదు. అమాత్సర్య మనునీశీలము ముప్పదియైదవది యగును.

మూ॥ మదం మాయాజయే కుర్యాత్ నధర్మే నాపి సంపది।
అమదాఖ్యమిదం శీలం షట్త్రింశ మితి కీర్తితం॥ ౯౫

తా॥ మాయను జయించు విషయమునని యహంకారము బాల్యవలయుగాని దానిసిధర్మమునెడగాని, సంపత్తు విషయమునగాని ధరింపఁగూడదు. అమద మనునీశీలము ముప్పదియాఱవదియగును.

మూ॥ గుణాగుణ విమర్శస్య త్యాగో యస్తు గురౌ చరే।
సప్తత్రింశం సమాఖ్యాతం శీల మాగమ వేదిభిః॥ ౯౬

తా॥ గురుచరులవిషయమున గుణదోషముల విమర్శింపఁగూడదు. ఇది ముప్పదియేడవశీల మని చెప్పఁబడుచున్నది.

మూ॥ ప్రాణినో యస్య కస్యాపి బాధస్యాకరణంహి యత్।
అహింసాఖ్య మిదం శీల మష్టత్రింశం సమీరితం॥ ౯౭

తా॥ ఏప్రాణికి బాధకలిగింపకుండుట అహింసయని చెప్పఁబడుచున్నది. ఇయ్యది ముప్పదియెనిమిదవశీల మగును.

మూ॥ ప్రాణిదుఃఖస్య వీక్షాయా మక్షమత్వం దయాభిదం।
శీలం ప్రసిద్ధ మేకోనచత్వారింశం ప్రకీర్తితం॥ ౯౮

తా॥ ప్రాణిదగు దుఃఖమును జూడఁజాలకుండుట దయయని చెప్పఁబడుచుండును. ఇయ్యది ముప్పదితొమ్మిదవశీల మగును.

మూ॥ క్రియాయాం వచనేవాపి యత్పరస్మాత్స్వతోపివా।
హ్రీత్వా శీలమిదం ప్రోక్తం చత్వారింశం త్రిశూలినా॥ ౯౯

తా॥ పనిచేయునెడను, మాటాడునెడను పరునివలనగాని, తన వలనగాని లజ్జగలిగియుండుట యేది గలదో అది నలుబదియవశీల మని చెప్పఁబడుచున్నది.

మూ॥ రిపౌ నిజసుతేవాపి యద్వైషమ్యవివర్జనం।
ఆర్జవాఖ్యం శీలమేకచత్వారింశం ముదాహృతం। ౧౦౦

తా॥ పుత్రునియందును శత్రునియందును నేకవిధముగా నుండుటఆర్జవమని చెప్పఁబడును. ఇయ్యదినలుబదియొకటవశీలమగును.

మూ॥ ఆగమే నిగమేచైవ విశ్వాసో యద్గురూదితే।
శ్రద్ధాఖ్యం శీల మేతద్ద్విచత్వారింశం సమీరితం॥ ౧౦౧

తా॥ ఆగమమునందును, వేదమునందును, గురువచనమునందును విశ్వాసము గలిగియుండుట శ్రద్ధయని చెప్పఁబడును. ఇది నలుబది రెండవశీల మగును.

మూ॥ ఆపద్యపి దురంత్రాయాం ధర్మస్య యదవర్జనం।
ధృత్యాఖ్యం శీల మేత త్త్రిచత్వారింశం ప్రకీర్తితం॥ ౧౦౨

తా॥ గొప్పయాపదయందైనను ధర్మమును విడువకుండుట ధృతియని చెప్పఁబడును. ఇయ్యది నలుబదిమూడవశీల మగును.

మూ॥ అదూషణం వైరిజనే ష్వపకారరతేష్వపి।
శీలం క్షమాభిదం చతుశ్చత్వారింశం సమీరితం॥ ౧౦౩

తా॥ శత్రుజను లపకారము సేయుచున్నను వారిని దూషింపకుండుట క్షమయని చెప్పఁబడును. ఇది నలుబదినాల్గవశీల మగును.

మూ॥ భోగప్రయుక్తవాంఛాయా రాహిత్యం యద్ధి మానసే।
భోగాసక్తిచ్యుతిః పంచచత్వారింశం సమీరితం॥ ౧౦౪

తా॥ చిత్తమునందు భోగములవిషయమైనకోరిక లేకుండుట భోగానాసక్తి యని చెప్పఁబడును: ఇది నలుబదియైదవశీల మగును.

మూ॥ క్రియాయాం వచనేవాపి ప్రమాదరహితస్థితిః।
ధీర్యాశీలం తదిహ షట్చత్వారింశం వినిశ్చితం॥ ౧౦౫

తా॥ ధర్మక్రియ చేయునెడగాని, వచనమునెడగాని ప్రమాదము లేకుండనుండుట ధీ అని చెప్పఁబడును. ఇయ్యది నలుబదియాఱవశీల మగును.

మూ॥ శివాస్య వస్తువిషయ సంకల్పపరివర్జనం।
శీలం దమాభిధం సప్తచత్వారింశం ప్రకీర్తితం॥ ౧౦౬

తా॥ శివునికన్న నితరమైన వస్తువును గూర్చి సంకల్పము లేకుండుట దమమని చెప్పఁబడును.

మూ॥ అన్యాయ ధర్మానుష్ఠానం పరద్రవ్యా పరిగ్రహః।
అస్తేయాఖ్యం శీల మష్టచత్వారింశ ముదాహృతం॥ ౧౦౭

తా॥ ధర్మములను కొదవ లేకుండనాచరించుటయు, పరధనము నపహరింపకుండుటయు అస్తేయమని చెప్పఁబడును. ఇది నలుబది యెనిమిదవశీల మగును.

మూ॥ అలబ్ధవస్తువిషయవ్యసనాభావసుస్థితిః।
సంతుష్టి శ్శీల మేకోన పంచాశత్కం వినిశ్చను॥ ౧౦౮

తా॥ లభింపని వస్తువుల విషయమున వ్యసనము లేకుండుట సంతుష్టి యగును. ఇయ్యది నలుబది తొమ్మిదవశీల మని చెప్పఁబడు చున్నది.

మూ॥ పారమేశ్వరయో ర్నిత్యం స్మరణం నామరూపయోః।
జీవన్ముక్తిప్రదం శీలం పంచాశత్కం సమీరితం॥ ౧౦౯

తా॥ పరమేశ్వరుని నామరూపముల నెల్లపుడు స్మరించు చుండుట యేఁబదియవశీలమని చెప్పబడుచున్నది. ఇయ్యది జీవన్ముక్తి నొసఁగుచు.

మూ॥ శంభునామగుణాదీనాం చింతనం యదనారతం।
శీలం పాశహరం త్వేకపంచాశత్కం ప్రకీర్తితం॥ ౧౧౦

తా॥ పరమేశ్వరుని కల్యాణగుణములను నెల్లపుడు చింతించు చుండుట యేఁబదియొకటవ శీల మగును, ఇది జన్మపాశమును పోగొట్టును.

మూ॥ భావ్యమానం సదాశంభోః పాదసంవాహనాదికం।
పాదసేవన మేత ద్ద్విపంచాశత్క ముదాహృతం॥ ౧౧౧

తా॥ ఎల్లపుడు పరమేశ్వరునకు పాదములు వత్తుచున్నట్లు భావించుట పాదసేవన మగును. ఇయ్యది యేఁబదిరెండవశీల మగును

మూ॥ అర్చనం మానసం యత్స్యా చ్ఛంభో రావాహనాదినా।
శీలం త్విదం గీష్యతే త్రిపంచాశత్క ముదాహృతం॥ ౧౧౨

తా॥ మనస్సునందే పరమేశ్వరుని నావాహనాదులచే పూజిం
చుట యేబదిమూడవశీల మగును.

మూ॥ శంభుపాదాబ్జయో ర్నిత్యం ప్రణామో మానసోహి యత్।
శీల మేతత్కిల చతుఃపంచాశం సంప్రకీర్తితం। ౧౧౩

తా॥ మనస్సునను శివునిపాదకమలములకు నెల్లప్పుడు నమ
స్కారము సేయుచుండుట యేఁబదినాల్గవది యగుశీలమని చెప్పఁబడు
చున్నది.

మూ॥ కైంకర్యకరణం శంభో ర్మనసా సర్వదాహి యత్।
దాస్యం శీల మిదం పంచపంచాశమితి భాషితం॥ ౧౧౪

తా॥ మనసునను యెల్లపుడు శివునకు కైంకర్యము సేయు
చున్నట్లు భావించుచుండుట దాస్య మగును. ఇయ్యది యేఁబదియై
దవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ శంభోః కల్యాణరూపస్య సఖితాభావనం హియత్।
సఖ్యాఖ్యం శీల మేత త్షట్పంచాశమితి నిశ్చితం॥ ౧౧౫

తా॥ కల్యాణరూపుఁడగు పరమేశ్వరునకు తాను సఖుఁడనని భావిం
చుట సఖ్యమగును. ఇది యేఁబదియాఱవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ బంధమోచనజాతస్య కృత్స్న స్యేశే సమర్పణం।
ఆత్మార్పణమిదం సప్తపంచాశం సంప్రచోదితం॥ ౧౧౬

తా॥ తనను బంధమునుండి విడిపించి ముక్తుని చేయుభారము
నంతను నీశ్వరునందె యుంచుట ఆత్మార్పణ మగును. ఇయ్యది యేఁ
బదియేడవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ యజ్జపో మూలమంత్రస్య మనసా క్రియతే సదా।
ఏతచ్ఛీలం సేవ్య మష్టపంచాశ మవధారితం॥ ౧౧౭

తా॥ మనసుననే మూలమంత్రము నెల్లపుడు జపించుచుండుట
యేఁబదియెనిమిదవశీలమని చెప్పఁబడుచున్నది.

మూ॥ శంభో ర్హృది దివ్యరూపానుసంధానం క్రియతే హృది
ధ్యానాఖ్యం శీల మేకోనషష్టికం పరికీర్తితం॥ ౧౧౮

తా॥ హృదయమునందు పరమేశ్వరుని దివ్యరూపము నను

సంధానము చేయుట ధ్యానమగును. ఇయ్యది యేబదితొమ్మిదవ శీలమని చెప్పఁబడుచున్నది,

మూ॥ ధ్రియతే తైలధారావ దవిచ్ఛిన్నం తదేవయత్
ధారణాఖ్యం శీలమిదం షష్టికం సముదాహృతం॥ ౧౯౯

తా॥ తైలధారవలె తెంపులేని ధ్యానమును ధరించియుం డుట ధారణఅని చెప్పఁబడును. ఇది అరువదియవ శీలమగును.

మూ॥ నివాతదీపవ ద్ధ్యానే చేతసో యదవస్థితిః।
సమాధ్యాఖ్యం శీల మేకషష్టికం సంప్రచోదితం॥ ౧౨౦

తా॥ ధ్యానము చేయునప్పుడు గాలిలేనిచోట నున్నదీపము వోలె చిత్తము కదలకుండుట సమాధి యనంబడును ఇది అరువదియొ క్కటవ శీల మగుచు.

మూ॥ సోహంభావేన విశ్వేశం ధ్యాయన్ కృత్యాని సర్వతః
తదింద్రియముఖే నైవ క్రియమాణాని భావయన్॥ ౧౨౧
యత్సంచరతి తచ్ఛీలం ద్విషష్టిక ముదాహృతం

తా॥ తాను పరమేశ్వరుఁడనని ధ్యానించుచు తాఁజేయు కృత్యములను నీశ్వరునింద్రియములద్వారా చేయఁబడుచుండునట్లు భావించుచుండుట యరువదిరెండవ శీలమని గ్రహింపవలయు,

మూ॥ అపరిచ్ఛిన్న రూపానుసంధానం యన్మహేశితుః॥ ౧౨౨
శీలముక్తం గీష్పతే త్రిషష్టికం సంప్రచోదితం।

తా॥ అపరిచ్ఛిన్నమై, సర్వవ్యాపకమైన పరమేశ్వరరూప మును ధ్యానముసేయుట అరువదిమూఁడవ శీలమని యెఱుంగవలయు,

మూ॥ అనంతరూపం దేవస్య భావయ న్నిజరూపతః॥ ౧౨౩
శివానందవశా ద్విశ్వ మాత్మానం విస్మరన్నపి
య స్తిష్ఠ త్యచల శ్శీలం చతుష్షష్టిక మీరితం॥ ౧౨౪

తా॥ అనంతమగు నీశ్వరరూపమును తనరూపముగానె భావిం చుచు, శివానందానుభవమువలన జగమును, తనను గూడ మరచి యుండుట యరువదినాల్గవశీలమని చెప్పఁబడుచున్నది,

మూ॥ య శ్చతుష్షష్టిశీలాఢ్య శ్శివఏవ నచాపరః।
ఏతదభ్యాసయోగేన శివసాయుజ్య మశ్నుతే॥ ౧౨౫

తా॥ ఇట్టి యరువదినాలుగు శీలములు గలవాఁడు శివుఁడే గాని యన్యుఁడుగాడని యెఱుంగవలయు వీనిని యభ్యసించుచుండు వాడు శివసాయుజ్యము నొందును.

మూ॥ గణాచార ఇతిప్రోక్తో భృత్యాచార మతశ్శృణు।
భృత్యత్వం వీరభృత్యత్వం భృత్యాచారో ద్విధామతః॥ ౧౨౬

తా॥ ఇట్లు గణాచారమును దెలిపితిని. ఇఁకను భృత్యాచారమును చెప్పుచున్నాను వినుము భృత్యత్వ మనియు, వీరభృత్యత్వ మనియు భృత్యాచారము రెండువిధములుగా నున్నది.

మూ॥ గురులింగజంగమానాం కైంకర్యాచరణంహి యత్।
భృత్యత్వమితి నిర్దిష్టం దేవదేవేన శంభునా॥ ౧౨౭

తా॥ గురులింగజంగమములకు పరిచర్య చేయుట భృత్యత్వ మని చెప్పఁబడియెను.

మూ॥ దేశికాయ తనుం చిత్తం శంభవేచ ధనంతథా।
జంగమాయ సమర్ప్యైవం మాహాత్మ్యాసమన్వితః॥ ౧౨౮
ముక్తిమేవ పరాం కాంక్షమాణో యదవతిష్ఠతె।
తన్మతం వీరభృత్యత్వం శివానుగ్రహసాధనం॥ ౧౨౯

తా॥ తనశరీరమును గురునకు, తనచిత్తమును శివునకు, తన ధనమును మాహేశ్వరులకు నర్పించి, మాహాత్మ్యముతోఁగూడి తనకు కైవల్యముక్తియే కావలయునని కోరుచుండుట వీరభృత్యత్వ మని చెప్పఁబడును. ఇయ్యది శివానుగ్రహమునకు పరమసాధనమైనది.

మూ॥ ఇత్యేవం కథిత స్తథ్యం పంచాచార వినిర్ణయః।
నిగమాగమసారోఽయం ముక్తిప్రాప్త్యైకసాధనః॥ ౧౩౦

నాశిష్యా యోపదేష్టవ్యో నాభక్తాయ కదాచన।
నాపుత్రాయచ వక్తవ్యో నశ్రద్ధాగహితాయచ॥ ౧౩౧
గోపనీయః ప్రయత్నేన కిమతశ్శ్రోతు మిచ్ఛసి॥

మెను. మనో బ్రహ్మే త్యుపాసీత, అను శ్రుతియందు ఉపపూర్వకాస ధాతువుతో నుపక్రమించి విద ధాతువుతో ముగింపు చేయఁబడెను. ఇట్లు విదధాతువుతో నారంభించి ఉపపూర్వకాస ధాతువుతో ముగింపు చేయుచును, ఉపపూర్వకాసధాతువుతో నుపక్రమించినపుడు విదధాతువుతో నుపసంహరించుచుండుటను విదధాత్వర్థమునకు ఉపపూర్వకాసధాత్వర్థమునకును భేదము లేదని తెలియుచున్నది. దీని నంగీకరింపనియెడ నారంభించినది యొక్కటి, ముగించినది వేరొక్కటి యగుటం జేసి యుపక్రమోపసంహారములు పరస్పరము విరోధింపక మానవు. కావున, విదధాత్వర్థమునకు ఉపపూర్వకాసధాత్వర్థమునకు భేదము లేదనుట వేదాన్తసమ్మతమే యని స్పష్ట మగుచున్నది. విదధాతువునకు నర్థము జ్ఞానము, ఉపపూర్వకాస ధాతువునకు నర్థము ఉపాసనము అని స్పష్టము. శంకరాచార్యులవారికట్రోక్తింబట్టియె జ్ఞానోపాసనములు రెండునొక్కటియె యనుట వేదాన్తసమ్మతమని విశద మయ్యెగదా? కర్మమునకు నుపాసనమునకు సముచ్చయము వేదసమ్మతమె యని సర్వవేదాన్తసిద్ధాంతసంగ్రహమునందు శంకరాచార్యులవా రంగీకరించినదె కదా? ఇట్లుండ నీలకంఠాచార్యులవారు జ్ఞానమన నుపాసనమే యనియు, కర్మజ్ఞానసముచ్చయము వేదాన్తసమ్మత మనియు సిద్ధాంతీకరించినది విరుద్ధ మెట్లగునో ఇందగు న్యాయ్యము గ్రహించు పని పండితులదే యగును.

ఆ కారణమున, శ్రు॥ యోన్యాం దేవతా ముపాస్తే అన్యోసావన్యోహ మస్మీతి న సవేద యథాపశుః॥ నేను వేరు దేవత వేరునని తలంచువాడు పశువువలె నేమియు నెఱుంగడని యర్థము చెప్పి జీవబ్రహ్మైక్య మీవిధమున శ్రుతిచే చెప్పఁబడియుండుటంబట్టి యద్వైతము పారమార్థికమని శంకరాచార్యులవారు సిద్ధాంతము సేసినది సప్రమాణము కాదని తెలియుచున్నది. ఈశ్రుతియందును ఉపాస్తే అని ఉపపూర్వకాసధాతువుతో నుపక్రమించి, నసవేదయని విదధాతు

మునో నుపసంహారము చేయఁబడియుండుటను, జ్ఞానోపాసనలకు భేదము లేదని వారె యంగీకరించియున్న కారణమునను విదధాత్వర్థమైన జ్ఞానసామాన్యమునకు ఉపపూర్వకాసధాత్వర్థమైన జ్ఞానవిశేష మైన యుపాసనయందె తాత్పర్యము గ్రహించుట పూర్వమీమాంసాన్యాయసిద్ధమగుటచేతను, యోఽన్యాం దేవతా ముపాస్తే అను శ్రుతియందు దెలుపబడిన యభేదభావము ఉపాసనావిషయమే అని యేర్పడుచున్నది, పూర్వమీమాంస, షష్ఠాంత్యాధికరణమునందు, శ్రు॥ అగ్నీషోమీయం పశు మాలభేత॥ అనుచోట పశువును వధింపవలయునని యున్నది. ఇచట పశుపదము సామాన్యవాచకము దీ.కి, శ్రు॥ ఛాగస్య వపాయా మేదసోఽనుబ్రూహి ॥ అను శ్రుతియందు ఛాగశబ్దముచే పశువిశేష మగు మేక గ్రహింపఁబడియుండుటంబట్టి పశువిశేషమునందే తాత్పర్యము గ్రహింపవలయునని, సూ॥ ఛాగోవా మంత్రవర్ణాత్ ॥ అనుసూత్రమున నిర్ణయింపఁబడియున్నది. ఈ న్యాయమునుంబట్టి జ్ఞానసామాన్య వాచకమైన విదధాతువునకు జ్ఞానవిశేష యుపాసనయందె తాత్పర్యమని యేర్పడుచుండగా నీన్యాయమును గ్రహింపక పోగా శ్రు॥ యోఽన్యాం దేవతాముపాస్తే॥ నేను వేరు, దేవత వేరునని యెవ్వఁ డుపాసించునో అని యీ శ్రుతి అభేదభావము ఉపాసనావిషయమే యని కంఠరవముతో జెప్పుచున్నను జ్ఞానవిశేషవాచకమైన ఉపపూర్వకాసధాతువునకు జ్ఞానసామాన్యపరమగు నర్థము గ్రహించి యందుఁ జెప్పఁబడిన యభేదము పారమార్థికమని నిర్ణయించుట యెట్టులుచితమో పండితులు విమర్శింతురుగాక. ఈ మొదలగు కారణములంబట్టి వారు తత్త్వము నిర్గుణ మనియు, యద్వైతమే పారమార్థిక మనియు సిద్ధాంతము సేసినది లోకశాంత్యర్థమే యని తోఁచెడిని వారట్లు చేసినది దేనికైనను నది విమర్శించుట ప్రకృతము గాదు. శైవదీక్షా ప్రభావము నిరూపించుటె ప్రకృతము. అయినను, శైవదీక్ష బ్రహ్మవిద్యాంగమని ప్రతిష్ఠించునప్పుడు బ్రహ్మవిద్యాంగము సన్న్యాసమని

శంకరాచార్యులవారు నిర్ణయించినదానికి కారణము దెలుప నవసర మగుటం జేసి ప్రసక్తానుప్రసక్తిచే కొంత విమర్శింపవలసెను.

ఈచేసినవిమర్శముంబట్టి, వేదాంతములు ఉపాసనావిధికరము లనియు, వానియందుఁ దెలుపంబడినజ్ఞానము ఉపాసనమె యనియు, కర్మజ్ఞానసముచ్చయము శాస్త్రసమ్మతమె యనియు, దానం జేసి జ్ఞానమునందు నధికారము సన్న్యాసులకేగాక తక్కినవారికిని గలద నియు నేర్పడియెను. దీనింబట్టిపూర్వకాండమున విధింపఁబడినకర్మము నాచరింప నధికారము నొసఁగునుపనయనదీక్షవోలె బ్రహ్మకాండ మునవిధింపఁబడినయీశ్వరోపాసనయందు నధికారము నొసఁగు శైవ మహాదీక్ష గ్రహింప నావశ్యకము సర్వాశ్రమస్థులకు గలిగియె యున్నది.

శాంకరమతమునందు బ్రహ్మజ్ఞాన మనఁగా ననుభవజ్ఞానము గాని యది యీశ్వరోపాసనము గాదని యంగీకరింపఁబడియుండుటం బట్టి యీశ్వరోపాసనము విధిప్రాప్తము గామింజేసి యందు నధికా రమునొసఁగు శైవదీక్ష యావశ్యకము గాదయ్యెను.

బసవేశ్వరుని మతమునందైననో యీశ్వరోపాసనముమాత్రము పరిగ్రహింపఁబడుటంజేసి తత్సాధనమగు శైవదీక్షమాత్రమే గ్రహిం పంబడియెను, కాని, కర్మాచరణ మనావశ్యకమని యెన్నఁబడుటం జేసి తదధికారప్రదమగు నుపనయనదీక్ష విసర్జింపఁబడియె,

నీలకంఠునిమతమునందు కర్మోపాసనలు రెండును చేరి యీశ్వ రసాయుజ్యసాధనములుగా నంగీకరింపఁబడుటచే నీరెంటిని నాచరింప నధికారమునొసఁగు నుపనయనదీక్ష శైవదీక్షయను రెండుదీక్షలును పరిగ్రహింపఁబడియెను. ఇట్లు రెండుదీక్షలును నావశ్యకము లగుటం జేసి యధ్వశోధనము మొదట నుపనయనదీక్షయందు సంగ్రహరూప

మున గ్రహింపఁబడినను, జన్మసాఫల్యప్రదమగుటంజేసి ముఖ్య మగు శైవదీక్షయందు నధి తీసుగా సమగ్రముగా గ్రహింప నవసరమై యెఱుంగవలయు.

రెండింటిలో శైవదీక్ష ముఖ్య మెట్లనిన ఉపనయనదీక్ష దేవతాంతరపరిచరణరూపమైన కర్మమున నధికారము నొసఁగును. శైవ మహాదీక్షయైనచో పరమేశ్వరారాధనరూపమైన యీశ్వరోపాసన మున నధికారము నొసఁగును. దేవతాంతరపరిచరణముకన్న నీశ్వరారాధనము ముఖ్య మగుటంజేసి యీరెంటిలో శైవదీక్ష ప్రాముఖ్యము వహించెను.

మఱియు, కర్మాధికారప్రదమైనది యుపనయనదీక్షయు మోక్షాధికారప్రదమైనది శైవదీక్షయునగు. దీనను నిదియె ముఖ్యము

ఇది మోక్షసాధనమనుట యెట్లనిన, ఉపనిషత్తులయందు మోక్షసాధనమని విధింపఁబడుటనే యీదీక్ష యిట్టిదని తెలిసెడిని. ఎట్లన, శ్రు॥ వ్రత మేత త్పాశుపతం తత్సమాచరే న్ముముక్షు ర్నపునర్భవాయ అనికాలాగ్ని రుద్రమునందు గలదు. అనఁగా, ముముక్షుః మోక్షముగోరువాఁడు, నపునర్భవాయ = పునర్జన్మరాహిత్యమునకై, తత్ ప్రసిద్ధమైన, ఏతత్ = ఈపాశుపతం పాశుపతమనె, వ్రతం దీక్షను, సమాచరేత్ ఆచరింపవలయు పొందవలయు ననిభావము॥

మఱియు, బృహజ్జాబాలమునందును॥ శ్రు॥ వ్రత మేత చ్ఛాంభవం సర్వేషు వేదేషు వేదవాదిభి రుక్తం భవతి। తత్సమాచరే న్ముముక్షు ర్నపునర్భవాయ॥ అని యున్నది॥ అనగా, శాంభవం = శాంభవమను పేరుగల, ఏతత్ = ఈ, వ్రతం = దీక్ష, సర్వేషు = సమస్తమైన వేదేషు = వేదములయందును, వేదవాదిభిః = వేదవిదులచే ఉక్తం = చెప్పఁబడియెను. తత్ = దానిని, ముముక్షుః = మోక్షము

గోరువాఁడు, నపునర్భవాయ= పునర్జన్మరాహిత్యమునకై, సమాచరేత్ ఆచరింపవలయును. అనియర్థము॥

ఇట్లు శాంభవము పాశుపతము అను పేరుగల దీక్షను మోక్షకాముఁడు తిరుగ జన్మములేకుండ జేసికొనుటకై గ్రహింపవలయునని యన్ని వేదములయందును గలదనిస్పష్ట మయినది. దీనింబట్టి శైవమహాదీక్ష మోక్షసాధన మనుట విశదమేకదా?

ఈదీక్ష మోక్షసాధన మెట్లగుననిన, మోక్షమునకు నంతరంగ సాధనమైన యీశ్వరోపాసనయందు నధికారము నొసఁగునదియగుటచే నిది మోక్షసాధనమని యేర్పడుచున్నది. ఈశ్వరోపాసనమే మోక్షప్రద మనుట సర్వశ్రుతిసమ్మతము॥ ఎట్లన, శ్రు॥ ఈశం జ్ఞాత్వా అమృతా భవన్తి॥ ఈశం=పరమేశ్వరుని, జ్ఞాత్వా=ఉపాసించునెడ, అమృతాః=ముక్తినొందినవారు, భవన్తి=అగుదురు॥ వేదాన్తములలోఁ జెప్పఁబడిన జ్ఞానము ఉపాసనారూపమేగాన జ్ఞాత్వాఅనగా ఉపాసించి అని యర్థమగును. దీనింబట్టి పరమేశ్వరోపాసనమే మోక్షప్రదమని యేర్పడియెను. దీనింగాంచి మతాంతరులు, ఈశశబ్దమునకు శివుఁడేయని యర్థమా? ఈశశబ్దము కొన్నిచోట్ల నారాయణునందును బ్రయోగింపఁబడుచున్నదిగదా? దానింబట్టి, ఈశం=నారాయణుని, జ్ఞాత్వా ....సేవించునెడ ముక్తులగుదురని సాధింపఁబూనిరి. అట్టి సంశయమును దీర్పఁబూని వేరొకశ్రుతిఁ జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి॥ శివుని నుపాసించునెడ కైవల్యముక్తి నొందగలఁడు అని చెప్పెను. మొదట, ఈశశబ్దమే నారాయణ పరమని సాధింప శక్యముగాదు. ఇట్టి విపరీతార్థమును నిఘంటుకారులు సమ్మతింపరు. ఎటనైన నీశబ్దము నారాయణునందుఁ బ్రయోగింపఁబడియున్నను, నట్టియెడ రాజునుంబలె ప్రకరణానులనుబట్టి యౌగికముగా నారాయణుని దెలుపును. ఇంతియెగాని, ఈశశబ్దము యోగరూఢిచే వస్త్వంతరమును దెలుపదు. అది యిటులుండ, నీశ్రుతి

శివునిననిఁ కంఠరవముతో శివ శబ్దమును గ్రహింపఁగానె వారికి శ్రుతులయెడ నిరాశాః పితరోగతాః, అనునట్లు నైరాశ్యము కలిగెను.

అంత మఱికొంతఁ జేరి యాలోచించి శివునితో పనిలేకయ మాకు మోక్షముగలుగు నేదేనొక యుపాయము ననుగ్రహింపుమని వేదపురుషుని శరణుజొచ్చిరి. వారియెడ సుప్రసన్నుఁడై వేదపురుషుఁడు, ఇదియనఁగా నెంతపని! దీకి సులువైన యుపాయము గలదు. చెప్పెద వినుఁడు. శ్రు॥ యదా చర్మవ దాకాశం వేష్టయిష్యన్తి మానవాః। తదా శివ మవిజ్ఞాయ దుఃఖస్యాన్తో భవిష్యతి॥ మానవాః = మనుష్యులారా! మీరు, యదా= ఎప్పుడు; ఆకాశం= ఆకసమును, చర్మవత్ — తోలునువలెఁ జుట్టునట్లు, వేష్టయిష్యన్తి — చుట్టుదురో, తదా — అప్పుడు, శివం — శివుని, అవిజ్ఞాయ — సేవింపకయె, దుఃఖస్యాన్తః — దుఃఖనివృత్తి, మోక్షము భవిష్యతి — లభింపఁగలదు॥ అని చెప్పెను. ఇదివినగానె తోలునుంబలె నాకసము మడుచుట యసంభవమైనచొప్పున శివుని సేవింపకయె మోక్షము లభించుటయు నసంభవమేయని మున్నాటికి దృఢపడుటంజేసి వారిభ్రాంతి నివర్తించెను. శ్రుతిశైలి యెంతకన్న నేమని చెప్పఁగలము? శ్రుతి యెన్నిదెఱుగుల మోక్షసాధనములను చెప్పినను వానికి నన్నిటికి నపార్థములు గల్పించి తమ తమ యిచ్ఛచొప్పున మెదలువారిగతి యెట్టిదైన నగుగాక యదియిట నప్రకృతము. దీనంబట్టి శివోపాసనమే మోక్షప్రదమనుట సర్వశ్రుతి సమ్మతమని ఋజువు చేయఁబడియెను.

ఇదిగాక, శైవమహాదీక్షనియగు నంగములన్నియు మోక్షప్రదములని శ్రుతిస్మృత్యాదుల వలనఁ దెలియుచుండుటను నీదీక్ష మోక్షసాధనమని యేర్పడుచున్నది. అది యెట్లనిన,

శైవదీక్ష మోక్షమునకు ముఖ్యసాధనము.

శైవమహాదీక్ష భస్మరుద్రాక్ష శివలింగ ధారణాత్మకమై యు

న్నది. గావున, భస్మము,రుద్రాక్షము, శివలింగంబును శైవదీక్షకు సంగములు, వీనిలో నొక్కొకటియు మోక్షప్రదములగుట సర్వ శ్రుతి సమ్మతము ఎట్లన,

మొదట భస్మధారణమునగు మహిమము నాలింపుడు కాలాగ్నిరుద్రోపనిషత్తునందు॥ త్రిపుండ్రం భస్మనా కరోతి యోవిద్వాన్ బ్రహ్మచారీ గృహీ వానప్రస్థోయతిర్వా, ససమస్తపాతకోపపాతకేభ్యః పూతో భవతి। ససర్వాన్దేవాన్ధ్యాతో భవతి। ససర్వతీర్థేషు స్నాతో భవతి, ససర్వసంపత్సమృద్ధో భవతి। స సతతం రుద్రమంత్రజాపీ భవతి। సర్వభోగభుగ్దేహం త్యక్త్వా శివసాయుజ్యమవాప్నోతి।నసపునరావర్తతే నసపునరావర్తత ఇత్యాహ భగవాన్కాలాగ్నిరుద్రః॥

బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని, వానప్రస్థుడుగాని, యతీశ్వరుడుగాని యేయాశ్రమమున నున్నవాడైనను భస్మముతో త్రిపుండ్రమును ధరించెనేని అట్టివాడు సమస్తమైన పాతకములనుండియు, ఉపపాతకములవల్లనుండియు విముక్తుడగుటయెగాక, సకలదేవతలను ధ్యానముచేసిన ఫలమును, సర్వతీర్థములయందు స్నానముచేసిన ఫలంబును నొంది; సకలసంపదలతో నొప్పి, ఎల్లపుడు శ్రీరుద్రాధ్యాయమును జపముసేయుగా గల్గుఫలము గాంచి, సకల భోగములననుభవించి దేహావసానంబున శివసాయుజ్యము నొంది పునరావృత్తి నొందనేరడు. అని భగవంతుడగు కాలాగ్నిరుద్రుండు చెప్పెనని యున్నది.

బృహజ్జాబాలమను నుపనిషత్తునందును॥ తత్ర సంవర్తకారుణి శ్వేతకేతు దూర్వాస ఋభు నిదాఘ జడభరత దత్తాత్రేయ రైవతక భుసుండ ప్రభృతయో విభూతిధారణాదేవ ముక్తాః॥ సంవర్తుడు, అరుణి, శ్వేతకేతుడు, దూర్వాసుడు, ఋభుడు, నిదాఘుడు, జడభరతుడు, దత్తాత్రేయుడు, రైవతకుడు, భుసుండుడు మొద

లగు మహర్షు లందఱును విభూతిని ధరించుటవల్లనె మోక్షము నొంది రని యున్నది.

సూతసంహితయందు॥

శ్లో॥ అతోపి పాశవిచ్ఛేదలాభాయ జ్ఞానసిద్ధయే।
ఉద్ధూళనం త్రిపుండ్రంచ ముముక్షు స్సమ్యగాచరేత్॥

తా॥ మోక్షముగోరువాఁడు జ్ఞానముగలిగి బంధవిముక్తి లభించుటకై భస్మోద్ధూళనమును, భస్మత్రిపుండ్రమును ధరింపవలయునని యున్నది. వాశిష్ఠలైంగమునందు,

శ్లో॥ కిమత్ర బహునోక్తేన వర్ణ్యతేచ పునః పునః।
ముక్త్వా త్రిపుండ్రం మోక్షస్య సాధనం సహి విద్యతే॥

తా॥ అధికముగాఁ జెప్పివర్ణింపనేల? భస్మధారణము వినాగా మోక్షమునకు సాధనమైనది వేరొక్కటి లేదు. అని చెప్పఁబడి యున్నది.

దీనింబట్టి భస్మధారణము మోక్షప్రదమనుట స్పష్టము.

ఇట్లే, రుద్రాక్షధారణఫలంబును బ్రహ్మకైవర్తమునందు॥

శ్లో॥ రుద్రాక్షం వపుషా ధర స్యది మృత శ్శ్వాసోపి ముక్తోభవే చ్ఛాద న్నంత్యనను హరార్తకే శివపురం గచ్ఛే త్సనోజాయతే కింనూక్తై ర్బహుభి స్సమంత్రక మిదం స్వాంగే సదాధారక స్సంసారం నపునః ప్రయాతి మనుజో వక్ష్యేఽనవద్యే తవ॥

శరీరమునందు రుద్రాక్షమును ధరించి యొక్కమారు శ్వాసము విడిచి మృతినొందినను, అట్టివాఁడు శివలోకముననే వసించునుగాని తిరిగి జన్మింపనేరడు. ఇట్లుండ రుద్రాక్షములను సమంత్రకముగా తనశరీరమున నెల్లపుడును ధరించుమనుజుడు మోక్షమునొందునని చెప్పవలయునె?

శ్లో॥ రుద్రాక్షద్రుమ పుష్పపల్లవపుట స్పృష్టానిలస్పర్శనా
ద్దూరస్థా స్తరవ స్తృణాన్యపి లతా యాం త్యక్షయం తత్ఫలం
తత్పుణ్యద్రుమ జాతలక్షణమణిం బిభ్రత్వజస్రం నరో
ముచ్యే త్సంసృతిబంధనాదితి పునశ్చిత్రం నకిం ది ప్రియే॥

తా॥ రుద్రాక్షవృక్షము వగుపుష్పపల్లవములను సోకి వాని మీాదినుండి వచ్చిన గాలి సోకినకారణమున దూరముననున్న చెట్లు తీవలు మొదలైనవియు నక్షయఫలము నొందుచున్నవి. అట్లుండ, ఆపుణ్యవృక్షముల నుండు బుట్టిన సలక్షణమగు రుద్రాక్షమును విడువక ధరించుమనుజుడు సంసారబంధమునుండి విముక్తినొందుననుట యేమిచిత్రమని పార్వతీదేవికి పరమేశ్వరుఁ డానతిచ్చినట్లు కలదు.

మఱియు, ఆగ్రంథమునందే.

శ్లో॥ గోమేధం నరమేధకం హయమఖం ప్రస్థానయాత్రాం పరాం
వానప్రస్థక నైష్ఠికత్వ మఖిలం వర్జ్యం కలౌ వైదికైః।
యోగస్థా విజితేంద్రియాః శ్రుతిశిరస్సంఘోక్తమర్థం పరం
భక్త్యారాధ్య శివం వ్రజే న్నిజతనౌ రుద్రాక్షభస్మావహాః॥

తా॥ గోమేధము, నరమేధము, అశ్వమేధము, మహాప్రస్థానము, వానప్రస్థాశ్రమము, నైష్ఠికబ్రహ్మచర్యము, మొదలగు వానిని కలియుగమునందు వైదికులగువార లాచరింపఁగూడదు. యోగాభ్యాసపరులును, ఇంద్రియనిగ్రహముగలవారును, నిగమాంతముల

యందుఁ జెప్పిన విధమున శరీరమునందు భస్మరుద్రాక్షశివలింగము లను ధరించి భక్తిచే శివునారాధించి ముక్తి నొందుదురు.

శ్లో॥ శ్రౌతం భస్మ ధృతం లలాటఫలకే ధృష్టిం సముత్పాదయే
న్మూర్ధ్న్యేత ద్వితనోతి చంద్రశకలం కంఠేఽసితం లాంఛనం।
పార్శ్వే యోషిత మాతనోతి భుజయో రేణం త్రిశూలంతసా
వ్యాఘ్రేభాజన రాజితాద్రివృషభా నంతే నవధ్యర్పయేత్॥

ముఖమునందు ధరింపఁబడిన భస్మత్రిపుండ్రము తనను ధరించినవానికి నవసానకాలమున, ముఖమునందు నేత్రమును, శిరమునందు చంద్రలేఖను, మెడయందు నలుపును, ఎడమప్రక్కన కాంతను, చేతులయందు త్రిశూలమును, లేడిని, బుజమున వ్యాఘ్రచర్మోత్తరీయమును కటియందు గజాజినమను కట్టువస్త్రమును, వసించుటకు వెండికొండను, ఎక్కుటకు నందిని నొసంగును. భస్మమును ధరించినవానికి శివసారూప్య ముక్తి లభించునని భావము.

శ్లో॥ లింగం దివ్యమణి స్సితంచ భసితం సిద్ధౌషధం వైదికం.
పంచార్ణః ప్రణవేన సాధ్యఫలదో మంత్రోమనూనాంవరః
ముక్తిస్త్రీముఖవశ్య కర్మణి పటు స్తస్యాంతు సక్తస్స్వయం
జహ్యా న్నైవకదాపి యావదవశా త్సంపత్స్యతే శాశ్వతం ॥

తా॥ శివలింగము దివ్యమగు చింతామణి, భసితమన్నో సిద్ధౌషధము. మంత్రరాజమగు శ్రీపంచాక్షర మహామంత్రమన్నో ముక్తికాంతను వశపరుచు వశ్యమంత్రము. కావున తనకు దేహావ

సానకాలమున శాశ్వతముక్తిపదము లభించువరకు నీమూటని విడువఁ గూడదు.

శ్లో॥ భస్మశ్రౌత మహోదయం నరవరో ధత్తేఽస్తి తత్రేశ్వరో
గౌర్యా యస్తు సమర్పయ త్యనుదినం తేనార్చిత శ్శంకరః
తస్మై దత్త మథాక్షయం సహినరో ముక్తో నవద్యః పరో
ముక్తిం నైవలభే త్సహస్రజననం జాతో ప్యభస్మాక్షభాక్॥

తా॥ శ్రుతిసిద్ధ మగు భస్మమునందు గౌరీదేవితోఁగూడ బరమేశ్వరుఁడు వసించుచుండును. గావున భస్మమును ధరించువాఁడు పరమేశ్వరు నర్చించుచున్న వాఁడగును. భస్మధారణము సేయువానికి నిచ్చినది యక్షయపుణ్యఫలద మగును. భస్మధారియే ముక్తుఁడగును. భస్మరుద్రాక్షములను ధరింపనివాఁడు వేయిజన్మములకైనను ముక్తి నొందనేరఁడు. అని యున్నది.

ఈవ్యాసమునందు మొదటనుండి నిరూపించినవిధమున శైవ మహాదీక్ష కేవలము మోక్షప్రద మనుటయు, శైవదీక్షాంగము లగు భస్మరుద్రాక్షాదులును మోక్షసాధనము లనుటయు సర్వశ్రుతి సమ్మతమని యేర్పడియెను.

దాననే కర్మము మోక్షమునకు గాకపోగా మోక్షసాధనమైన జ్ఞానమునకేని సాధనముగాదు, ఇఁకనిది మోక్షేచ్ఛకే సాధనమగును. జ్ఞానమునకైననో శమదమాదులే యంతరంగసాధనము లని నిర్ణయించి కర్మమార్గమును లఘూకరించి శిఖాయజ్ఞోపవీతము

లతో గాయత్రినిగూడ బరిత్యజించి, శుద్ధాద్వైతము నేసిద్ధాంతీకరించిన శ్రీశంకరాచార్యస్వాములవారును భస్మ రుద్రాక్ష చంద్రమౌళీశ్వర లింగారాధన శ్రీ శైవపంచాక్షరీమంత్రజపాదికమును విడువ నోపరైరి ఇట్టి ప్రాచీనశిష్టజనానుష్ఠానమును బట్టియు భస్మరుద్రాక్షాది శైవ దీక్షాంగములు ముక్తిసాధనము లనుటయు, సర్వాంగసహితమగు శైవమహాదీక్ష మోక్షప్రాప్తికి నంతరంగసాధన మనుటయు సిద్ధవాద మని యేర్పడుచున్నది.

ఇట్లు మోక్షైకసాధనమగు శైవమహాదీక్షను పరిగ్రహించుటచే నే యారాధ్యమహాజనులు లోకాచార్యత్వమునకు పాత్రులైరి, ఏలన, శాంకరమతమునందు మోక్షాధికారము, సన్యాసులకేగాని గృహస్థ లకు లేదు. సన్యస్య శ్రవణం కుర్యాత్ అనిచెప్పి జనుఁడు సన్న్యా సము పరిగ్రహించినచే గాని వేదాన్త శ్రవణమునకే యర్హుడు గాడ నుటచే గృహస్థుడు మొదలగువారికి మోక్షమునెడ నధికారము లేదని దృఢపడియెను.

సన్యాసులకు మోక్షమున నధికారమున్నను నట్టివారు సన్న్యా సులకేగాని గృహస్థాదులకు నుపదేశము సేయ నర్హులుగామింజేసి గృహస్థాదులయెడ గురుత్వమువహింపఁ జాలరైరి, గృహస్థులైననో తమకే మోక్షమునెడ నధికారము లేనప్పుడు కడమవారికి మోక్షమా ర్గము నుపదేశింప నర్హు లెట్లు లగుదురు? ఈకారణమున నామతము నందు గృహస్థాదులకును, యతులకును లోకాచార్యతకు దగుమో

గ్యత లేమిం జేసి వారలకు గురుత్వాధికారము మృగ్య మయ్యెను.

రామానుజీయులకు స్వమతరీతినిబట్టి గృహస్థాదులకును మోక్షాధికారము గలిగియున్నను వారు గ్రహించుపాంచరాత్రదీక్ష శ్రుతిప్రసిద్ధముగామిచే నయ్యది శ్రుతిసమ్మత మగుమోక్షమునకు సాధనము గామిం జేసి యామతస్థులు స్వమతములోని వారియెడ మాత్రమే గురుత్వాధికారము గలిగియుండిరి.

ఆరాధ్యులైననో శ్రుతిసమ్మతమగు శైవమహాదీక్షను పరిగ్రహించియున్న కారణమున శ్రుతిసమ్మతమగు మోక్షప్రాప్తికి భాజనులగుటయెగాక చాతుర్వర్ణ్యగురుత్వమునకును నర్హులైరి.

శైవులు పరిగ్రహించుశైవమహాదీక్ష మోక్షసాధనమని శ్రుతులచే వక్కాణింపఁబడియెగాన నీయర్థమునెడ శ్రుతివిశ్వాసము గలవార లెంతమాత్రము సంశయింపరు. అయినను కొంద ఱజ్ఞాను లీయర్థము నంగీకరింపకున్నను నాస్తికు లంగీకరింపనిమాత్రన శ్రుతిధర్మపరులగు శైవులకు, గొంచెమేని లోప ముండదు,

ఇయ్యెడ శ్రుతులయందు శాంభవము, పాశుపతము, మొదలగు పదములతో మోక్షసాధనముగాఁ జెప్పఁబడు దీక్ష భస్మధారణ రూపమైనదేగాని లింగధారణాత్మకమైనదిగాదని కొందఱు మతాంతరు లభిప్రాయపడుచున్నారు. గాని యది నిజము గాదు.

పురాణములయందును, నాగమములయందును, శాంభవదీక్ష యొక్కయెడ భస్మధారణ రూపమైనదనియు, ఇంకొక్కయెడ భస్మ రుద్రాక్షధారణ రూపమైనదనియు, వేరొక్కయెడ భస్మరుద్రాక్ష శివమంత్ర గ్రహణాత్మకమైనదనియు నధికారిభేదమునుబట్టి నానావిధ ములఁ జెప్పఁబడియున్న మాట నిజమేగాని యంతమాత్రమున లింగధా రణాత్మకమైనది శ్రుతి సిద్ధ శాంభవదీక్ష గాదని చెప్పఁగూడదు. శివాగమముల యుత్తరభాగములయందును లింగపురాణాదుల యం దును, నుత్తమాధికారికమగు శాంభవదీక్ష భస్మరుద్రాక్షశివమంత్ర లింగధారణాత్మకమైనదే యని నిర్ణయింపఁబడియుండుటంబట్టి ప్రధాన మైన దీక్ష శివలింగధారణాత్మకమైనదే యని గ్రహింపక తక్కదు. ఆయర్థము శైవదీక్షాస్వరూపమను నింకొక వ్యాసమున సవిస్తరముగా నిరూపింపఁబడగలదు.

పరుల యభిప్రాయమునుబట్టి భస్మధారణ రూపమైనదే శాం భవదీక్షయని గ్రహించినను భస్మధారణాత్మకమైన దీక్షకే మోక్ష కారణత్వము నంగీకరింపక తక్కదుగదా? ఇట్లుండ భస్మ రుద్రాక్ష శివమంత్ర శివలింగధారణాత్మక మైనశాంభవదీక్ష మోక్షప్రదమను నెడ సంశయ మెట్లుండును? కావున, భస్మరుద్రాక్ష శివలింగధారణా త్మకమైన పాశుపతదీక్ష మోక్షైకసాధనమనుట నిర్వివాదము.

ఇట్లు మోక్షైకసాధనమగు శాంభవదీక్ష పరిగ్రహించిన ముముక్షువులకు ప్రాకృతజనసాధారణమైన పిశాచత్వాదినివర్తకమగు ప్రేతకర్మము లేకుంట లోపమని వచింప శాస్త్రవిశ్వాసముగలవాఁ

డెట్లుసాహసించుచున్నారు? అయినను, ఎవ్వండేని ముసలాగ్రబుద్ధి యట్లు వచింపఁబూనినను,

శ్లో॥ దండగ్రహణమాత్రేణ ప్రేతత్వం నహివిద్యతే॥

దండమును గ్రహించినమాత్రన యతికి ప్రేతత్వము లేదని యన్యమతములవారు తృప్తినొందుచుండగా భస్మరుద్రాక్షాదమోక్ష లాంఛనముల దాల్చినవానికి ప్రేతత్వ మెట్లు సంప్రాప్తమగునని సమాధాన పరచవలయు.

మఱియు నెవ్వండేని దండముతో దుల్యమగుసామర్థ్యము భస్మరుద్రాక్షశివలింగములకు లేవని ప్రతిఘటించుచునెడ వానినుద్దేశించి నీవు శైవలాంఛనములయందు విశ్వాసము లేనివాఁడవగుటం జేసి 'యాదృశీ భావనాయత్ర" అనున్యాయముచుబట్టి యయ్యవి నీకు ప్రేతత్వమును దొలఁగింపఁజాలవుగావున నీవు ప్రేతకర్మమునకు యర్హుండవని వచించునది.

శైవమహాదీక్షాంగములగు భస్మరుద్రాక్షాది లాంఛనములలో నొకటొకటియు మోక్షసాధనములనుటయు, సర్వాంగకలితమగు శైవదీక్ష మోక్షప్రదమనుటయు సర్వవేద సమ్మతముగాన శైవమహాదీక్ష మోక్షకాములకు నాశ్రయణీయమని గ్రహింతురుగాక.

ఇట్లు

వ॥ సం॥

వప్పుకొనలేరు. విష్ణుని పూజింపుమనిన కడమవార లంగీకరింప
రైరి. ఈతగవును పరిష్కరింపనె అన్ని మతములవారు పూజిం
చు దేవతలను పంచాయతీగాఁ జేర్చి పరిష్కరించిరి.

ప్రతి—అట్లైని, ఆర్వురు దేవతలను జేర్చి షడాయతీగదా చేయవలసి
యుండెను.

పండి—నిజమే, అయినను, షడాయతీ, వ్యవహారనిర్ణాయకముగా
ధర్మశాస్త్రసంకేతితము గానందునను, ఆఱవవారైన కౌమార
మతస్థులకు ప్రాబల్యము కొరవపడియున్నందునను నాఱ
వదియగు స్కందవిగ్రహము పరిగ్రహింపఁబడదయ్యెను

అన్నం—పంచాయతనమునకును, పంచాయతీకి నేమిసంబంధము?

పండి—పంచాయతన మను సంస్కృతపదమే తెలుంగున పంచాయ
తీపద మయ్యెనుగాన రెండు నొక్కటియే.

అన్నం—మాయాచార్యులవారు పంచాయతనము నేర్పరిచినది పంచా
యతీకొఱకే యగునా?

పండి—సందేహ మేమి?

అన్నం—దేనినిబట్టి మీరిట్లు నిర్ణయింపగలరు?

పండి—ఏకమే వాద్వితీయం బ్రహ్మ అనుశ్రుతినే ప్రధానముగా
గ్రహించి బ్రహ్మతత్త్వ మొక్కటియే యని సిద్ధాంతము సేయు
చున్నమీరు ఇందఱ దేవతలను పూజయందుఁ బరిగ్రహించు
టంబట్టియే యట్లు నిర్ణయింపఁబడుచున్నది.

అన్నం—ఈపంచాయతీ శైవవైష్ణవాదిమతములలోనుండి వచ్చికలిసిన
వారి వ్యవహారపరిష్కారముననకే గావింపఁబడియెనని యెట్లు
తెలియును.

పండి—మీమతమునకు పూజనీయ మగుదేవత శైవవైష్ణవాదులు పరిగ్రహించినదానికన్న వేరొక్కటిలేక హరివారిదేవతలనే గ్రహించి యొక్కచో ! చేర్చుటంజేసి శైవవైష్ణవాదిమతముల నుండి పరిచ్యుతులైనవారిసంఘమే స్మార్తసంఘ మనియు, ఆసంఘమునకు పూజనీయమైనదేవతయెడ వివాద మేర్పడినం దున నద్దానింబరిష్కరింపనే యీపంచాయతీ యేర్పడియె ననియు స్పష్ట మగుచున్నది.

అన్నం—పూర్వము స్మార్తమతమునుండి తొలఁగినవారె శైవవైష్ణ వాదులై రనియేల యంగీకరింపరాదు?

పండి—శైవవైష్ణవాదులయొక్క దేవతలను భస్మరుద్రాక్షాదిలాంఛ నములనుగూడ స్మార్తులు గ్రహించియున్నకారణమునను, శంకరాచార్యులవారు మతప్రచారము చేయునాటికి శైవవైష్ణ వాదిమతములు ప్రబలముగా నున్నట్లును, వానిని జయించి యాచార్యులవారు శిష్యులనుగా జేసికొనినట్లును ఆనందగిరి కృతశంకరవిజయమున నుండుటంబట్టియు శైవవైష్ణవాదిమత ములే ప్రాచీనములని యంగీకరింపక తీరదు.

అన్నం—స్మార్తమతమువారి దేవతలలో నొక్కొకరిని మాత్రము గ్రహించి కొందఱుకొందఱు శైవాదిమతస్థులుగా మారిరని యేల యంగీకరింపరాదు?

పండి—తగినకారణ మున్నచో నట్లుబాగుగనె గ్రహింపనగును.

అన్నం—దీని కేల కారణము లేదు,

పండి—శైవులకు శివుఁడు దేవతయనియు, వైష్ణవులకు విష్ణువు దేవత యనియు ప్రసిద్ధమైనట్లు స్మార్తమతమునకు ఇది దేవతయని

ప్రసిద్ధి లేదు, అట్లుండగా, స్మార్తుల దేవతలనె శైవవైష్ణవాదులు గ్రహించిరనుట యుక్త మెట్లగును?

అన్నం—స్మార్తులదేవత యేల ప్రసిద్ధముగాదు?

పండి—అట్లు ప్రసిద్ధముగా నున్నచో నాదేవతయేదో చెప్పుడు.

అన్నం—ఈయైదుగురును మా దేవత లనుట ప్రసిద్ధముగాదా?

పండి—అట్లేని, మీయాచార్యులవారు హరిహరరూపుడు దేవుఁడని యేల చెప్పెను?

అన్నం—హరిహరులు నీయైదుగురిలోనివారేకదా?

పండి—మీమతమునకు నైదుగురును దేవతలైనచో నైదుగురని యేల చెప్పలేదు?

ప్రతి—అద్వైతము సిద్ధాంతమనుచు మాకు దేవతలైదుగురనిన చో వినినవారు నవ్వుదురని చెప్పలేదు.

పండి—ఎట్లైననేమి? భట్టాచార్యులవారూ, మీమతము శైవవైష్ణవాదులకన్న వేరైనచో మీమతమునకు దేవుఁడెవఁడైనది తేలియుండవలయును, అది స్పష్టముగా లేనందునను శైవవైష్ణవాదిమతములవారిదేవతలనే పంచాయతీగా గ్రహించిరని యేర్పడుచున్నది.

ప్రతి—ఈపంచాయతీవలన తగవు పరిష్కారమైనదా?

పండి—ఇంతమాత్రమునతగవు పరిష్కారమైనచో నీయైదుగురిలో నెవరి యిష్టమువచ్చినవారిని వారువారు మధ్యభాగమున నుంచవచ్చునని యేల యంగీకరింపవలయును?

అన్నం—ఇట్లేల యంగీకరింపవలసివచ్చెనని మీయూహ?

వండి—ఇట్లు లంగీకరింప నేమికారణమో మొదట మీయుద్దేశము దెలుపుడు.

అన్నం—మనసు కుదరమి నే

వండి—మనసు కుదరపోవుటకు గారణమేమి?

అన్నం—లోకోభిన్నరుచిః అనుసామెత గలదుగదా?

వండి—మీమతము లోకచిత్తానుసారముగా గల్పింపఁబడినదే యగునా?

అన్నం—ప్రమాణమునుబట్టియే.

వండి—మొదట పంచాయతనమునకే ప్రమాణము లేనప్పుడు, తమ యిష్టమువచ్చినవారిని నడుమనునిచి కడమవారిని చుట్టు నును చుట యెట్లుప్రమాణసిద్ధ మగును?

అన్నం—తమయిష్టమువచ్చినవారిని నడుమ నునుపవలయుననుటకు మీరేమి కారణము చెప్పెదరు?

వండి—అవధానముతో వినుడు.

శైవవైష్ణవాదిమతములనుండి తొలఁగి కొందఱొకసంఘముగా జేరినను వారివారికి కొంతకొంతపూర్వాభిమానము విడువ నందున నీయైదుగురను దేవతలను సమానముగా భావించి పూజింప మనసు కుదుర దయ్యెను. దానంజేసి మీకుమీకు నిష్టమైనదేవతను నడుమ నునిచికొని కడమవారిని పరివార ములోఁజేర్చి పూజింపుడని యాచార్యులవారు బోధింపవలసి వచ్చెను. దానింబట్టి యెవరియిష్టమువచ్చినవారిని మధ్య నునిచి కడమవారిని పరివారములోఁజేర్చుట యవసరమయ్యెనని

తెలియుచున్నది. లేనిచో నీకల్పనము నిష్ప్రయోజన మగును. ఇట్లు, శైవవైష్ణవాదిమతదేవతలనే పరిగ్రహించి యందుచేరిన వారి చిత్తసమాధానమునకై యీసామరస్యము కల్పింపంబడుటంజేసి శైవవైష్ణవాది ప్రాచీనమతసంఘములనుండి తొలఁగిన పెద్దసంఘమే స్మార్తమత మనుపేరు గాంచెనని స్పష్ట మగుచున్నది.

పతి—ఈయుపాయము మాసంఘములోనను లోకవ్యవహారములకుఁ గూడ నుపయోగింపఁబడుచున్నది.

ప్రశ్నం—ఎట్లు?

పతి—మాలోఁ గొందఱు తమశిష్యసంచారమునకై పోవునప్పుడు వేరొక్కని దనకుఁ బరిచారకునిగాఁ జేసికొనుటయు, ఇతరుఁడు శిష్యులయొద్దకు నేగునప్పుడు వానికి దాము పరిచారకులుగా నుండుటయు గలదు. అట్లే వీరిపంచాయతనమునందును ఒకప్పుడు నడుమనుండి కడమ నల్వురదేవతలచే నూడిగముసేయించుకొనిన ప్రతిదేవతయు నింకొకయదనున నితరదేవతలకు నూడిగము సేయుచుండుట విహిత మయ్యెను, ఇదిచూడగా వీరు దేవతలకు లోఁబడినవారుగాఁ దోచుట లేదు. దేవతలె వీరి సెలవుచొప్పున మెదలవలసినవారుగా దోచెడిని, కాన వీరిగౌరవము ప్రశంసనీయము,

ప్రశ్నం—ఇందు రహస్య మొక్కటి గలదు. అది దెలియమిచే మీరిట్లు పలుకుచున్నారు.

పండి—దానిం గొంచెము సెలవిండు,

అన్నం—మాకు నందఱు దేవతలు సమానమైనను వ్యవహారమునకై వారిలో నొక్కొకరిని నధ్యక్షునిగా భావించుట యుచితము గాన నిష్టమువచ్చినదేవతను నడుమనుంచినం దప్పేమి?

పండి—ఇది తప్పని యెవ్వరనిరి? ఒప్పే యగును. లోకమున నాయా సమయములందు నధ్యక్షుని నెన్నుకొనుచుండుట ప్రసిద్ధమే. ప్రజాప్రభుత్వములయందు నిది ముఖ్యావశ్యకము నగును. కాని, ఈప్రజాప్రభుత్వ మిదివరకే దేవతలయందు గలదా? లేక, శంకరాచార్యులవారవతరించినతరువాత వారిచే దేవతల కిట్టిప్రభుత్వము వ్యవస్థాపింపబడియెనా? యని సంశయము బాధించుచున్నది.

ప్రతి—భట్టాచార్యులవారూ! మీకు దేవతలుమాత్రమే యందఱు సమానమా, మనుష్యులు మొదలగు జీవరాసులు సమానము కావా?

అన్నం—జ్ఞానముయొక్క సంప్రదాయము మీలోనెక్కడ శ్లో॥ శుని చైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః, అని గీతాచార్యుల వారు చెప్పియుండిరిగాదా?

ప్రతి—మీకు నందఱు సమానమేయైనచో వైదిక ః యోగి సమాన మని యొప్పుకొనిదురా?

అన్నం—భావమునందు నందఱుసమానమని తప్పకయంగీకరింతుము.

ప్రతి—శునిచైవ శ్వపాకేచ అను శ్లోకమునకు సమదృష్టిని భావము నందె యుంచికొని క్రియయందు బక్షపాతము వహింపవల యునని యాశయమా ?

పండి—అనవసర ప్రసంగములతోఁ బనిలేదు. పంచాయతనము నీవిధమున వ్యవస్థాపించినది పూర్వశైవ పూర్వవైష్ణవాదుల సామరస్యమునకే గానిచో నింక దేనికని మాయభిప్రాయము.

అన్నం—పూర్వశైవులు, పూర్వవైష్ణవులు ననగా నెవరు?

పండి—పూర్వము శైవులుగాను, వైష్ణవులుగానునుండి యాయామతములను వదలిపెట్టి యన్యమతము నవలంబించినవారు.

అన్నం—ఈవ్యవస్థ వారినిమిత్తమైనది కానేరదు.

పండి—ఇం కెవరినిమిత్తము?

అన్నం—ధర్మశాస్త్రములయందు సాలగ్రామముతోఁగూడిన శివలింగతీర్థము నెగాక, కేవలలింగతీర్థమును గ్రహింపగూడదని యున్న కారణమున సాలగ్రామాదులును జేర్పఁబడియెను.

పండి—ఇట్లనియెం దున్నది?

అన్నం—స్మృతులయందున్నది.

పండి—ఈయర్థమును జెప్పిన స్మృతులు వేదసమ్మతములేయగునా?

అన్నం—సంశయ మేమి?

పండి—అట్లైన, శివలింగ ప్రశంసను వేదములయందుఁ గనఁబరుతును మీసాలగ్రామముయొక్క పేరుగాని ప్రస్తావముగాని వేదమునం దెటనైన గనఁబరుపఁగలరా?

ప్రతి—సాలగ్రామము ప్రస్తావము వేదమున లేనేలేదా ?

పండి—ఉన్నచో నెవరైననేమి కనఁబరుచుడు. ఆలస్యము దేనికి ?

ప్రతి—భట్టాచార్యులవారూ! సెలవిండు

అన్నం—సాలగ్రామము మీకును పూజనీయమేగదా ? మీరేల వేదమునఁ గనఁబడకుండును గూడదు?

ప్రతి—ఈవాదమును నిలుపుకొనవలసిన భారము మీది.

అన్నం—మీకు సాలగ్రామముతోఁ బని లేదా?

పండి—వేదమునఁ నామమాత్రంబును లేని సాలగ్రామముతో జేర్చినంగాని సర్వవేదసిద్ధ శివలింగతీర్థము గ్రాహ్యము గానేరదని చెప్పుస్మృతి యెట్లు వేదసమ్మతమగునో దాని నవలంబించిన మీవైదికత్వ మెట్టు లన్వర్థకమగునో నిరూపించుకొను భారము మీయది.

ప్రతి—ఆరాధ్యులవారూ, ఇప్పుడు మట్టమధ్యాహ్న మయ్యెను. కావున నేటి కీవాదము నుపసంహరింతము.

అని యందఱు నిష్క్రమించిరి.

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ కొమరవెల్లి కాళయ్యగారు వరంగల్ | 12-0-0 |
| ,, రామిని మల్లయ్య గారు ... | 12-0-0 |
| ,, తుగ్గపాటి వెంకటేశ్వరరావుగారు, బారిష్టరు, బెజవాడ | 10-0-0 |
| ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్నగార్లు, సికింద్రాబాదు | 10-0-0 |
| ,, కైలాస శరభయ్యగారు, ... | 10-0-0 |
| ,, బెల్దె రామన్న కుమారుడు, జగదీశ్వరయ్య ... | 10-0-0 |

## —♦ పో ష కు లు ♦—

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యవార్లంగారు, ఈమని | 5-0-0 |
| ,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని | 5-0-0 |
| ,, కామర్సు రాజశేఖరరావుగారు, కరణం, నవాబుపాలెం | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిలుగారు, తొండపి | 5-0-0 |
| ,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల | 5-0-0 |
| ,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చపేట | 5-0-0 |
| ,, భూపతి రత్నంగారు, వరంగల్ | 5-0-0 |
| ,, మల్లంపల్లి మల్లికార్జునుడుగారు, అయితంపూడిఅగ్రహారం | 5-0-0 |
| ,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ | 5-0-0 |
| ,, శ్రీపతిపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని | 5-0-0 |
| ,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు | 5-0-0 |
| ,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు | 5-0-0 |
| ,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్దిపేట | 5-0-0 |
| ,, ముత్యంపేట మల్లయ్యగారు ,, | 5-0-0 |
| ,, కాళేశ్వరం నాగభూషణంగారు ,, | 5-0-0 |
| ,, కొమరవెల్లి బాలరాజుగారు, వరంగల్ | 5-0-0 |
| ,, గర్రెపల్లి రామన్నగారు. బిడిదొడ్డి | 5-0-0 |

# ప్రకటనము.

ఆర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:- ఈ గ్రంథమునందు బ్రాహ్మణులు మొదలగువారు వేకువజామున నిద్రలేచినది మొదలుకొని రాత్రి పండుకొనునందాక చేయనగు స్నానసంధ్యాది సకలధర్మములకును వైద్యశాస్త్ర ప్రామాణ్యమును బట్టి ఆరోగ్యరూపమగు ప్రత్యక్షఫలము కలదని ఋజువుచేయఁబడియున్నది. వెల రు ౧-౦-౦

కారణోత్తరమను దివ్యాగమము:-ఇయ్యది శైవుల లింగధారణము మొదలగువానియెడలగల సకలసంశయముల వారించు నెడ నిరుపమానమైనది. వెల రు ౧-౦-౦

ఆహ్నికవిధి:-ఇందు స్నానము సంధ్య మొదలుకొని వైశ్వదేవమువరకుగల సకల నిత్యకర్మములు సస్వరాంధ్ర ప్రయోగముతో గలవు. వెల రు -౮-౦.

మకుటోత్తరము అను దివ్యాగమము:- ఇందు శివపూజా విశేషములు, శైవాంత్యేష్టి విధానము మొదలగు ననేక విశేషములు గలవు. వెల రు ౧-౮-౦.

బ్రహ్మతర్క స్తవము:- శ్రీమదప్పయ దీక్షిత విరచితము. ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, స్మశానవాసిత్వము, బాణాసురయుద్ధమున నోడిపోయెనన్న దానికి సమాధానము మొదలగు ననేక విషయములు గలవు. వెల రు ౧-౦-౦

మహాశివపూజా విధి:- ఇయ్యది లింగనిరీక్షణమున వినియోగించు దశావధాన విధానముతోను, సస్వరాంధ్రప్రయోగముతోను శాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦-౮-౦

ధర్మసంగ్రహము అంత్యేష్టికాండము:- ఇందు శైవులాచరించు సమాధ్యారాధనవిధులు శాస్త్రసిద్ధములని పలువిధముల నిరూపింపఁబడియుండుటెగాక, అపరకాండ సందర్భమునగల సర్వవిధకృత్యములకుఁదగు ప్రమాణముల గనబరిచి సకల సంశయములు వారింపఁబడియెను. ఆంధ్ర తాత్పర్యసహితము. వెల రు ౨-౦-౦,

వలయువారు:— ముదిగొండ నాగలింగశాస్త్రి.

రామలింగేశ్వర పేట, తెనాలి. అని వ్రాయవలెను.

Reg. No. M- 2284.



శ్రీ
శివాయ గురవేనమః

# శైవరహస్యబోధిని.

ఇది
శ్రీ చేబ్రోలు సంస్థానాధిపతులగు ఇజ్జితాసార్
శ్రీ కంనుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని
సాహాయ్యమున వెలువడుచు
శైవధర్మములను, వాని ప్రామాణ్యమును దెలుపు
మాసపత్రిక.

| సంపుటము 5. | విభవనామ సంవత్సర ఫాల్గునమాసము. | సంచిక 12. |
|---|---|---|

సంపాదకుడు:- ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।
విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ।
అశేషశం కానుయపంకశోధినీ।
జయత్వియం శైవరహస్యబోధినీ।



తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

చందా సం॥ రు 2-0-0.

1929.

## శాశ్వత ప్రధాన పోషకులు.

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగ మయ్యావార్లగారి కుమారుడు
నాగమల్లయ్య అయ్యావార్లగారు. సిద్ది పేట
కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, రామన్నవగైరా సిద్దిపేట

## —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారీకులు

1 భండారు మల్లిఖార్జునరావుగారు
2 భండారు వీరభద్రరావుగారు
3 భండారు వీరరాజుగారు
4 భండారు వీరబసవరాజుగారు
5 భండారు చెన్నబసవయ్యాగారు
6 భండారు చిన మల్లిఖార్జునుడుగారు

60—0—0

## —: ప్రధానపోషకులు :—

| | |
|---|---|
| మరా॥శ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రిలుగారు సికింద్రాబాదు | 12-0-0 |
| ,, శివలంక తాయన్నగారు, పోణంగి | 10-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రయ్య అయ్యవారుగారు, ఈమని | 10-0-0 |
| ,, శివపురపు రాజయ్యగారు, శికింద్రాబాదు | 10-0-0 |
| ,, కోడిమేల భోగసోమలింగారాధ్యులుగారు, శ్రీగురుత్వ సంస్థానం వరంగల్ | 10-0-0 |
| ,, శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు నిర్మల | 10-0-0 |
| ,, కాశీనాధుని అల్లమయ్య అయ్యవారుగారు యలక్కుర్రు అగ్రహారం | 10-0-0 |
| ,, శివలెంక శంభులింగం అయ్యవారుగారు బెజవాడ | 10-0-0 |
| ,, ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్ | 12-0-0 |

## శైవమహాదీక్షాస్వరూపము,

శైవమహాజనులారా!

శాంభవము, పాశుపతము ఈ మొదలగు నామములతో నుపని షత్తులయందుఁ జెప్పఁబడినదీక్ష లింగధారణాత్మకమైనది యని ప్రాచీనులు నిర్ణయించియుండిరి. అయినను ఇది భస్మధారణరూపమైనదే యని కొంద అభిప్రాయపడుచున్నారు. దానికి వారు కారణము నేమి చెప్పుచున్నారనిన,

కాలాగ్నిరుద్రోపనిషత్తునందు శ్రు॥ అగ్నిరిత్యాదినా భస్మగృహీత్వా విమృజ్యాంగాని సంస్పృశేత్ ॥ వ్రత మేత త్పాశుపతం॥ అనుటచే పాశుపతవ్రతము భస్మధారణరూపమైనదే యగును. కావుననే వాయు సంహిత మొదలగువానియందును, భస్మధారణరూపమైనదే పాశుపత దీక్షయని విధింపఁబడియున్నది. ఈకారణములచే పాశుపతదీక్ష భస్మ ధారణరూపమైనదేగాని లింగధారణరూప మైనదిగాదని వారి యభిప్రాయము.

ఇందు యోజింపఁగా అథర్వశిరమునందు భస్మధారణము నిరూపించి, శ్రు॥ ఇష్ మూర్ధ్నం తపసా నియచ్ఛత, వ్రతమేత త్పాశుపతం॥ అని యున్నది. ఇషమూర్ధ్నం అను వాక్యము ఇష్టలింగధారణమును విధించుచున్నది. కావున పాశుపతదీక్షకు లింగధారణంబును నంగమే యని తెలిసెడిని.

కొన్నిచోట్ల పురాణములయందు శైవదీక్ష భస్మధారణరూపమనియు, భస్మరుద్రాక్షధారణరూపమనియుఁ జెప్పఁబడియున్నను, శతే పంచాశతీన్యాయమునుబట్టి, భస్మరుద్రాక్షములును శైవదీక్షాంగములె గాన కొంద అధికారులనుద్దేశించి, వానిని మాత్రము ధరించుటయు శైవదీక్షయెయని విధించినట్లు గ్రహింపవలయు. ఇట్టు లంగీకరింపనిచో

ఇషమూర్జం అనునిష్టలింగధారణవిధాయక మగు శ్రుతివాక్యము వ్యర్థమగును.

అదిగాక, నమోబ్రహ్మణే ధారణంమే అస్తు, అమృతస్య దేవ ధారణో భూయాసం॥ మొదలుగా నుపనిషత్తులలోని లింగధారణప్రతిపాదకములైన యనేకమంత్రములకు వినియోగము లేకపోవును.

కావున శాంభవపాశుపతాది శబ్దితమైన దీక్ష భస్మరుద్రాక్ష శివలింగధారణాత్మకమేయని యంగీకరింపక తీరదు.

ఇషమూర్జం, అమృతస్య దేవధారణో భూయాసం ఈమొదలగు మంత్రములు లింగధారణమునే బోధించుననుట యెట్లని శంకింతురేని యామంత్రములు లింగధారణమునే బోధించుగాని వానికి వేరొకయర్థము చెప్పుటకు వీలులేదను నంశమును లింగధారణ సర్వస్వంబను గ్రంథమునందు చూడవలయు.

అదిగాక, భస్మరుద్రాక్షధారణము నంగీకరించినవారు శివలింగధారణము నంగీకరింపకుండుటకు కారణము వచింపఁజాలరు. అదియేలందురేని, ఆలింపుడు.

శివలింగధారణము లేనివారు లింగధారణమునెడ నేమని సంశయించుచున్నా రనిన. లింగము నెల్లపుడు ధరించునెడ నశుచికాలముల యందును ధరింపవలసి వచ్చుననియు, అట్లు ధరించుట దోషావహమనియు నుడువుచున్నారు.

ఇందు యోజింపగా, వీరి కిట్టిసంశయము భస్మరుద్రాక్షములను ధరించునెడ నేలగలుగదయ్యెనో ఆలోచింపవలసియున్నది.

ఈ సందర్భమున శివలింగము కేవలము శివస్వరూపమగుగాని భస్మరుద్రాక్షములైననో అట్టివి గానేరవని వార లభిప్రాయపడియుందురనితోచెడిని. కాని యీ యభిప్రాయము సరియైనది కానేరదు. ఏలనిన. సూత సంహితయందు॥

శ్లో॥ శివస్వరూపం పరమం భాసనా ద్భస్మ సంస్మృతం।
తదేవ స్వీయమాయోత్థప్రపంచే జలసూర్యవత్ ।
అనుప్రవిష్టం తద్రూపం భస్మ శైవముదాహృతం।
స్వతంత్రో బింబభూతస్తు సదైవోద్ధూళిత శ్శివః॥

తా॥ భస్మము శివస్వరూపమై భాసిల్లుచున్నదిగాన దీనికి భస్మమని పేరు గల్గినది. శివస్వరూపము జగమునందు, జలమునందు సూర్యునివోలె ప్రకాశించుచున్నది, దానంజేసి భస్మము శైవమనియుఁ జెప్పఁబడుచున్నది. ఈ విధమున భస్మము శివునకుఁ బ్రతిబింబమైనదిగాన దీనిని శరీరమునకు నుద్ధూళనము చేసికొనునెడ శివునినే ధరించినట్టు లగుననియున్నది. ఈ మొదలగు ప్రమాణములనుబట్టి భస్మము శివస్వరూపమేయని స్పష్ట మగుచున్నది.

అట్లే రుద్రాక్షంబును రుద్రరూపమెయని బహుప్రమాణముల యందు గలదు. ఇట్లుండగా అశుచిసమయములందు శివలింగమును ధరింపరాదను నభిప్రాయముగలవార లట్టిసమయములందు శివస్వరూపములని చెప్పఁబడుచున్న భస్మరుద్రాక్షములను మాత్రము ధరింప నెట్టు లనువగును?

అపవిత్ర సమయములయందు రుద్రాక్షమును వదలిపెట్టుచున్నారమని వారలు వచించినను, నట్టిసమయములందు ధరించిన భస్మమును వదలిపెట్ట నసంభావితముగాన లింగధారణమునెడ వారలకు గలిగిన యీ సంశయము నిర్హేతుకమని యెఱుంగునది.

ఈ యెడ మఱికొందఱు మేము అంతర్లింగమును ధరించుచున్నారముగాన బాహ్యమున లింగమును ధరింప ననావశ్యకమని వచించుచున్నారు. విమర్శించునెడ నిదియు ననాలోచితమె యగును ఏలన.

బ్రహ్మోపనిషత్తునందు॥ శ్రు॥ హృదిస్థా దేవతాస్సర్వా। హృది ప్రాణాః ప్రతిష్ఠితాః। హృది ప్రాణాశ్చ జ్యోతిశ్చ త్రివృత్సూత్రంచ

తద్విదుః॥ హృది చైతన్యే తిష్ఠతి!

యదక్షరం పరంబ్రహ్మ తత్సూత్రమితి ధారయేత్ సూచనాత్సూత్ర మిత్యాహు స్సూత్రంనామ పరంపదం॥ తత్సూత్రం విదితంయేన సవిప్రో వేదపారగః॥

ఈవచనములనుబట్టి సూత్రమనగా పరబ్రహ్మమేయని తెలియుచున్నది. అంతస్సునందు పరబ్రహ్మమును ధరించినవారు బాహ్యమునందు తత్సూచకమగు సూత్రము నేలధరింపవలయునో బాహ్యమువ బ్రహ్మసూత్రమును ధరించునెడ లేనియీసంశయము వీరికి లింగధారణమునెడ నేలకలిగెనో వచింప దుశ్శకము.

కాఁబట్టి లింగధారణము నిరాక్షేపణము.

అయినను లింగమును ధరింపఁదగు పావిత్ర్యము తమకు లేమిచే నిప్పనికిఁ దామసమర్థులమని వారలభిప్రాయపడుదు రేని నాయంశమున మాకు వ్యతిరేకాభిప్రాయములేదుగాని జనులందఱు ననర్హులనుట యంగీకారార్హముగాదు. ఏలన,

బ్రాహ్మణుని శరీరము పవిత్రమనియు, దేవతలందఱు బ్రాహ్మణు నాశ్రయించి యుందురనియు వేదశాస్త్రము లుద్ఘోషించుచుండగా నెల్లరు నపవిత్రులే యనుమాట నెట్లొప్పనగును?

కావున, అపవిత్రతాశంకచే శివలింగమును ధరింపనొల్లకుండుట వ్యామోహమనియే యేర్పడుచున్నది.

శివలింగధారణము వేదవిహితమనుట లింగధారణసర్వస్వము మున్నగువానియందుఁ జూడనగును, అట్లుగాక,

ధారణము విహితముగాదని వాదమునకై యొప్పినను ఇది నిషిద్ధమనిగాని, అకృత్యమనిగాని నిరూపింప శక్యముగాదు. ఏలనిన, లింగ

ధారణమునకు నిషేధము వేదమునందుగాని, కల్పసూత్రములయందు గాని ధర్మశాస్త్రములయందుగాని పురాణములయందుగాని యెందును లేదు. దానంజేసి యది నిషిద్ధమనఁ జెల్లదు. ఇఁక నిది యకృత్యమన నైన, తనకుగాని పరునకుఁగాని లేశమైన చెరుపు గలుగ జేయునది గాదు.

అట్టివిగాకుండుటయగాక, ఆలోచించునెడ నిది యత్యుత్తమ కృత్యమనియే యేర్పడుచున్నది. ఎట్లనిన,

శివుఁడు సర్వేశ్వరుఁడనుటయు, శివలింగము పూజనీయ మను టయు పరులకు సమ్మతమేగదా? ఈ రెండును నంగీకరింపనివారు నుతి కొందఱున్నను నట్టియవైదికులవాదము పరిగ్రాహ్యముగాదుగాన నీరెం డును నంగీకరించినవారి సమ్మతమే యిప్పుడు గ్రాహ్యమగును.

శివలింగము పూజనీయమని యొప్పినవారికి దాని ధారణము ఆక్షేపణార్హము గానేరదు. ఎట్లందురేని,

శివలింగము పూజనీయమైనయెడ దాని స్పర్శము పుణ్యప్రదమే యని యంగీకరింపక తీరదుగదా? ఎదేనొకప్పుడు గలిగిన శివలింగ స్పర్శమే పుణ్యప్రదమైనచో సార్వకాలికమైన తదీయస్పర్శము అనంత పుణ్య ప్రదమని వేర చెప్పవలయునా? అట్టిచో లింగధారణము పుణ్య ప్రదము గానేరదని వచింప వారికి నెట్లు శక్యమగును?

అదిగాక, పరమేశ్వరస్మృతియే పరమగతిసాధన మనుట సర్వ శాస్త్ర సమ్మతమైయుండగా, సర్వకాలములయందునుబరమేశ్వర స్మృ తిని గలిగించు పరమేశ్వర లింగధారణము పరమపద ప్రాప్తి కారణము గానేరదని వచింప ఆస్తికులలో నెవ్వారలు సాహసింతురు? కాఁబట్టి శివ లింగధారణము మోక్షకారణమనుట నిర్వివాదము.

ఇదిగాక, సర్వకాల సర్వావస్థలయందును నాత్మకు ననాదిగా పెనఁగి కొనియున్న సంసారపాశబంధమును త్రెంచివైవ సర్వకాల సర్వావస్థ

యందును శరీరత్రయమునకు లింగత్రయధారణంబును, సర్వాంగలింగ సాహిత్యంబును సమర్థంబులగుగాని తక్కకృత్యంబులు జాలియుండునె? కావున, శాంభవదీక్ష దక్క మోక్షప్రదానదక్షంబైనది వేరొక్కటి గలదనుట గగన కుసుమ సదృక్షంబనుట నిక్కము.

ఇట్లు లింగధారణదీక్ష పారమార్థికమెయైనను కామార్థ పరతంత్రమైన జనసంఘమునకు నాదరణీయము గాకుంట దోషావహము గాదు. దాననె యిద్ది కాలక్రమమున సన్నగిలుచున్నను ప్రాజ్ఞసమితి యందు నాదరింపఁబడుచునెయున్నది.

లింగాంగ సంబంధజ్ఞానమే సంసారపాశబంధమును ఛేదింపఁజాలిన దగుటంజేసి మోక్షసాధనమగు శైవదీక్షకు లింగధారణమే ప్రధానాంశమని తెలియుచున్నది, కావున, కొంద అధికారుల నుద్దేశించి లింగధారణ రహితమైన శైవదీక్ష చెప్పఁబడియున్నను నది ప్రధానమైనది కాదని యూహింపదగియున్నది.

ఇట్లు భస్మరుద్రాక్ష శివలింగములు కేవలము శివస్వరూపము లైనవిగావున వీనిని ధరింపఁ బ్రాకృత శరీరం బనర్హమే యగుటంజేసి సద్గురునిచే సమగ్రము లగుషడధ్వశోధనాదులచే శరీరము నసాంస్కృతము గావించి, భస్మరుద్రాక్షశివలింగము లొసఁగఁబడుచున్నవి.

దీనింబట్టి దీక్షారహితునకు భస్మరుద్రాక్షముల ధరింపనైన నధికారములేదని తెలియుచున్నది.

పరులు చెప్పినవిధమున నచ్చటచ్చట భస్మరుద్రాక్షముల ధరించుటయు శాంభవదీక్షయెయని గలదనుటంబట్టియు, భస్మరుద్రాక్షములను దీక్షారహితుఁడు ధరింప ననర్హుఁడనియె ధ్రువపడుచున్నది.

ఇందు గొందఱు దీక్షగ్రహింపకయే భస్మరుద్రాక్షముల ధరించు చున్నారు. ఇయ్యది జూడ నుపనయనముగానివాఁడు దొంగజంధెమును దాల్చినట్లై యగును. అయినను భస్మరుద్రాక్షముల నవిధిగాదాల్చినను నవి నిష్ఫలములు గానేరవు గాన సంపూర్ణ ఫలప్రదములు గావనియే గ్రహింపవలయును.

దీక్షలేకయే భస్మరుద్రాక్షముల ధరించుటయు, శివలింగమును బూజించుటయు, అంగడిలోని విగ్రహములఁగొనివచ్చి వానికి నెవ్విధ సంస్కారంబు నొనరింపకయె వానిని బూజించుటయుఁ గొందఱకు సంప్రదాయసిద్ధంబైనను నదియంతయు నవిధియోగంబనియు, ఈ యనర్థము శివాగమముల ప్రామాణ్యము గ్రహింపని కతన సంప్రాప్త మయ్యెనని యు నెఱుంగునది.

శైవషడక్షరీమహామంత్రమును కొందఱు దీక్షాసంస్కారము లేకయె గ్రహించుచున్నారు. వారిని అట్లే తాము సంస్కారమునొందకయె సావిత్రీమహామంత్రము నేల గ్రహింపరైరో వచింపఁజాలరు.

మఱియు, సాధ్వి ఐహికాముష్మికసుఖము బడయగోరి నాథుని సేవింపనైన వైవాహికసంస్కారము నొందకయు, ధర్మేచ, అర్థేచ, కామేచ నాతిచరామి॥ ధర్మార్థకామములయందు నిన్ను నతిక్రమింపనని ప్రమాణముచేయకయు, నర్హురాలు కాదయ్యెను. ఇట్లుండ జనుఁడు నిరవధికనిత్యసుఖము బడయగోరి సర్వేశ్వరుని సేవింప నేసంస్కారంబును నెట్టివ్రతంబును బనిలేదని యెట్టిమూర్ఖుండైనఁ జెప్ప సాహసించునా? కావున, శంకరకైంకర్యమునకు శైవదీక్ష యావశ్యకమనియు, అది భస్మరుద్రాక్షశివలింగధారణాత్మకమనియు, శ్రుతులచేతనె గాక, యుక్తులచేతను సిద్ధమగుచున్నదిగాన దీనిని గాదన నెవ్వారలకుఁ జెల్లదనుట యథార్థము.

కాఁబట్టి మహాజను లీయర్థము గ్రహించి, శైవదీక్ష నా
రించి శంకరుని చరణాబ్జముల సేవించి, తదీయానుగ్రహమునకుఁ బాత్రులై
యిహపరసుఖముల గాంచునట్లు ప్రసాదించుగాక యని జగదీశ్వరుని
బ్రార్థించుచున్నాఁడను.

ఇట్లు
ప॥ సం॥



శ్రీశివాయగురవేనమః

మత వినోద చర్చ,

చతుర్థాహ్నికము.

(అందఱు సమావేశమైరి.)

అన్నం—ఆచార్యులవారూ! శైవవైష్ణవమతములలో వేదసమ్మతమైన మత మేది?

ప్రతి—వైష్ణవమతమే వేదసమ్మత మైనది.

అన్నం—దేనినిబట్టి యీయర్థము విశ్వాసార్హ మగును?

ప్రతి—ద్విజులకు సావిత్రీమహామంత్రము ముఖ్యమైనది. ఇయ్యది సకల వేదములకును సారభూతమనిగూడఁ జెప్పఁబడుచున్నదిగదా? ఈమహామంత్రము కేవలము నారాయణునిపరమేయగునుగాని దేవతాంతరపరము గాదు. కావున, వైష్ణవమతమే వేదసమ్మతమని యంగీకరింపక తప్పదు.

అన్నం—సావిత్రీమహామంత్రము నారాయణపర మనుట యెట్లు?

ప్రతి—శ్లో॥ వేదాది ర్వేదమాతాచ పౌరుషం సూక్తమేవచ॥ ప్రణవము, గాయత్రి, పురుషసూక్తము మొదలైనవి నారాయణునే బోధించునని పెద్దలు నిర్ణయించియున్నారుగదా?

పండి—ఇయ్యవి నారాయణపరములని యెవరిపెద్దలు నిర్ణయించిరి?

ప్రతి—పెద్దలనగా పూర్వీకులగు మహావిద్వాంసులు. వార లందఱకును పెద్దలె యగుదురు. ఇంతియెకాని ఎందైన మాపెద్దలు వేరు. మీపెద్దలు వేరుగా నుందురా?

పండి—నిర్ణయించినవారు నిష్పక్షపాతబుద్ధులే యగుచో వారు అందఱకును పెద్దలే యైయుందురు. అట్లుగాక, పక్షపాతబుద్ధితో వ్రాసినచో వారు ఎల్లరకు పెద్ద లెట్లగుదురు?

ప్రతి—వారు పక్షపాతబుద్ధితో వ్రాసిరని యెట్లు నిర్ణయింపనగును?

పండి—విమర్శనమునందు నిలువనివి ప్రమాణవిరుద్ధములు నగువానిని నిర్ణయించినప్పుడు వారు పక్షపాతబుద్ధిగలవారని యేల నిర్ణయింపఁబడరు? అదిగాక, ప్రణవము మొదలైనవి నారాయణపరములని వ్రాసినవారు వైష్ణవపండితులా, లేక శైవపండితులా?

ప్రతి—ఎందైన శైవపండితు లట్లు వ్రాయుదురా?

పండి—కావున, వారు వైష్ణవపండితు లనియేకదా యేర్పడుచున్నది. వారు మీపెద్దలే యగుదురుగాన దానింబట్టియే యెవరిపెద్దలని యడుగవలసివచ్చెను.

ప్రతి—ఎవరిపెద్దలైన నేమి? న్యాయ్యము చెప్పినప్పుడుగ్రహింపవలయు గదా?

పండి—న్యాయ్యము చెప్పినచో బాగుగనే గ్రహింపవలయు.

ప్రతి—వారు న్యాయ్యము చెప్పలేదని మీరెట్ల ధ్రువపరుపగలరు?

పండి—విమర్శమున నిలువనియర్థములు సెప్పుటనే న్యాయ్యము చెప్ప లేదని ధ్రువపడుచున్నది.

ప్రతి—వారు చెప్పినయర్థములు విమర్శమున నిలువ వనుట యెట్లు?

పండి—ప్రణవము నారాయణపరమని వారుచెప్పినది విమర్శమున నిలిచెనా? దానింబట్టి వారుచెప్పినది న్యాయ్యమని యెట్లు గ్రహింపనగును?

అన్నం—వారు చెప్పినవానిలో నేదేనొకటి నిలువనంతన యన్నియు నట్లేయని యెట్లు నిర్ణయింపనగును?

పండి—అట్లేని సావిత్రీయెడను మీకుగల సందియము దీర్చుకొనుడు.

అన్నం—సావిత్రీ మహామంత్రము దగునర్థమునెడ మాకేమియు సందియము లేనె లేదు. ఈ మహామంత్రము శివపరముగాదు

విష్ణుపరముగాదు. ఇఁకనిది కేవలము బ్రహ్మపరమేయని మాకు దృఢనిశ్చయము గలిగియె యున్నది.

ప్రతి.—అట్లైనిమీరంగీకరించినది చతుర్ముఖబ్రహ్మమా? లేక నిర్ముఖబ్రహ్మమా? ఏదియో సెలవిండు.

అన్నం.—మేము చెప్పెడు బ్రహ్మ మెద్దియైనది మీవాదములు తేలినమీఁదఁ జివరకు సిద్ధాంతము చెప్పెదను. ముందు మీమీ యర్థములె సాధించుకొనుడు.

ప్రతి.—మమ్ముల నేమి సాధించు మనుచున్నారు?

అన్నం.—సావిత్రి మహామంత్రము నారాయణపరమని మీరు చెప్పిన దానిని బాగుగా సాధించుడు. దాని ధ్యాన శ్లోకముదగు నర్థ మెవరికి సాధకమో అదియు చర్చించుడు.

ప్రతి.—గాయత్రీధ్యాన శ్లోకంబును మాకే సాధక మగును.

పండి.—అదియెట్లో? సహేతుకముగా దెలుపుడు.

ప్రతి.—శ్లో॥ ముక్తా విద్రుమ నీల హేమ ధవళ చ్ఛాయైర్ముఖై స్త్రీక్షణై
ర్యుక్తామిందునిబద్ధ రత్నమకుటాం తత్త్వార్థవర్ణాత్మికాం।
గాయత్రీం వరదాభయాంకుశకశా శ్శుభ్రంకపాలంగదాం
శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహం తీంభజే.

ఇది గాయత్రీధ్యానశ్లోకము దీనియర్థ మేమనిన,

క్రమముగా, తెలుపు, ఎఱుపు, నలుపు, పసిమి, తెలుపు వన్నెలుగలవియు, మూఁడేసి కన్నులుగలవియు నగు నైదు ముఖములు గలదియు. చంద్రునితోఁగూడిన రత్నకిరీటము గలదియు, పరమాత్మను దెలుపు ప్రణవస్వరూపమైనదియు, వరము, అభయము, అంకుశము, కొరడ, కపాలము, గద, శంఖము, చక్రము, రెండు తామరపూవులు ననువానిని పది చేతులలో ధరించియున్నదియు, నగు గాయత్రీమంత్ర ప్రతిపాద్యయగు దేవతను సేవించుచున్నాను. అనియర్థము, దీనిలోని

కొన్ని ముఖ్యవిశేషములనుబట్టి యీశ్లోకముచే ధ్యానము చేయఁదగ్గ వాఁడు నారాయణమూర్తియే యని యేర్పడుచున్నది.

పండి—ఆముఖ్యవిశేషము లెవ్వియో సెలవిండు.

ప్రతి—గద, శంఖము, చక్రము ననునవి యీదేవతచేతులలో నున్నట్లు తెలియుచున్న దిగదా? ఈయాయుధములు నారాయణమూర్తికే గాక, ఇంక నేదేవతకును లేవు. గావున నీయాయుధములు గల దిగా ధ్యానముచేయఁదగిన దేవత నారాయణమూర్తియే యని స్పష్ట మగుటలేదా?

అన్నం—ఆచార్యులవారూ? మీరుసెలవిచ్చినది కొంతవరకు సహేతుకముగానె యున్నదిగాని పైనఁజెప్పఁబడిన విశేషణములు నారాయణునందు నెట్లు సమన్వయించునో అదిగూడ కొంచెము సెలవిండు.

ప్రతి—ఈశ్లోకములోని యన్నివిశేషణములునొక దేవతయందు సమన్వయించుట నాకెగాదు, ఆరాధ్యులవారికి గాదు, బ్రహ్మకైన నలవిగాదు. కావున. వీనిలో ముఖ్య విశేషములను బట్టి నారాయణమూర్తియే యని నిర్ణయింపఁబడుచున్నది. కడమ విశేషము లెట్లు కుదురుననిన, అచింత్యాద్భుత శక్తియగు శ్రీమన్నారాయణమూర్తికి అనంతములగు లీలారూపము లుండునుగాన వానిలో నేదేనొకరూప మిట్టి విశేషములు గలదిగా నుండుట యసంభవముగాదు. కావున, ఈగాయత్రీ ధ్యానశ్లోకము నారాయణపరమనుట నిస్సంశయము.

అన్నం—ఆచార్యులవారు చెప్పినది చాలబాగుగానున్నది. ఆరాధ్యులవారూ! దీనిని మీర లంగీకరింతురా? లేక యేదియైన చెప్పుదురా?

పండి—సెలవైనచో నభ్యంతరము లేదు.

అన్నం—ఈశ్లోకమునకు మీరేమి యర్థము చెప్పుదురో సెలవిండు.

పండి—గాయత్రీధ్యానశ్లోకము కేవలము శివపరమనియె చెప్పుదుము.

అన్నం—అది యెట్లు?

పండి—ఈశ్లోకమునందు దేవతకు అయిదుముఖములు, మూడుకన్నులు నున్నట్లు ఆచార్యులవారే చెప్పియున్నారు.కాదా?

అన్నం—అగును. అంతమాత్రమున నేమి?

పండి—అయిదుముఖములు, మూడు నేత్రములు పరమేశ్వరునకుగాక నింక నెవ్వరికి గలవు?

అన్నం—శంఖచక్రములు, గద యను నాయుధములు శివునిచేతిలో నుండునని యెటనైన నున్నదా?.

పండి—అయిదు ముఖములు, మూడుకన్నులు, శిరమున చంద్రుడు నివియన్నియు నారాయణమూర్తికిఁగలవని యెందైననున్నదా?

అన్నం—ప్రధానలక్షణములనుబట్టి కడమలక్షణములు గౌణముగా సమన్వయము చేసికొనవలయునుగాన శంఖచక్రాదిలక్షణములను బట్టి యీశ్లోకమునఁ జెప్పఁబడినది నారాయణమూర్తియే యని యేర్పడుచున్నదిగాన పంచముఖత్వాదిలక్షణములు నారాయణమూర్తికి లీలారూపమున నుండనగునని నిశ్చయింపఁబడుచున్నది.

పండి—ఈన్యాయమునుబట్టి చూచిననె అయిదుముఖములు, మూడు నేత్రములు మొదలగు లక్షణములనుబట్టి శ్లోకప్రతిపాద్యమగు తత్త్వము పరమేశ్వరుడే యని యేర్పడుచున్నదిగాన, శంఖ చక్రాదిలక్షణములు, శివుని లీలావిగ్రహమున గౌణముగా సంభవించునని యేల విశ్వసింపఁగూడదు?

అన్నం—ఈ న్యాయము రెండిటికి ననుకూలముగానెయున్నది. కాని యిందు ప్రధానలక్షణము లెవ్వియో గౌణలక్షణము లెవ్వియో ముందు నిర్ణయించుట యుచితము.

ప్రతి—శంఖచక్రాదులు అసాధారణములుగాన ప్రధానలక్షణము
నేను చెప్పియుంటిని.

పండి—అయిదు ముఖములు, మూడునేత్రములు మొదలైనవి అ
ధారణము లెట్లు గావు? దానింబట్టి యవియే ప్రధానలక్షణ
లని యేల గ్రహింపఁగూడదు?

అన్నం—ఇందుఁజూడగా, రెండును నసాధారణములెగాన ప్రధాన
గానె కన్పట్టు చున్నవి. కావున నిది నారాయణరూప మని
జెప్ప వచ్చును. లేక శివరూపమనియైన నంగీకరింపవచ్చు
నాకు జూడ రెండులక్షణములనుబట్టి హరిహరరూప మను
న్యాయ్యముగా గన్పట్టుచున్నది.

పండి—భట్టాచార్యులవారూ! మీరుసెలవిచ్చినట్లు పంచవక్త్రత్వా
లును, శంఖచక్రాదులును నీరెండును ప్రధానములేమైనచో
శ్లోకమునకు మీామతమును బట్టి హరిహరరూప మ
న్యాయ్యమగును. మామతములను బట్టి పరస్పర వ్యాఘా
వలన నేయర్థము నిలువకపోవును.

అన్నం—ఆరాధ్యులవారూ! ఇందు రెండును ముఖ్యముగా కన
చుండ వీనిలో నొకటి ముఖ్యముగా దనుట యెట్లు?

పండి—న్యాయ్యమునుబట్టియె.

అన్నం—ఇందు ఏన్యాయమునుబట్టి పంచవక్త్రత్వాదులు ముఖ్య
లగునో తెలుపుడు.

పండి—అయిదుముఖములు, మూడునేత్రములు ననునివి స్వరూప
ణములు, గావున ముఖ్యములు శంఖచక్రాదులైననో
లక్షణములు ఇయ్యవి స్వరూపమున చేరునవిగావు, స్వరూ
లక్షణములు ముఖ్యము లెట్లందు రేని,

స్వరూపలక్షణ మేలాటిదనిన, ఇది ఉన్నది తీసివేయనుగాని, లేనిది దాల్పనుగాని వీలైనది గాదు. తటస్థలక్షణ మైననో ఉన్నది తీసివేయనగును. లేనిది ధాల్పను నగును. శూలమును తీసి శంఖమునో శంఖమునుమాని ఖడ్గమునో ధరింపనగుగాని అయిదుముఖములను దీసి యొక్కముఖమునో, రెండుకన్నులను దీసి మూడుకన్నులనో దాల్ప వలనుగాదు.

కాఁబట్టి పంచవక్త్రత్వాదులు స్వరూపలక్షణములుగాన ముఖ్యములనియు, శంఖచక్రాదులు తటస్థలక్షణములుగాన గౌణములనియు నేర్పడియెను. పరిధానలక్షణములనుబట్టి యిది శివరూపమేయని నిర్ధారణ మగుచున్నది.

ఇదిగాక పూర్వమీమాంసయందు అనుపసంజాతవిరోధిగావున ఉపక్రమమునకు ప్రాబల్యము అంగీకరింపఁబడియున్నది. ఈధ్యానశ్లోకమునందు, పంచవక్త్రత్వ, త్రిణేత్రత్వాదులు, ఉపక్రమలక్షణములై యున్నవి. శంఖచక్రాదివైశిష్ట్యమైననో ఉపసంహారమైయున్నది. ఉపసంహారము నుపక్రమమునకు ననుకూలముగనే యన్వయించుకొనవలయు ననుట పూర్వమీమాంసానిర్ణీతముగావున ఉపక్రమమునందున్న పంచవక్త్రత్వాదులనుబట్టి శంఖచక్రాదులును నీశ్వరరూపముననే యన్వయించుననుటయు న్యాయ్యమైయున్నది.

మఱియు, విప్రతిషేధే భూయసాం స్యాత్సధర్మత్వం అనియు న్యాయము గలదు. వాక్యములలో పరస్పరవిరోధమువచ్చినప్పుడు అధికవాక్యములకు ననుకూలముగా నల్పవాక్యముల నన్వయింపవలయు నని యర్థము. ప్రకృతమునందు, పంచవక్త్రత్వము, త్రిణేత్రత్వము, చంద్రశేఖరత్వము మొదలగు ననేక విశేషణములు శివుని ప్రతిపాదించుచున్నవిగావున శంఖచక్రాదివైశిష్ట్యంబనునొకవిశేషణంబును వానికి ననుకూలముగానె సమర్థించుటయు న్యాయ్యం బగును. కావున గాయ

శ్రీధ్యానశ్లోకమున బ్రతిపాదింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే యగుగాని దేవతాంతరము గానేరదు.

అదిగాక, పరమేశ్వరు నైదుముఖములలో నేముఖ మేవన్నె గలదిగా నుండునో ఈశ్లోకమునందును సక్లైవర్ణింపఁబడియెను. ఎట్లనిన, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష ఈశానములని పరమేశ్వరున కైదుముఖములు గలవనియు, వీనిలో సద్యోజాత ముఖము తెలుపనియు, వామదేవముఖ మెఱుపనియు, అఘోరముఖము నలుపనియు, తత్పురుషముఖము పసిమియనియు, ఈశానముఖము తెలుపనియు, ఉపనిషత్తులు, శివాగమములు, శివపురాణములును నేకవిధముగా బోధించుచున్నవి.

ఈధ్యానశ్లోకమునందును నైదుముఖములును సద్యోజాతాది ముఖముల వర్ణములు గలవిగానె తెలుపఁబడి యున్నవి. దీనింబట్టి యియ్యవి సద్యోజాతాది ముఖములనియె నిర్ణయమగుచున్నది.

ఇట్లు, సద్యోజాతాది పంచబ్రహ్మ ముఖములు గలవనియు, మూఁడునేత్రములు గలవనియు, చంద్రశేఖరుఁడనియు వర్ణింపఁబడియుండగను, వీనిని బట్టి యిందుఁ జెప్పఁబడినది శివతత్త్వమేయని యేర్పడుచుండగను, ఈశ్లోకము దేవతాంతర పరమనిగాని, శంఖచక్రములను బట్టి నారాయణుఁడని గాని వచింపఁ బూనుట సాహస మెట్లుగాదో వచింపుఁడు.

అన్నం౦—ఇదంతయు బాగానేయున్నదిగాని, ఈశ్లోకమునందు గాయత్రీం అని స్త్రీలింగము నిర్దేశింపఁబడియున్నది. దీనింబట్టి దేవి యని యేర్పడుచుండగా, శివుండనుట యెట్లో యనుసంశయము బాధించుచునేయున్నది.

పండి—గాయత్రీయని స్త్రీలింగముమాత్రమునుబట్టి దేవియని చెప్పుటకు నవకాశము లేదు. ఏలన, దేవతాశబ్దము స్త్రీలింగము

తా॥ ఇట్లు నీకు పంచాచారనిర్ణయము చెప్పితిని. ఇయ్యది సకలమైన నిగమాగమములయొక్క సారముగాన మోక్షప్రాప్తికి నిదియె పరమసాధన మగుచున్నది, దీనిని శిష్యుఁడుగానివానికిగాని, భక్తిలేనివానికిగాని, పుత్త్రుఁడుగానివానికిగాని, శ్రద్ధలేనివానికిగాని దెలుపక జాగరూకత్వో గాపాడుము. ఇంక దేని విననగోరుదువో తెలుపుము.

ఇతిశ్రీచంద్రజ్ఞాన ఉత్తరభాగే
శివశాసనే
పంచాచారనిర్ణయోనామ
నవమః పటలః.

---

## దశమః పటలః.
## ఆరభ్యతే.

బృహస్పతిరువాచ—బృహస్పతి తిరుగా నిట్లని యడిగెను.

మూ॥ సర్వభద్ర గుణోపేత కాద్రివేయ పరిష్కృతే ।
జగదుద్ధరణోన్నిద్రాఽనంతరుద్ర నమోఽస్తుతే॥ ౧

తా॥ సకల మగు మాంగల్యగుణములు గలవాఁడవును, సర్పములచే నలంకరింపఁబడినవాఁడవును, జగమును గాపాడు పనియందు జాగరూకుఁడవును నగు నోయనంతరుద్రుఁడా! నీకు నమస్కారము చేయుచున్నాఁడను.

మూ॥ ఆగమేషు నిగద్యన్తే శైవభేదాస్త్వనేకధా ।
చత్వారః క్వచిదుచ్యన్తే తథా సప్తేతిహి క్వచిత్ ॥ ౨
దశేతిచ క్వచిత్ప్రోక్తాః కథ్యన్తే క్వచిదన్యథా॥
సంగృహ్య తానిహ బ్రూహి పరిష్కార మసంశయం॥ 3

తా॥ ఆగమముల యందు శైవ భేదములు నాల్గని యొక్క చోటను, ఏడని యింకొక్క చోటను, పదియని వేరొక్క చోటను, మఱి కొన్ని విధముల మఱియొకచోటను నిట్లు లనేకవిధములుగాఁ జెప్పఁబడు చున్నవి. వానిని సంగ్రహించి సంశయము నివర్తించునట్లు పరిష్కరించి తెలుపుదము.

అనంతరుద్ర ఉవాచ—నావిని యనంతరుద్రుం డిట్లనియె.

మూ॥ అధునా తే ప్రవక్ష్యామి శైవభేద మనుత్తమం ।
అనాదిశైవం ప్రథమ మాదిశైవం ద్వితీయకం ॥ ४
పూర్వశైవం తృతీయంస్యా న్మిశ్రశైవం చతుర్థకం ।
శుద్ధశైవం పంచమంస్యాత్ షష్ఠంవై మార్గశైవకం॥ ౫
సామాన్యం సప్తమం జ్ఞేయం వీరశైవమథాష్టమం ॥
అథతల్లక్షణం వక్ష్యే యథావ దనుపూర్వతః ॥ ౬

తా॥ ఓబృహస్పతీ, ఇపుడు నీకు శైవభేదములను చెప్పెద వినుము. ఎట్లనిన, అనాదిశైవము మొదటిది, ఆదిశైవము రెండవది పూర్వశైవము మూడవది, మిశ్రశైవము నాల్గవది, శుద్ధశైవము అయిదవది, మార్గశైవమాఱవది, సామాన్యశైవ మేడవది, వీరశైవ మెనిమిదవది, ఇట్లు శైవ మెనిమిదివిధములు, క్రమముగా వీని లక్షణములు చెప్పుచున్నాను వినుము.

మూ॥ అనాదిశైవ శ్శంభు స్స్యా దథ తస్య గణా అపి।
తా॥ శివుండే అనాదిశైవుఁ డగును, తరువాత నద్దేవునిగణిబులును ననాదిశైవులనియె పేర్కొనఁబడుచుందురు
మూ॥ ఆదిశైవాస్తు విజ్ఞేయాః కౌశికాద్యా మహర్షయః॥ ౭
కౌశికః కశ్యపశ్చైవ భరద్వాజాత్రి గౌతమాః।
ఆదావేతే మహేశస్య పంచవక్త్రేషు దీక్షితాః ౮

తా॥ కౌశికుఁడు మొదలగు మహర్షులు ఆదిశైవులని చెప్పఁబడుచున్నారు. ఏలన, కౌశికుఁడు, కశ్యపుఁడు, భరద్వాజుఁడు, అత్రి, గౌత

ముడు నను నైదుగురు మహర్షులును మహేశ్వరుని నైదుముఖముల యందు దీక్షను పొందియుండిరి. గాన నామహర్షులు ఆదిశైవులని చెప్పంబడుచుందురు.

మూ॥ గురో ర్ముఖా ద్దీక్షితాహి తద్గోత్రా శ్చాన్యగోత్రిణః।
ఆగమాం తో క్తవిధయా శాంభవవ్రతసేవినః॥ ౯
వేధా మను క్రియాభిఖ్య దీక్షాత్రయ విధానతః।
లింగత్రయ పరిస్ఫూర్జ దంగత్రితయ శోభినః॥ ౧౦
ఆదిశైవా ఇతిభువి నిగద్యన్తే బృహస్పతే॥

తా॥ ఈ చెప్పిన పంచగోత్రములవారును, నితర మహర్షిగోత్రములవారును శివాగమముల యుత్తర భాగములయందుఁ జెప్పఁబడిన శాంభవవ్రతము నవలంబించి, వేధా మను క్రియలను మూడు దీక్షలను గ్రహించి, స్థూల సూక్ష్మ కారణములను మూడు శరీరములయందును నిష్టప్రాణభావములను మూడులింగములను ధరించిన వారును ఆదిశైవులనియె చెప్పబడుచుందురు.

మూ॥ మహేశస్య ప్రతిష్ఠాయా ముత్సవే స్నపనాదిషు॥ ౧౧
ఆచార్యత్వేఽప్యధికృతా ఆదిశైవా జగన్నుతాః।

తా॥ లోకారాధ్యు లగునీయాదిశైవులు శివుని ప్రతిష్ఠించుట, కల్యాణోత్సవము చేయించుట, కుంభాభిషేకము చేయించుట మొదలగు వానియందు నాచార్యత్వమున నధికారము గలిగియుందురు.

మూ॥ పూర్వశైవాహి విజ్ఞేయాః కానీనాస్తు హరద్విజాః॥ ౧౨
అనూఢాసుహి కన్యాసు ప్రభూతాః పంచగోత్రిణః।

తా॥ వివాహము చేసికొనని విప్రకన్యలయందు పుట్టినవారగుటచే కానీనులని చెప్పంబడుచున్నవారును, కాశికాదిపంచగోత్రములవారును నగు హరద్విజులు పూర్వశైవులని చెప్పంబడుచుందురు.

మూ॥ దీక్షాణామిహ శైవీనాం పూర్వభాగోదితాత్మనాం॥ ౧౩
గ్రహణాగ్రహణాభ్యాంచ ద్వివిధాస్తే శివద్విజాః।

తా॥ శివాగమముల పూర్వభాగములయందుఁ జెప్పంబడిన శైవదీక్షలను గ్రహించువారు గొందఱును, గ్రహింపనివారు మఱికొందఱును నిట్లు శివద్విజులు రెండువిధములుగా నుండుదురు.

మూ॥ పూర్వకాండోక్తదీక్షాభి స్సంస్కృతాస్తే హ్యలింగినః॥ ౧౪
స్వార్థే పరార్థే యజనేఽధికృతాస్తే భవన్తిహి॥

తా॥ శివాగమపూర్వకాండమునఁ జెప్పఁబడిన శైవదీక్షలను గ్రహించినవారును, లింగధారణదీక్ష నొందనివారును నగు శివద్విజులు స్వార్థము పరార్థమునగు పూజయందు నధికారము గలిగియుందురు.

మూ॥ అర్చకత్వేహి దేవస్య కైంకర్యకరణేపిచ॥ ౧౫
శివాగార పరిష్కారేఽధికృతాస్తే సురార్చిత॥

తా॥ ఓబృహస్పతీ! ఆశివద్విజులు శివునిపరార్థపూజయందును శివుని పరిచారకత్వమునందును, శివాలయము పరిశుభ్రము సేయుటయందును నధికారము గలిగియుందురు.

మూ॥ నాచార్యత్వేఽప్యధికృతిః ప్రతిష్ఠాదిషు కర్మసు॥ ౧౬
దీక్షితానా మపిహ్యేషాం కానీనత్వా దసంశయం।

తా॥ శివద్విజులు దీక్షనొందినను, వీరు కానీనులుగాన వీరికి శివప్రతిష్ఠాదికృత్యములయెడ నాచార్యత్వమున నధికారము గలుగదు.

మూ॥ అథ యేత్వదీక్షితాఏవ పరార్థయజనే రతాః॥ ౧౭
తేహి దేవలకాః ప్రోక్తాస్సర్వకర్మవిగర్హితాః॥
శివాగారా దన్యదేశే తేషాం స్పర్శోపి దోషదః॥ ౧౮

తా॥ ఇంక శైవదీక్షను గ్రహింపకయే పరార్థపూజయందుఁ బ్రవర్తించు శివద్విజులు దేవలకులని చెప్పఁబడుచుందురు. వీరలు సర్వ

కర్మములయందును ననర్హులే యగుదురు. శివాలయమునదక్క నితర
మగుచోట వీరిని తాకినను దోషం బంటును.

మూ॥ శివార్చకత్వా దేతేషాం శైవత్వేపి పరిస్ఫుటం।
అదీక్షిత జనానర్హా పరార్థయ జనాదపి॥ ౧౯
తథావిధ జనానర్హ శివద్రవ్యస్య భక్షణాత్।
శివకైంకర్య విషయ శ్రద్ధాలోపాదిదోషతః॥ ౨౦
తన్మలా ఇత్యుదీర్యన్తే సర్వశైవేషు గీష్పతే।
తేషు శైవే ష్వవద్యత్వా త్తన్మలాఇతి విశ్రుతాః॥ ౨౧

తా॥ ఈ శివద్విజులు శివార్చకులుగాన శైవులే యైనను, శైవ
దీక్షను పొందనివారు సేయఁగూడని పరార్థపూజను చేయుటవలనను,
శైవదీక్షపొందనివారు గ్రహింపరాని శివద్రవ్యమును భక్షించుట వల
నను, శివుని పరిచర్యసేయునెడ నశ్రద్ధాది దోషములవలనను నెల్లశైవు
లలో వీరు తన్మలులు అని చెప్పంబడుచుందురు. శైవులందఱిలోనను
వీరు నిందితులుగా నున్నకతన తన్మలులని పిలువఁ బడుచుందురు.
తన్మల శబ్దమే తద్భమున తంబళశబ్ద మయ్యెనని యెఱుంగునది. ఈ
యర్థము స్కాందమునందును నిరూపింపఁబడియున్నది.

మూ॥ వంశపారంపర్యయోగా చ్ఛివవిప్రేషు దీక్షితాః।
పూర్వకాండోక్త విధయా పూర్వశైవాః ప్రకీర్తితాః॥ ౨౨
అథయే త్వదీక్షితాఏవ పరార్థయ జనే రతాః।
తన్మలాఇతి శైవేషు కథ్యన్తే వానవార్చిత॥ ౨౩

తా॥ ఇట్లు వంశపరంపరగా శివాగమములయొక్క పూర్వభాగ
మునఁ జెప్పఁబడు దీక్షల నాచరించు శివద్విజులు పూర్వశైవులనియు,
దీక్ష గ్రహింపకయే పరార్థపూజ నాచరించు శివద్విజులు తన్మలులనియు
గ్రహింపవలయు.

మూ॥ మిశ్రశైవ మథోవక్ష్యే సురాచార్య శృణుష్వతత్ ।
ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం ॥ ౨౪
ఏకపీఠే సన్నివేశ్య మిశ్రీకృత్యాఽర్చయన్తియే ।
మిశ్రశైవా ఇతిహి తే ప్రోచ్యన్తే మిశ్రపూజనాత్ ॥ ౨౫

తా॥ ఓ బృహస్పతీ, ఇఁక, మిశ్రశైవమును చెప్పుచున్నాను వినుము. సూర్యుని, అంబికను, విష్ణుని, గణపతిని, మహేశ్వరుని చేర్చి, ఒక పీఠముననే యునిచి పూజించువారు మిశ్రశైవులని చెప్పఁబడుదురు. మహేశ్వరునితో నితరదేవతలను గలిపి పూజించుటవలన మిశ్రశైవులని నుడువంబడుచున్నారు.

మూ॥ నైతేషాం శివదీక్షాస్యా న్నశివాధిక్యభావనా ।
భస్మరుద్రాక్షధరణా చ్ఛైవత్వం మిశ్రపూజనాత్ ॥ ౨౬
మిశ్రత్వం విద్యతేయస్మా న్మిశ్రశైవాః ప్రకీర్తితాః ॥

తా॥ మిశ్రశైవులకు శైవదీక్షగాని, శివాధిక్యభావముగాని యుండదు. భస్మరుద్రాక్షము లను శైవచిహ్నములను ధరించుటవలన శైవత్వంబును, మిశ్రపూజవలన మిశ్రత్వంబును గలదుగాన వీరు మిశ్రశైవులని యెన్నంబడుచున్నారు.

మూ॥ అన్తశ్శాక్తం బహిశ్శైవం సభామధ్యేతు వైష్ణవం ॥ ౨౭
మిశ్రితం దృశ్యతే యస్మా న్మిశ్రశైవాః ప్రకీర్తితాః ॥

తా॥ వీరికి శక్త్యాధిక్య భావముండుటచే లోపల శాక్తలక్షణంబును, భస్మరుద్రాక్షములు ధరించుటచే బాహ్యమున శైవలక్షణంబును సభామధ్యంబున గోవిందనామ స్మరణముచే వైష్ణవలక్షణంబును మిశ్రముగా నున్నందునను వీరు మిశ్రశైవు లగుదురు.

మూ॥ శుద్ధశైవ మతో వక్ష్యే ప్రసిద్ధం సుమనోర్చిత॥ ౨౮
భస్మరుద్రాక్ష ధరణాత్మక పౌరాణదీక్షయా।
దీక్షితా శ్శివలింగైకపూజా తత్పరచేతసః॥ ౨౯

శివపారమ్యవిశ్వాసా శ్శివభావానుభావినః।
శుద్ధశైవాఇతి భువి నిగద్యన్తే బృహస్పతే॥ 30

తా॥ ఓ బృహస్పతీ! ఇఁక శుద్ధశైవమును చెప్పుచున్నాను. వినుము. భస్మరుద్రాక్షధారణరూపమైనపురాణోక్తదీక్ష ధరించి శివలింగమునుమాత్రమే పూజించువారై, శివాధిక్యమునందు విశ్వాసము గలిగి శివభావమును భావించుచుండువారు శుద్ధశైవులని చెప్పంబడుదురు

మూ॥ మార్గశైవం ప్రవక్ష్యామి ముక్తిసన్నిధిమార్గకం।
నిగమాగమాంతగదితదీక్షాత్రియపరిగ్రహః॥ 31
షట్స్థలజ్ఞానసంపత్తి ష్షట్కాలశివపూజనం।
ఏకవింశతిసాహస్ర యుతషట్శతసంఖ్యయా॥ 32
షడక్షరీజపో నిత్యం లింగాంగైక్యవిభావనం।
ధర్మోఽయం మార్గశైవానామీశ్వరేణ ప్రకీర్తితః॥ 33

తా. ఓసురాచార్యా! మార్గశైవమును చెప్పుచున్నాను వినుము. ఇయ్యది ముక్తికి సన్నిధిమార్గమైన కారణమున మార్గశైవమని చెప్పంబడుచున్నది. దీని లక్షణమెట్టిదనిన, ఉపనిషత్తులయందును, శివాగమోత్తరభాగములయందును జెప్పఁబడిన వేధామను కియులను మూఁడు దీక్షలను గ్రహించుటయు, షట్స్థల జ్ఞాననిష్ఠయు, ప్రతిదినము షట్కాల శివపూజనంబును, ఇరువదియొక్కయారునూర్ల సంఖ్య గల షడక్షరీజపంబును, లింగాంగైక్యానుసంధానంబును నియ్యవి మార్గశైవులకు ధర్మములని యీశ్వరునిచేఁ జెప్పంబడియెను.

మూ॥ ఆద్యశైవేన తాల్యేపి దీక్షాదీనాం పరిగ్రహే
విశిష్టానాంహి ధర్మాణాం శీఘ్రముక్తిప్రదాయినాం. 34
నిరంతరానుష్ఠానం య న్మార్గశైవే విశిష్యతే.

తా. మార్గశైవమునందు దీక్షలు ఆద్యశైవముతో సమానములే యయినను శీఘ్రముక్తినొసగు నుత్తమధర్మములు; ఇందు సందులేకుండ

జేయుట విశేషమగునని యెఱుంగునది.

మూ॥ సామాన్యశైవం వక్ష్యామి తచ్ఛృణుష్వాఽవధానతః। ౩౫
శాక్తాద్యాస్స్వస్వపక్షైస్తే మత పంచకవర్తినః॥
అధ్వశోధనసంస్కారా ద్గాయత్రీగ్రహణాదపి॥ ౩౬
సామాన్యశైవా ఇతిహి నిగద్యన్తే ధరాతలే.

తా॥ ఓ బృహస్పతీ! సామాన్య శైవమును చెప్పుచున్నాను వినుము అధ్వశోధన సంస్కారమును సంగ్రహరూపముగా గ్రహించుటను, శివతత్త్వప్రతిపాదకమైన సావిత్రీమహామంత్రమును గ్రహించుటవలనను శాక్తమతము మొదలుకొని నైదుమతములలో నుండువారును సామాన్యశైవు లను పేరు గలిగియుందురు.

మూ॥ వీరశైవం ప్రవక్ష్యామి విదితం శ్రుతితంత్రయోః॥ ౩౭
శ్రౌతం స్వతంత్రమితి త ద్ద్వివిధం పరికీర్తితం।
వర్ణాశ్రమాయధర్మాఢ్యం శ్రౌత మి త్యభిధీయతే॥ ౩౮
తదీయధర్మరహితం స్వతంత్రమితి కథ్యతే॥

తా॥ ఇంకమీద వీరశైవమును చెప్పుచున్నాను వినుము, శ్రౌతమనియు, స్వతంత్రమనియు వీరశైవము రెండువిధములుగా నున్నది. అందు వర్ణాశ్రమ ధర్మములుగలది శ్రౌత మనియు, వర్ణాశ్రమ ధర్మములు లేనిది స్వతంత్రమనియుఁ జెప్పంబడుచుండును.

మూ॥ ఆగమోత్తరకాండోక్త దీక్షాణాం యః పరిగ్రహః॥ ౩౯
సమాన ఆదిశైవేన విశేష మిహ సంశ్రృణు॥
ఇష్టలింగవియోగేవా వ్రతానాంవా పరిచ్యుతౌ॥ ౪౦
తృణవ త్ప్రాణసంత్యాగ ఇతి వీరవ్రతంమతం॥

తా॥ ఆగమముల యుత్తర కాండములయందుఁ జెప్పఁబడు దీక్షలను గ్రహించుట ఆదిశైవమునకు, వీరశైవమునకు సమానమే

యగును. ఇఁక నిందుగలవిశేష మేమనిన, ఇష్టలింగము నష్టమైనను, వ్రతములకు లోపము సంభవించినను తృణముంబలె ప్రాణము విడుచుట వీరవ్రత మగును.

మూ॥ భక్త్యుత్సాహవిశేషోపి వీరత్వమితి కథ్యతే॥  ౪౧
వీరవ్రతసమాయోగా ద్వీరశైవం ప్రకీర్తితం॥

తా॥ భక్త్యుత్సాహ మధికముగా నుండుటయు వీరవ్రతమని చెప్పఁబడుచున్నది. ఇట్టి వీరవ్రతము గలిగియుండుటచే వీరశైవ మని చెప్పఁబడియెను.

మూ॥ పున స్త్రివిధ మేతద్ధి సామాన్యాది ప్రభేదతః ॥  ౪౨
సామాన్యంచ విశేషశ్చ నిరాభారీతిచ త్రిధా ।

తా॥ ఈవీరశైవము తిరిగి మూఁడు భేదములు గలదియై యుండును. ఆభేదము లెవ్వియనిన, సామాన్యము, విశేషము, నిరాభారి యని గ్రహింపవలయును.

మూ॥ అథ లక్షణ మేతేషాం క్రమా ద్వక్ష్యామి సంశ్రుణు॥  ౪౩
ఇష్టాదిలింగత్రితయ స్యైకీభావేన చార్చనం ।
గురౌ మహేశ్వరే స్వేష్టలింగేచ సమభావనా ॥  ౪౪
త్రికాలం లింగపూజాచ సంభవద్భిః పదార్థకైః ।
సామాన్య వీరశైవస్య ధర్మోఽయం పరికీర్తితః ॥  ౪౫

తా॥ ఇంకమీఁద వీని లక్షణమును చెప్పుచున్నాను వినుము. ఇష్టప్రాణభావములను మూఁడులింగముల నేకముగానె పూజించుట. గురునందు, మహేశ్వరునందు, ఇష్టలింగమునందును సమదృష్టి గలిగి యుండుట, సంభవించిన పదార్థములతో మూఁడుకాలములయందు లింగము బూజించుటయు ననునివి సామాన్యవీరశైవము దగు ధర్మములని యెఱుంగునది.

మూ॥ విశిష్టధర్మానుష్ఠానా ద్విశేషశ్చ సపనహి॥
ఏకం మాహేశ్వరంవాపి ద్వావా త్రీ న్ప్రతివాసరం॥  ౪౬

భోజయిత్వాపి తచ్ఛేషం భుంజీయాదప్రమాదతః ।
షట్కాలం లింగపూజాచ నియతైస్తు పదార్థకైః. ४२

తా॥ విశిష్ట మగుధర్మమును. నడిచినందున సామాన్యవీరశైవుడే విశేషవీరశైవుడనఁబడును. విశిష్టధర్మము లెవ్వియనిన, ప్రతిదినము నొక్కరినో, ఇద్దరనో, లేక ముగ్గురనో మాహేశ్వరులను భుజింపఁజేసి శేషమును భుజించుటయు, ప్రతిదినము నియమముతో నాయాకాలములయందు నిష్టలింగమును పూజించుటయు విశిష్ట ధర్మములగును.

మూ॥ ద్రోణపుష్పం బిల్వపత్రం కరవీర మథాపివా
మల్లికోత్పలపున్నాగ జాత్యాది కుసుమానివా॥ ४५

మూ॥ ఏకేకం త్రీణి ద్వావాపి హ్యర్పయేన్నియమాన్వితః।
ఏవం చరిష్యే నియమా సహ మాప్రాణ సంచరాత్॥ ४६
నాన్యథా బిభృయాం ప్రాణానితి యో నియమ స్మృతః।
ఇత్యాదినియమై ర్యుక్తో విశేషఇతి కథ్యతే॥ ५०

తా॥ తుమ్మిపువ్వు, మారేడుదళము, గన్నేరుపువ్వు, మల్లెపూవు, నల్లగలువ, మొదలగువానిలో ప్రతిదినము నొక్కటినో మూడిటినో ఆఱిటినో నియమముతో నర్పింపవలయు. నియమ మెట్టిదనిన ప్రాణముండువరకు నే నిట్టులాచరింతును, లేనిచో ప్రాణము బాల్పను. అనువ్రతము నియమమని చెప్పఁబడును. ఇట్టి నియమములు గలవాఁడు విశేషవీరశైవుఁడని చెప్పఁబడును.

మూ॥ తురీయాశ్రమసేవీతు నిరాభారీతి చోచ్యతే।
స్వతంత్రే త్యక్తదారాది ర్నిరాభారీతి కథ్యతే॥ ५१
ముండీవా జటిలోవాపి దండకాషాయసంయుతః।
స్వతంత్రే వీరశైవేతు నిరాభారీ చరేన్మహీం॥ ५२

తా॥ నాల్గవ యాశ్రమము నవలంబించినవాఁడు నిరాభారియని చెప్పఁబడును. స్వతంత్రవీరశైవమునందు దారపుత్రగృహాదులను వదలిన

నాఁడు నిరాభారియని చెప్పఁబడును. జడలను దాల్చిగాని, బోడితల గలిగిగాని దండమును, కాషాయవస్త్రములను ధరించి స్వతంత్రవీరశైవమునందు నిరాభారి పుడమిని జరింపవలయు.

మూ॥ శిఖాయజ్ఞోపవీతాఢ్యః దండకాషాయచేలవాన్।
వైదికే వీరశైవేతు నిరాభారీతి సస్మృతః॥ ౫౩
స్వేష్టలింగావియోగస్తు సమాన ఉభయో స్మృతః।

తా॥ శ్రౌతమగు వీరశైవమున నున్ననిరాభారి శిఖాయజ్ఞోపవీతములను, దండమును, కషాయవస్త్రములను ధరింపవలయు. ఇష్టలింగమును విడువకుండుట యిద్దఱకును సమానధర్మమై యగును.

మూ॥ నిస్పృహో నిజలింగైక్యో భిక్షాశీ భయవర్జితః। ౫౪
మానీ భూతదయాయుక్తో నిరాభారఇతి స్మృతః।

తా॥ నిష్కాముఁడును, లింగాంగైక్యానుసంధానము గలవాఁడును, భిక్షాహారము భుజించువాఁడును, భయరహితుండును, మానవ్రతియు, భూతదయగలవాఁడును నగువాఁడు నిరాభారియని చెప్పంబడును.

మూ॥ కంథాకమండలుధరో భూతిరుద్రాక్షసంయుతః॥ ౫౫
దండకౌపీనధారీచ నిరాభారీతి గీయతే॥

తా॥ శీతబాధానివృత్తికై కంథను (కుడితి) కమండలమును భస్మరుద్రాక్షములను, దండమును, కౌపీనమును ధరించినవాఁడు నిరాభారియని చెప్పఁబడును.

మూ॥ నిరాభారాశ్రమస్థస్య సంభవే తస్య సన్నిధౌ॥ ౫౬
గ్రాహ్యోఽయ మాశ్రమ స్తస్య ముఖాద్ధి ప్రణవోపిచ।

తా॥ నిరాభారాశ్రమస్థుఁడు సంభవించునెడ నట్టివాని సన్నిధియందు నీయాశ్రమము గ్రహింపవలయు. వాని ముఖమునుండియె ప్రణవోపదేశము నొందవలయు.

మూ॥ అసంభవే తాదృశస్య శివాగారేఽథవాప్ునః॥ ౫౮
బిల్వమూలే పరిగ్రాహ్యో భవ తీశ్వరశాసనాత్।

తా॥ నిరాభారాశ్రమస్థుఁడు దొరకనిమెడల శివాలయమున శివునిసన్నిధియందుగాని, బిల్వవృక్షమూలంబునగాని గ్రహింపవలయు నని యీశ్వరశాసనంబు గలదుగాన నట్లు గ్రహింపవలయు.

మూ॥ ప్రణవే జప్యమానేపి సూక్ష్మపంచాక్షరాత్మని॥ ౫౮
స్థూలపంచాక్షర శ్శైవో నవర్జ్యో యతిభి స్సదా॥

తా॥ యతులు సూక్ష్మపంచాక్షరమైన ప్రణవమును జపించు చున్నను, స్థూలపంచాక్షరమైన శైవమంత్రమును పరిత్యజింపఁగూడదు.

మూ॥ ఆదేః పూర్వస్య శుద్ధస్య తథైవం మార్గవీరయోః॥ ౫౯
సవిశేష శ్శివాద్వైత శ్రుతీనాం సమ్మతో మతః॥

తా॥ ఆదిశైవమునకు, పూర్వశైవమునకు, శుద్ధశైవమునకు, మార్గశైవమునకు, వీరశైవమునకును శ్రుతిసమ్మతమైన విశిష్టశివాద్వైతము మత మగుచున్నది.

మూ॥ మిశ్రస్య శుద్ధాద్వైతాఖ్యో మతస్తు పరికల్పితః॥ ౬౦
సామాన్యస్య విశిష్టోఽయం శక్త్యాద్యద్వైతపవహి ॥

తా॥ మిశ్రశైవమునకు శుద్ధాద్వైత మనుమతము పరికల్పిత మగును. సామాన్యశైవమునకైననో శక్తివిశిష్టాద్వైతము, విష్ణువిశిష్టాద్వైతము మొదలైనవి మతములని యెఱుంగునది.

మూ॥ ఆదే ర్మార్గస్య వీరస్య ప్రేతకర్మ నవిద్యతే॥ ౬౧
దహనంచైవ సాపిండ్యం నై తేషాం సమ్మతే తతః।

తా॥ ఆదిశైవమునకు, మార్గశైవమునకు, వీరశైవమునకును ప్రేతకర్మము లేదు, గావున వీరలకు దహనము, సాపిండ్యంబును గూడవు.

మూ॥ పూర్వాదీనాంతు ప్రేతత్వం తత్ప్రియుక్తంహి కర్మచ॥ ౬౨
విశిష్యతే యత స్తేషాం నదీక్షా శాంభవీ పరా॥

తా॥ పూర్వ శైవులు మొదలగువారి కైననో ప్రేతత్వముగలదు గాన ప్రేతత్వమూలక మగు దహనాదికర్మము గలిగియున్నది. అది యేలన, వీరికి ముక్తిప్రద మైనశాంభవదీక్ష లేదు. పూర్వ శైవులకు శైవదీక్ష యున్నను నయ్యది పరార్థపూజయందు నధికారము గలిగింపనే యేర్పడినదిగాన నాదీక్ష వారికి ప్రేతత్వ ప్రయుక్తకర్మమును దొలగింపఁ జాలదనుట.

మూ॥ ఆచారభేదమూలాస్తే శైవభేదా స్సమీరితాః॥ ౬౩
పరిధానమేకమేవ స్యా త్సర్వవిద్యాసమన్వితం ।
నిర్గతోపపదం శైవం విదితం మునిపుంగవ॥ ౬౪

తా॥ ఓబృహస్పతీ, ఆచారభేదమును మూలీకరించుకొని యేర్పడిన శైవభేదములను దెల్పితిని. సర్వవిద్యా సమన్వయముగల ముఖ్యమైన శైవమొక్కటె యగును. అద్దానికి కేవలము శైవమనియె పేరు గలదుగాని ఉపపదములేదు. ఇయ్యది ప్రసిద్ధమైనది.

మూ॥ య దాగమాంతవిశ్రాన్తం శైవదీక్షాభిశోభితం।
అంగత్రితయసంబద్ధ లింగత్రయవిరాజితం॥ ౬౫
వర్ణాశ్రమాయధర్మాఖ్యం షట్స్థలజ్ఞానసంయుతం।
విశిష్ట మష్టావరణైః పంచాచారాభిమండితం॥ ౬౬
సద్యః పాశక్షయకరం కర్మజ్ఞానసముచ్చయం।
మహేశ్వరప్రతిష్ఠాది కృత్యాచార్యత్వశోభితం॥ ౬౭
జగద్గురుత్వాధికృతం నిగమాగమసమ్మతం॥

తా॥ ప్రధానమగు నీశైవమతము దగులక్షణ మెట్టిదనిన, ఇందు శివాగమోత్తర భాగమునందుఁ జెప్పబడిన వేధామనుక్రియాదీక్షలు గలవు. స్థూల సూక్ష్మకారణము లనుమూడు శరీరములకును నిష్టప్రాణ భావములను మూడులింగముల దగుసంబంధము గలిగియుండును, ఇందు

వర్ణాశ్రమధర్మములు విలసిల్లుచుండును. షట్స్థలజ్ఞానసంపత్తియుం గలదు. అష్టావరణ పంచాచారంబులు నుండును. ఇందగు ధర్మములు బంధచ్ఛేదకరములై యుండును. కర్మజ్ఞానములు రెండును నిందు ముఖ్యములుగాన కర్మజ్ఞానసముచ్చయము గలదు. శివప్రతిష్ఠాదులయెడ నాచార్యత్వంబును గలదు. జగద్గురుత్వాధికారంబును గలిగియుండును. ఈమతము నిగమాగమసమ్మత మైనది.

మూ॥ అథాపీదం తత్రతత్ర బహుధైవాభిధీయతే॥ ౬౯
తత్తద్గుణసమాయోగా త్తత్తన్నామాంకితం భవేత్.

తా॥ ఈ మతమునకు కేవలము శైవమనియే పేరు గలిగియున్నను నిది అనేకములగు పేర్లతో పిలువఁబడుచున్నది. ఆ యా గుణములనుబట్టి వివిధములగు పేర్లు గలుగనగును, ఎట్లన,

మూ॥ అనాదిసర్గసంచారా దనాదీదం నిగద్యతే॥ ౭౦
మతానా మిహ సర్వేషా మాద్యత్వా దపి గీష్పతే.
ఆదిశైవమితి ఖ్యాతం క్వచి ద్వేదవిదుత్తమ॥ ౭౧

తా॥ ఈశైవము అనాదియగు సృష్టినుండి ప్రచారము గలిగియున్న కారణమున అనాదిశైవ మనియుఁ కడమ యన్నిమతములకన్న మొదటిదగుటచే యాదిశైవ మనియుఁ జెప్పబడుచున్నది.

మూ॥ ముక్తి మార్గప్రధానత్వా న్మార్గశైవ మితి శ్రుతం ।
దేవతాంతర సంబంధవర్జనా చ్ఛుద్ధమిత్యపి॥ ౭౨

తా॥ మఱియు నీమతము ముక్తికి ముఖ్యమార్గ మైనదిగాన మార్గశైవమని నుడువఁబడుచున్నది. మఱియు, నిత్యోపాసనయందు దేవతాంతరసంబంధము లేదుగాన శుద్ధశైవమనియుఁ జెప్పఁబడుచున్నది.

మూ॥ స్మార్తకర్మాభిసంబంధా న్మిశ్ర మిత్యపిచ క్వచిత్
వీరవ్రతసమాయోగా ద్వీరశైవమితి స్మృతం॥ 23

తా॥ స్మార్తకర్మముతో సంబంధము గలిగియుండుటచే మిశ్ర
శైవమనియు, ఇందు వీరవ్రతము లుండుటంబట్టి వీర శైవమనియుఁ
జెప్పఁబడుచున్నది.

మూ॥ అభిధానా నీదృశాని గౌణానీతి విభావయ
ప్రధానస్యాఽస్య శైవస్య సర్వవిద్యా స్తుతస్యహి॥ ౨౪

తా॥ సకలవిద్యలయందుఁ బ్రశంసింపంబడుటచేఁ బ్రధానమైన యీ
శైవమునకు నిట్టినామము లాయాగుణ సంబంధమువలన గలిగినవిగాన
ముఖ్యములుగావని యెఱుంగునది.

మూ. ఇతితే గీష్పతే సమ్య క్శైవభేద స్సమీరితః
పరిధానమపి శైవంచ కిమన్య చ్ఛ్రోతు మిచ్ఛసి. ౨౫

తా. ఓబృహస్పతీ శైవమతభేదంబులును, పరిధానమగు శైవం
బును నీకు తెలిపితిని. ఇంక దేని వినగోరెదవో అడుగుము.

ఇతి శ్రీచంద్రజ్ఞానే ఉత్తరభాగే
శివశాసనే
శైవభేదోనామ
దశమః పటలః.

***

ఏకాదశః పటలః.

ఆరభ్యతే.

బృహస్పతి రువాచ—బృహస్పతి తిరుగా నిట్లని యడిగెను.

మూ॥ కంకాళధర సర్వజ్ఞ కాలకాల కృపానిధే ।
అనంతరుద్ర భగవ న్ప్రణతో స్మ్యనుగృహాణమాం. ౧

తా॥ బ్రహ్మాదుల యస్థులను సొమ్ములుగా ధరించినవాఁడవును, సర్వజ్ఞుఁడవును, కాలాంతకుఁడవును. దయాసముద్రుఁడవు నగు నోయనంతరుద్రుఁడా? నమస్కరించుచున్నాను. అనుగ్రహింపుము.

మూ॥ శాంభవవ్రతనిష్ఠానాం శైవానాం ప్రయతాత్మనాం ।
ఆహ్నికం శ్రోతుమిచ్ఛామి విధానం బ్రూహ్యశేషతః. ౨

తా॥ శాంభవవ్రతము నవలంబించిన శైవులయొక్కయాహ్నిక విధానమును వినగోరుచున్నాఁడనుగాన నద్దానిని సమగ్రముగా దెలుపుము.

అనంతరుద్రఉవాచ—అనంతరుద్రుం డిట్లని యానతిచ్చెను.

మూ॥ బ్రాహ్మే ముహూర్త ఉత్థాయ నేత్రయోరిష్టలింగకం ।
స్పర్శయ న్నీశ్వరం సాంబం ధ్యాత్వా కార్యం విచార్యచ. ౩

తా॥ జనుఁడు బ్రాహ్మముహూర్తముననె మేల్కాంచి యిష్టలింగమును కనులకు నద్దుకొనుచు, అంబికాసహితుండగు పరమేశ్వరుని ధ్యానముచేసి పవలు చేయనగుపనుల నాలోచించుకొనవలయు.

మూ॥ బహిర్విదిశ మాగ్నేయీం గచ్ఛేదారా దతంద్రితః ।
శివసూత్రం యజ్ఞసూత్రం మూర్ధ్ని విన్యస్య వాససా. ౪
పరివృత్యచ శిరోన్యత్ర జలపాత్రం నిధాయచ ॥
విసృజ్యచైవ విణ్మూత్రే శౌచంకుర్యా ద్విధానతః. ౫

తా॥ తరువాత, బహిర్దేశమునకై యాగ్నేయ దిగ్భాగమున దూరముగాఁ బోవలయు. శివసూత్రమును, యజ్ఞసూత్రమును వెనుక నుంచి శిరముప నునిచికొని యాశిరమునకు వస్త్రము జుట్టుకొని, జలపాత్రమును వేరొకచోట నునిచి, మలమూత్రములను విసర్జించి యథావిధిగా శౌచము చేసికొనవలయు.

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ కొమరువెల్లి కాళయ్యగారు వరంగల్ | 12-0-0 |
| ,, రామిని మల్లయ్య గారు ... | 12-0-0 |
| ,, తుగ్గపాటి వెంకటేశ్వరరావుగారు, బారిష్టరు, బెజవాడ | 10-0-0 |
| ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్న గార్లు, శికింద్రాబాదు | 10-0-0 |
| ,, కైలాస శరభయ్యగారు, ... | 10-0-0 |
| ,, బెల్దె రామన్న సమారుడు, జగదీశ్వరయ్య ... | 10-0-0 |

## —◆ పోషకులు ◆—

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యవార్లంగారు, ఈమని | 5-0-0 |
| ,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని | 5-0-0 |
| ,, కామన్న రాజశేఖరరావుగారు, కరణం, నవాబుపాలెం | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిలుగారు, తొండపి | 5-0-0 |
| ,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల | 5-0-0 |
| ,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చపేట | 5-0-0 |
| ,, భూపతి రత్నంగారు, వరంగల్ | 5-0-0 |
| ,, మల్లంపల్లి మల్లికార్జునుడుగారు, అయితంపూడిఅగ్రహారం | 5-0-0 |
| ,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ | 5-0-0 |
| ,, శ్రీపతిపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని | 5-0-0 |
| ,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు | 5-0-0 |
| ,, కోనసముద్రం మోహినీలు అయ్యవారుగారు, ఆరమూరు | 5-0-0 |
| ,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్దిపేట | 5-0-0 |
| ,, ముత్యంపేట మల్లయ్యగారు ,, | 5-0-0 |
| ,, కాళేశ్వరం నాగభూషణంగారు ,, | 5-0-0 |
| ,, కొమరువెల్లి బాలరాజుగారు, వరంగల్ | 5-0-0 |
| ,, గర్రెపల్లి రామన్నగారు, మిడిదొడ్డి | 5-0-0 |

# ప్రకటనము.

ఆర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:- ఈ గ్రంథమునందు బ్రాహ్మణులు మొదలగువారు వేకువజామున నిద్రలేచినది మొదలుకొని రాత్రి పండుకొనునందాక చేయనగు స్నానసంధ్యాది సకలధర్మములకును వైద్యశాస్త్రప్రామాణ్యమును బట్టి ఆరోగ్యరూపమగుప్రత్యక్షఫలము కలదని ఋజువుచేయఁబడియున్నది.

వెల రు ౧-౦-౦

కారణోత్తరమను దివ్యాగమము:-ఇయ్యది శైవుల లింగధారణము మొదలగువానినిగూర్చిగల సకలసంశయముల వారించు నెడ నిగుపమానమైనది.

వెల రు ౧-౦-౦

ఆహ్నికవిధి:-ఇందు స్నానము సంధ్య మొదలుకొని వైశ్వదేవమువరకుగల సకల నిత్యకర్మములు సప్వరాంధ్ర ప్రయోగముతో గలవు.

వెల రు -౮-౦.

మకుటోత్తరము అను దివ్యాగమము:- ఇందు శివపూజా విశేషములు, శైవాంత్యేష్టి విధానము మొదలగు ననేక విశేషములు గలవు.

వెల రు ౧-౮-౦.

బ్రహ్మతర్క స్తవము:- శ్రీమదప్పయ దీక్షిత విరచితము. ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, స్మశానవాసిత్వము, బాణాసురయుద్ధమున నోడిపోయెనన్న దానికి సమాధానము మొదలగు ననేక విషయములు గలవు.

వెల రు ౧-౦-౦

మహాశివపూజా విధి:- ఇయ్యది లింగనిరీక్షణమున వినియోగించు దశావధాన విధానముతోను, సప్వరాంధ్రప్రయోగముతోను శాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦-౮-౦

ధర్మసంగ్రహము అంత్యేష్టికాండము:- ఇందు శైవులాచరించు సమాధ్యారాధనవిధులు శాస్త్రసిద్ధములని పలువిధముల నిరూపింపఁబడియుండుటెగాక, అపరకాండ సందర్భమునగల సర్వవిధకృత్యములకుఁదగు ప్రమాణముల గనబరిచి సకల సంశయములు వారింపఁబడియెను. ఆంధ్ర తాత్పర్యసహితము.

వెల రు ౨-౦-౦,

వలయువారు:— ముదిగొండ నాగలింగశాస్త్రి.

మారీస్పేట, తెనాలి. అని వ్రాయవలెను.

